# పీ ఠి క

మా యాంధ్రప్రచారిణీ గ్రంథమాలిక కిది సప్తమ పుష్పము. మూలగ్రంథకారుఁడగు బంకించంద్రచట్టోపాధ్యాయు లీనవలకు వంగభాషయందు "రాజసింహ" యనునామమును నిర్దేశించియున్నారు. దానిననుసరించి భాషాంతరీకరించినవా రెల్లరును నీనామమునే వాడియున్నారు. ఇది మ. రా. శ్రీ బి. వేంకటాచారిగారిచే భాషాంతరీకరింపఁబడిన కర్ణాటగ్రంథమునుండి మ. రా. శ్రీ వేంకటపార్వతీశ్వర కవులచే నాంధ్రీకరింపఁబడినది. ఈయాంధ్రీకృతగ్రంథమునకు గూడ నాదిమగ్రంథకారుని యభిప్రాయానుసరణముగ సుప్రసిద్ధమగు నానామమే నిర్దేశింపఁబడినది. వంగభాషావిశారదుఁడును, ఆఖ్యాయికారచనానైపుణీ విలసితుఁడునగు శ్రీ బంకించంద్రచట్టోపాధ్యాయునిచే వ్రాయఁబడిన యీ నవలయందు హిందూజనులు బాహుబలమున దేశీయులగు నితరజాతులకుఁ దీసిపోవరని ప్రతిపాదింపఁబడినది. ఈ విషయ ముపసంహారమునందు బంకించంద్రునిచే స్పష్టీకరింపఁబడినది. ఇయ్యది చరిత్రాత్మకమైననవల. ఇందు రాఁబోవుపాత్రములు చరిత్రాత్మకమగునవియే. అందు ఔరంగజేబు, రాజసింహుఁడు జేబఉన్నీసా, ఉదయపురి, రూపనగరరాజకన్యయగు చంచలకుమారి, మొదలగువారు ముఖ్యులు. నవల యంతయు నతిమనోహరమై భావవిలసితమై యొప్పారుచున్నది.

భాషాభిమానమాననీయులగు ప్రధానపోషకులయొక్కయు, రాజపోషకులయొక్కయు, పోషకులయొక్కయు, చందాదారుల యొక్కయు ప్రోత్సాహముచే మేమీకార్యమును నిర్విఘ్నముగ కొనసాగింపఁగలుగుచున్నందులకు వీరికెంతయుఁ గృతజ్ఞుల మగుచున్నారము.

మాచేఁ బ్రకటింపఁబడిన గ్రంథములలోఁ గొన్నినీగ్రంథము తోఁబాటు పాఠశాలాపఠనీయ గ్రంథములుగా నెన్నుకొని మాకుఁ బ్రోత్సాహముఁ గూర్చుచున్న పాఠశాలాపఠనీయ గ్రంథనిర్ణాయక సంఘమువారికి మాయభివందనములఁ దెలుపుకొనుచు నిట్లే దొరతనమువారు భాషాసంఘములకు వలయు నుపకారములఁ జేసి దేశభాషల నుద్ధరించెదరుగావుతమని కోరుచున్నాను.

ఇట్లు

అయ్యగారి నారాయణమూర్తి,

సంపాదకుఁడు.

శ్రీ

# రాజసింహ

## ప్రథమభాగము—చిత్రపటమునందలి పదాఘాతము.

### మొదటి ప్రకరణము

#### చిత్రపటములమ్ము వృద్ధురాలు

రాజస్థానమునందలి పర్వత ప్రదేశమునందు రూపనగర మను చిన్నరాజ్యముకలదు. రాజ్యము చిన్నదైనను పెద్దదైనను దానికి రాజొకఁడుండి యుండును. రూపనగరమునకుఁగూడ రాజొకఁడుండెను రాజ్యము చిన్నదైనంతమాత్రమున రాజునకు గొప్పపేరుండుటను గూర్చి యెవ్వరు నాక్షేపింపఁజాలరు. రూపనగరప్రభునినామము విక్రమసింహుఁడు. విక్రమసింహుని యితరవిషయములంగూర్చి తరువాత దెలిపెదము.

ప్రస్తుతము మేమాతని యంతఃపురమునఁ బ్రవేశింతుము. చిన్నరాజ్యము, చిన్నరాజధాని, చిన్న రాజప్రాసాదము—అందొక విశాలమైన మనోహరమందిరము. ఆమందిరమునందలి క్రిందిభాగము నీలశ్వేత శిలలచే నిర్మింపబడి రత్నకంబళము పఱుపఁబడినట్లుండెను. చంద్రకాంత శిలానిర్మితములైన గోడలును, వివిధమణిఖచితములై ప్రకాశించుచుండెను. ఆకాలమందు తాజ్‌మహల్, మయూరసింహాసనము మొదలగువాని ననుకరించి భవనములను నిర్మించుట యాచారమై యుండెను. అట్లనుసరించి నిర్మించుటవలననే యామందిరకుడ్యములందు చిత్రితములైన పక్షులు చిత్రలతలపైఁ గూర్చుండి చిత్రపుష్పములపై పుచ్ఛములనుంచి చిత్రఫలములను తినుచున్నట్లు

చిత్రింపబడియుండెను. నేలపై విశాలమైన రత్నకంబళము పఱుపబడి యుండెను. దానిపై పది పదునైదుగురు సుందరులు కూర్చుండియుండిరి. అనేక విధములైన వస్త్రాలంకారములు—నానావిధ రత్నాభరణములు—సముజ్జ్వలములై, కోమలములై, మనోహరములై బహు భంగుల విలసిల్లుతనూలతలు—ఒక్కతె నవమల్లికాసదృశగౌరాంగి, ఒక్కతె దరవికసితసరసీరుహ రక్తగాత్రి ఒక్కతె సుకుమార చంపకలతాంతస్వర్ణవిగ్రహ ఒక్కతె నవదూర్వాదళశ్యామాంగి అందఱును గవియందలి మణిసమూహమును దిరస్కరించుచుండిరి. కొందఱు తాంబూలమును సేవించుచుండిరి. కొందఱుహుక్కాలను పీల్చుచుండిరి ఒక్కతె తన బులాకియందలిపెద్దముత్యము నల్లాడించుచు భీమసింహుని పట్టపురాణియగు పద్మిని చరిత్రమును చెప్పుచుండెను. కొందఱు నవరత్నఖచితములైన కర్ణాలంకారములు చలింప పరనిందా వాక్యములతో నెదుటివారి హృదయములకు సంతోషమును గలిగించుచుండిరి. అందు చాలమంది యౌవనవతులై యుండిరి. విశేషముగ నవ్వుచు హాస్యాలాపము లాడుకొనుచుండిరి.

ఆయువతీమణులు నవ్వుటకుం గారణమున్నది. ఒకవృద్ధురాలు కొన్ని చిత్రపటముల నమ్ముటకై తీసికొనివచ్చెను. ఆచిత్రములు వారి చేతులయందుండెను, అవి దంతనిర్మితములైన పలకలపై జిత్రింపఁబడిన విచిత్రచిత్రములై యుండెను. వృద్ధాంగనయు రూపపటముల నమ్ముకొనవలయునను కోరికతో దన పెట్టెనుండి యొక్కొక్కచిత్రపటమునే తీసి వారికి జూపుచుండెను. తరుణీమణు లాచిత్రపటముల యందలి మూర్తులవృత్తాంతముల నడుగుచుండిరి.

ఆముదుసలి మొట్టమొదట చిత్రము నిచ్చినమీదట నొక సుందరి "ఇది యెవ్వారిరూపపటము?" అని యడిగెను.

ముదుసలి—ఇది షాజహాను బాదుషావారిచిత్రపటము.

సుందరి—తీసికొని పొమ్మా! ఓముసలిదానా! ఈ గడ్డమును నేనెఱుంగుదును. ఇది మాతాతగారిగడ్డమంత యున్నది.

మఱియొకరసికురాలు "అదేమే! తాతగారిపై రెత్తుచున్నావు! అది నీమగనిగడ్డము" అని చెప్పి యందఱివంకను జూచి "ఈగడ్డము నం దొకదినమున నొకతేలు చేరి యుండెను. నేను దానిని చీపురు తోఁగొట్టి చంపితిని" అనియెను. అప్పు డందఱును పక్కున నవ్వసాగిరి.

వృద్ధురాలు మఱియొకచిత్రమును తీసి చూపించి "ఇది జహంగీరుబాదుషావారిచిత్రము" అనియెను.

ఒకరసికసుందరి యాచిత్రమును చూచి "దీనివెల యెంత?" అనియెను.

వృద్ధురాలు దానికి హెచ్చువెల చెప్పెను.

రవి—చిత్రములవెల యట్లుండనిమ్మా! ఇది ప్రతిబింబము. నిజమైన నూర్జహానుబేగ మెంతవెలకు వచ్చును?

వృద్ధురాలు "అది యమూల్యమైనది" అని చెప్పి తన చాతుర్యమును వెలివఱిచెను.

రసి—మూలప్రకృతికే యింతటిగతి పట్టినప్పుడు ప్రతిబింబ మొకగ్రుడ్డిగవ్వయైనను చేయదు.

అందఱును పకపక నవ్విరి. ముసలిది విరక్తయై చిత్రపటము లన్నిటిని తీసి దాఁచికొనుచు "ఇదేమినవ్వమ్మా! మీరు వెలపెట్టి కొను వారు కారు. రాజకుమారిని రానిండు తరువాత నింకను చిత్రములఁ జూపించెదను. ఆమెకొఱకే వీనిని దీసికొనివచ్చితిని" అనియెను.

అప్పుడు నలుగురు నాలుగు దిక్కులనుండియును వచ్చి "నేనే రాజకుమారిని, నేనే రాజకుమారిని" అని కేకలువేయ నారంభించిరి. వృద్ధురాలు దిక్కులు చూడసాగెను. తిరిగి నవ్వు ప్రారంభమయ్యెను.

ఇంతలో నాకస్మికముగా నవ్వు లాఁగిపోయెను. ఒకరి నొకరు చూచి కనుసన్నలు చేసికొనుచు తొంగితొంగి చూచుచుండిరి. నడుము పైనుమ వస్త్రము వెలిసినతరువాత వెలిదోఁచుచున్న చిన్ని మెఱుపు గలవలెనే యాసుందరులయరుణాధరప్రదేశములందు ముసిముసి నగవు వెల్లివిరియుచుండెను. ఇందులకుఁ గారణ మేమైయుండు నని యావృద్ధురాలు వెనుదిరిగి చూచెను. వెనుక నొక దేవీప్రతిమ నిలుఁవ బడియుండెను.

చంద్రకాంతశిలానిర్మితమో యనునట్లు మనోహరమై సకల శోభామయమై యున్నయావిగ్రహము నావృద్ధవనిత తెప్పవాల్పక తదేకదృష్టితోఁ జూచుచుండెను. ఆహా! ఏమి యీసౌందర్యము! వృద్ధురాలి నేత్రదృష్టి తగ్గుటవలన స్పష్టముగాఁ జూచుట కసమర్థురాలై యున్నను, చూచినంతవరకు "ఇది చంద్రకాంతశిలా చిత్రము కాదనియును, నిర్జీవప్రతిమయం దింతటిమనోహర కాంతియుండఁ దని యును, తెలిసికొనియెను. ఆమె చూచుచుండఁగనే యావిగ్రహము మెల్లమెల్లగ నవ్వెను. ప్రతిమ యెన్నడైన నవ్వుట కలదా? అప్పుడు వృద్ధురాలు "ఇది ప్రతిమకాదు" అని నిశ్చయించుకొనియెను. సోగలై, వినీలకనీనికావిలసితంబులై, విశాలములై, చంచలములై, లావణ్యమయంబులై యొప్పారు నాకనుదమ్ములు రెండు నావృద్ధు రాలిని చూచుచు నవ్వుచుండెను.

ముదుసలికి నోట మాట రాలేదు. ఇటు నటు చూచెను. కాని యేమియును తోఁచలేదు. వికలచిత్తయై యాసుందరులవంకఁ జూచి "అమ్మా! మీరైనను చెప్పఁగూడదఁటమ్మా"! అనియెను.

ఒకసుందరి నవ్వు నాఁపికొనలేకపోయెను. తనంతట తానే హాసము బయలువెడలెను. నవ్వి నవ్వి నిలువలేక తిరుగాడ నా[illegible]

భించెను. అని యంతయును చూచి వృద్ధురాలు విస్మయవిహ్వలయై యేడువనారంభించెను.

అప్పుడా ప్రతిమ మాటలాడఁజొచ్చెను. అతి మధురస్వరముతో "ఏమమ్మా! ఎందుల కేడ్చెదవు?" అని యడిగెను.

"ఇది చిత్రప్రతిమ కాదు. నిజమైన మానుషమూర్తి—రాజమహిషియో, రాజకుమారియో యైయుండవచ్చును." అని వృద్ధురాలనుకొని సాష్టాంగప్రణామము చేసెను. ఆనమస్కారము రాజకులమునకుఁ గాదు ఆమె సౌందర్యమునకు వృద్ధురాలు తాను చూచిన సౌందర్యమునకుఁ బ్రణతురాలయ్యెను.

---

## రెండవ ప్రకరణము

### చిత్రపటమును తమ్ముట

చిత్రములనమ్ము వృద్ధురాలు నమస్కరించిన యాభువన మోహనసుందరీమణి రూపనగర రాజకుమారిక. ఆమెపేరు చంచల కుమారి. వృద్ధురాలియెదుట నింతవఱకుఁ బరిహాసము లాడుచున్న సుందరు లామె చెలికత్తెలును, పరిచారికలు నైయుండిరి. చంచల కుమారి వారి పరిహాసవచనములను వినుచు నవ్వుచుండెను. వృద్ధురా లేడ్చుటకుఁ బ్రారంభించినతోడనే యామెనుగూర్చి మధురస్వరముతో 'నీవెవ్వతెవమ్మా!' అని యడిగెను.

సఖులామె వృత్తాంతమును తమ చెలితోఁ దెలుపవలయునను నాత్రముతో నున్నవారు కావున "ఆమె రూపపటము లమ్ముటకు తీసికొనివచ్చినది" అని చెప్పిరి.

చంచలకుమారి—అట్లయినయెడల మీరిట్లేల నవ్వుచుంటిరి?

కొందఱుకొంచెము వెలవెలపోయిరి. చీపురుమాట చెప్పి నవ్వించిన యామెమాత్రము "మాదోషమేమి? ఈముదుసలి యట్టి బాదుషాలపటములను చూపించినది. అందువలన మాకు నవ్వు(గినదికాదు, మనరాజుగారి చిత్రశాలయందు, షాజహాను, జహంగీరు మొదలగు బాదుషాల చిత్రపటము లెన్ని లేవు?" అనియెను.

వృద్ధ—లేకేమమ్మా! ఒకటి యున్నయెడల నింకొకటి తీసికొన(గూడదా?

రాజకుమారి "నీయొద్దనున్న చిత్రపటము లన్నియును జూపింపుము" అని యడిగెను.

వృద్ధురా లొక్కొక్క చిత్రపటమునే తీసి రాజకుమారికి చూపించుచుండెను. అక్బరు. జహంగీరు, షాజహాను, నూర్జహాను, నూర్మహాల్, మొదలగు వారిచిత్రపటములను చూపించెను. రాజపుత్రిక నవ్వుచు చూచి వానిని తిరిగి యిచ్చివైచి "మామందిరమునందనేక చిత్రపటము లున్నవి. హిందూరాజుల చిత్రపటము లున్నవా?" అనియెను.

వృద్ధురాలు "అందుల కేమికొదవ?" అని చెప్పి మానసింహుఁడు. వీరబలుఁడు, జయసింహుఁడు మొదలగువారి చిత్రములను చూపించెను రాజపుత్రి వానిని తిరిగి యిచ్చివైచి "వీనిని నేను తీసికొనను. వీరు హిందువులు కారు. ముసల్మానుల బానిసలు" అనియెను.

వృద్ధురాలు "అమ్మా! ఎవ్వరెవ్వరిబానిసలో నేనెఱుఁగను. నాయొద్దనున్న వానిలో నీయిష్టమువచ్చినవానిని తీసికొనవచ్చును" అనియెను.

ముదుసలి చిత్రములను చూపించుచునే యుండెను. రాజకుమారిక వెదకి వెదకి రాణాప్రతాపసింహుఁడు, రాణాఅమరసింహుఁడు, రాణాకర్ణుఁడు యశోవంతసింహుఁడు మొదలగువారి చిత్రపటములను

తీసికొనియెను. వృద్ధురాలొక చిత్రపటమును దాఁచి యుంచుకొని యెను. దానిని రాజకుమారికి చూపింపలేదు.

రాజకుమారి "ఆదాఁచికొన్న చిత్రపట మెవ్వరిది?" అని యడిగెను. వృద్ధురాలు మాటాడలేదు. రాజపుత్రిక మరల నడిగెను.

వృద్ధురాలు భయముతోఁ జేతులుజోడించుకొని "నాయపరాధము మనసునం దుంచుకొనవలదు. కొంచెము పొరపాటుపడి యితరపటములతోఁ గూడ దీనిని తీసికొనివచ్చితిని" అనెను.

రాజకుమారి—అంతభయ మెందులకు? చిత్రపటమును చూపించుటకు భయ మెందులకు?

వృద్ధు—చూపించుటవలనఁ బ్రయోజనము లేదు. అది మీ వంశమునకు శత్రువైనవాని చిత్రపటము.

రాజకు—ఎవ్వరిది?

వృద్ధు—(భయముతో) రాణా రాజసింహునిది.

రాజకుమారిక—(చిఱునవ్వునవ్వుచు) స్త్రీజాతికి వీరపురుషు లెప్పుడును శత్రువులు కారు. నేనాచిత్రపటమును తీసికొనియెదను.

వృద్ధురాలు రాజసింహునిచిత్రపటమును రాజకుమారిచేతి కిచ్చెను. రాజకుమారి యా చిత్రమును చాలసేపు చూచెను. చూచుచుండగనే యామెముఖము ప్రఫుల్లమయ్యెను. కన్నులు విస్ఫారితము లయ్యెను. ఆమె భావమును గనిపెట్టి చెలి యొక్కతె నన్నుగూడ నాచిత్రము నొకసారి చూడనిమ్మని కోరెను. రాజకుమారి యాపటమును చెలిచేతికిచ్చి "నేత్రపర్వముగాఁ జూడఁదగినదానిని చూడుము" అనియెను.

ఆచిత్రపటము చెలికత్తెలందఱిచేతులలో నొక్కసారితిరిగెను. రాజసింహుఁడు యౌవనపురుషుఁడు కాఁడుగాని యాతనిచిత్రమును జూచి యందఱును ప్రశంసింప నారంభించిరి.

వృద్ధురాలదియంతయును చూచి యాచిత్రమునకు రెట్టింపు వెల రాఁబట్టవలయు నని కొంచె మాసపడి “ఠాకురాణీ! వీరపురుషుల ప్రతిబింబపటములు కావలసియున్నయెడల నింకను కొన్నియున్నవి. కాని యింతటిమహావీరుఁ డీపృథ్వీతలంబున మఱియొకఁడు లేఁడు, అని చెప్పి మఱియొకపటమును దీసి రాజకుమారిచేతి కిచ్చెను.

రాజకు—ఇది యెవ్వరిప్రతిబింబము?

వృద్ధ—అలంగీరుబాదుషా చిత్రపటము.

రాజకు—సరియే. తీసికొనియెదను.

అని చెప్పి రాజకుమారి తన పరిచారికలను పిలిచి మనము తీసికొన్న చిత్రపటములమూల్యమును తెచ్చి యీవృద్ధురాలి కిచ్చి వేయుమని చెప్పెను. పరిచారిక సొమ్ము తీసికొనివచ్చుటకై వెడలి పోయెను. ఇంతలో రాజకుమారి తనచెలికత్తెలం బిలిచి “రండు! మన మిక్కడ నొకవినోదమును చేయుదము” అనియెను. విలాసప్రియ లగువయస్య లెల్లరును రాజపుత్రికను సమీపించి “చెలీ! ఏమి వినోదము!” అని యడిగిరి.

రాజకు—ఈయలంగీరుని చిత్రపటమును నేలపై బెట్టుచున్నాను. ఒక్కొక్కతెయును వచ్చి తనయెడమకాలితో నొక్కొక్కతాపు తన్నవలయును. ఎవ్వరితాపువలన నాతనిముక్కు బ్రద్దలగునో చూతము.

ఈమాటలను విని సఖులందఱును వివర్ణవదన లైరి. అందొక్కతె “కుమారీ! నీవాక్కునుండి యంతటిమాట వెలువడఁగూడదు. గోడలకుఁగూడఁ జెవులున్నవి. ఈమాట యానోట నానోటఁ బడి దేశమున వ్యాపించెనేని రూపనగరదుర్గముపై నొక్కఱాయినైన నిలుచుట కష్టము.” అనియె.

రాజకుమారి యామాటలను విశ్వసింపక నవ్వుచు చిత్రపటమును నేలపై బడవైచి "ఎవ్వరు తన్నెదరో తన్నుడు" అనియెను.

ఎవ్వరును ముందునకు బోవ సాహసింపరైరి. నిర్మల యను చెలి యొక్క తెమాత్ర మారాజకుమారివదనమండలమును తనకోమలకరపంకజంబున నాచ్ఛాదించి నవ్వుచు "ఇక నెన్నడు నిట్టిమాటలాడకుము' అనియెను.

చంచలకుమారి యమూల్యమణిమయాలంకార శోభితంబగు తనవామపాద పల్లవము నెత్తి యౌరంగజేబు చిత్రపటముపైనుంచెను చంచలకుమారి పాదమునూది కొంచెముకొంచెముగ నదిమెను. చిట చిటమని చప్పుడయ్యెను. ఔరంగజేబుబాదుషావారి ప్రతిబింబము రాజకుమారిక పాదములక్రిందఁబడి పొడిపొడియైపోయెను.

అది యంతయును జూచి సఖులందఱును "ఎంతప్రమాదము! ఎంతపని జరిగినది!' అని యనుకొనుచు గడగడ వడఁకిపోవుచుండిరి.

రాజకుమారి నవ్వుచు "పిల్లలు బొమ్మలనుపెట్టి బొమ్మల పెండ్లిండ్లు మొదలగు నాటలమూలమున కోరికలఁ దీర్చుకొనునట్లే నేనును మొగలుబాదుషా మొగముపైఁ దన్నువలయునను నాశ తీర్చుకొంటిని.' అని చెప్పి నిర్మలవంకఁజూచి "సఖీ! నిర్మలా! పిల్లల యాశ తీరినది. నే నెప్పటికైనను నిజముగా నౌరంగజేబు ముఖముపై నిట్లే—'

ఆవాక్య మింకను పూర్తికాకుండఁగనే నిర్మల రాజపుత్రీ ముఖమును మూసివైచెను. వాక్యము పూర్తికాలేదు. కాని దాని యర్థముమాత్ర మందఱికిని తెలిసిపోయెను. వృద్ధురాలి హృదయము కంపించిపోవుచుండెను. ఇంతటి ప్రాణోపద్రవకరమైన సంభాషణము జరుగుచున్న యీస్థలమునుండి యెప్పుడు తప్పించుకొనిపోయి సుఖ పడుదునా యని యావేగపడుచుండెను అంతలో చిత్రపటము లమూ

ల్యము వచ్చెను. ఆధనము చేతికి బడినదో లేదో కాని వృద్ధురా లాస్థలమును విడిచి యూర్థశ్వాసముతోం బారిపోయెను.

ఆమె యిల్లువాటినతోడనే నిర్మలయు నామెవెనుకనే పరు గెత్తికొని వచ్చి యామెచేతిలో నొకమొహరీనుంచి 'ఓముసలిదానా! నీవు విన్నమాట మఱియెవ్వరిచెవినైనను వేయవలదు. మారాజ కుమారికిపోటి కష్టములేదు. ఇంకను చిన్నపిల్ల' అని చెప్పెను.

ముసలిత మొహరీని తీసికొని 'ఏమమ్మా! ఎంతమాట యంటిరి ఈమాట యెవ్వరికైనం జెప్పదగిన మాటయా! ఈసంగతినేను మాత్ర మెఱుంగనా! అనియెను. నిర్మల సంతోషముతో వెనుదిరిగి పోయెను.

---

## మూఁడవ ప్రకరణము

### చిత్రపట పరీక్ష

మఱునాడు చంచలకుమారి యొక్కతెయే కూర్చుండి వెలకుఁ దీసికొన్న చిత్రపటముల నన్నిటిని చూచుచుండెను. అప్పుడు నిర్మల కుమారికూడ వచ్చి కూర్చుండెను. ఆమెనుచూచి చంచల "నిర్మ లా! వీరిలో నెవ్వరిని నీవు పెండ్లిచేసికొనుట కిష్టపడియెదవో చెప్పుము" అనియెను.

నిర్మల—నేను పెండ్లియాడ నిశ్చయించుకొన్న యాతని చిత్ర పటమును నీవు కాలితో దన్ని పగులగొట్టితివి.

చంచల—ఔరంగజేబునా?

నిర్మల—నీకింత యాశ్చర్యమెందులకు?

చంచ—ఆదురాత్మునే?

నిర్మల—చెక్కవానిని వశముచేసికొనుటయే నాకు మిగుల నానందము నేను పులిని పెంచుచుండుట నీవెఱుంగవా? ఎప్పటికైన నేనా యౌరంగజేబును పెండ్లిచేసుకొనవలయు ననియే తలంచుకొను చుంటిని.

చంచల—ముసల్మానునే?

నిర్మ—నా చేతులలోఁ బడిన యెడల నౌరంగజేబుకూడ హిందువు కాఁగలఁడు.

చంచ—ఛీ మూర్ఖురాలా! చావఁగూడదా?

నిర్మ—అందుల కాక్షేపణము లేదు. కాని, నీవు త్రిప్పి త్రిప్పి చూచుచున్న చిత్రపట మెవ్వరిదో? ఆసంగతిమాత్రము తెలిసికొని తరువాత నట్లే చచ్చెదను.

చంచలకుమారి యింతవఱకును తాను చూచుచున్న చిత్రమును దగ్గఱనున్న చిత్రములతోఁ జేర్చివైచి "నే నేచిత్రమును చూచుచుంటిని? నిష్కారణముగా నితరులపై దోషారోపణము చేయుట యేమిలాభము? నేనే చిత్రమును చూచితిని?" అనియెను.

నిర్మల నవ్వుచు "నీవొక యాలేఖ్యమును చూచుచుంటివి. రాజకుమారీ! నీకింతకోప మెందులకు? ఈచిత్రపటములలో నెవ్వని ముఖము ప్రసన్నమై యుండునో వెదకి తీయఁగలను" అనియెను.

చంచల—అక్బరు బాదుషాచిత్రమా?

నిర్మల—అతని పేరెత్తినంత మాత్రముననే రాజకన్యకలు చీపురుగట్ట తీసికొందురు. అది కానేకాదు.

నిర్మల యిట్లు చెప్పి చిత్రపటములున్నతట్టుఁ దీసికొని "నీవు చూచుచున్న పటమునకు వెనుకవైపున నొక నల్లనిచుక్కయున్నది, దానిని నేను కనిపెట్టితిని. ఆగుర్తునుబట్టియే వెదకుచుంటిని" అని చెప్పుచు నొకపటమును దీసి చంచల చేతికిచ్చి "దీనినే నీవు చూచు కొనుచుంటివి" అనియెను.

చంచలకుమారి కోపముతో "నీకేమియు పనిలేదు, ఎదుటి వారి మొగములు చూచుచుండుటయే నీపని. దూరముగఁ బొమ్ము" అనియెను.

నిర్మ——నేను పోను. ఈముసలిరాజు చిత్రమును చూచుకొనుచుండుటకేనా నిప్పుడిది తీసికొంటివి?

చంచ——ముసలిరాజా? నీకుఁ గన్నులున్నవా పోయినవా?

మాటలాడుచున్న నిర్మల, చంచలకుమారి కోపమును వృద్ధిచేయవలయునను నుద్దేశముతోఁ జిఱునవ్వు నవ్వెను. నిర్మల మిగుల సౌందర్యవతి. ఆమందహాస మామె సౌందర్యమును ద్విగుణితముగాఁ జేసెను. నిర్మల నవ్వుచు "ఈపటమునందు ముసలితనము నీకగపడక పోవచ్చును. మహారాణా రాజసింహున కిద్దఱుకుమారులు పెద్దవారున్నారని జనులు చెప్పుదురు" అనియెను.

చంచల——అదియేమి? రాజసింహునిపటమా? అది యెవ్వ రెఱుఁగుదు రమ్మా!

నిర్మ——ఈపటము నిన్నసేకాదా తీసికొంటివి. నిన్నటిమాట నేఁటికే మఱపా? ఆతనికి వయసును చెల్లినది——అంతటి సౌందర్యవంతుఁడును లేఁడు. అగపడుటలేదా? నేను బాగుగఁ జూచితిని.

చంచ:—— క. గిరిజాత భస్మచర్మాం
బరు, లోపాముద్ర కుంభ ♦ భవుని; సుకన్యా
తరుణి చ్యవనర్షిఁ; గోరరె?
వరసతులు వరింత్రు వీర ♦ వరుల నెట్లైనన్.

అని చదివి యూరకుండెను.

నిర్మ——రాజకుమారీ! ఇటు చూడుము. నీవే నిన్ను బలిచేసికొనినట్లున్నది. దుర్లభుఁడైనరాజసింహుని నెట్లు పొందఁగలవు?

చంచ——పొందవలయు ననియే తలంచుచుంటినా? నీ వారం

గజీబును పొందవలయుననియే స్మరించుచుంటివా?

నిర్మ—నేను పరిహాసమున కాతని వరించితిని. నీవుకూడ రాజసింహు నట్లే తలంచుచుంటివా?

చంచ—నాకు నట్టిభాగ్యము లభింపదు. ఈజన్మమునం దిక నాసంసారసౌఖ్యము వ్యర్థమై పోయినది.

నిర్మ—రాజసింహుఁడు—ఏమీ! చెప్పుము! చిత్రదర్శనమాత్రముననే యిట్లాయిపోయితివా?

చంచ—ఏది యెట్లగునో నీకును నాకును దెలియునా? ఏమయినదియో యెవ్వ రెఱుఁగుదురు?

మేమును నట్లే చెప్పెదము. చంచలకుమారి యెట్లైనదియో మేమును చెప్పఁజాలము. అనురాగము మనుజులయందుఁ బుట్టుట సహజము [illegible], పటము మనుష్యుఁడగునా? పటమును విడిచి యారాజసింహునియందే ధ్యానము నిల్పినయెడఁ గావచ్చును. మొట్టమొదట నేదైన మనస్సునందుంచుకొని యనంతరము చిత్రపటమును స్మరించుకొన్నయెడలఁ గావచ్చును. స్వప్నమైనను నట్లే. చంచలకుమారి కేమైననట్టియవస్థ కలిగినదా! ఆపదునెనిమిది వత్సరములప్రాయముగలతరుణీమణి హృదయావస్థనుగూర్చి మేమెట్లు తెలియఁజెప్పఁగలుగుదుము!

చంచలకుమారిహృదయ మెట్లుండిన నుండనిండు! ఆమె కోమల హృదయమున నుదయించిన యగ్నిహోత్రము నూది ప్రజ్వలింపఁజేయుట మంచిపని కాదు. ఏమన, ముందు చాలవిపత్తు రానైయున్నది.

# నాలుగవ ప్రకరణము.

## వృద్ధురాలి సందిగ్ధము.

చిత్రములను విక్రయించిన యావృద్ధకాంత యచటనుండి బయలుదేరి తనయింటికి వచ్చెను. ఆగ్రా యామె నివాసస్థానము. ఆమె దేశదేశములకును బోయి చిత్రపటముల నమ్ముకొనుచుండును. ఆమె రూపనగరమునుండి యింటికి వచ్చునప్పటి కామెకుమారుఁడును వచ్చియుండెను. అతఁడు ఢిల్లీపట్టణమున వ్యాపారము చేయుచుండెను.

వృద్ధురాలు రూపనగరమునకుఁ బోయిన వేళ మంచిదికాదు. చంచలకుమారి యొనరించిన సాహసకార్యమును కన్నులారఁ జూచిన యామె కాసంగతుల నెవ్వరికైనఁ జెప్పవలెనను మనసు చలించిపోవుచుండెను. నిర్మలకుమారి యామెచేతిలో నొక మొహరీనుంచి "ఈ సమాచారము నెవ్వరికిని దెలియనీయవలదు" అని చెప్పకయే పోయిన యెడల వృద్ధురాలి హృదయమున నింత గందరగోళము పుట్టక పోయియే యుండును. ఆసమాచారము వెలిపఱచుట కెంత యాటంక మున్నదో యంతకంటె హెచ్చు వ్యాకులభావము కూడ నామె హృదయమును గలఁగించుచుండెను. వృద్ధురాలేమి చేయగలదు? రెండవకంటివాని కెఱుకపడనీయ నని యొట్టుపెట్టుకొని వచ్చినది. అంతేకాక యామెయొద్ద నొక మొహరీని లంచముగాఁ దీసికొని యున్నది. ఆసమాచారము ప్రకటమయ్యెనేని బాదుషామూలమునఁ జంచలకుమారికిఁ జాలగష్టములు ప్రాప్తించు ననికూడ నెఱిఁగి యున్నది. ఉన్నట్లుండి యీవార్త ప్రచురపఱచుట మంచిపని కాదు కాని, యాముదుసలి కాహారము సహించుట లేదు. రాత్రులయందు

నిద్రపట్టుట లేదు. తుట్టతుద కీమాట నెవ్వరికిని దెలియఁజేయ గూడదని తనలోఁదానే శపథము చేసికొనియెను. ఇట్లు చేసికొన్న యనంతరమే యా కుమారుఁడు భోజనమునకుఁ గూర్చుండెను. వృద్ధురాలు తనకుమారుని కంచములో రొట్టెయును మఱికొన్ని భక్ష్యములను వడ్డించి "అబ్బాయీ! భుజియింపుము. పారవేయకుము. రూపనగరమునుండి వచ్చి నేఁటిదినములో నీరొట్టె చేసితిని. ఎట్లు చేసితినో చెప్పఁజాలను. ఎన్నఁడు నిట్లు చేయలేదు. ఇఁక నెప్పుడు నిట్లు చేయఁజాలను" అనియెను.

కుమారుఁడు భోజనముచేయుచు "అమ్మా! రూపనగర సమాచారము లేమో చెప్పెదనంటివే! చెప్పెదవా?" అనియెను.

తల్లి—అబ్బాయీ! నోరెత్తఁగూడదు. ఆమాట నోటినుండి వెడలఁదగినది కాదు—నేనేమి చెప్పితిని? మఱచిపోయి యేమేమియో చెప్పియుందును.

చంచలకుమారిమాటలు తన హృదయమును గలఁచివేయుచుండుటచే నామె తనకుమారునితో నేమి మాటలాడుచుండెనో తెలిసికొనఁజాలకుండెను. ఇట్టి తల్లిమాటలను విని కుమారుడు "ఊరకంటివేమి? అది చెప్పఁగూడదా యేమమ్మా!" అనియెను.

తల్లి—చెప్పఁదగినమాట కాదు నాయనా!

కుమా—అది యెట్టిమాట? ఎందులకుఁ జెప్పఁగూడదు?

తల్లి—మఱేమియును లేదు, రూపనగర రాజకుమారికమాట.

కుమా—ఆమె చాల సుందరి యనియా? ఇదియేనా మిగుల రహస్యమైనమాట.

తల్లి—అదికాదు—ఆదురాత్మురాలి కెంతపొగరు!—అయ్యో దైవమా! నేనేమని చెప్పివైచితిని?

కుమా—రూపనగర రాజకుమారి యనగా నెవ్వరు? ఆమె

పొగరవ నెట్టిది? నీవెందులకుఁ జెప్పఁగూడదు? నేనేల వినఁగూడదు?

తల్లి—అది చాల పొగరెక్కియున్నది. నిశ్చయముగాఁ బాదుషావారినిగూడ లక్ష్యము సేయుటలేదు.

కుమా—పాదుషాను తిట్టియుండవచ్చు నని తోఁచుచున్నది.

తల్లి—తిట్టుటా? అంతకంటెను హెచ్చుపని.

కుమా—అంతకంటెను హెచ్చుపనియా? ఏమిచేయును? పాదుషావారిని పొడిచి వేయఁజాలదుగదా!

తల్లి—పొడిచి వేయుటకంటెను హెచ్చుపని.

కుమా—పొడిచి వేయుటకంటెను దారుణమైనకృత్యమా?

తల్లి—అబ్బాయీ! ఇంక నన్నడుగకుము—నేనామెసొమ్ముదినియుంటిని.

కుమా—అమ్మా! ఆమెసొమ్ముఁ దినుటయెట్లు?

తల్లి—ఆమె నాకొకమొహరీ నిచ్చినది.

కుమా—ఎందులకు?

తల్లి—ఆమెచేసిన దారుణపాపకృత్యమునుగూర్చి నేనెవ్వరితోడను చెప్పకుండుటకు—

కుమా—మంచిది. నాకుఁగూడ నొకమొహరీ నీయరాదా?

తల్లి—ఎక్కడ నున్నది నాయనా?

కుమా—అట్లయినయెడల నాతోఁగూడఁ జెప్పరానిమాట యెంతమాటయో?

తల్లి—మఱియేమియును లేదు—పాదుషావారి చి—త్ర—ప—ట—మును— అయ్యో! అయ్యో! మాట నోటినుండి వెడలి పోవుచున్నది.

కుమా—చిత్రపటమును చినుఁగఁగొట్టినదా?

తల్లి—అయ్యో! బిడ్డా! పాదములతోఁదన్ని తుత్తునియలుగఁ

జేసి నైచినది—అయ్యో! నేనవిశ్వాసిని నైతిని.

కుమా—ఇందు నీయవిశ్వాసమేమున్నది? నీవు తల్లివి. నేను బిడ్డను. నాతోఁ జెప్పినంతమాత్రమున నేమి?

తల్లి—అబ్బాయీ! ఈమాట ఎవ్వరితోడను చెప్పకుము.

కుమా—నీవు స్పష్టముగాఁ దెలుపుము. నేనెవ్వరితోడను దెలుపువాఁడనుగాను.

అప్పు డావృద్ధురాలు చిత్రపటములనుగూర్చి జరిగినవృత్తాంత మంతయును సమగ్రముగ, రసవంతముగఁ దెలియఁజెప్పివైచెను.

---

## ఐదవ ప్రకరణము

---

### దరియాబీబీ

అవృద్ధురాలి కుమారునిపేరు ఖిజర్ షేక్. చిత్రపటములను లిఖియించి యిచ్చువాఁ డాతఁడే. ఆతనియంగడి ఢిల్లీనగరమునం దుండెను. ఆతఁడు తల్లియింటియం దొకటిరెండుదినము లుండి ఢిల్లీకిఁ బోవుచుండును. ఢిల్లియం దాతకొకబీవీ యుండెను. ఆమె యెప్పుడు నాతని యంగడియందే యుండును. ఆమెపేరు ఫాతిమాబీబీ. ఖిజరు తనతల్లివలన వినినరూపనగరవృత్తాంత మంతయును ఫాతిమాతోఁ జెప్పి "నీవిప్పుడే దరియాబీబీయొద్దకుఁ బోయి యామెమూలమున నీసమాచారమంతయును బేగమువారికి విక్రయించినయెడల నేమైనఁ గొంతధనము చిక్కఁగలదు" అని చెప్పెను.

దరియాబీబీ వారియింటిసమీపముననే నివసించియుండుటచే నా

యింటిలోనుండియే దరియాబీబీగృహమునకుఁ బోవుట కొకమార్గము కూడ నుండెను. కావున ఫాతిమా మేలిముసుఁగు లేకుండఁగనే యామెయింటికిఁ బోయెను.

పాఠకుల కిప్పుడు ఖజరునుగూర్చిగాని, ఫాతిమానుగూర్చిగాని విశేషపరిచయమును గలిగింపవలసినయవసరము లేదు. కాని, దరియాబీబీనిగూర్చిమాత్రము కొంచెము దెలుపవలసియున్నది. దరియాబీబీకి నిజమైనపేరు దర్రఉన్నీసా అని యుండవచ్చును. కాని, యాపేరుతో నామె నెవ్వరును పిలుచుటలేదు. దరియాబీబీ యనియే పిలుచుచుండిరి. ఆమెకుఁ దల్లిదండ్రులు లేరుకాని యక్కగా రొక్కతె యుండెను. అంతేకాక యింకొకముసలి కూడ నుండెను. ఆమె యింటియందు మగవా రెవ్వరును లేరు. దరియాబీబీవయసు పదునేను సంవత్సరములకంటె హెచ్చుగా నుండదు. ఆమె చాల సుందరి.

ఆమెయక్కగారు మంచిమంచియత్తరులు, సుర్మాలు మొదలగుమనోహరవస్తువులను జేయుచుండును. అందువలననే యామెను దినము గడచుచుండును. దరియాబీబీ పల్లకియందుఁగాని బండియందుఁగాని కూర్చుండి దొడ్డవారియిండ్లకుఁ బోయి యావస్తువుల నమ్ముచుండును. పాప మాపేదరాలు రాత్రికాలములయందు కాలి నడకను గూడఁ బోవుచుండును. బాదుషావారియంతఃపురమునకుఁ బోవుట కెవ్వరికి నధికారము లేదు. ఇతరులగు స్త్రీలుఁగూడఁ బోరాదు. కాని, దరియాబీబీకిమాత్ర మచ్చటికిఁ బోవుట కొకయుపాయ ముండెను. దానినిగూర్చి ముందు తెలిపెదము.

ఫాతిమాబీబీ వచ్చి చంచలకుమారి వృత్తాంతమంతయును దరియాబీబీకిఁ దెలిపి "ఈసమాచారమును విక్రయించి ధనము తేవలయు" నని చెప్పెను.

"అట్లయినయెడల రంగమహాలునకుఁ బోవలయును. అక్కడ

క్షుంగోవృట కాజ్ఞాపత్రము కావలయునుగదా! ఎక్కడ నున్నది!'' అని దరియాబీబీ పలికెను.

ఫాతిమా ''నీయొద్దనే యున్నది'' అనియెను. దరియాబీబీ యొక్క పట్టము (పటుకా) ను దీసి దానిలోనుండి యొకకాగితమును దీసికొని త్రిప్పి త్రిప్పి చూచి ''ఔను. ఉన్నది'' అని చెప్పెను.

దరియాబీబీ కొంచెము సుర్మాయును, ఆజ్ఞాపత్రము (పరమానా) ను దీసికొని బయలుదేరి పోయెను.

---

# ద్వితీయ భాగము

---

## నందనవనమునందలి నరకము

## మొదటి ప్రకరణము

---

### అదృష్ట గగనము

సంపూర్ణ కౌముదీవిలాసమున స్వచ్ఛంబులగు సికతాతలంబుల నడుమనుండి యింద్రనీలసదృశంబులగు జలతరంగములచేఁ బ్రవహించుచున్న యమునానదియొద్దను మహానగరములలో నెల్లఁ బేరుగాంచిన డిల్లీనగరము మిలమిలమెఱయు మణిఖండమువలెఁ బ్రకాశించుచుండెను. అనేకములైన యమూల్యమణులచే నిర్మింపఁబడిన మినారతు స్తంభములును, బురుజులును నాకసమువీఁదికిఁ దలలెత్తి యమునాతరంగమాలికలం బ్రతిఫలించి యందలి మెఱుంగుహొరంగుల ద్విగుణీకరింపఁ జేయుచుండెను. దూరముననున్న కుతుబ్ మినారు నందలి సమున్నతశిఖరము ధూమమయ స్తంభమువలెఁ గానవచ్చుచుండెను. సమీపమునందలి జుమ్మామసీదుయొక్క నాల్గు స్తంభము

లును నీలాకాశమును ఛేదించుకొని చంద్రాలోకమున విలసిల్లుచుండెను. రాజవీధుల యందలి యంగడులును, అంగడులయందలి దీపమాలికలును నగరవాసులచే నలంకరించుకొనఁబడిన పుష్పమాలికల పరిమళములును, ఒక్కచో వినోదములై, మఱియొక్కచో మృదువులై వినవచ్చుచున్న నాగరకులహాసకలకలంబులును, తదీయాలంకార శింజితధ్వనులును, అన్నియు నేకమైనరకమున నందనారామవిహారామోదము గలిగించుచు మోహమును గల్పించుచుండెను. పుష్పంబుల పరిమళంబులును, అత్తరులసుగంధములును, నర్తకీజనంబులనూపురారావమును, గాయకకంఠములనుండి వెడలు సప్తస్వరంబుల యారోహణావరోహణంబులును, భేరీమృదంగకాహళాది వివిధవాద్యస్వనంబులును, కమనీయకామినీ కరతలకలితతాళధ్వనులును, ద్రాక్షానారికేళాదిమద్యంబుల ప్రవాహంబులును, మదనతీవ్రాగ్ని కటాక్షానల జ్వాలాప్రసారంబులును, అజిరీపులావుల ఘుమఘుమలును, వికట, కపట, మధుర, చతురంబులను చతుర్విధహాసంబుల విలాసంబులును, రాజమార్గప్రచారంబులగు నశ్వంబుల ఖురపుటాఘాతశబ్దంబులును, సుందరపల్యంకికావహననముత్సాహులగు బోయల భీషణారావంబులును, మదగజగళఘంటికాచటుల నిస్వనంబులును, వివిధశకట చక్రవిరావంబులును, సకలజనహృదయ రంజకంబులై యలరారుచుండెను.

నగరమధ్యమునందలి గుల్‌జారు, చాందనీచతుష్పథముల యందు రాజపుత్త్రులును, తురకలును తురగముల నధిష్ఠించి ప్రచారముసేయుచు జాగరూకులై కాఁచికొనుచుండిరి. ప్రదేశమునందలి యమూల్య పదార్థము లన్నియుఁ దరతరములై, రాశీభూతములై యచ్చోఁ జేరియుండెను. అందందు మార్గమధ్యమున నర్తకులు సారంగను వాయించుచు గానముచేయుచుండిరి. వాద్యములవారు

వాద్యములు సేయుచుండిరి. వేనవేలు జనులు గుంపులుగుంపులై చేరి చూచుచుండిరి. అన్నిచోటులకంటెను జ్యోతిష్కుఁడు కూర్చుండి యున్న స్థలమున హెచ్చుమందిజనులు గుంపులు గూడియుండిరి. మొగలాయి బాదుషాలకాలమునందు జ్యోతిష్కులకుఁ గలిగిన గౌరవము మఱియేకాలమునందును గలుగలేదని తోఁచుచున్నది. వారు జ్యోతిశ్శాస్త్రమునకు వశులై యుండిరి. ఆకాలమునందు జ్యోతిషమునుచూచికొనక యెట్టిదొడ్డకార్యమునందైనను బ్రవేశించుటలేదు. ఈగ్రంథమునందు వర్ణింపఁబడిన చరిత్రకాలమునకుఁ గొంచెము పూర్వముక్రిందట ఔరంగజేబుకనిష్ఠకుమారుఁడైన యక్బరనునాతఁడు రాజవిద్రోహియై ప్రతిఘటించి యుండెను. అయిదువేలమంది రాజపుత్రసైనికు లాతనికి సాహాయ్యము నొనరించుచుండిరి. ఔరంగజేబునకు స్వల్పసైన్యముమాత్రమే యుండెను. కాని జ్యోతిష్కులవాక్యములపై నమ్మకముంచి యక్బరు తనసేనలను దీసికొని బయలుదేరుటకుఁ గొంచెమాలస్యముచేసెను. ఈసమయము నెఱింగి తన నేర్పుచే నౌరంగజేబు పనిచేసి యక్బరునిప్రయత్నము విఫలముగఁజేసివైచెను.

ఢిల్లీయందు చాందనీయను చతుష్పథమునందు జ్యోతిష్కుఁడు చిత్రాసనము వేసికొని, పుస్తకమును మణికట్లపై నుంచుకొని, తలపైనొక యుష్ణీషమును ధరించి కూర్చుండి యుండెను. చాలమంది స్త్రీలును పురుషులును తమతమయదృష్టములను తెలిసికొనవలయునను నభిలాషతో నాతని బరివేష్టించి యుండిరి. అంతఃపురస్త్రీలుగూడ నాజనసమూహములో నుండి పోయి తమతమ యదృష్టములను తెలిసికొనుటకు సంకోచపడుచుండిరి. జ్యోతిష్కుఁడు మాత్ర మొక్కఁడే. జనులు నలుదెసలనుండియును వచ్చి స్థలము లేకుండఁ గ్రిక్కిరిసియుండిరి. ఆగుంపునకు వెలుపల నొకయువతీమణి మేలిముసుఁగు వైచికొని యటునిటు తిరుగాడుచుండెను. ఆమెకు

జ్యోతిష్కునియొద్దకుఁ బోవలయుననియున్నది. కాని యాజనులంద ఱును దాటికొని లోనికిఁబోవుట కామె సాహసింపలేక యటునిటు చూచుచుండెను. అప్పుడా మార్గమునుండి యొక గుఱ్ఱపురౌతు పోవు చుండెను.

ఆయశ్వారోహకుఁడు యౌవనపురుషుఁడై యుండెను. బాగుగ జూచినయెడల నాతఁడు మొగలాయీ వంశస్థుఁడని తోఁచుచుండెను. అతని శరీరకాంతి మిగుల రమణీయమైనది. అంతటి సుందరపురుషుడు మొగలాయీల యందు దుర్లభుఁడు. గౌరవార్హములైన యాతని యుడుపులను చూచినతోడనే యాతఁడొక గొప్పయింటివాఁడై యుండునని తోఁపకమానదు. ఆతఁడెక్కిన గుఱ్ఱముకూడ నుత్తమలక్షణములుగల జాత్యశ్వమైయుండెను.

జనసమ్మర్దమువలన నారౌతు తనగుఱ్ఱమును మెల్లమెల్లగ నడపించుకొనుచుఁ బోవుచుండెను. అటునిటు చూచుచు నిలువబడియున్న యాయువతీమణి యాతనిం గాంచి సమీపించి యాగుఱ్ఱమును కళ్ళెమునుబట్టి యాపి ''ముబారకుసాహేబువారా?'' అనియెను.

ముబారకు—(ఇదియే యాతని పేరు) ''నీవెవ్వతెవు'' అనియెను.

యువ—అయ్యో దైవమా! ఇంకను గుర్తు తెలియలేదా?

ముబా—దరియాబీబీయా యేమి?

దరి—అవునుస్వామీ!

ముబా—ఇక్కడ కేందులకు వచ్చితివి?

దరి—ఏమీ! నేనెల్లచోట్లకును బోవుచుందును. నీయాక్షేపణ మేమియును లేదుగద! నీవు వలదందువా యేమి?

ముబా—నేనేమియు నభ్యంతరము చెప్పుటలేదు. ఎందులకుఁ జెప్పవలయును? నీవు నాదానవు కావుకద!

ఫలించుటచే రోషనార్వారు పృథ్వీతలమునసే యదృశ్యురాలై పోయెను. అనంతరము జేబఉన్నీసా తనమేనత్తపదవిని, మర్యాదను, ఆమెకింత వఱకుఁ బాదాక్రాంతులైన ప్రియజనులను గూడఁ దానాక్రమించు కొనియెను.

పదవి, మర్యాద యని చెప్పియుంటిమి. వానికిఁ దాత్పర్యము న్నది. బాదుషావారి యంతఃపురమునకుఁ . గోజ్జాలకంటె మఱియెవ్వ రుప ప్రవేశమును లేదు. అంతఃపురసంరక్షణమునకు స్త్రీజనము మాత్రమే యుండెను. హిందూరాజు లెట్లు ముసల్మానుకన్యకలను ప్రతీహారిణులుగ నుంచుకొనుచుండిరో, అట్లే మొగలుబాదుషాలు కూడ నేర్పఱచుకొనుచుండిరి. మొగలుబాదుషాలు తాతారసుందరుల నంతఃపురరక్షమునకు వినియోగించుచుండిరి. వీరలందఱిపైని నొక స్త్రీ యధికారిణియై యుండును. ఆమె సేనానాయిక స్థానమునం దుండుటచే నామెపదవి మిగుల గౌరవమైనదిగా నుండును. అందులకు దగినట్లు వేతనముఁగూడ నధికముగా నుండును. ఇదివఱకీపదవియందు రోషనార్వారు నియోగింపఁబడి యుండెను. ఆమె యాకస్మికముగా లోకాతీతమైనమహాంధకారమున నంతర్హితయైన వెనుక జేబఉన్నీసా యాపదవిని పొంది రాజాంతఃపురమునందలి యెల్లవిషయములకు నధి కారిణియై యుండెను. అందువలన జేబఉన్నీసా రంగమహాలునకు (బాదుషావారి యంతఃపురమునకు రంగమహాలు, మహాలు, అను నామములుండెను.) సర్వాధికారిణి యయ్యెను. ప్రతీహారిణులు, కొజ్జాలు, దాసీలు, కావలివారలు, బోయలు, వంటవారలు మొదలగు సేవకు లెల్లరు నామెచెప్పినట్లు చేయుచు నామెకు వశ్యులై యుండిరి. అందువలన నామెయిుత్తరువునకు వచ్చినవా రెవ్వరైన నంతఃపురము నకుఁ బోవుట కవకాశము కలుగుచుండెను.

ఆమె యాజ్ఞ ననుసరించి యంతఃపురమునకుఁ దరచుగా రెండు తరగతులజనులు వచ్చుచుఁ బోవుచుండిరి. అందొక తెగవా రామె ప్రేమించిన శృంగారపురుష శేఖరులు; మఱియొక తెగవారు వివిధ దేశ సమాచారములను విక్రయించి ధనము సంపాదించుకొనువారు.

జేబఉన్నీసా మిగుల రాజనీతివిశారద యని పైనిజెప్పియు న్నాము. మొగలుసామ్రాజ్య మనునావను నడపుయంత్ర మామె చేతిలో నున్నది. ఆమె మొగలాయిసామ్రాజ్యమును నియమించు నదృష్టదేవత యని వర్ణింపఁబడియున్నది. రాజకార్యధురంధరు లగు వారలకు విదేశసమాచారములం దెలిసికొనుట యావశ్యకమని యం దఱకును దెలిసినవిషయమే. ఎక్కడ నేమిజరుగుచున్నదో, దానిని రహస్యముగా దెలిసికొనుచుండుట వారిపని. దుర్మ్మఖుని ప్రభువైన శ్రీరామచంద్రమూర్తి మొదలుకొని బిస్మార్కువరకు నందఱు నిట్టిప ద్ధతి నవలంబించినవారలే. జేబఉన్నీసా యిట్టికార్యములయందుఁ జాలప్రవీణురా లగుటచే నలుదెసలనుండియు వార్తలను సంగ్రహించు చుండెను. ఇందుకొఱకామె కొందఱుజనులను నియమించియుంచెను. చిత్రపటవిలేఖకుఁ డగుఖజరుకూడ నందులో నొకఁడు ఆతనితల్లి నా నా దేశములకును పోయి చిత్రముల నమ్మికొనుచు సమాచారములను సంగ్రహించుకొని వచ్చి తనకుమారునితోఁ జెప్పుచుండును. దరియా బీబీ సహోదరియును సుర్మా, అత్తరు మొదలగువానిని విక్రయించు నెపంబున ఢిల్లీనగరమున సంచరించుచు నందందలివార్తలను గొనితె చ్చుచుండును. వీని నన్నిటిని దరియాబీబీ పోయి జేబఉన్నీసాకు దెలి యజేయుచుండును. ఇట్టివార్తలను దెచ్చినవారికి జేబఉన్నీసా వార మున కొకసారి బహుమానముల నిప్పించుచుండును. దీనికే వార్తావి క్రయమని మీఁదఁ జెప్పియుంటిమి. సంవాదవిక్రయార్థమై దరియా బీబీ రాజాంతఃపురమునఁ బ్రవేశించుటకు జేబఉన్నీసా యామె కొక

యాజ్ఞాపత్రిము (పరమానా) నిచ్చియుండెను. అందలి రహస్యమే మనగా దరియాబీబీ సుర్మావిక్రయించు నెపమున నెప్పుడైనను వలసి నప్పుడు మహాలునకు బోవచ్చును.

కాని దరియాబీబీ యానాఁడంతఃపురమునఁ బ్రవేశించు సమయమున నాకస్మికముగ నొకయంతరాయము కలిగెను. ముబారకు ఖాను రంగమహాలునఁ బ్రవేశించి యుండెను. దరియాబీబీ యప్పుడే లోనికిఁబోక కొంతసేపు వేచియుండి తరువాత నంతఃపురమునఁ బ్రవేశించెను.

ఆమె పోవునప్పటికి ముబారకు జేబఉన్నీసావిలాసగృహము నందే యుండెను. దరియాబీబీ చాటుననుండి చూచుచుండెను.

---

## మూఁడవ ప్రకరణము.

---

### ఐశ్వర్య నరకము.

మహానగరమైన డిల్లీయందు డిల్లీదుర్గము సారభూతమైనది. దుర్గమునందు ప్రసిద్ధమైనది రాజప్రాసాదమాలిక. ఆరాజప్రాసాదములయం దున్నంతటి ధనరాశి, అంతటి రత్నరాశి, అంతటిరూపరాశి మఱియు నంతటిపాపరాశి, యీభారతవర్షమునం దంతటను ద్రోవు చేసి చూచినను గానరాదు, రాజప్రాసాదములయందు మనోహరమైన యంతఃపురము, రంగమహాలు. ఇది కుబేరకందర్పులకు రాజధానియై యుండెను. ఇందు సూర్యచంద్రకిరణ ప్రసారమే లేదు. యముఁడుగూడ రహస్యముగనే గాని బహిరంగముగా నందుఁ బ్రవేశింపఁజాలఁడు. అట వాయువునకుఁగూడ గమనరోధము కలదు. అక్కడనున్న చిన్నచిన్న మందిరములన్నియును మిగుల జిత్రములై

సవి. చంద్రకాంత శిలానిర్మితములును, నవరత్నఖచితములునగు నిట్టి రమణీయసుందిరములు మఱియెచ్చటను లేవు; స్వర్గమునందలి నంద నారామమును నిందించునట్టి యుద్యానవనమాలికలును మఱియొకచో లేవు. రంభోర్వశీమేనకా తిలోత్తమాద్యప్సరల గర్వనిర్వాపణంబు చేయఁజాలు త్రిలోకమోహనాకార లగురమణీమణులు డిల్లీనగరము నందుమాత్రమే కలదు. ఇంతటిభోగవిలాసాదు లీలోకమున నెచ్చ టను లేవు. ఇట్టిభోగవిలాసములమధ్య ప్రదేశముననే జేబఉన్నీసా విహారమునొకకొక విలాసభవన ముండెను.

ఆ కేళీగృహ మతిమనోహరమైనది. ఆభవనమునందలి నేలపై నీల శ్వేతవర్ణంబులగు నమూల్యశిలాఫలకములు పఱుపబడి యుండెను చంద్రకాంత శిలానిర్మితంబులగు కుడ్యంబులపై విమలనవమణి విరచి తంబు లగులతలును, పత్త్రిములును, పుష్పములును, పండ్లును, కూర్పబడియుండెను. ఎల్లచోట్లను మణిమయదర్పణములు కొంచె మెత్తుగా నమర్పబడియెను. ఆదర్పణముల కిరువంకలను బంగారుసరిగ కుచ్చులు వ్రేలాడుచుండెను. మేలుకట్టునకు వెండిసరిగ పనిచేసిన లత లును వానికి చిన్నచిన్న ముత్తెములజాలరులును, నప్పుడే వికసించిన పరిమళ పుష్పములచే గూర్పబడిన మాలికలును నలంకరింపఁ బడియెను. తొలుకరివానలకు ననలెత్తిన కోమలమైన పచ్చ పచ్చిక కంటెను మృదువైన రత్నకంబళము నేలపై బఱుపఁబడియుండెను. అందుపై నేనుగుదంతములతో నిర్మింపఁబడిన రత్నఖచితమగుమంచ మును దానిపై సరిగకుట్టుపనిచేసిన మొకమలుపఱుపును, ఆపఱుపుపై సురభిళకుసుమపరంపరలచే నిండింపబడినవివిధ పాత్రలును, ఆ పాత్రల యందనేకవిధంబులగు నత్తరులును, మనోహర పరిమళద్రవ్యములచే నతి ప్రయత్నపూర్వకముగ సమకూర్పఁబడిన తములపుటాకుమడపు లును, మఱికొన్ని పాత్రములయందు హృద్యంబులగు మద్యంబులును,

నవరింపఁబడియుండెను. ఈయన్నిటినడుమను పుష్పరాసులను, రత్న రాసులనుగూడఁ దిరస్కరించు సౌందర్యముగల ప్రోఢయగు జేబఉన్నీసా పానపాత్రమును దక్షిణహస్తమునం గీలించి యక్తరాత్రమునందలి నక్షత్రశోభారామణీయకమును గవాక్షమార్గములం గాంచుచు సుగంధపుష్పాలంకృతంబగు తన యుత్తమాంగమును, శీతల మందమలయానిలంబులచేఁ జల్లఁజేసికొనుచుఁ గూర్చుండి యుండెను. అట్టి విలాససమయమున ముబారకుఁగూడ నచ్చటనే యుండెను.

ముబారకు జేబఉన్నీసాసమీపమునసే కూర్చుండి తాంబూలాదులగు బహూకారములవలన సంతృప్తుఁడై ధన్యుఁడై యుండెను.

అప్పుడు జేబఉన్నీసా "పిలువకుండ వచ్చినవారే బాగుగఁ బ్రేమించువారు" అనియెను.

ముబా—పిలువకుండఁగనే వచ్చి మర్యాద నతిక్రమించితిని, కాని, నేను యాచకుఁడను. కావునఁ బిలువకుండఁగనే వచ్చితిని.

జేబ—ప్రాణాధికా! నీకోరిక యేమి?

ముబా—ఈ ప్రాణాధికశబ్దమునందు శాస్త్రప్రకారము నాకధికారము కలిగియుండవలయు ననియే నాకోరిక.

జేబఉన్నీసా నవ్వుచు "ఇదేమిమాట! బాదుషాపుత్త్రిక లెన్నఁడైనను వివాహము చేసికొనుట యున్నదా?

ముబా—మీచెల్లెండ్రిద్దఱును పెండ్లి చేసికొనలేదా?

జేబ—వారు రాణులు కాఁగోరి పెండ్లిఁజేసికొని యున్నారు. బాదుషాపుత్త్రికలు రాజకుటుంబములోవాసి తప్ప మఱియొకనిని పెండ్లి చేసికొనరు. సార్వభౌమతనయ యున్నారు రూపాయలమన్సబుదారుని వివాహ మాడునా!

ముబా—నీవీరాజ్యమున కంతకు నధికారిణివి. బాదుషావారు నీవేమిచెప్పిన నది చేయుటకు మఱుమాట చెప్పరు.

జేబ—ఇట్టి యనుచితమైన విషయమునుగూర్చి నేను బాదుషావారితో మనవి చేయఁజాలను.

ముబా—రాజకుమారీ! ఇది యనుచితకార్యమా ?

జేబ—ఇదిమాత్రమా ?

ముబా—ఇది మహాపాపకార్యముకాదా ?

జేబ—మహాపాపము నెవ్వరు చేయుచున్నారు ?

ముబారకు తలవంచికొని తుట్టతుదకు "నీవు బాగుగ నాలోచించి తెలిసికొనలేవా ?" అనియెను.

జేబ—ఇది నీకుఁ బాపముగాఁ దోఁచినయెడల నింతటినుండి నీవిటకు రాకుము.

ముబా—అది నాకు సాధ్యమేయైనయెడల నట్లే చేయుదును. కాని, నేనీ రూపరాశికి విక్రీతుఁడనై పోయితిని.

జేబ—నీవట్లే విక్రీతుఁడవైతివేని, నేను మూల్యముననే నిన్ను విలిచికొంటినేని, నేను చెప్పినట్లు చేయుము. ఊరకుండుము.

ముబా—నేనొక్కఁడనుమాత్రమే యిట్టి పాపమునకు గుఱియై యుండినయెడల నట్లే యూఱకుందును. కాని, నేను నిన్ను నాప్రాణములకంటెను హెచ్చుగఁ బ్రేమించుచుంటిని.

జేబఉన్నీసా పకపక నవ్వుచు "ఇదియంతయును సార్వభౌమపుత్త్రిక చేయుచున్నపాపమే యందువా ?"

ముబా—పాపపుణ్యములు భగవన్నిర్ణీతములు.

జేబ—భగవంతుఁ డిట్టియల్పజనులకొఱకు పనిఁగల్పించుకొని పుణ్యాపాపనిర్ణయముం జేయుచుఁ గూరుచుండునా! ఏకపతివ్రతనై చిరకాలముభర్తకు దాసినై యుండి తుదకు సహగమన మనునెపంబున మహానలజ్వాలలంబడి మ్రగ్గుటకు నేనుహిందూబ్రాహ్మణకన్యకననుకొంటివా! కాక రాజపుత్త్రికననుకొంటివా!సర్వేశ్వరుఁడునానుదు

ట నట్టి వ్రాతయే వ్రాసినయెడల నన్నీబాదుషా కడుపునఁ బుట్టింపక యే యుండును.

ఒక్కసారిగా ముబారకు నింగినుండి నేలపైఁ బడిపోయెను. ఇట్టిపరుషవాక్యముల నాతఁ డెన్నఁడును విని యుండలేదు. అంతటిపాపపూరితమైన డిల్లీనగరమునఁ గూడ నట్టిదారుణవాక్యము లాతని చెవి నిబడియుండలేదు. ఆమాటలు మఱియొక రెవ్వరైన నన్నయెడల నాతఁడ నేకవిధముల మందలించి శపించియే యుండును. కాని, యట్టి కఠినోద్దేశమంతయును జేబఉన్నీసా జగన్మోహనకరంబగు లావణ్యరస సముద్రమున నడుగుముట్ట మునిఁగిపోయియుండెను. ఆతనికి వేఱు మార్గ మేమియును తోఁచలేదు. కేవలము విస్మితుఁడై పోయెను.

జేబ—ఆమాటలుపోనిమ్ము. మఱియొక ప్రసంగమునకుఁ రమ్ము నేనిఁక నెన్నఁడు నట్టిమాటలు వినుదాననుగాను. మరల నామాట యెత్తితివేని—

ముబా—నన్ను భయపెట్టుటవలన నేమి ప్రయోజనము? నీవెవ్వనిపై నప్రసన్నురాలవైయుందువో యాతనికంఠముపై నుత్తమాంగమొకగడియయైన నిలువఁజాలదని నేనెఱుఁగుదును. కాని, యీముబారకు మృత్యువునకు భయపడువాఁడు కాఁడని నీకును తెలియును.

జేబ—మరణముకంటెను మించినశిక్షయే లేదా?

ముబా—ఉన్నది. అది నీయొద్ద నున్నది.

జేబ—మాటిమాటికి నసందర్భప్రసంగములకు దిగుచుండిన యెడల నది యిప్పుడే కాఁగలదు.

ఒకదానికిఁ బోయిన వేఱొకటి వచ్చెనని ముబారకు తలంచికొనియెను. జేబఉన్నీసా పాపాత్మురాలని యామెను పరిత్యజించిన యెడలఁ దనకు మరణము శరణమగుట కేమియును సందేహము లేదని కూడఁ దెలిసికొనియెను. మొగలాయిసామ్రాజ్యమున నెందు నెదురు లేక

యామె సర్వేశ్వరియైయుండెను. కేవలమూరంగజీబే యామె యాజ్ఞ కుబద్ధుండైయుండెను. కాని ముబారకున కందుల కెంతమాత్రమును చింతలేదు. ముబారకు తానా జేబఉన్నీసా జగన్మోహనాకృతికి లొంగి యామెను విడనాడంజాలకుండుటకును, ! ఇంతటిపాపకర్మమునుండి తరించుటకుందనకు శక్తిలేకుండుటకును మిగుల విచారించుచుండెను.

అందువలన ముబారకు వినయభావముతో "నీయభీష్టపూర్వకమైన దయాలేశమెంతవఱకు నాపైఁ బ్రసరింపఁజేయుదువో యంతవఱకే నాజీవితము పవిత్రముకాఁగలదు. నేనింకను విశేషించి దురాశాబద్ధుండనైతినేని యది నాపేదతనముయొక్క ధర్మమని తెలిసికొని మన్నింపవలయును. జగచ్చక్రవర్తియగు బాదుషాను దరిద్రుఁడెవ్వఁడును నిందింపఁజాలఁడు" అనియెను.

అప్పుడు ప్రసన్నురాలైన జేబఉన్నీసా ముబారకుఁ గొంచెము మద్యమును సాదరముగఁ ద్రావనిచ్చి మధురప్రియసంభాషణానంతరమం దత్తరుతాంబూలముల నొసంగి పంపివైచెను.

ముబారకు రంగమహాలునుండి వెడలిపోవుచుండఁగా దరియాబీబీవచ్చి యాతనిచేయిపట్టుకొని యితరులకు వినఁబడకుండ "రాజపుత్రికను పెండ్లిచేసికొనవలయుననునభీష్టమిప్పుడుతీరినదా?"అనియెను

ముబారకు విస్మితుండై "నీవెవ్వతెవు?" అనియెను.

దరి—ఆదరియాబీబీని.

ముబా—దురాత్మురాలా! పిశాచీ! నీవిక్కడ కెందులకు వచ్చితివి?

దరి—తెలియలేదా? నేనువార్తా విక్రయురాలను.

ముబారకు గడగడ వడకఁ జొచ్చెను.

దరి—రాజపుత్రికను పెండ్లిచేసికొనియెదవా?

ముబా—రాజపుత్రిక యెవ్వరు?

దరి——షహజాది జేబఉన్నీసా బేగమువారు. షహజాది రాజపుత్త్రిక కాదా?

ముబా——ఛీ! ఛీ! ఏమని ప్రేలుచుంటివి! ఇక్కడనే నీతల నఱకివైచెదను.

దరి——నేనల్లరిచేయకమానను.

ముబా——వలదు. నిన్ను నేను చంపను. కాని, నీ వెవ్వరికి సమాచారమును విక్రయింపవచ్చితివి? చెప్పుము!

దరి——చెప్పవలయుననియే యిక్కడ నిలిచియుంటిని. మాననీయురాలగు జేబఉన్నీసా బేగమువారికి——

ముబా——విక్రయింపఁదగిన సమాచార మెట్టిది?

దరి——నీవు నేఁడు బజారునందు జ్యోతిష్కునకుఁ జేయి చూపించి తెలిసికొన్న సంగతిని గూర్చియు, మఱియు నీవు షహజాదిని పెండ్లియాడఁదలఁచియుండుటనుగూర్చియును, అందువలన నీవు మహాభాగ్యవంతుఁడ వగుటనుగూర్చియును; ఇంతియ సమాచారము.

ముబా——దరియా! నేను నీకేమియపరాధము చేసితిని? నాపై నీవింతటి దారుణకృత్యముల నడపించుట కేమి కారణము?

దరి——ఏమిచేసితివి? ఏమియును చేయలేదు. ఈయాఁడుదాని విషయమైనీవు చేసినదానికంటె హెచ్చుగ మఱియేమిచేయవలయును?

ముబా——ఏమి ప్రాణప్రియా! నావంటివారిఁక నెవ్వరైన నున్నారా?

దరి——ఔను ఇంతటిపాపాత్ములు మఱియెవ్వరును లేరు.

ముబా——నేను పాపాత్ముఁడనుగాను. కాని, యిక్కడ నిలిచియుండి సంభాషించుట కిది యదనుకాదు. మఱియొకచో నీవును నేనును కలసికొన్నప్పు డెల్ల సంగతులును నీతోఁ జెప్పెదను.

అని చెప్పి ముబారకు తిరిగి జేబఉన్నీసాయొద్దకుఁ బోయి "నేను మరల వచ్చితిని. నేను నీయెడల నేఁడొనరించిన తప్పులేమైన నున్న నెడల మన్నింపవలయును. దరియాబీబీ వచ్చియున్నది. ఇప్పుడు మీదర్శన మపేక్షించుచున్నది. ఆపిచ్చిది నాపై నేమైన నేరములు చెప్పినయెడల నావలనఁ బ్రత్యుత్తరము తీసికొనకయే మీరు నాపైఁ గోపముసేయఁగూడదు" అని చెప్పెను.

జేబ—నీపై నేనెట్లు కోపింపఁగలను? ఎప్పుడైనను నీపైఁ గోపమే వచ్చినయెడల నప్పుడు నాకే దుఃఖము రాకమానదు.

"ఈదాసునిపై నిట్టియనుగ్రహ మెల్లప్పుడు నుంపఁగోరెదను" అని చెప్పి ముబారకు తిరిగి యనుజ్ఞ తీసికొని వెడలిపోయెను.

---

## నాలుగవ ప్రకరణము

### సమాచార విక్రయము

జేబఉన్నీసా విలాసగృహద్వారమందు ఖడ్గహస్తయై కావలిఁ గాచుచున్న తాతారసుందరి యొక్కతె దరియాబీబీని చూచి "ఇంత రాత్రివేళ నిట కెందులకు వచ్చితివి?" అని ప్రశ్నించెను.

దరి—నాసంగతి కావలివారలకుఁగూడ దెలుపవలయునా? నీవు లోపలకుఁ బోయి నేను వచ్చితినని మనవి సేయుము.

తాతా—నీవావలకు బొమ్ము! నేను లోపలకుఁ బోను.

దరి—మిత్రురాలా! ఏల కోపించెదవు? నీకు లంచముల నిచ్చుటవలననే దేశమంతయును ధ్వంసమైపోయినది. నీచేతిలోఁ గత్తియును తలపై నధికారము నున్నంతమాత్రముననే యిట్లు కోపము చేసితివేని కార్యములు నడచుట యెట్లు? ఇదిగో! చూడు మాజ్ఞాపత్రము—పోయి మనవి చేయుము.

ప్రతీహారిణి కెమ్మోవి విఱిచి చిఱునవ్వు నవ్వుచు నీయాజ్ఞా పత్త్రిమును, నిన్నునుగూడ నే నెరుగుదును. ఇంత రాత్రి వేళఁగూడ బేగమువారు నీసుర్నాయత్తరులను దీసికొందురా? నీవు ఱేపటి యుదయముననే రమ్ము. ఇదె నేనాజ్ఞాపించుచున్నాను. నీవు వెలుపలకుఁబొమ్ము. పోక నిలిచితి వేని—

దరి—నీవు నరకమునకుఁ బొమ్ము! నీకత్తియు, నధికారమును నీయుడుపులును గూడ నరకమునకుఁ బోనిమ్ము! నేనేమియును పని లేకుండ వచ్చుదానను గానని నీవెఱుగవా?

'హాజరతు బేగము వారు తమవిలాసమున నిప్పుడు స్వేచ్ఛావిహారిణులై యుండవచ్చును.' అని యాతాత్తారసుందరి మెల్లనఁబలికెను.

అప్పుడు దరియాబీబీ తనయుడుపులలోనుండి యొకసీసాను దీసెను. ప్రతిహారిణి యాశతో 'నదియేమి?' అనియెను. దరియాబీబీ యాసీసామూతను తీసి తాత్తారసుందరినోటి కందించెను. గ్రీష్మాతప తాపమున నెండి బీటలువారియున్న మహానదివలె నా తాత్తారసుందరి యందలిద్రవపదార్థము నొక్కసారిగాఁ బీల్చివైచి ''బిస్మిల్లా! చాల మేలైన మద్యము!' అని పలుకుచు 'మంచిది. నీవిక్కడ నుండుము! నేను పోయి మనవిచేసి వచ్చెదను' అనియెను.

ప్రతీహారిణి లోనికి బోయి చూచునప్పటికి జేబఉన్నీసా పూవులతో నొకకుక్కను నిర్మించుచుండెను. దానిమొగము ముబారకు మొగమువలె జేసెను. దానితలపై బాదుషావారి సరిఫేషువంటి యలంకారముసుంచెను. అప్పుడు జేబఉన్నీసా తాత్తారసుందరింజూచి 'నర్తకీజనంబుల బిలిచికొని రమ్ము!' అని యాజ్ఞాపించెను.

రంగమహాలునం దెల్ల బేగములయొద్దను విలాసార్థ మొక్కొక్క నర్తకీజనులగుంపు నియోగింపఁబడి యుండును. ప్రత్యేకమందిరము

సందును నృత్యగీతములు జరగుచుండును. జేబఉన్నీసా కూడ విలాసార్థమై కొందరు నాట్యాంగనామణులం జేరికొని యుండెను.

ప్రతీహారిణి వినయముతో దలయొగ్గి "చిత్తము" అని చెప్పి 'దరియాబీబీ వచ్చియున్నది. నేను రాగూడదని చెప్పితిని' అనియెను.

జేబ—నీకు లంచమేమైన నిచ్చినదా?

తారాసుందరి సిగ్గుపడుచు పైటచెఱగు మొగమున కడ్డము చేసికొనియెను' అప్పుడు జేబఉన్నీసా "సరియే నాట్యాంగనలమాట యటుండనిమ్ము. దరియాబీబీని పంపించుము!" అనియెను.

దరియాబీబీ వచ్చి వినయముతో వంగి సలాముచేసి పూవులతో జేయుచున్న కుక్కను చూచుచు నిలిచియుండెను. ఆమెను చూచి జేబఉన్నీసా "దరియా! ఇది యెట్లున్నది?" అని యడిగెను.

దరియా మరల సలాముచేసి "సరిగా మనసబుదారు ముబారకుసాహేబువలె నున్నది." అనియెను,

జేబ—ఔను. నీవు తీసికొందువా?

దరి—ఏమసెలవు? నేను తీసికొనవలసినది యీకుక్కనా? కాక మనుష్యుడా?

జేబఉన్నీసా బొమముడిపాటుతో జూచి మఱల గోపమును శమింప జేసికొనుచు జిఱునవ్వు నవ్వి "నీయిష్ట మెట్లో యట్లే" అనియెను.

దరి—అట్లయినయెడల నీకుక్కను హజరతుబేగముసాహేబా వారియొద్ద నుండనిండు. నేనుమనుష్యునే తీసికొనియెదను.

జేబ—నాచేతిలో నిప్పుడీకుక్కమాత్రమే యున్నది. మనుష్యుడిక్కడ లేడు. ఇప్పు డీకుక్కనుమాత్రమే తీసికొనుము.

అని చెప్పి జేబఉన్నీసా మధ్యపానపుఁదంబున బుష్పనిర్మితమైయున్న యాకుక్కను దరియాబీబీయొద్దకు విసరివైచెను. దరియా

దానిని వినయపూర్వకముగ నందికొని తనయుడుపులలో దాచికొని యెను. అట్లే చేయకపోయినయెడల నపరాధ మాచరించినట్లగును. పిమ్మట దరియాబీబీ "బేగము వారియనుగ్రహమువలన మనుష్యుమును, శునకమును కూడ నాకే లభించెను." అనియెను.

జేబ—ఎట్లు?

దరి—మనుష్యుడేమో నావాడేకదా!

జేబ—అది యెట్లు!

దరి—నన్నాతడు పెండ్లియాడుటవలన—

జేబ—చీ! చీ! ఇటనుండి దూపలకు బొమ్ము!

జేబఉన్నిసా దరియాను పుష్పమాలికతో బలముగా విసరి కొట్టెను.

దరియాబీబీ చేతులు జోడించుకొని, "ఖాజిమొదలగువారు" నాకు సాక్షులుగా నున్నారు. వారింకను జీవించియే యున్నారు. వలయునేని వారిని బిలిపించి యడుగవచ్చును" అనియెను.

జేబఉన్నిసా బొమలుముడివైచి "నాయానతి ననుసరించి వారెల్లరును శూలారోపణశిక్షకు గురియయ్యెదరు" అనియెను.

దరియాబీబీ గడగడ నడకసాగెను. వ్యాఘ్రాంగనతో సరియైన క్రూరత్వముగల యీ మొగలాయిరాజకుమారిక యేమిచేసినను చేయగల దని యామె యెఱుంగును. తుట్టతుదకు "అమ్మా! బేగము సాహేబా! నేను పేదరాలను. సమాచారవిక్రయమునకై వచ్చియుంటిని. నాకితరప్రసంగములతో బ్రయోజనమేమియు లేదు" అనియెను.

జేబ—ఆసమాచారమేమియో చెప్పుము!

దరి—రెండుసమాచారము లున్నవి. అందొకటి యీముబారకుసాహేబువిషయము. ఆజ్ఞ యగునంతవఱకు చెప్పుటకు ధైర్యము చాలకున్నది.

జేబ—చెప్పుము!

దరి—ఇతడీరాత్రియందు రాజవీధి నున్న గణేశజ్యోస్యునకు దనచేయి చూపించి తనయదృష్టమునుగూర్చి చెప్పించుకొనియెను.

జేబ—జ్యోతిష్కు డేమి చెప్పినాడు?

దరి—మహాజాదిని పెండ్లిచేసికొంటివేని యభివృద్ధిలోనికి రాగలవని—

జేబ—ఇది యంతయు నసత్యము. మనసబుదారుడు జ్యోతిష్కునియొద్ద కెప్పుడు పోయెను?

దరి—ఇక్కడకు వచ్చుటకుముందు—

జేబ—ఇక్కడ కెవరువచ్చినారు?

దరియాబీబీ కొంచెము భయపడి యంతలోనే ధైర్యము తెచ్చికొని మరల సలాము చేసి "ముబారకుఖాన్ సాహేబువారు" అని చెప్పెను.

జేబ—నీ కెట్లు తెలిసినది!

దరి—నేను వచ్చునప్పుడు చూచితిని.

జేబ—ఇట్టిమాట లాడువారినందఱను శిరచ్ఛేదము చేయించెదను.

దరియాబీబీ కంపముతో "ఇట్టిమాటలను బేగముసాహేబావారియెదుటనే కాని, మఱియెచ్చటనైన నెవ్వరికైనఁ దెలుపుటకు సాహసించుదానను గాను" అనియెను.

జేబ—అట్లు చెప్పితివేని కటికవారలచే నీనాలుకఁ గోయింతును. సరియే. నీరెండవసమాచార మేమి?

చంచలకుమారి చిత్రపటమును దన్నినసమాచార మంతయును దరియాబీబీ యాద్యంతముగఁ దెలియఁజేసెను. అంతయును విని జేబఉన్నీసా "ఇది మంచి సమాచారము. నీకుఁ దగిన బహుమానమిప్పించెదను" అనియెను.

అప్పుడు రంగమహాలునందలి కోశాధ్యక్షునకుఁ జీటి పంపఁ బడియెను. అనంతరము కొంతసేపటికి దరియాబీబీ బహుమాన ద్రవ్యము నందికొని వెడలిపోయెను.

తారాసుందరి యామెను పట్టుకొని పరదానైన తనకత్తె నామె కుత్తుకపై నుంచి "ముత్తురాలా! ఎక్కడకుఁ బోయెదవు?" అని జంకించెను.

దరి—నాపని యైనది. ఇంటికిఁ బోవుచుంటిని.

తారా—డబ్బు దొరకినదిగదా, నాకేమియు నీయనక్కఱ లేదా?

దరి—నీకు లంచము కావలయునా? అందులకు బదులుగా నొకపాట పాడిపోయెదను. సారంగమును తెచ్చికొనుము.

తారాసుందరియొద్ద సారంగ మున్నది. అవకాశము కలిగిన ప్పుడెల్ల నామె పాడుకొనుచుండును. ఆరంగమహాలునందు గీతవాద్య కలకలము విశేషము. ఒక్కొక్క బేగమునకు నొక్కొక్క జోడుగ గాయకసుందరులు నియమింపఁబడియుండిరి. పెండ్లిచేసికొనక వేశ్యా వృత్తి నవలంబించువారెల్లరును తమకుఁ దామే పాడుకొనుచుందురు. రంగమహాలునందు రాత్రి యంతయును వీణాగానములచేఁ జెవులు బద్దలై పోవుచుండును. దరియాబీబీ తారాసుందరిసారంగమును దీసి కొని పాడుచుఁ గూరుచుండెను. ఆమె కంఠస్వర మతిమనోహరమైనది సంగీత మతిప్రౌఢముగానుండెను. ఆమె యతిమధురముగ నతివిలాస ముగ గానము సేయుచుండెను. జేబఉన్నీసా లోపలినుండి యామధుర గానము నాలకించి "ఆపాటపాడువా రెవ్వరు?" అనియెను.

తారా—దరియాబీబీ.

ఆమెను పిలిచికొనివచ్చుట కాజ్ఞయయ్యెను. దరియాబీబీ తిరిగి జేబఉన్నీసాయొద్దకుఁ బోయి వినయముతో వంగి సలాముచేసెను.

జేబఉన్నీసా "ఇదిగో! వీణ యిటనున్నది. పాడుము" అని యెను.

ఆపేర నందికొని దరియాబీబీ గానము చేయుచుండెను. ఆపాట యతి మనోహరమై, శ్రవణపుటపేయమై యలరారుచుండెను. అప్సరోమణుల విందించు సంగీతవిద్యావిశారదులగు గాయనగాయనీమణుల మధురగానములను జేబఉన్నీసా యిదివఱ కెన్నియోసారులు వినియున్నది కాని, యెప్పుడు నిట్టి సంగీతము నాలకించి యుండలేదు. సంగీతము పూర్తియైనతరువాత జేబఉన్నీసా" నీవెన్నఁడైన ముశారకునొద్ద గానము చేసియుంటివా?" అని యడిగెను.

దరి—నాసంగీతము నాలకించియే యాతఁడు నన్నుఁ బెండ్లి చేసికొనియెను.

జేబఉన్నీసా పుష్పమయమైన యొకతురాయిని తీసి దరియాబీబీపైకి బలముగా విసరివైచెను. అది యామె కర్ణాభరణమునకుఁ దగులుటచేఁ గొంచెము తెగి యామెచెవినుండి రక్తము ప్రవహింపఁ జొచ్చెను. దానిని చూచి జేబఉన్నీసా యామెనుఁ గొంతద్రవ్యమును బహుమానముగా నిచ్చి "ఇఁక నెన్నఁడును నీవిటకు రావల"దని చెప్పి పంపివైచెను.

దరియాబీబీ సలాము చేసి వెడలిపోవుచు "మరలమరల వచ్చి నీయొడలు మండించుచు, నీప్రహారములకు సహించుచు. నీయొద్ద బహుమానములు నందికొనుచు, తుదకు నిన్నును, నీయాశలను ధ్వంసముచేయక మానను" అని తనలోఁ దాననుకొనియెను.

---

## ఐదవ ప్రకరణము

### ఉదయపురి బేగము.

ఔరంగజీబు జగత్ప్రసిద్ధిగలబాదుషా. ఆతఁడు సుప్రసిద్ధమైన రాజ్యమునకు శాసకుఁడై యుండెను. విశేషించి బుద్ధిశాలి. రాజకార్యదక్షుఁడు. అంతేకాక సకలసార్వభౌమలక్షణలక్షితుఁడై కూడ

నుండెను. ఇంతటి యసాధారణగుణగరిష్ఠుఁడై జగద్విఖ్యాతిఁ గాంచి, రాజాధిరాజై యుండినను, తనసుప్రసిద్ధ సామ్రాజ్యము నాతఁ డొక్కరీతిగా స్వాధీనము చేసికొనుచు వైహికవిషయములఁ దన మానవజన్మమును సార్థకపఱచుకొనుచుండెను.

ఇందులకు ముఖ్యమైనకారణము ఔరంగజేబు మహా పాపాత్ముఁడై యుండుటయే. అతనివంటిస్వార్థపరుఁడును, కపటాచారియు, పాపభీతి లేనివాఁడును, స్వార్థపరాయణుఁడును, పరపీడకుఁడును, లోకమునం దిదివఱ కొకఁ డుద్భవించెను మఱిలేఁడు. ఈదంభవ్రతుఁడు తాను జితేంద్రియుఁడ నని నటించుచుండును. కాని, యీతని యంతఃపురము తేనెటీఁగలచే నావరింపబడిన తేనె పెరవలె సుందరీజన సమూహములతో నిండి యానందధ్వనులచే నిరంతరము ప్రతిధ్వనించుచుండెను.

ఆతనిభార్యలకు లెక్కయే లేదు. మఱియు ముసల్మాను శాస్త్రానుసారముగఁ బెండ్లియాడినవారు గాక వేతనము లందికొనుచున్న విలాసినీమణులు వేనవే లున్నారు. పడుపుఁగూటికై చేరిన పాపాత్మురాండ్రగు నీసుదవతులతోడి సంబంధ మీగ్రంథమునఁ జాల తక్కువగా నుండును. కాని, యీచరిత్రమున నాతనిభార్యలలోఁ గొందఱిసంబంధము మాత్రము విశేషముగ నున్నది.

మొగలాయిబాదుషాలు మొట్టమొదట నెవ్వరిని పెండ్లిచేసికొందురో వారేపట్టపుదేవులై యుందురు. హిందూజనద్వేషియైన యౌరంగజేబు దురదృష్టమునకుఁ దోడుగ నాతని కొక హిందూసుందరియే ప్రధానమహిషి యయ్యెను. మొగలాయిప్రభువులు రాజకుమారికలను బెండ్లియాడుపద్ధతి మొట్టమొదట నక్బరుబాదుషా యాచరణమునకుఁ దెచ్చెను. ఈనియమమును ననుసరించి తరువాత

కొంగలాయి బాడుషాల కంచఱకును హిందూస్త్రీలు దేవు లగుచుం డిరి. ఔరంగజేబుపట్టమహిషి యోధపురిబేగము.

యోధపురిబేగము ప్రధానమహిషియే. కాని, సార్వభౌముని ప్రేమవిశ్వాసములకుమాత్రము పాత్రురాలు కాలేదు. ఔరంగజేబున కాతనిరాణులలో నెల్లఁ బ్రాణప్రియురా లగుదేవి యొకక్రైస్తవకా మిని. చరిత్రములం దామెయే, 'ఉదయపురిదేవి' అని వ్రాయఁబడి యున్నది. ఉదయపురమునకు నామెకును సంబంధ ముండుటచేతనే యామెకు "ఉదీపురి" "ఉదయపురిబేగము" అను పేరులు కలిగెను. ఆసియాఖండ పశ్చిమప్రాంతమున నిప్పటి రష్యాదేశములోనున్న జార్జియాప్రదేశ మీమెజన్మభూమి. ఈమెకు జిన్నతనమునం దొక దాసవ్యవసాయి, (Slave trader) విక్రయార్థమై యీమెను భారత వర్షమునకు గొనితెచ్చెను. ఔరంగజేబున కన్నయైన దారాయను నాతఁ డీమెను కొనియెను.

ఈబాలిక యభినవయౌవనవతి యగునప్పటి కద్వితీయరూప లావణ్యవతికూడ నయ్యెను. ఈమె జగన్మోహనాకారవిలాసములం గాంచి మోహించి దారా యీమెకు వశుఁడైపోయెను. ఉదయపురి బేగము ముసల్మానుసుందరి కాదనియును, క్రైస్తవకన్య యనియును చెప్పియుంటిమిగదా. తుదకు దారాకూడ క్రైస్తవుఁడైపోయె నని యొక ప్రవాదముకూడ నున్నది.

దారాను యుద్ధమునందుజయించినపిమ్మట నౌరంగజేబుసింహా సనము నధిష్ఠించెను. అతఁడు దారాను జయించి చెఱసాలయం దుంచుటయేకాక తుద కాతనిప్రాణములకూడ దీయించివైచెను. అనంతరము నరాధముఁడైన యౌరంగజేబు ఖురానులోని ధర్మవచన ములనుల్లంఘించి, యిస్లాముమతానుసారముగా "అన్నభార్యను దమ్ముడు తప్పక పెండ్లియాడితీరవలయును" అని సిద్ధాంతముచేసి

దారా ప్రధానమహిషుల నిద్దఱిని తనకు రాణులుగా గోరెను. అందొకతె రాజపుత్రిక; మఱియొకతె పైని చెప్పిన మహానుభావురాలగు నుదయపురి బేగము. ఔరంగజేబు దురభిప్రాయము నెఱింగి రాజపుత్రకన్యక యెట్టిపానాన కార్య మాచరించినదో మాయమన్యం దట్టి కార్యమును హిందూసుందరి తప్ప మఱేజాతి కామినియును చేయజాలదు. ఆమె విషపానమాచరించి స్వర్గస్థురాలయ్యెను. ఆ క్రైస్తుకన్యక యానందముతో నౌరంగజేబుకరమును బట్టుకొనియెను ఇట్టిజారిణీ నామమునే విశేషముగ కీర్తించి దేశచరిత్రములు తమ జన్మములను సార్థకపరచుకొన్నవి. కాని, మానరక్షణార్థమై విషము దిని ప్రాణత్యాగమొనరించిన యాయుదారహృదయ పావననామాక్షరములనైన లిఖియించుటకు విసుగుచెందినవని తోఁచుచున్నవి. మనచరిత్రముల యందలి సత్యమింతవఱకున్నది. ప్రాశస్త్యము నింతటిదే.

ఉదయపురిబేగము రూపలావణ్యాదులయం దెట్టియద్వితీయయో మద్యపానాసక్తియందుగూడ నట్టి యద్వితీయయే. ఢిల్లీబాదుషాలు ముసల్మానులై యుండియు విశేషముగ మద్యపానప్రియులై యుండిరి. వారిప్రజలుగూడ నావిషయమున దమప్రభుల ననుసరించుచునే యుండిరి. రంగమహాలునం దీమధురససేవనము విశేషముగ నుండెను. ఆనరకమునందుగూడ నుదయపురిబేగము పేరు సుప్రసిద్ధమై తలచూపుచుండెను.

ముందుగా దెలియజేయకుండ నాకస్మికముగా నుదయపురి బేగముశయనగృహమునకు బోవుటకు జేబఉన్నిసాకైనను నధికారము లేదు. భారతసామ్రాజ్యధురంధరుని ప్రియతమురాలైన యామహారాజ్ఞి మధుపానమదంబున నొడలెఱుంగక పడియుండెను. అలంకారములును, వసనమునుగూడఁ జెదరియుండెను. పరిచారిక లన్నిటిని

చక్కఁజేసి గట్టిగా కేకవైచి పిలిచి యామెకు స్మృతికలిగించి సావధానహృదయం జేసిరి. పిమ్మట జేబఉన్నీసా లోపలికిం బోయెను. అప్పు డుదయపురిబేగము తనయెడమచేతితో హుక్కాగొట్టమును బట్టికొని కన్నులరమోడ్చి, యధరమునుండి వెడలియు వెడలనినుడులు తడఁబడుచుండ వర్షసమయమునందలి చండమారుతంబునం దూలి నేలపైఁ గూలిన సజలప్రసూనరాశిం బోలి హంసతూలికాతల్పముపై బడుండి యుండెను.

జేబఉన్నీసా యామెకొక సలాముచేసి "అమ్మా! మీరు సావధానముగా నుంటిరా?" అనియెను.

ఉదయపురిబేగ మరసొక్కఁగవిసినస్వరముతో నాలుక నల్లలాడించుచు "యింతరాత్రివేళ నేమిపని యున్నది?" అని యడిగెను.

జేబ—ఒకదొడ్డసమాచార మున్నది.

ఉద—మరాటాదొంగ చచ్చిపోయెనా యేమి?

జేబ—అంతకంటెను మంచివార్త.

అని చెప్పి జేబఉన్నీసా యసత్యములను చేర్చి చంచలకుమారి చిత్రపటమును త్రొక్కిన సమాచార మంతయును చెప్పెను, "ఏమి! మంచిసమాచారము!" అని యుదయపురిబేగ మనియెను.

జేబ—ఆమె చాల నందమైనది. ఆమె మీకుఁ దాంబూలమును మడచియిచ్చు నూడిగపుగత్తెయై యుండగా నాకుఁ జూడవలయుననియున్నది. ఆ రాజకుమారి మీసేవ చేయునట్లు నియమింపుడని మీరు బాదుషావారిని కోరవలయును.

ఉదయపురిబేగము తనకేమియును తెలియకపోయినను "సరియే" అని యంగీకరించెను,

పిమ్మటఁ గొంతసేపటికి రాజకార్యపరిశ్రాంతుఁ డగుబాదుషా విశ్రమార్థమై, యుదయపురబేగముమందిరమునకు వచ్చెను. ఉదయ

పురి మొదటివలెనే మధుమదంబునఁ దడఁబడుచు జేబడుచున్నా తనతోఁ జెప్పిన సమాచారమంతయు నాతనికిఁ దెలిపి యా రాజపుత్త్రిక నాపరిచారికయై యుండవలయునని కోరెను. ఆ సమాచారమును విన్నంత మాత్రముననే మంగిపడుచున్న ఔరంగజేబు బాదుషా ప్రార్థనము నంగీకరించి యట్లు చేయుటకు గృతప్రతిజ్ఞుండయ్యెను.

---

## ఆఱవ ప్రకరణము.

---

కామోద్దీప్తి వేగము

మఱునాఁడే రాజాజ్ఞ ప్రకటింపబడియెను. అల్పరాజ్యమైన రూపనగరముయొక్క ప్రభువున కాదేశపత్త్రము పంపబడియెను. ఎవ్వని యద్వితీయకుటిలస్వభావమునకు భయపడి జయసింహుఁడు, యశోవంతసింహుఁడు మొదలగు సేనానాయకులును, మఱియు, అజింషాహా మొదలగు మొగలాయి రాజకుమారులును సర్వదా కుందేళ్ళవలె భీరుస్వభావము నగపఱచుచుందురో, ఎవ్వనియభేద్యకుటిలజాలంబులందగిలికొని చతురాగ్రగణ్యుఁడగు శివాజికూడ డిల్లీనగరమున, కారాగారబద్ధుఁడయ్యెనో, ఆతనియంతటి కుటిలస్వభావముచే నీయాజ్ఞాపత్రము వెలువరింపఁబడియెను. ఆయాజ్ఞాపత్రమునందు "ఔరంగజేబు బాదుషావారు రూపనగర రాజపుత్త్రిక రూపలావణ్యాదులను విని మోహించియున్నారు. మఱియు రూపనగరప్రభుని సత్స్వభావమును, రాజభక్తియును, చూచి యానందించుచున్నారు. అందువలన బాదుషావారు రూపనగర రాజకుమారికను పాణిగ్రహణముచేసికొని, యామూలమున నాతని రాజభక్తికి బహూకృతుల నొనరింపవలయు ననునభిలాషతో నున్నారు. రూపనగరప్రభుఁడు తనకుమార్తెను డిల్లీకిఁ బంపించు

టకుసంసిద్ధులై యుండవలయును. రాజసైన్యము వచ్చి యాకన్యక నుభద్రముగా ఢిల్లీకిఁ దీసికొనిరాఁగలదు.” అని వ్రాయఁబడి యుండెను.

ఈసమాచారము రూపనగరమున వ్యాపించినతోడనే యాపట్టణమునఁ జాలగడబిడలు ప్రారంభమయ్యెను. ఆనగరమునందలి యానందమునకు హద్దు లేదు. యోధపురము, అంబరు, మొదలగు గొప్పగొప్పరాజ్యముల కధీశ్వరులగు రాజపుత్రులు మొగలుబాదుషాలకుఁ గన్యాదాన మాచరించుట మహాగౌరవ మనియు, మహాదృష్టమనియు నెంచికొనియుండిరి. ఇట్టిస్థితిలో నీచిన్నసామంతరాజున కిట్టి యదృష్టము పట్టుట బ్రహ్మానందకరమైన విషయమని ప్రజలందఱు నేకగ్రీవముగనిశ్చయించి పలుకఁజొచ్చిరి. ఎవ్వఁడు బాదుషాలకు బాదుషాయై యుండెనో, ఎవ్వని కీమానవలోకమున సమానుఁడు లేఁడో, అట్టిసార్వభౌము డల్లుఁడగుటయును, చంచలకుమారి రాజరాజేశ్వరి యగుటయును తటస్థించెను. ఇంతకంటెనిక గావలసిన దేమున్నది? రాజును, రాణియు, పౌరులును, రూపనగరరాజ్యమునందలి ప్రజలు గూడ నానందపారావారమున మునిగితేలుచుండిరి. రాణి దేవాలయముల కన్నింటికిని పూజాద్రవ్యముల నంపించెను. రాజీసమయమును గనిపెట్టి జాగీరు లన్నిటిని లాగికొని వాని నన్నిటిని తనస్వాధీనము చేసికొనవలయునని తలంచుకొనుచుండెను.

చంచలకుమారి చెలికత్తెలుమాత్రము కేవల మసంతుష్టిగలవారై యుండిరి. మొగలాయిరాజవిద్వేషిణియైన చంచలకుమారి కీసంబంధమువలన నావంతయైన సుఖము కలుగబోదని వారెఱింగి యుండిరి.

ఈసమాచారము ఢిల్లీయందంతటను వ్యాపించెను. ఇదియంతయు నంతఃపురమున గూడ బ్రచారమగుటచే యోధపురిబేగము విని చాల విచారించెను. ఆమోహిందూసుందరి, మునల్మానులయింట

బడి భారతవర్షమునకు మహారాజ్ఞియై యున్నను నామె కించుకయైన సుఖము కలుగలేదు. ఆమె యౌరంగజేబుగృహమునం దున్నను, హైందవాచారములనే నడపుకొనుచుండెను. ఆమె పరిచారిక లందఱును హిందూ స్త్రీలే. హిందువులు వండినవంటకములుతప్ప నామె మఱియేవస్తువులను భుజియించుటలేదు. ఆమె గోకులాయిప్రభునిమందిరమునగూడ నామె లక్ష్మీనారాయణవిగ్రహముల నుంచి పూజించుకొనుచుండెను. సుప్రసిద్ధుఁడును, దేవద్వేషియు నగునౌరంగజేబు వీని నన్నిటిని సహించి యూరకుండుట చూడగా నాతనికి యోధపురి బేగముపై విశేషానుగ్రహ ముండియుండునని తోచుచున్నది.

యోధపురి బేగ మీసమాచార మాలకించి యొకదినమున నామెకు భర్తృదర్శనము లభించినప్పుడు మిగుల వినయముతో వంగి నమస్కరించి 'మహాప్రభూ! ఎవ్వనియాజ్ఞామాత్రమున నిరంతరము రాజరాజేశ్వరులు రాజ్యచ్యుతు లగుచుండిరో, అట్టినియాగ్రహమున కొక్కయబల యగురాజకుమారిక పాత్రీభూతయై యేమిచేయగలదు?' అని విన్నవించెను.

ఔరంగజేబు నవ్వెను కాని. యేమియును మాటాడలేదు? అక్కడ మఱియేప్రసంగమును జరుగలేదు.

అప్పుడు యోధపురిబేగము తన హృదయమున "అయ్యో! పరమేశ్వరా! నేను వితంతువైనను విచారములేదు. ఈరాక్షసుఁడింకనుచాలకాలము బ్రతికియుండునేని నీలోకమున హిందువనునామమే లేకుండ బోవునుగదా!" అని యనుకొనియెను.

ఆమెకు దేవియను నొకపరిచారిక కలదు. ఆమె యోధపురి బేగముతో నరణపుదాసిగా వచ్చియున్నది. కాని, స్వదేశమునువిడిచి చాలకాల మగుటవలనను, ఈసమయమునందు ముసల్మాను నగరమునందుండుట కిష్టము లేకుండుటవలనను, దేవి కిప్పుడు స్వదేశమునకుఁ

బోవలయునని యుండెను. చాలదినములక్రిందటనే తనయుద్దేశమును యోధపురిబేగమునకుఁ దెలిపి సెలవిమ్మని కోరియుండెను. కాని, యామెచాల నమ్మకముగల పరిచారిక యగుటచే రాణిగా రామెకు సెలవీయలేదు. యోధపురిబేగ మీదినమున దేవినిపిలిచి రహస్యముగా "నీవు చాలదినములనుండి జన్మభూమికి బోవలయునని యుంటివి; నేను నీకు సెలవిచ్చెదను; నీవు నాకొక కార్యమును చేయవలయును. అది చాల ఘనకార్యము. మిగులనమ్మకముతో నెరవేర్పవలయును. అందులకు వలయునంత ధనమిచ్చెదను; బహుమానము కూడ నిచ్చెదను. అంతేకాక నిన్ను నీదేశమునుండి మఱి పిలిపింపను. నీవాకార్యమును చేయఁగలవా?" అని యడిగెను.

దేవి—రాణిగారి యాజ్ఞయైనచో నట్లేచేసెదను.

యోధ—రూపనగరరాజకుమారిక యగు చంచలకుమారి వృత్తాంతమును వింటివిగదా! నీవామెయొద్దకుఁ బోవలయును, నేనేమియును జాబు వ్రాసియిచ్చుటకు వలనుపడదు. నేను చెప్పుమన్న వాక్యముల నామెకుఁ జెప్పి నాహస్త (పంజా) ముద్ర గలమొహరీ నామె కానవాలు చూపింపవలయును. నీవు గుఱ్ఱము నెక్కఁగలుగుదువు. గుఱ్ఱమును కొనుటకు నీకుఁ గావలసినంతధన మొసంగెదను. నీవు మఱియొక నగరమున గుఱ్ఱమును దీసికొనుము.

దేవి—నేనామెతోఁ జెప్పవలసిన మాటలేమి?

యోధ—"నీవుత్తమ క్షత్రియకులాలంకారమవై యుండియు ముసల్మానులయింట నెట్లు ప్రవేశింపగలవు? అట్లువచ్చి నేననుభవించుచున్న సుఖమేమున్నది? నిరంతరము నేను మరణమునే కోరుకొనుచున్నాను. నీవు చిత్రపటమును దన్నిన సమాచారము విని బాదుషా నీదుడుకు దనమునకు దగినశిక్ష విధింపవలయు నను నుద్దేశముతో నిట్టి మోసమును చేయుచున్నాడు. మఱియు రూపనగరప్రభుకుమారికవగు

నిన్ను దయపురి జేగము నకుఁ బములప్పు బాకలిచ్చుపరివారికగా జేయ దలచియున్నాను. విషపానమైన జేయవచ్చును కాని, క్షత్రియకాంత యొకమహాద్మ్రాదీయుని చెట్టపట్టి సేవకవనము నాసింపదు'' అని నా వాక్యములుగా జంచలకుమారికి జెప్పవలయును. మఱియును "ఢిల్లీ సింహాసన మిప్పుడు మహాపాపసముద్రమధ్యమునం బడి తలమునుగుట కొఱతగా నల్లాడుచున్నది. దక్షిణ దేశమునందు మహారాష్ట్రవీరులు మొగలాయి సేనలను నాశనము చేయుచున్నారు. జిజియాసుంక మనుదారుణాగ్ని ప్రజ్వలించుచుండుటచేఁ బ్రళయకాల ఝంఝామారుతంబున నెగచి లోకముల ముంపనైయున్న సముద్ర తరంగములవలె రాజపుత్రులందఱును విజృంభించుచున్నారు. రాజస్థానము నందుగూడ నిరంతరము గోహత్యలు జరుగుచుండ నేరాజపుత్రుఁడు కన్నార జూచుచు నూరకుండగలఁడు? రాజపుత్రులేకీభవించుచు న్నారు. ఉదయపురిరాణా రాజసింహుఁడు మహావీరపురుషుఁడు. మొగలాయీలయందుగాని తాత్తారులయందుగాని యంతటివీరుఁడు మఱి యొకఁడు లేఁడు. అతఁడు రాజపుత్రుల కధినాథుఁడై శస్త్రాస్త్రము లధరించి యొకవంకశివాజియును, మఱియొకవంక రాజసింహుఁడును చతురంగబలములతోఁ బనిసేయుచుండఁగా ఢిల్లీసింహాసనము మొగలాయిప్రభువులయొద్ద నెంతకాలము నిలువఁగలదు?'' అనికూడ నా వాక్యములుగాఁ దెలుపుము.

దేవి—అమ్మా! నీవంతమాట యనవలదు. ఢిల్లీసింహాసనము నీబిడ్డలకొఱకు నిలిచి యున్నది. నీబిడ్డలయదృష్టమును నీవే తుడిచి వేయుటకుఁ దలంచుట న్యాయమా?

జోధ—నా బిడ్డ లీసింహాసనము నధిష్ఠించి రాజ్యము సేయుదురను నమ్మకము లేదు. ఈరాకాసి జేబఉన్నీసాయును, డాకినీ యుదయపురియును జీవించియున్నంతవఱకు నా కాయాశ లేదు. నేనొకసారి

నాయుద్దేశమును దెలుపుటవలననే రోషన్నారచే బలవంతముగాఁ బ్రహరింపఁబడితిని. ఆదెబ్బలగురుతు లింకను నామొగముపై నగపడుచున్నవి.

అని చెప్పి యోధపురి బేగము కన్నీటితో "ఈమాటలవలనఁ బ్రయోజనము లేదు. నాయభిప్రాయము నీకుఁ దెలియదు. నేను చెప్పినట్లు చేయుము. రాజసింహునిశరణము నపేక్షించుట నీకు సర్వశ్రేయ మని చంచలకుమారితోఁ జెప్పుము. అతఁడామెను తిరస్కరింపఁజాలఁడు. ఆమె రాజసింహుని ప్రాణప్రియ కావలయు నని నే నాశీర్వదించితి ననికూడఁ దెలుపుము. ఆమె రాజసింహునిరాణియై యున్నప్పు డుదయపురి బేగమే యామెకుఁ దాంబూలము నందియిచ్చు నడపగత్తెయై యుండుఁగాక! రోషన్నారు చంచలకుమారిపాదసేవ సేయుటకు లేకపోయెనని నేను విచారించితి" నని చెప్పెను.

దేవి—అమ్మా! ఇది యంతయు నిట్లే జరగునా?

యోధ—దానినిగూర్చి నీవు నన్నడుగవలదు. నేను చెప్పినట్లు నీవుచేసెదవా లేదా?

దేవి—ఆజ్ఞప్రకార మట్లేచేసెదను.

అప్పుడు యోధపురి బేగము, దేవికిఁ గావలసినద్రవ్యమును, బహుమానమును, తనహస్తముద్రయు నిచ్చి దేవిని పంపివైచెను.

---

## ఏడవ ప్రకరణము.

ఈశ్వరుఁడు జేబఉన్నీసా నేల సృష్టించెనో?

జేబఉన్నీసా తన విలాసమందిరమునం దుండెను. ముబారకు కూడ నచ్చటనే యుండెను. అతఁడు క్రింద రత్నకంబళముపై నుండెనువైచి చేతులు జోడించుకొని కూర్చుండియుండెను. జేబఉన్నీసా నవరత్నఖచితంబును, ముక్తాప్రవాళజాలాలంకృతంబును నగు మంచ

ముపై హంసతూలికాతల్పంబున నొరఁగియుండి, సువర్ణమణిమయం బగు హుక్కానాళమును నోటియందుంచుకొని తంబాకు సేవించు చుండెను. ఈతంబాకు పాశ్చాత్యమాహాత్మ్యమువలననే యీభారత వర్షమునఁ బ్రవేశించెను.

జేబ—అంతయును సరిగాఁజెప్పెదవా?

ముబా—(చేతులుజోడించుకొని) ఆజ్ఞయైనచో నట్లే—

జేబ—నీవు దరియాబీబీని పెండ్లిచేసికొంటివా?

ముబా—మా దేశమునందున్నప్పుడు పెండ్లియాడితిని.

జేబ—అందువలననా నన్నుఁ బెండ్లి చేసికొందునని నాపైఁ బరిపూర్ణ కటాక్షమును చూపించితివి?

ముబా—నేను చాలకాలముక్రిందటనే తల్లాకిచ్చి యామెను వదలివైచితిని.

జేబ—ఆమె నెందులకుఁ బరిత్యజించితివి?

ముబా—పిచ్చిదగుటవలన—ఆసంగతి మీకుఁగూడ దెలిసి యుండవచ్చును.

జేబ—ఆమె పిచ్చితనము నేనెప్పుడును బరీక్షింపలేదు.

ముబా—ఆమె తన కార్యసిద్ధికొఱకు మీయొద్దకు వచ్చు చున్నది. పని గలిగినప్పు డామెపిచ్చితనము నాకుఁగూడ నగపడదు. కాని యితరసమయములయందుమాత్రమామె యున్మత్తయే. వలయు నేని మఱియొకప్పు డెప్పుడైన మీకుఁ జూపించెదను.

జేబ—నాకుఁ గొంచెము సుర్మాకావలయును. ఆమె నొకసారి యిచ్చుటకేఁ బంపెదవా?

ముబా—నాకు ఱేపటి యుదయముననే దూరదేశములకుఁ బోవలసియున్నది.

జేబ—దూరదేశప్రయాణమా? నాతో నింతవఱకు నేల చెప్పలేదు?

ము బా—రాజస్థానమునందు రూపనగరమను నొక చిన్న రాజ్యమున్నది. అక్కడి రావుసాహేబువారి కుమార్తెను పెండ్లిచేసి కొనవలయునని శాహుసావారి యభిప్రాయమైయున్నది. ఆమెనుగొని తెచ్చుటకుఁ గొంతసైన్యము జేపటియుదయమున నే పోవును.

జేబ—ఆవిషయమున నేను చెప్పవలసినమాటలు కూడఁ గొన్నియున్నవి. కాని ముందీప్రశ్నమున కుత్తరమిమ్ము! నీవు గణేశ జ్యోస్యునకుఁ జేయి చూపించుటకుఁ బోయితివా?

ము బా—పోయితిని.

జేబ—ఎందులకు?

ము బా—అందఱును పోవుచుండిరి. నేనును పోయితిని కాని మఱియొక కారణమున్నది. దరియాబీబీ నన్నుఁ దీసికొనిపోయినది.

జేబ—అలాగా?

అని చెప్పి జేబఉన్నీసా కొంతసేపు పూవులతో విలాసముగ నాటలాడుకొనుచుండెను. పిమ్మట "నీవెందులకుఁ బోయితివి?" అని యడిగెను.

ము బా—జరిగినదంతయును మనవిచేసికొంటిని.

జేబ—జ్యోతిష్కుఁడు షహజాదిని పెండ్లి చేసికొన్న యెడల భాగ్యవంతుఁడవు కాగలవని నీతోఁ జెప్పలేదా?

ము బా—హిందువులు "షహజాది" యని యనరు. అతఁడు రాజపుత్త్రిని బెండ్లియాడుమనియెను.

జేబ—షహజాదియును రాజకుమారికయే కాదా?

ము బా—కాకేమి?

జేబ—నీవప్పుడు వివాహప్రస్తావముం జేయుట యందుకొఱకేనా?

ము బా—అది ధర్మమని తెలిసికొని చెప్పియుంటిని. ఇంతకు

ముందే మీతో నేనీవిషయమునుగూర్చి ప్రస్తావించియుంటిని. మీకు జ్ఞప్తియుండవచ్చును.

జేబ—ఏమో! నాకు జ్ఞప్తిలేదు. పోనిమ్ము. దానివలన నేమి ప్రయోజనము? నేనిట్లంటినని నీవు కోపింపవలదు. నీవు కోపించితి వేని నాకుఁ జాలవిచారమగును. నీవు నాప్రాణప్రియుఁడవు. నిన్నుఁజూచు చుండుటయే నాకుఁ బరమానందము. రమ్ము! ఈ శయ్యపైవచ్చి కూర్చుండుము. చందన మలందెదను.

జేబఉన్నీసా ముబారకును మంచముపై గూర్చుండబెట్టుకొని యాతని కత్తురుమొదలగు పరిమళద్రవ్యముల నిచ్చి కొంతసేపైన తరువాత—'ఇప్పుడా రూపనగరరాజకుమారికమాట చెప్పుచున్నాను ఆమెతండ్రి యామెను పంపునో పంపఁడో మనకు దెలియదు. పంపక పోయినయెడల నీవు బలవంతముగా దీసికొని రావలయును' అని చెప్పెను.

ముబా—బాదుషావారు నాకట్లాజ్ఞ యిచ్చియుండలేదు.

జేబ—నేనే బాదుషా నని నీవెఱుఁగవా. బాదుషా కట్టి యభిప్రాయమే లేనియెడల సేనల నేల పంపించును?

ముబా—మార్గమధ్యమున నేభయమును కలుగకుండుటకు—

జేబ—ఔరంగజీబు బాదుషావారి సైన్యముపోయినపని యెన్నటికైన నిష్ఫలము కావచ్చునా? నీవెట్లైన నామెను దీసికొని రావలయును. అందులకు బాదుషావా రాగ్రహించిరేని నేనుంటినిగాదా?

ముబా—నాకంతమాత్రము మీదయ యుండిన జాలును. మీకిట్టియభిప్రాయము కలుగుటకు గారణ మేమియో చెప్పితిరేని మీయాజ్ఞానిర్వహణవిషయంబున నాబాహుబలము మఱింత హెచ్చు కాఁగలదు.

జేబ—అది నీతో జెప్పుటకే నేనీమాట నెత్తితిని. నానేర్పుచే రూపనగరరాజకుమారిక నిటకు దీసికొని రావలయు నని నిశ్చయించు కొంటిని.

ముబా—ఎందులకు?

జేబ—ఉదయపురి బేగము తానే త్రిలోక సుందరి ననియు, తన కంటె సుందరు లీలోకమున లేరనియు గర్వించి యున్నది. చంచలకుమారి చాల నందగత్తె యని వినియుంటిని. ఉదయపురి బేగముకంటె నామెయే రూపవిలాసములచే బాదుషాను వశపఱచుకొనజాలుననియు, నేనేయామెను గొని తెచ్చినదాననగుటచే నాపై నామె ప్రేమగలిగి నాయధీనురాలై యుండగలదనియు, నేనప్పుడు నిష్కంటకముగ నేకాధిపత్యమును వహింపగలుగుదుననియు నమ్మియుంటిని. ఈపనికి నీవే పోవుటగూడ మంచిదయ్యెను. ఆమె యుదయపురికంటెను చాల నందమైనదట చూడుము!

ముబా—నేనుదయపురి బేగమువారి నెన్నడును చూడలేదు.

జేబ—చూడుము! ఈ తెరచాటున నున్నది.

ముబా—చీ!

జేబఉన్నీసా నవ్వుచు 'ఢిల్లీయందు నీవంటిక్రోతి మఱియొకటి లేదు. పోనిమ్ము. నీవుదయపురిని చూడకుంటివేని యామెప్రతిబింబ పటమును చూపించెదను, రూపనగర సుందరినికూడ జూచి ఉదయపురికంటె నందమైనదైనయెడల నామెతో 'జేబఉన్నీసాదయవలన నీవు బాదుషావారి బేగమవు కాగలవు' అని చెప్పుము. ఆమెయంత యందగత్తె కానియెడల—

ఇట్లు చెప్పి యామెయేమో కొంచెమాలోచింప దొడగెను. ముబారకు 'అంతసుందరి కానియెడల నేనేమిచేయవలయును?' అని యడిగెను.

అంతయందగత్తె కానియెడల నామెను నీవు పెండ్లిచేసికొనుము. అందులకు బాదుషావా రంగీకరించునట్లు చేయగలను.

ముబా—ఈదీనునియందు మీకింత యనుగ్రహమున్నదా?

జేబ—బాదుషావారికుమార్తె కింకను ప్రీతివిశ్వాసము లెక్కడ?

ముబా—ఈశ్వరుడు జేబఉన్నిసా నేలసృష్టించెనో?

జేబ—సుఖపడుటకు—

ముబారకు మఱిమాటాడలేదు. అంతటితో నామాటనిలిపి 'బాదుషావారి బేగముకాఁదగినయామెను నేనెట్లుచూడగలను?' అని యెను.

జేబ—ఏయుపాయముచేసైనఁ జూడవలయును.

ముబా—బాదుషావారు విన్నయెడల నేమగుదును?

జేబ—నీకేమియును భయములేదు. నేనుంటినిగాదా!

ముబా—సరియే. మీరు చెప్పినట్లు చేసెదను. కాని యీాదీనునిపైననుగ్రహ ముంచవలయును

జేబ—నీవు నాప్రాణప్రియుఁడ వని మొదటనే చెప్పితినికాదా?

ముబా—అది నాపైఁ బ్రీతివిశ్వాసములతోఁజెప్పినమాటయేనా?

జేబ—ప్రీతివిశ్వాసము లల్పుల కుండవలయును. అవి దుఃఖకారణములు. జేబఉన్నిసా యట్టిదుఃఖములకు లోఁబడునది కాదు.

ముబారకు మర్మాహతుఁడై యాజ్ఞఁ దీసికొని వెడలిపోయెను.

---

## తృతీయ భాగము—వివాహవికల్పము.

### మొదటి ప్రకరణము.

బకము—హంసము.

నిర్మలమెల్లమెల్లగఁ బోయి రాజకుమారియొద్ద గూర్చుండెను. రాజకుమారి యొంటరిగఁ గూర్చుండి యానాఁడు కొన్నచిత్రపటములలో నొకదాని చేతఁబట్టుకొని చూచుకొనుచుండెను. నిర్మలనుచూచియామె చిత్రమును మూసివైచెను. నిర్మలకదియెవ్వరి చిత్రమో

తెలిసికొనవలసిన యవసరములేదు. నిర్మల సమీపించి 'ఇప్పుడుపా యమేమి?' అనియెను.

చంచ—మనకెట్టి సదుపాయమును లేకున్న లేకపోవుఁగాక! నేనుమాత్రముపోయి మసల్మానుల యింటిదాసినైన యుండజాలను.

నిర్మ—అది నేనెఱుఁగుదును. కాని, యలంగీరుబాదుషావారి యాజ్ఞ యిట్లున్నది మనప్రభువువా రందుల కభ్యంతరము చెప్పుటకు వలనుపడదుగదా! సఖీ! మనకిఁక వేఱుమార్గములేదు. అందులకు నీవంగీకరింపవలయును. అదియే నీకు సౌభాగ్యకారణము. యోధపురము చూడుము! అంబరు చూడుము! రాజులు, బాదుషాలు, ఉమ్రావులు, నబాబులు, సుబేదారులు, మొదలగు గొప్పగొప్పవారందఱును ఢిల్లీసింహాసనమును గొలిచియుండుట కిష్టపడుచుండుట లేదా? రాజరాజేశ్వరియగుటకు గూఢ నీకిష్టములేదా?

చంచలకుమారి కోపగించుకొని "ఛీ! నీవావలకుబొమ్ము" అనియెను.

నిర్మల యిట్టిమాటలవలన బ్రయోజనములేదని తెలిసికొని మఱి యేయుపాయము చేసైన నీకేమైన నుపకారము చేయవలయునని యోచించి "నేనట్లె లేచిపోయెదను. కాని, నేనింత కాలము వఱకు నెవ్వతెచే బోషింపబడుచుంటినో, యామె కేదైన హితము జేయవలయునని యాలోచించుచున్నాను. నీవుఢిల్లీకి బోకుండినయెడల నప్పుడు నీతండ్రిగతి యేమగునో బాగుగ యోచించితివా?" అనియెను.

చంచ—యోచించితిని నేను పోకుండినయెడల నాతండ్రిగారి ప్రాణములమీదికి రాగలదు. రూపనగరదుర్గముపై నొక్కఱాయియైన నిలువదు. నామూలమున బితృమరణము కలుగకమానదు. కావున బాదుషావారిసైన్యము వచ్చినతోడనే యేమియు నభ్యంత

రము చెప్పక దానితోఁగూడ నేనును డిల్లీకి బోవలయునని నిశ్చయించు కొంటిని.

నిర్మలయానందముతో "నేను నామాటయే చెప్పవలయునని వచ్చితిని" అనియెను.

రాజకుమారి యూఁడుగ జదికొని "నేను నామాటయే చెప్ప వలయునని వచ్చితిని" అనియెను.

రాజకుమారి యాఁడు గజదికొని "నేను డిల్లీకిబోయి యా ముసల్మానుని యింట సంతోషముతో మెలంగెదననుకొంటివా?" అనియెను.

నిర్మల యేమియు నాలోచింపకుండ "కాకయున్న నీవేమి చేయుదువు?" అని యడిగెను.

చంచల తన వ్రేలి యుంగరమును చూపించి "డిల్లీకిబోవు మార్గమున విషపానమును చేసెదను" అనియెను. ఆయుంగరమున విషమున్నదని నిర్మల తెలిసికొనియెను.

నిర్మ—మఱియేయుపాయమును లేదా?

చంచ—నిర్మలా! ఇంకేమియుపాయ మున్నది? నన్నుద్ధరించు టకు డిల్లీశ్వరునితో వైరము పెట్టికొనునంతటి మహావీరపురుషుఁడెవ్వఁడు న్నాఁడు? రాజస్థానమునందలి రాజపుత్త్రులందరును మొగలాయీల బానిసలే. ఇప్పుడెవ్వఁడున్నాఁడు? సంగ్రామసింహుఁడు లేడుగదా? ప్రతా పసింహుఁడెక్కడనున్నాఁడు? చెప్పుము!

నిర్మ—ఏమని చెప్పను? రాజకుమారీ! సంగ్రామసింహుఁడు ఉన్నను నట్టివారు సర్వమును వదలుకొని నీకొఱకు బాదుషాతో వైరము పెట్టుకొందురా? ఔను. ప్రతాపుఁడు లేడు; సంగ్రాముఁడు లేడు. రాజసింహుఁ డున్నాఁడుకాదా? అతఁడు నీకొఱకు తన సర్వస్వము నేల వదలుకొనును? అంతేకాక నీవు మార్వారువంశస్థురాలవు.

చం:చ—అదేమి యట్లనుచున్నావు? బాహువులయందు బల మేయున్నయెడల రాజపుత్త్రులు శరణాగతులను రక్షింపజాలరా? నేను దానినిగూర్చియే యాలోచించుచుంటిని. నిర్మలా! ఆసంగ్రామ, ప్రతాపసింహుల వంశమునకు తిలకప్రాయుడగు నాతనిశరణము నపే క్షింపవలయుననియే యోచించుచున్నాను. ఆతడు నన్ను రక్షింప జాలడా?

అని చెప్పుచు నంతవఱకు మూసియుంచిన తన చేతిలోని చిత్ర పటమును పైకిదీసెను. అది రాజసింహుని ప్రతిబింబపటమై యుండెను. ఆచిత్రమును చూచుచు రాజకుమారి మరల నిట్లనియెను. "చూడు ము! ఈవీరపురుషుని కాంతివిలాసములంజూడ నీతఁడనాథలకు నాథుఁ డనియు, నగతికలకు గతియనియు నీకుఁ దోఁచుటలేదా? నేనీతనిశర ణము నపేక్షించితినేని నన్నీయాపదనుండి యుద్ధరింపఁజాలఁడా?"

నిర్మల విశేషబుద్ధిశాలిని. చంచలకు సోదరికంటెను ప్రియు రాలు. ఆమె చాలసేపాలోచించి చంచలవంక బాగుగాఁ జూచుచు "నిన్నింతటి విపత్తునుండి యుద్ధరింపజాలెడు తేజోమూర్తియగు వీర పురుషునకు ప్రత్యుపకారముగ నీవేమీయగలవు?" అనియెను.

రాజకుమారి యాభావమును దెలిసికొని కంపము నొందక పోయినను వికలమైన స్వరముతో "నే నేమీయగలను? సఖీ! నాయొద్ద నేమున్నది? నేనబలను!" అనియెను.

నిర్మ—నీవుఁటివిగాదా?

చంచల యప్రతిభయై "ఆవలకుబొమ్ము!" అనియెను.

నిర్మ—ఇట్టిమర్యాదలు రాచవారింట నున్నవియే. నీవు రుక్మిణివైతివేని యదునందనుఁడెవచ్చి యాతడు నిన్నవశ్యముగ నుద్ధ రింపగలడు.

[9] తృతీయ భాగము

చంచలకుమారి సిగ్గుచే జెల్లవోయెను. ప్రభాతసమయంబున మేఘమాలికపై బ్రసరించుచున్న కాంతితరంగములపై తటిత్కాంతులు ప్రసరించి యందలిసౌందర్యము నెల్ల క్షణక్షణమునకు నుత్కర్షింపజేయుచుండునో యట్లే చంచలకుమారి వదనమండలమున నానందలజ్జాభావములు క్షణక్షణమున క్రొత్తవింతయందమును గల్పించుచుండెను. తుదకు చంచలకుమారి "సఖీ! నాకీజన్మమున నాతనిం బొందునంతటిభాగ్యము గలుగునా? నాయంతట నేనే నన్నర్పించుకొనబోయిన యెడల నాతడు నన్ను బరిగ్రహించునా?" అనియెను.

నిర్మ—పరిగ్రహించుటగాని, పరిత్యజించుటగాని, యాతని యిష్టము. అది మనమాలోచించి నిశ్చయింపదగిన విషయము కాదు. రాజసింహుడు మహాబలపరాక్రమసంపన్నుడని వినియుంటిమి. ఆతని యొద్ద కెవ్వనినైన దూతగా బంపగలుగుదువా? ఎవ్వరికిని దెలియకుండ రహస్యముగా నెవడు పోగలుగును?

చంచలకుమారి బాగుగా నాలోచించి "నీవు పోయి మాగురువులవారిని పంపించుము. ఆతనికంటె హెచ్చుగా నన్ను బ్రేమించువారెవ్వరున్నారు? కాని నీవే యంతయు నాతనికి విశదపఱచి యుచ్చటికి దీసికొని రమ్ము. నాయంతట నేనే చెప్పుటకు సంకోచ మగుచున్నది" అనియెను.

ఇంతలో చెలికత్తెలు వచ్చి "ఎవ్వతెయో ముత్యములమ్ముకొను కాంత వచ్చి యున్నది" అని చెప్పిరి. రాజకుమారి "ఇప్పుడు ముత్యములవ్యాపారము చేయుటకు దగినసమయము కాదు. ఆమెను పొమ్మని చెప్పుడు" అనియెను. "పొమ్మన్నను బోవుటలేదు." అని చెలికత్తెలు చెప్పిరి. అప్పుడు చంచలకుమారి యామెను తీసుకొని రండని యాజ్ఞాపించెను.

ముత్యములమ్మునుయువతి వచ్చి కొన్ని మైనపుముత్యములను తీసి చూపించెను. చంచలకుమారి విసివికొనుచు "ఈసీమముత్యములను చూపించుటకా నీవింతతొందరపెట్టితివి?" అనియెను.

ముత్యా—కాదు. ఇంకను చూపింపదగినపదార్థము లున్నవి. మీరు రహస్యముగా వచ్చితిరేని చూపింపగలను.

చంచ—నేనొక్కతెనే యుండను. నాతో నా చెలియొక్కతెమాత్ర ముండును. నిర్మలా! నీవుండుము. తక్కినవారు పొండు!

అప్పుడు తక్కినచెలులందఱును వెలుపలకుఁబోయిరి. అనంతరము దేవి—ఆముత్యములమ్మునది దేవియే ఆమె యోధపురిబేగము పంపించినహస్తముద్రను చూపించెను దానినిచూచి చంచలకుమారి 'ఇది నీకెక్కడ దొరకినది?' అనియెను.

దేవి—యోధపురిబేగముసాహెబావారు నాకిచ్చిరి.

చంచ—నీవామె కేమగుదువు?

దేవి—దాసిని.

చంచ—బేగమువారిహస్తముద్ర నెందులకు తెచ్చితివి?

దేవి యున్నసంగతులను సవిస్తరముగాఁ దెలియఁ జేసెను. చంచలయు, నిర్మలయుఁ బరస్పరముఖావలోకనములం గావించుకొనిరి. చంచల యా దేవికి విశేషముగ బహుమతు లిచ్చి పంపివైచెను.

దేవి పోవునప్పుడు యోధపురిబేగముహస్తముద్రను మరలఁ దీసికొనకయే వెడలిపోయెను 'ఎక్కడ నున్న నేమి? ఎవ్వరు తీసికొనఁగలరు?' అని యోచించి బుద్ధిపూర్వకముగా నాహస్తముద్రను చంచలకుమారియొద్దనే విడిచి దేవి వెడలిపోయెను,

చంచల 'నిర్మలా! ఆమెను పిలువుము! ఈహస్తముద్ర నిక్కడఁ బారవైచిపోయినది!' అనియెను.

నిర్మ—కావలయు ననియే విడిచిపోయినది.

చంచ—దీనిని నాయొద్ద నుంచికొని యేమిచేయను?

నిర్మ—ఇప్పటికిఁ దీసికొనుము. ఎప్పటికైనను మోఘపుర జె గమునకు మరలఁ బంపవచ్చును.

చంచ—బేగము చెప్పినమాటలవలన మనకు చాలధైర్యము కలుగుచున్నది. లోకజ్ఞానములేనిపసివాండ్ర మగుమనము యోచించిన కార్యము మంచిదియో, చెడ్డదియో, అగునో కాదో యేమియును తెలియుటలేదు. ఇప్పటికి ధైర్యముకలిగినది. రాజసింహుని శరణము నపేక్షించి తీరవలయును.

నిర్మ—దానినిగూర్చి నీకు మొట్టమొదటనే తెలియును.

అని నిర్మల నవ్వెను. చంచలయును నవ్వెను. నిర్మల తటాలున లేచి వెడలిపోయెను. ఆమెకు నమ్మకములేదు. కన్నీరు విడుచుచు లేచిపోయెను.

---

## రెండవ ప్రకరణము.

---

### అనంతమిశ్రుడు.

అనంతమిశ్రుడు చంచలకుమారిపితృవంశమునకుఁ బురోహి తుఁడు. ఆతఁడు చంచలకుమారిని తనకన్నకుమార్తెకంటె నెక్కు డుగఁ బ్రేమించుచుండును. ఆతఁడుమహామహోపాధ్యాయ పండితుఁ డు. ప్రజలందఱు నాతని యెడల మిగుల భక్తిగలవారలై యుండిరి. చంచలకుమారి పిలిచినదని వినినతోడనే యాతఁ డంతఃపురమునకు వచ్చెను. త్రోవలో నిర్మల యాతని కెల్ల సమాచారములను సవిస్త రముగఁ దెలియఁజేసెను.

విభూతిచందనవిభూషితసర్వావయవుండును, సుప్రశస్తలలా

టుండును, దీర్ఘకాయుండును. రుద్రాక్షమాలికాలంకృతుండును నగు నాబ్రాహ్మణుఁడు చంచలకుమారి సమీపమునకు వచ్చినిలువఁబడి యెను.

చంచలకుమారి గురుదేవునింజూచి స్థిరచిత్తము కలదయ్యెను.

గురు—తల్లీ! నన్నెందులకుఁ బిలిపించితివి?

చంచ—నన్ను రక్షించుటకు—నన్నుద్ధరించుటకు మీకంటె మఱి యెవ్వ రున్నారు?

అనంతమిశ్రుఁడు నవ్వుచు "రుక్మిణీకల్యాణ మని తోఁచు చున్నది. అందుకొఱకీ కీముదిపురోహితుఁడు ద్వారకానగరమునకుఁ బోవలయును కాఁబోలును! అట్లయినయెడల అమ్మా! చూడుము! దారిబత్తెమున కేమైన నిచ్చితివేని యుదయపురమునకుఁ జేరెదను" అనియెను.

చంచలకుమారి సరిగకీన్ కాబుతోఁ జేయఁబడినసంచి నంది కొని దులిపి క్రుమ్మరించెను. దానినిండ మొహరీలుండెను. పురోహితుఁడైదు మొహరీలనుమాత్రము తీసికొని మిగిలినవానిని క్రిందఁ బడవైచి "మార్గమునం దన్నము తినియెదముగాని బంగారము తినముగదా! నేనొక్క మాట చెప్పెద నట్లుచేసెదవా?" అనియెను.

చంచ—ఈయాపదనుండి విడివడుటకై యగ్నికుండములో నుఱుకు మనిన నుఱికెదను. ఏమిచేయవలయునో యాజ్ఞాపింపుఁడు.

మిశ్రు—రాణా రాజసింహునకొక యుత్తరమును వ్రాసి యియ్యఁగలవా?

చంచలకుమారి చాలసే పాలోచించి "నేను బాలికను. అంతఃపురకాంతను. ఆతనికిఁ బరిచితురాలనుగాను. ఎట్లు జాబు వ్రాయఁగలను. కాని నేనాతనివిషయమున భిక్షుకురాలనై యుంటిని. సిగ్గుపడి యూరకుండినయెడల నెట్లు? సరియే. అట్లే వ్రాసియిచ్చెదను" అని యెను.

మిశ్రు—నేను చెప్పి వ్రాయింపవలయునా? నీవు వ్రాసెదవా?

చంద్ర—మీరే చెప్పి వ్రాయింపవలయును.

అప్పుడటనున్న నిర్మల "అట్లు కాదు. ఇట్టి కార్యములలో ఛాందసులగు వైదిక బ్రాహ్మణుల మంత్రాంగము పనికిరాదు. సూక్ష్మబుద్ధులగు కాంతామణుల యాలోచనమే కావలయును. మేము జాబు వ్రాసికొందుము. మీరు పోయి ప్రయాణమునకు సంసిద్ధులరై రండు" అనియెను.

మిశ్రఠాకూరు వెడలిపోయెను. కాని యింటికిపోలేదు. విక్రమసింహప్రభునియొద్దకుఁ బోయి "మహారాజా! నేను దేశాంతరములకుఁ బోవలయును. అందువలన నిప్పుడు మిమ్మాశీర్వదించి పోవలయు నని వచ్చితిని" అని చెప్పెను. ఎక్కడకుఁ బోవుచుంటిరని రాజడిగెను. కాని యందుల కా బ్రాహ్మణుఁ డేమియును సమాధానము చెప్పక "నేనుదయపురమువఱకును పోవలయును. రాణా రాజసింహున కొక పరిచయలేఖను వ్రాసి యీయవలయును" అని కోరెను. రూపనగర ప్రభుండగు విక్రమసింహుఁ డట్టి యుత్తరమును వ్రాసియిచ్చెను.

అనంతమిశ్రుఁడు రాజుగారిచ్చిన యుత్తరమును దీసికొని చంచలకుమారి యంతఃపురమునకు వచ్చెను. ఇంతలో చంచలా నిర్మలలుఁ దమ యిరువురి యాలోచనములు నేకముచేసి యొకజాబును సంపూర్ణముగ లిఖించియుంచిరి. రాజకుమారిక యాయుత్తరమును పురోహితుని చేతికిచ్చి తన పెట్టెలోనుండి యొక ముత్యాలహారమును దీసి "మహారాణా రాజసింహుఁ డీయుత్తరము చదివినపిమ్మట నామారుగా మీరీహారము నాతని కుపాయన మొసంగిఁ రావలయును. రాజపుత్రకులాలంకారుం డగు నా రాజసింహుఁడు, రాజకన్యచేఁ బంపఁబడిన

కానుకను తిరస్కరింపజాలను' అని చెప్పి యాహారము నాతనిచేతి కిచ్చెను.

మిశ్రతాకూ రందుల కంగీకరించిబయలుదేరెను. పోవునప్పుడు చంచలకుమారి యాతనికి సాష్టాంగప్రణామ మాచరించి పంపించెను.

## మూఁడవ ప్రకరణము

### అనంతమిశ్రుని నారాయణస్మరణము

ఉపవస్త్రము, ఛత్రము, చేతికఱ్ఱ, చందనపుజెక్క, తామ్రపాత్రము, నీర్కావిదోవతులు మొదలగు నావశ్యకంబు లగు వస్తువులం దీసికొని, తన గృహిణితో జెప్పి యనంతమిశ్రుఁడు యోధపురయాత్రకు బయలుదేరెను. అప్పుడాతని యిల్లాలు 'మీరెందులకు బోయెదరు! వృథాశ్రమయేల? పోవలదు' అని యెంతయోసేపు పీడించెనుగాని 'మహారాణావలన నేదియైన నొకవృత్తి సంపాదించుకొని వచ్చెదను' అని యాబ్రాహ్మణుఁడు చెప్పినతోడనే యామె మాఱుమాట చెప్పలేదు. మఱి విరహతాప మామెను దహింపలేదు. ధనలాభమనియెడు నాశాస్వరూపమైన శీతజలప్రవాహ మాప్రచండజ్వాలామయం బగునగ్నిహోత్రమును దడిపి తడిపి చల్లార్చివైచెను. మిశ్రతాకూ రొక్కభృత్యుని దీసికొని బయలుదేరిపోయెను. ఆతడింకను చాలమంది సేవకులను దీసికొనిపోగలవాఁడై యుండినను వారిమూలమున రహస్యభంగ మగుననునుద్దేశముతో నొక్కని మాత్రమే వెంట దీసికొనిపోయెను.

విశేషము లగుకఱకురాళ్ళుగలయామార్గ మతిదుర్గమమైయుండెను. చాలచోట్ల నిలుచుటకైన స్థలములేదు. బ్రాహ్మణుడేకాహారి,

ఎక్కడ భోజనము దొరకిన నక్కడ నాగుచు దిన మంతయును ప్రయాణము చేయుచుండెను. తనయొద్ద ముక్తాహార ముండుటచే నామార్గమున దొంగలభయ ముండుటవలన నొంటరిగా బోక కొందఱుమార్గస్థుల సాహాయ్యము దొరకునంతవఱకును ప్రయాణము నాపివేయుచుండెను. ఎవ్వరైన జతకు దొరకినయెడల వారితోబోయి వారు నిలిచినచోటనే తానును నిలుచుటకు స్థలము చూచుకొనుచుండును. ఒకనాటిరాత్రి యాతడొక దేవాలయమంటపముపై బరుండెను. ప్రభాతసమయమున నాతడు బయలుదేరునప్పు డాతనికి జతగాండ్రను వెదకికొనవలసినయవసరము లేకపోయెను. నలుగురువర్తకు లారాత్రి యాదేవాలయమునందలి శివకూటమున భోజనము చేసి యక్కడనే పరుండి యుండిరి. తెల్లవారినతోడనే వారును బయలుదేరి బ్రాహ్మణునిజూచి 'మీరెక్కడకు బోవుచున్నారు?' అని యడిగిరి. బ్రాహ్మణు 'డుదయపురమునకు పోవుచుంటి' ననియెను. వర్తకులు 'మేము నచ్చటికే పోవుచుంటిమి; అందఱమును కలసియే పోవచ్చు' ననిరి. బ్రాహ్మణుడు సంతోషముతో 'ఉదయపుర మింకెంతదూర మున్నది?' యని యడిగెను. వర్తకులు 'సమీపమునకు వచ్చితిమి; ఈసాయంతనమునకు చేరగలము; ఇదియంతయును రాణావారి రాజ్యమే' యనిరి.

ఇట్లు మాటలాడికొనుచు వారు ప్రయాణము చేయుచుండిరి. మెట్టలును, గుట్టలును గల యాదుర్గమారణ్యమార్గమున నడచుట చాలకష్టము. ఎక్కడనునిలుచుటకు నిర్భయమైన వసతిలేదు. క్రమక్రమముగా వారా కంటకమార్గమును తరించుచుండిరి. ఇంక కొంత సేపటిలో సమప్రదేశమునకు చేరగలరు, అట్లుపోయి వారొక శోభామయంబగు పర్వతపార్శ్వమున బ్రవేశించిరి. ఇరువంకలను సమోన్నతంబులగు పర్వతములు శ్యామలతరులతాశోభితంబులై యాకాశము

దలలెత్తి చూచుచుండెను. ఆ రెండుకొండలనడుమనుండియు నొక నదీప్రవాహము నీలమణిప్రభాభాసమానంబు లగుజలంబులతోఁ గర్కశశిలాతలంబులం బడి యెగసి రొదసేయుచు, నావనాభిముఖం బుగఁ బోవుచుండెను. ఆనదీపార్శ్వమునుండియే మనుష్యులు నడచి పోవుటకొకబాట యేర్పడి యుండెను. ఆమార్గమునుండి పోవుచున్న వారి నితరు లెవ్వరును కనిపెట్టజాలరు. కాని యాప్రక్కకొండలపై నిలిచియున్నవారు మాత్రమువారిని చూడగలరు.

అతినిగూఢమగు నాస్థలమునకు జేరినతోడనే యందొక వర్తకు డాబ్రాహ్మణునింబిలిచి "నీయొద్ద డబ్బు, దస్కము నేమైన నున్నదా అని యడిగెను.

ఆప్రశ్నమును విని బ్రాహ్మణుడు భయపడి "ఇక్కడ కొంచెము దొంగలభయ మున్నది కాబోలును! అందుకొఱకే వీరు నన్ను హెచ్చరించుచున్నారు." అని యనుకొనియెను. దుర్బలున కసత్యమే యూతకోల యగుచుండును. కావున నాబ్రాహ్మణుడు "నేను యాచకబ్రాహ్మణుడను. నాయొద్ద నేమున్నది?" అనియెను.

వర్తకులు—ఇది చాలచెడ్డత్రోవ. నీయొద్ద నేమైన నున్న యెడల మాచేతికిమ్ము. నీవు భద్రముగా దాచికొనజాలవు.

బ్రాహ్మణుడు వెనుకముందు చూచి, యీరత్నహారము నీ వర్తకులచేతులలో బెట్టుదునా? యని యాలోచించుకొనియెను. "అపరిచితులగు వీరిని నమ్మి నేనెట్లీయఁగలను?" అని యనుకొని నేను భిక్షుకుడను. నాయొద్ద నేమున్నది?" అని చెప్పెను.

విపత్కాలమున వెనుకముందు చూచువాఁడు దారుణకష్టములపాలబడి చావకమానడు. బ్రాహ్మణుని తత్తరపాటు చూచి కపటవేషధారులగు నావర్తకులు వీనియొద్ద కొంతధన ముండకపోదని తెలిసికొని యందొక డాతనిమెడ బట్టుకొని క్రిందకు బడఁద్రోసి గుండెలపై

గూరుచుండి కేకలు వేయకుండునట్లు భద్రముగా నాతని నోరు మూసి వైచెను. మిశ్రఠాకూరుని భృత్యుడా క్షణమునం బెచ్చటికి మాయమై పోయెనో యెవ్వరును చూడలేదు. మిశ్రఠాకూరు నోట మాటలేక హృదయముననే నారాయణస్మరణచేయ నారంభించెను. మఱియొక దొంగ యాతనియొడిలోనున్న సంచి నూడదీసికొని విప్పిచూచెను అందు చంచలకుమారియుంచిన ముక్తాహారమును, రెండు కాగితము లును, కొన్ని మొహరీలునుండెను. ఆదొంగ యావస్తువులను దీసికొని తన స్నేహితులతో "ఇక బ్రహ్మహత్యవలన ప్రయోజనము లేదు. ఆతనియొద్దనున్న దంతయును మనకు దక్కినది. ఆబ్రాహ్మణుని వదలివేయుడు" అనిచెప్పెను.

మఱియొక దొంగ "వదలివేయం గూడదు. అట్లైన మొదలబ్రాహ్మణుం డల్లరి చేయంగలడు. రాణారాజసింహుండు చండ శాసనుడు. ఆతని యధికారమున మనబోటివారిం బ్రదుకుట యే కష్టముగా నున్నది. ఈబ్రాహ్మణు నొకచెట్టునకుం గట్టివైచి మఱి పోవుదము" అనియెను.

ఇట్లు మాటలాడుకొని మిశ్రఠాకూరుని బట్టలతోనే యాతని కాలుసేతులు గట్టి యొక చెట్టుకొమ్మకుం గట్టివైచి బాటను వదలి యరణ్యమధ్యమునం బడి యాదొంగలు వెడలిపోయిరి. ఈసమయ మునందు పర్వతశిఖరముపై నొకగుఱ్ఱపురౌతు నిలుచుండి యిది యంతయును చూచుచుండెను. దొంగలుమాత్ర మాతనిని చూడలేదు.

దొంగ లానదీతీరమునందలి యరణ్యమునం బడి కొంతదూర మరిగి యొకకొండగుహలోం బ్రవేశించిరి.

ఆగుహలో భోజనపదార్థములును, పరుండుటకు మంచములు పఱుపులు మొదలగు వస్తువులు సిద్ధముగ నుండెను. ఇది యంతయు నుచూడంగా నీదొంగ లప్పుడప్పుడు వచ్చి యీగుహలో నివసించు

నుందురని తోఁచుచున్నది. కుండలలో నీరు నిండియుండెను. అక్కడ దొంగ లందఱును తంబాకు వేసికొన నారంభించిరి. అందొకఁడు "మాణిక్యలాలూ! వంట యగునంతలో మన మీవస్తువులను పంచుకొందమా?" అనియెను.

మాణి—సరియే. అట్లే కానిండు.

అప్పుడు దండలి మొహరీలను నాలుగుభాగములు వైచి యొక్కొకఁ డొక్కొక్క భాగమును దీసికొనిరి. ముక్తాహారము విక్రయించినఁ గాని విభజించుకొనుటకు వలనుపడకుండుటచే నది యవిభక్తమై యట్లే యుండెను. ఆకాగితము లేమిచేయవలయు ననువిషయమును గూర్చి చర్చించిరి. అందు నాయకుడు "ఆకాగితములవలన నేమి ప్రయోజనము? చింపి పారవేయుడు" అని చెప్పి యాయుత్తరములను మాణిక్యలాలుచేతి కిచ్చెను.

మాణిక్యలాలు చదువగలఁడు. అతఁ డాకాగితములను తుదివఱకును జదివి మహానందభరితుఁడై "ఈకాగితములను పాడుచేయఁ గూడదు. ఇందువలన సర్కారులో పని సంపాదించుకొనవచ్చును" అనియెను.

ఈమాటలను విని "ఏమి! ఏమి!" అని తక్కినమువ్వురును సంతోషముతో బలికిరి. అప్పుడు మాణిక్యలాలు జాబునందలి సారాంశ మంతయును దెలియజేసెను. అందఱును పరమానందభరితులైరి.

మాణి—ఈకాగితమును రాణా కిచ్చినయెడల మనకు బహుమాన మీయగలడు.

నాయకుడు—అయ్యో! వెఱ్ఱివాఁడా! "ఇది నీ కెక్కడదొరికినది?" అని రాణా నిన్నడిగినయెడల నేమని యుత్తర మీయగలవు? దొంగతనము చేసి సంపాదించితి నని చెప్పుదువా? బహుమానము

పోయి ప్రాణదండన మగునే! దీనిని దీసికొనిపోయి బాదుషావారి కి త్తుము. ఇట్టిసమాచారము విన్నయెడల బాదుషా మనకు బహు మాన మియ్యగలడు. ఇంతవఱకు నేను దృఢముగా జెప్పగలను. ఇంతేకాక దీనిలో—

నాయకు డింకను మాట పూ ర్తిచేయలేదు. అంతలోనే యాతనితల కంఠమును వదలి క్రిందఁ బడిపోయెను.

---

## నా లు గ వ ప్ర క ర ణ ము.

---

మాణిక్యలాలు.

కొండపైనున్న గుఱ్ఱపురౌతు నలుగురుమనుష్యు లొక్కని బట్టుకొని కట్టివేయుచున్నదారుణకృత్యమును జూచియుండెను. అంతకుముం దేమిజరిగినదో యాతఁడు చూడలేదు. అప్పటికాతఁ డాపర్వతశిఖరముపైకి రానేలేదు. ఆరౌతు, దొంగ లేమార్గమునఁ బలాయితులై పోవుచుండిరో యామార్గమును జాగరూకుడై చూచుచుండెను వారు వక్రముగాఁ బ్రవహించుచున్న యానదియొడ్డున నున్నయడవిం బడి కంటి కగపడకుండఁ బోవుచున్నంతవఱకునుచూచి యాగుఱ్ఱపు రౌతు తన యశ్వమునుండి దిగి గుఱ్ఱమును చేతితో నిమురుచు 'విజయా! నేను వచ్చునంతవఱకు నీవిట నిశ్శబ్దముగా నిలిచియుండుము!' అని హెచ్చరించెను. ఆయుత్తమాశ్వమట్లే నిశ్శబ్దముగా నుండెను. రౌతు పాదచారియై యతివేగముతో నాపర్వతమునుండి క్రిందికి దిగి మిత్రశౌకూరును కట్టివైచినస్థలమునకువచ్చి యాతనిబంధముల వెడలించి 'ఏమి జరిగినదో యతిత్వరితముగ నొక్కమాటలోఁ జెప్పుమా' యడిగెను.

మిశ్ర—నలుగురు మనుష్యులతోఁ గూడ నేను వచ్చుచుంటిని వారిని నేనెఱుఁగను. వారు వర్తకుల మని నాతోఁ జెప్పిరి ఇక్కడకు వచ్చినతోడనే నన్నుఁ గొట్టి నాయొద్దనున్న ధనమును దోచుకొని నన్నిట్లుచేసి యెక్కడకో పోయిరి.

రాతు—ఏమేమి దొంగిలించుకొని పోయినారు?

మిశ్ర—ఒక ముక్తావలయము; కొన్ని మొహారీలు, రెండు కాగితములు.

రాతు—మీరిక్కడనే యుండుఁడు. వారెక్కడకుఁ బోయిరో చూచి వచ్చెదను.

మిశ్ర—మీరేల పోయెదరు? వారు నలుగురుమనుష్యులు; మీరొక్కరుమాత్రమే.

రాతు—నేను రాజపుత్త్రయోధుఁడను. మీరుకనిపెట్టలేదా?

అనంతమిశ్రుఁ డీతడు యుద్ధవ్యవసాయి (Military) యని తెలిసికొనియెను. ఆతనినడుమునఁ గత్తియును, పిస్తోలును, చేతిలో బల్లెమును కూడ నుండెను. మిశ్రతాకూరు భయముతో విశేషప్రసంగము సేయ లేదు.

రాజపుత్త్రుఁడు దొంగలుపోయినమార్గమునుబట్టి వారివెనుక నేపోయెను. కాని యరణ్యమధ్యమునకుఁ బోయినతోడనే దారితప్పిపోయెను. దొంగ లేదిక్కుగాఁబోయిరో గుర్తు తెలియ లేదు.

అప్పుడు రాజకుమారుఁడు తిరిగి మెట్టపై కెక్కి చూడఁగా దూరమునఁ బోవుచున్న యానలుగురు మనుష్యులును గాన్పించిరి. అక్కడనే యాతఁడు నిలువఁబడి జాగ్రతగాఁజూచుచుండెను. కొంతసేపటికి వారొకచెట్లగుంపులోనికిఁ బోయిరి. అటనుండి వారు పైకిఁ బోయినట్లు లేదు. రాజపుత్త్రుఁడు 'వారక్కడవిశ్రమించి యుండవలయును చెట్లు చాటగుటచే నేమియు నగపడుటలేదు, కాక—అక్కడ నేది

యైన గుహాయుండవలయును. వారందుఁ బ్రవేశించియుందురు' అని యాలోచించుకొనియెను.

రాజకుమారుఁడు చెట్టుగుఱ్ఱముఁజూచికొని కొండదిగి యాస్థలము నకు వచ్చి చూడఁగా నాతఁ డనుకొన్నట్లే యట నొకగుహ యుండెను దానిలో జనులు మాటలాడుకొనుచున్నట్లు కూడ వినవచ్చెను.

రాజకుమారుఁడు "వారు నలుగురు మనుష్యులున్నారు. నే నొక్కఁడను. ఇప్పుడు గుహలోఁ బ్రవేశించుట యుచితమా? అనుచి తమా? వారాగుహాద్వారమును మూసివైచి యుద్ధము సేయఁగడంగి నచో వారిని జయించుట యసంభవముగదా!" అని యిట్లనేకవిధ ముల నాలోచించెను. కాని యీయోచనలతోఁ జాలసేపు గడప లేదు. మరణభయముకంటెను మించిన భయమేమున్నది? రాజ పుత్రులు మరణమునకు భయపడి యెత్తికార్యమునకైన వెనుదీయుట లేదు. కాని యాతనికి మఱియొక యాలోచనము తోఁచెను. "గుహా ప్రవేశము చేసినయెడల నొకరిద్దఱిని చంపుట కేమియును సందేహ ము లేదు. వారు నిజముగా దొంగలుకాక, నిరపరాధులైనచో నా కార్య మెంతదారుణముగాఁ బరిణమించును? అని—

ఇట్లు యోచించుకొనుచు నాతఁ డాగుహాద్వారమునొద్దకు వచ్చి నిలిచి లోపల వారి మాటలను వినుచుండెను. అప్పుడు దొంగలు తాము దొంగిలించినసొత్తును విభజించుకొనుచుండుటచే రాజకుమారుఁడు తప్పక వీరు దొంగలేయని నిశ్చయించుకొనియెను.

ఆతఁడు నిశ్శబ్దముగఁ బోయి తనబల్లెము నాయరణ్యమునం దొకచో భద్రముగా దాఁచి యొరనుండి కరవాలముందీసి కుడిచేత ధరించి యెడమచేతితో బారుచేసిన పిస్తోలును బలముగాఁ బట్టుకొని మరల నాగుహయొద్దకు వచ్చెను. దొంగలు చంచలకుమారియుత్తర మును చదివి యానందముతో నందువలన ధనము సంపాదించుకొన

వచ్చునని యాలోచించుకొనుచు నన్యమనస్కుఁడైయున్న సమయ మున రాజపుత్త్రుఁడు నెమ్మదిగా నడుగు లిడుచు గుహలోఁ బ్రవేశిం చెను. ఆదొంగలలోని నాయకుఁడు ద్వారమునైపు వెన్నుంచి కూర్చుండియుండెను. రాజకుమారుఁ డందుఁ బ్రవేశించినతోడనే తన దృఢముష్టిం దాల్చియున్న ఖడ్గముతో నాతనికంఠమున నొక్క విసరువిసరెను. అసమానబలసంపన్నుఁడగు నాతని కృపాణాఘాత ముచే నానాయకుని మస్తకము రెండుతుంటెములై క్రిందఁ బడి పోయెను.

తత్క్షణమే రాజపుత్త్రుఁ డానాయకుని ప్రక్కను గూర్చుండి యున్న మఱియొక దొంగతలపై నొకగ్రుద్దుగ్రుద్ది యాతని మూర్ఛిల్లం జేసెను. అప్పు డింకొకదొంగ లేచి రాజపుత్త్రునిపై నొక బండఱాతిని బడవేయఁ జూచుచుండగా రాజపుత్త్రుఁ డా దొంగపై పిస్తోలుకాల్చి యాతనిం జంపివైచెను. మిగిలిన నాలుగవదొంగ యగు మాణిక్య లాలు చేయునది లేక గుహనుండి వెలుపలఁబడి యతివేగముగఁ బారి పోయెను. రాజపుత్త్రుఁ డాతని వెంబడించెను. అంతలో మాణిక్యలాలు రాజపుత్త్రుఁడు దాచియుంచిన బల్లెమును తీసికొని రాజకుమారునివైపు నకుఁ ద్రిప్పి "అయ్యా! నిన్ను నేనెఱుఁగుదును. దగ్గఱకు రావలదు. వచ్చితి వేని యీబల్లెముతో నిన్నుఁ బొడిచివైచెదను" అనియెను.

రాజపుత్త్రుఁడు నవ్వుచు "నీవు బల్లెమును విసరెదవేని నేను దాని నెడమచేతితో నాఁపివేయఁగలను. నీవు నన్నుఁ బొడువఁజాలవు. ఇదిగో! చూడుము!" అని చెప్పి తనచేతిలోనున్న పిస్తోలును బలముగా నాతనిపైకి విసరెను. ఆదెబ్బచే మాణిక్యలాలు చేతిలోనున్న బల్లెము క్రిందఁ బడిపోయెను. అప్పుడు రాజపుత్త్రుఁడు లాఘవముతో నాబల్లె మును దీసికొని యొక్కపరుగునం బోయి మాణిక్యలాలుని జుట్టుపట్టు కొని తన వాఁడికత్తితో నాతనితల తెగవేయ నుద్యుక్తుఁడయ్యెను.

మాణిక్యలాలప్పుడు గద్గదస్వరముతో "మహారాజాధిరాజా నాకుఁ బ్రాణదానము చేయుము! ఈశరణాగతుని రక్షింపుము" అని ప్రార్థించెను.

రాజపుత్త్రి డాతని వదలివైచి 'నీవు చచ్చుట కింతభయపడి యెదవేల?' అనియెను.

మాణి—నేను మరణమునకు భయపడుటలేదు. కాని, నా కొకయాఁడుబిడ్డ యున్నది. ఆమె కింకను నేడువత్సరములు నిండలేదు. ఆబిడ్డకు దల్లి లేకుండుటచే నాకంటె నామెకు దిక్కెవ్వరును లేరు. ఈయుదయముననే లేచి నేనామెకు భోజనముపెట్టి వచ్చితిని. నేనిప్పుడిచ్చట మరణించినయెడల పాపమా ముద్దుబిడ్డకు సాయంతన మన్నముపెట్టువా రెవ్వరు? నేను చచ్చినయెడల నాబిడ్డయును చచ్చిపోవును. నన్ను జంపదలచితిరేని నాకంటె ముందుగ నాపసికూనను జంపి పుణ్యము కట్టుకొనుడు.

అని యాడోడంగ యేడ్చుచు 'మహారాజా! నేను మీపాదకమలములను ముట్టి ప్రమాణముచేయుచున్నాను. ఈయుత్తరక్షణము నుండియే నేను చోరవృత్తి వదలుకొని మీపాదసేవ సేయుచుండెదను. బ్రతికియుంటినేని, ఏనాటికైన దేవర కీయల్పభృత్యునివలన నుపకారము కాకపోదు' అని వినయముతో బలికెను.

రాజ—నీవు నన్నెఱుఁగుదువా?

మాణి—మహారాణారాజసింహు నెఱుఁగనివా రుందురా?

రాజ—నేను నీకక్కే ప్రాణదానము జేసెదను. కాని నీవు బ్రహ్మస్వమును హరియించితివి. నిన్నెట్టియిన నొకవిధముగా దండింపకపోయినయెడల నేను ధర్మచ్యుతుఁడ నగుదును.

మాణి—(వినయభావముతో) మహాప్రభూ! నేనిట్టి పాప

కృతజ్ఞుననై నూతనముగ ప్రవేశించితిని. దయ యుంచి నాకు లఘు శిక్ష విధింపవలయును. నేనిప్పుడు దేవర శిక్షకు లోనయ్యెదను.

అని చెప్పి మాణిక్యలాలు తన మొలనున్న చూరకత్తిందీసి చేతివ్రేళ్ళను కత్తిరించుకొన నుద్యుక్తుడయ్యెను. ఆకత్తి పదనైనది కాకుండుటచే వ్రేళ్లు మాంసమున్నంతవఱకు తెగుటయేగాని తును కలుగలేదు. అప్పుడాతడు తనవ్రేళ్ళ నొకఱాతిపైనుంచి వానిపై కత్తినుంచి మఱియొకఱాతితో గొట్టెను. అప్పుడా చేతివ్రేళ్ళన్నియు క్రిందబడిపోయెను. మాణిక్యలాలు 'మహారాజా! ఇంతమాత్రపు దండనము దేవర యంగీకరింపవలయును' అని ప్రార్థించెను.

రాజసింహు డత్యాశ్చర్యభరితుడై మాణిక్యలాలువంక చూడలేక 'సరియే. ఈశిక్షచాలును. నీపేరెవ్వరు?' అనియెను.

మాణి——ఈ యధమాధముని పేరు మాణిక్యలాలసింహుడు. ఈతడు రాజపుత్రకులకళంకుడని చెప్పుటకు నోరు రాకున్నది.

రాజ——మాణిక్యలాలా! ఇదిమొదలు నీవు నాయుద్యోగివైతివి. నిన్నశ్వములపై నధికారిగా జేసితిని. నీబిడ్డను దీసికొని యుదయపురమునకు బొమ్ము! అక్కడ నీకిల్లువాకిలియు, మడిమాన్యమును నిచ్చెదను. సుఖముగా నుండుము.

మాణిక్యలా లప్పుడు రాజసింహుని పాదరజోలేశమును శిరంబున ధరించికొని 'దేవర నాపై దయయుంచవలయును' అని ప్రార్థించి గుహలోనికి బోయి దొంగిలించిన ముక్తావలయమును, మొహరీలును, కాగితములును దీసికొనివచ్చి రాజున కిచ్చి 'ఇవియే బ్రాహ్మణునియొద్ద మేమపహరించినవస్తువులు, ఈకాగితములు మీకొఱకు వ్రాయబడినవి. ఈయుత్తరములం జదివిన యీసేవకునియపరాధమును మన్నింపవలయును' అనియెను.

రాజసింహు డాయుత్తరములపై విలాసమును చూచెను. అందు తననామమే లిఖింపబడియుండెను. అప్పుడు రాజు 'మాణి

క్యలాల్! ఈయుత్తరములఁ జదువుట కిష్టములు బాగుగ లేదు నాతోఁ గూడరమ్ము. దారి జూపించుచు నీవు ముందు నడువుము" అనియెను.

మాణిక్యలాలు ముందు నడచుచుండెను. కాని తుత్తునియలుగాఁ జేయఁబడిన తన వ్రేళ్ళవంకఁ జూడనైన లేదు. ఆవిషయమై మరల నొకమాటయైన జెప్పకొనలేదు. అట్లే పోవుచుండెను. వ్రేళ్లు తెగిపోవుటచే వికృతాకారము నొందిన యాతనిచేయిఁ జూచి రాజసింహుడు మిగుల నాశ్చర్యపడియెను. క్రమక్రమముగా వారిరువురును వేగవతీ నదీతీరమునకు వచ్చి యొకరమణీయప్రదేశమున విడిసిరి.

---

## ఐదవ ప్రకరణము.

చంచలకుమారి సందేశలేఖ.

ఆప్రదేశమున వేగవతీనదియొక్క దలితతరంగముల కలకలధ్వనితోఁ గూడఁ గలసివచ్చుచున్న మధురమందమారుతముతో మనోజ్ఞస్వరంబుల వెలిఁజిమ్ముచున్న విహంగమకోమలకలకలాలాపంబు లేకీభవించుచుండెను. అక్కడ దట్టముగఁ బెరిగియున్న తరులతాసంతానంబులు చిగుళ్ళు, మొగ్గలు, పూవులు, పిందెలు, కాయలు, పండ్లు మొదలగువానిచే నలంకృతంబులై యావనంబునకు వింతయందముం గూర్చుచు కన్నులపండువు సేయుచుండెను. ఆరమణీయప్రదేశమున సౌందర్యము మూర్తీభవించి యుండెను. మనోహరశబ్దములు తరంగితములగుచుండెను; పరిమళము గుప్పుగుప్పున నెల్లకడల విరాజిల్లుచుండెను; అట నొక పెద్దబండఱాతిపైఁ గూర్చుండి రాజసింహుఁ డాయుత్తరమునుఁ జదువుట కుద్యుక్తుఁ డయ్యెను.

మొట్టమొదట విక్రమసింహుని యుత్తరమును జదివెను.

"సరియే. ఆబ్రాహ్మణుని కేమైన నిచ్చి పంపినయెడల నీయుత్తరము

నందలియుద్దేశము సఫలము కావచ్చును" అనుకొని పిమ్మట చంచల కుమారి లేఖను చదువ నారంభించెను.

"మహారాజా! నీవు రాజపుత్రకులశ్రేష్ఠుడవు. భారతీయజన శిరోమణివి. నేను నీకపరిచితనైనయవివేకబాలికను. దారుణవిపత్సముద్రమున మునింగియుండకపోయినయెడల నీకు లేఖ వ్రాయునంతటి ధైర్యముకలదానను కాకయేపోవుదును. నేను కేవలము విపదంధకారమున మగ్ననై యుంటినని తెలిసికొని నా సాహసమును మన్నింపం గోరెదను.

ఈ లేఖంగొని తెచ్చినవారు మాగురువులు. నేనుత్తమక్షత్రియ కన్యను. రూపనగరము కేవలము చిన్నరాజ్యము. మాతండ్రి విక్రమ సింహుడు పదియాఱుపట్టణములకు ప్రభువై యున్నాడు. రాజకుమారినైనంతమాత్రమున నేను మధ్యదేశాధిపతి వగునీతో సమముగ బరిగణింపంబడందగినదానను గాను. నేను రాజకన్యక నగుటచేతనే నీదయకు బాత్రురాల నని మనవి చేయుచున్నాను. ఏమన—నీవు రాజరాజేంద్రుడవు. ఉత్తమక్షత్రియకులతిలకుడవు.

నాపైననుగ్రహ ముంచి నాకష్టములనుగూర్చి సావధానచిత్తముతో నాలకింపవలయును. నాదురదృష్టమునకు దగినట్లు నన్ను ఢిల్లి బాదుషా పెండ్లియాడవలయు ననితలంచి యున్నాడు. నన్నుబలవంతముగా ఢిల్లీకి గొనిపోవుట కాతనిసైన్యము కొలదికాలములోనే రానైయున్నది. ఉత్తమక్షత్రియకులోద్భవను, రాజకుమారికనునగు నేనెట్లాతనికి దాసినై యుండగలను? రాజహంసినై బకసహచరి నగుటయెట్లు? రాజకుమారికనై యొకకఱకుతురకయాజ్ఞకు లోబడి యెట్లు మెలంగంగలుగుదును? నేనీ వివాహమునకు ముందే విష పానము చేసి ప్రాణత్యాగము చేసికొనవలయు నని నిశ్చయించుకొని యుంటిని.

మహారాజాధిరాజా! నేను దురభిమానము కలదాన నని తలంపవలదు. నేనొక యల్పభూస్వామికి తనయ నని యెఱుంగుదును. యోధపురము, అంబరు మొదలగు దేశముల కధికారులగు మహాపరాక్రమసంపన్నులైన రాజాధిరాజులుకూడ బాదుషాకు కన్యాదానము చేయుట తమకులమునకు గళంక మనుకొనలేదు. అది కేవలము గౌరవమనియే యనుకొనుచున్నారు. అంతటి గొప్పయింటివారి యెదుట నే నెంతటిదానను? అట్టియెడల నీకీదురభిమాన మెందులకని యడుగగవచ్చును. మహాప్రభూ! జగత్ప్రకాశకుఁ డగుసూర్యదేవుఁ డస్తంగతుఁ డైనప్పుడు మిణుగురుపురుగు మిలమిల మెఱయుట లేదా? శిశిర భారంబున తామరపూవు ముకుళించినప్పుడు మొల్లమొగ్గ వికసించుట లేదా? అంబరు, యోధపురము మొదలగుసంస్థానములవారు తమ యుత్తమవంశమును ధ్వంసము చేసికొన్నప్పుడు రూపనగరమువారు తమవంశమర్యాదలను నిలుపుకొనఁగూడదా? ప్రభూ! వనవాసి యగు రాణాప్రతాపసింహునితో సహపఙ్క్తిని భుజించుటకు మానసింహుడు వచ్చినప్పుడు రాణా యాతనితో గలిసి విందారగింపలే దని వందిపుత్త్రిలు పొగడుచుండుట వినుచుంటిమి. రాణాప్రతాపసింహు డట్లు నిరాకరించుట మానసింహుడు తనచెల్లెలిని తురకల కిచ్చి పెండ్లి చేసెననియేగదా! అట్టిమహావీరునివంశమున జనించిననీకు నిజముగా నేలోకముననైననేమి, యెప్పుడైననేమి, రాజపుత్త్రికను తురకల కిచ్చి చేయునంతటియధమవివాహము తీవ్రక్రోధకారణము కాకపోవునా? మహారాజా! ఈదినమువఱకు మీవంశమువా రెవ్వరైన తురకలతో సంబంధముచేయుట కేల యంగీకరింపలేదు! మహాబలపరాక్రమసంపన్నులగుటవలననే యని చెప్పుటకు వలనుపడదు. ఏమన— మహాబలసంపన్నులగు రష్యా, పెరిస్యాదేశాధీశ్వరులుకూడ దమ కుమార్తెలను బాదుషా కిచ్చి పెండ్లిచేయుట గౌరవ మని తలంచిరి.

కాని యొక్క యుదయపుర రాజుమాత్ర పెండ్లి చేయుట కంగీకరింప లేదు. ఎందువలన? వారాత్మగౌరవముగల యుత్తమక్షత్రియకుల శిరోమణు లగుటవలన కాదా! మహారాజా! నేనుగూడ నట్టియాత్మ గౌరవముగల రాజకుటుంబమున జన్మించినదానను గానా? మహా ప్రభూ! ప్రాణములనైన ద్యజించి మానమును గాపాడుకొనవలయు నని కృతప్రతిజ్ఞరాలనై యుంటిని.

అవసరమైనయెడల నీప్రాణమును తృణప్రాయముగ విసర్జింప సంసిద్ధనై యుంటిని. కాని యీపదునెనిమిదిసంవత్సరములవయసునం దీనవనవోన్మేషయౌవనవిలాసవిభాసితంబగు సుఖజీవితము నెట్లైన గాపాడుకొనవలయునను నాశకూడ లేకపోలేదు. నన్నీవిపత్తులనుండి యుద్ధరించి నాయాశను తీర్చువారెవ్వరున్నారు? మాతండ్రిమాట చెప్ప నక్కఱలేదు. ఆత డౌరంగజేబు నెదిరించి నిలువజాలడుగదా! మిగి లినరాజపుత్త్రులలో చిన్నపెద్దలెల్లరును బాదుషాకు బానిసలై యా తనిపేరు చెప్పిన గడగడ వడకిపోవుచున్నారు. కేవలము నీవొక్కడవు మాత్రమే రాజకులప్రదీపకుడవై స్వతంత్రుడవై యున్నావు. ఉద యపురేశ్వరు డొక్కడుమాత్రమే బాదుషాతో సమానప్రతికక్షు డై యుండదగినవాడు. భారతీయులలో నట్టివారింకొకరులేరు. అబల యు, విపన్నయునగు నీబాలికనుగాపాడువారింకెవ్వరున్నారు? ప్రభూ! నేను నీశరణము నపేక్షించి ప్రార్థించుచున్నాను. నీవు నన్ను రక్షింప జాలవా?

నీవు నెఱవేర్పవలయు నని నిన్ను నేఁ బ్రార్థించిన యీమహా కార్య మత్యపాయకర మైనదని నేనెఱుఁగక పోలేదు. నేను కేవల బాల్యచాపలమున నీలేఖ వ్రాసితి నని తలంపవలదు. ఢిల్లీశ్వరునితోఁ బోరాటము తెచ్చుకొనుట సామాన్యమైనపని కాదనియు, నాతనితో వివాదముపెట్టుకొని నిలువఁజాలువా రెవ్వరును లేరనియు నేనెఱుం

గుదును. అయినను మహాప్రభూ! మహారాణాసంగ్రామసింహుఁడు బేబరుచక్రవర్తి నీపదవశిష్టముగ రాజ్యభ్రష్టునిం జేయలేదా? మహారాణాప్రతాపసింహుఁ డక్బరుచక్రవర్తిని మధ్యదేశమునుండి తరిమివేయలేదా? నీ వాసంగ్రామప్రతాపసింహుల వంశములోనివాఁడవు కావా? వారిచే నలంకరింపబడిన దేకాదా నీవధిష్టించినయుదయపురి సింహాసనము? బలశౌర్యౌదార్యాదిగుణగణంబుల నీవు నీపూర్వుల కంటెఁ దక్కువవాఁడవే? కొండనొంగ యని పేరు మోచియున్న మహారాష్ట్రవీరుఁ డొక్కఁడు నేర్పుచే నౌరంగజేబు నోడించె నని వినియుంటిని. అట్టిపిరికిపందయగు బాదుషా రాజస్థానప్రభుండ వగు నీ యెదుట నెంతటివాఁడు?

"నాబాహువులయందు బలమున్నది; బలమున్నంత మాత్రమున నీకొఱకేల కష్టములఁ గొనితెచ్చికొనవలయును? అపరిచితయు, ముగ్ధయునగు నొక సుందరికొఱ కేలమహారణముసేయఁ బూనుకొనవలయును? ఎందుకొఱకు దారుణమైన జీవహింసాకరం బగుకృత్యమున కొడంబడవలయును?" అని నీవు చెప్పవచ్చును. మహారాజా! శరణాగతుల రక్షించుటకు సర్వస్వమును త్యజించుట యుత్తమక్షత్రియధర్మము కాదా? ఒక్కకులకామినిమానరక్షణార్థమై ప్రాణమానధనంబులనైన ధారవోయుట కేరాజపుత్త్రుఁడు వెనుదీయఁగలఁడు——"

చంచలకుమారి స్వహస్తముతో లిఖించినభాగ మింతవరకే మిగిలినభాగమామె వ్రాసినదికాదు. అది నిర్మలకుమారి వ్రాసినది. ఈసంగతి చంచలకుఁ దెలియునో, తెలియదో, మేము చెప్పజాలము. ఆభాగమునందలి సంగతులీక్రిందివిధముగా నున్నవి.

"మఱియొకమాట యున్నది. దానినిగూర్చి వ్రాయుటకు సిగ్గగుచున్నది. వ్రాయకుండుటకును వలనుపడలేదు. నేనీవిపదంధకారమునంబడి యొకప్రతిజ్ఞ చేసికొని యున్నదానను. ఏవీరుఁడు నన్ను

మొగలాయిహతకులబారిఁ బడకుండఁ దప్పించి రక్షించునో, యాతడు రాజపుత్త్రుఁడై యుండి దన్ను యథాశాస్త్రముగఁ బరిణయము చేసు కొనుట కంగీకరించునేని నేనాతని పాణిగ్రహణముచేసి యాతనిదాసి నయ్యెదనని సంకల్పించుకొంటిని. ఓవీరాగ్రగణ్యా! రణరంగమున స్త్రీలాభము వీరున కుచితమైనదికాదా! పాండవులు ద్రౌపదికొఱకు ప్రతిపక్షులగు క్షత్రియవీరులతోఁ బోరాడలేదా? భీష్ముఁడు కాశీరాజ దుహితలగు నంబికాంబాలికలకొఱకు స్వయంవరాగతులగు రాజ కుమారులనెల్లరఁ జెల్లాచెదరుచేయలేదా? ఓ రాజా! రుక్మిణీకల్యాణ మును జ్ఞప్తికిఁ దెచ్చుకొనుము. నీతో సమానుడగు వీరుఁ డీలోక మున నింతవఱ కెవ్వఁడును లేడు. జగదేకవీరుడవగు నీవు వీరధర్మము నుండి పరాఙ్ముఖుడ వయ్యెదవా యేమి?

నీయర్ధాంగిని కావలయునని కోరుకొనుచున్ననాయాశ దురా శయే కావచ్చును. నేను నీకు బరిగ్రహణయోగ్యురాలను కాకపోయి నయెడల నీతో నితరసంబంధములను చేయుట కిష్టపడుదానను గాను ఏమయినను గానిమ్మని యోచించి నీయనుగ్రహపాత్రురాలను కావలయునను కోరికతో నామనఃపూర్వకమైన కానుక నొకదానిని మాగురుదేవునిచే నీయొద్దకు బంపికొనియున్నాను. అతడు దాని నీ కర్పింపగలడు. ఆపైని నీరాజధర్మము నీబాహుబలమునందున్నది; నాప్రాణము నాయఱచేతిలో నున్నది. ఢిల్లీకి బోవుట తప్పకయేపో యినయెడల మార్గమధ్యమున విషమునే సేవింప నిశ్చయించుకొని యున్నదానను.''

రాజసింహు డిట్లాయుత్తరమును చదివికొని కొంతసేపాలోచ నాధీనమానసుడై యుండి యనంతరము 'మాణిక్యలాలూ! ఈయుత్త రమునందలి సంగతులు నీకంటె మఱియెవ్వరైన వినియున్నారా?' అని యడిగెను.

మాణి—చిన్నవానిని గుహామధ్యమునందే మీరు చంపివైచితిరిగదా!

రాజ—మంచిది. నీవింటికిఁబొమ్ము! ఉదయపురమునకు వచ్చి మరల నన్నొకసారి చూడుము! ఈ లేఖావృత్తాంతము నెవ్వరికిని దెలుపవలదు.

ఇట్లు చెప్పి మాణిక్యలాలునకు తనయొద్దనున్న కొంతద్రవ్యమును బహుమానముగా నిచ్చి పంపివైచెను. అతఁడును రాజసింహునకు సాష్టాంగదండప్రణామముచేసి వెడలిపోయెను.

---

## ఆఱవ ప్రకరణము

---

[illegible]

'నేను వచ్చువఱకు నీవిచ్చటనే యుండుము' అని రాజసింహుఁడు చెప్పినమాటలనుబట్టి యనంతమిశ్రుఁడు రాజాగమనమును నిరీక్షించుకొనుచు గూర్చుండియుండెను. కాని, యాతనిహృదయము మాత్ర మనేకవిధముల జెదరిపోవుచుండెను. అయశ్వారోహకుని యోధవేషమును, ఆతనితీవ్రదృష్టియు, ననంతమిశ్రునకు గొంచెము భయముకలిగించెను. 'పడరాని యాపదలంబడిన నాకొకసారి ప్రాణములను నిలుపుకొనుటయే. కష్టమయ్యెను, అంతియకాక చేతిలోదంతయును బోగొట్టుకొంటిని, చంచలకుమారితో బలికిన మాటలన్నియును బోయినవి. ఇక నామెకు నా మొగ మెట్లుచూపింపగలుగుదును?' అని యాత డాలోచించుకొనుచుండగా గొండపై నెవ్వరో మాటలాడుచున్నట్లు వినవచ్చెను. అప్పుడా బ్రాహ్మణుడు భయముతోడ 'మరల నెవ్వరైన క్రొత్తదొంగలు వచ్చిరోయేమో? మొదటి

వాండ్రిప్పుడు నాసర్వస్వమును దోచికొని నన్ను బ్రాణావశిష్టునిగ జేసి పోయిరి. ఈనాఁటి యీదొంగలచేతిలోబడి ప్రాణముల నెట్లు దక్కించుకొనగలను?' అని యోచించుకొనుచుండగా గొండమీఁదనున్న పురుషు లాబ్రాహ్మణుని తర్జనితోఁ జూపించుచు మాటలాడుకొనుచుండిరి. వారినిజూచినతోడనే స్వల్పధైర్యముకూడ వదలిపోవుటచే నాబ్రాహ్మణు డెట్లయిన తప్పించుకొని పారిపోవలయునని తలంచి చటాలున లేచెను. అంతలో నాకొండపైనున్న వారిలో నొకడు క్రిందికిదిగుచుండుటను జూచి యనంతమిశ్రు డూర్ధ్వశ్వాసముతో బరుగెత్తనారంభించెను.

అప్పుడు 'పోనీయకుము! పట్టుకొనుము!' అని కేకలువైచుచు ముగ్గురునలుగురుమనుష్యు లాతనివెనుకనే పరుగెత్త సాగిరి. కాని బ్రాహ్మణుడుమాత్రము దొరకలేదు. ఆతనికి శరీరస్మృతి తప్పిపోయెను. కట్టుకొన్న బట్టకూడ విడిపోయినట్లాతనికి తెలియలేదు. అయిన నాతడు నారాయణస్మరణము చేసికొనుచు నతివేగముగ బరుగెత్తిపోయెను. ఆతని వెన్నంటి పోవుచున్నపురుషు లాతఁడగపడకుండుటచే వెనుకకుఁ దిరిగి వచ్చిరి.

వారు మహారాణారాజసింహునిభృత్యులే గాని మఱి యెవ్వరునుగారు. ఇక్కడ మనకు రాజసింహుని సందర్శన మెట్లు తటస్థించినదో దానినిగూర్చి చెప్పవలసియున్నది. రాజపుత్త్రులు విలాసవిహారములయందు మిగుల నాసక్తులగుటచే నీదినమున మహారాణా నూఱుమందియాశ్వికులను భృత్యులను వెంటఁబెట్టుకొని వేటకు బయలుదేరి యనంతర ముదయపురికి వెనుదిరిగిపోవుచుండెను. రాజసింహుఁడెల్లప్పుడును భృత్యులచేఁ బరివేష్టింపఁబడి రాజచిహ్నములతోఁ బ్రకాశింపవలయుననియే యిష్టముగలవాఁడు కాఁడు. అప్పుడప్పుడాతఁ డనుచరులను దూరమున విడిచి యొక్కఁడే యశ్వారూఢుఁడై

గూఢ వేషముతోఁ జరించుచుఁ బ్రజల యవస్థలను కన్నారఁగాంచి, వీనులార విని తెలిసికొనుట కక్కడక్కడకుఁ బోవుచుండుట కలదు. అందువలన నాతని పరిపాలనమునందుఁ బ్రజలత్యంత సుఖవంతులై యుండిరి.

నేఁడు వేఁటనుండి తిరిగి వచ్చుచున్నప్పు డాతఁడు తనయను చరులకు వెనుకనుండి రావలయునని యాజ్ఞాపించి తానొక్కఁడే విజయమను పేరుగల గుఱ్ఱము నెక్కి ముందుగా వచ్చుచు ననంతమిత్రుని దీనావస్థను గాంచెను. బ్రహ్మస్వము నుద్ధరించుటకై యాతఁడు స్వయముగా దిగివచ్చెను. తరువాత జరగిన కంతయును ముందే చెప్పి యుంటిమి. ఏదియసాధ్యమైనదియో, ఏది విపత్పరిపూర్ణమైనదియో యట్టిమహాత్కార్యమును నిర్వహించుటయందే యాతని కానందము.

చాలసేపటివఱకు రాజసింహుఁడు రాకుండుటచే ననుచరు లాతని వెదకికొనుచు నతివేగముగ వచ్చుచుండిరి. రాజసింహునిగుఱ్ఱ మొక్కటిమాత్రమే తమ కక్కడ నగపడుటచే వారు మిగుల నాశ్చర్యపడి కొంచెముసేపు విచారించిరి. మహారాణా కేమైన నపాయము కలిగియుండవచ్చునని యోచించుకొనుచు నొకబండఱాతిపైఁ గూర్చుండియున్న యనంతమిత్రునిజూచి యాతనివంక వ్రేలుపెట్టి చూపించుచు నాతని కేమైన దమప్రభుని వృత్తాంతము తెలియునేమో యడుగ వలయునని వారును కొండపైనుండి దిగివచ్చుచుండిరి. వారిని చూచి నంతనే యనంతమిత్రుఁడు భయపడి నారాయణస్మరణము చేయుచుఁ బలాయనమాత్రము నవలంబించెను. అప్పుడా రాజభృత్యు లాతనిని యపరాధియై యుండనోపునని తలంచి యాతని వెన్నంటిపరువెత్తిరి. ఆబ్రాహ్మణుఁడుమాత్రము వారికి దొరకక నొకగుహాలోఁ బ్రవేశించి తనప్రాణములను గాపాడికొనియెను.

మహారాణా రాజసింహుడు చంచలకుమారి వ్రాసిన యుత్తరమును సంపూర్ణముగ జదివికొని, మాణిక్యలాలునకు సెలవిచ్చి యంపించి యనంతర మనంతమిశ్రుని వెదకికొనుచు వచ్చుచుండెను. సంకేతస్థలంబున బ్రాహ్మణుడు గనబడలేదు కాని యాతని యనుచరులగు నాశ్వికులుమాత్ర మాతనికి బదులుగా నాసమతలంబున నిలిచి యుండిరి. విజయాశ్వము తనప్రభువును చూచి యానందముతో వచ్చి యాతనిపార్శ్వభాగమున నిలువబడియెను. రాజసింహు డాయశ్వము నధిరోహించెను. ఆతడు ధరించిన వస్త్రములు రక్తమయములై యుండుటను చూచి యనుచరులందఱు నేడే యొక యాయుధవ్యాపారము జరిగియుండుననని తెలిసికొనిరి. కాని, యిట్టికార్యములు రాజపుత్రులకు నిత్యనైమిత్తికకృత్యములగుటచేఁ దమ ప్రభునిగూర్చి 'ఇది యేమి?' అని యెవ్వడును బ్రశ్నింపలేదు.

రాజ—ఇంతవఱకు నిక్కడఁ గూర్చుండియున్న బ్రాహ్మణుఁ డెక్కడకుఁ బోయెనో, యేమయ్యెనో, మీరెవ్వరైన నెఱుఁగుదురా?

'అతఁ డెక్కడకో పాఱిపోయెను' అని యాతని వెన్నంటి పోయిన యనుచరులు విన్నవించిరి.

రాజసింహుఁడు "అతనిని వెదకి భద్రముగా నాయొద్దకుఁ గొనిరండు!" అని యాజ్ఞాపించెను.

అప్పుడా యనుచరులు జరిగిన సమాచార మంతయును తమ యేలికకు నివేదించిరి.

ఆయాశ్వికులలో రాజసింహునికుమారు లిద్దఱును, మంత్రులును, జ్ఞాతులును కూడ నుండిరి. రాజసింహుఁడు తన కుమారులను మంత్రులను బిలిచి వారితో నేమేమియో మాటలాడెను. తరువాత రాణాయాశ్వికుల నందఱను బిలిచి నేఁడు చాలఁ బ్రొద్దుపోయినది. మీరందఱు నలసియున్నారు. కాని మన కీదినమున నుదయపురము

నకుఁ బోయి బడలిక తీర్చికొని సుఖించు నదృష్టము లేదు. మనము మరల వచ్చినమార్గమునసే పోవలసి యున్నది. ఒకచిన్నపోరాటము తటస్థించినది. రణరంగవిహారమునం దిష్టముగలవారు నాతోఁగూడ రండు! నేను తిరిగి యీమెట్లు నెక్కిపోయెదను. ఇష్టము లేనివా రుదయ పురమునకు మరలిపోవచ్చును" అనియెను.

ఇట్లు చెప్పుచు రాజసింహుఁడు పర్వతారోహణము సేయు చుండెను. అప్పు డందఱును 'జయజననీ! మహారాణాకు జయ మగుఁ గాక!" అని కేకలు వేయుచు నానాక్షత్రాశ్వికులును రాజువెనుకనే బయలుదేరిరి. పర్వతము నెక్కినతోడనే యందఱును "హరహరా! మహాదేవా" అని స్మరించుచు రూపనగరాభిముఖులై పోవుచుండిరి. వాయువేగమునఁ బోవుచున్న యాయుత్తమాశ్వముల ఖురపుటాఘాత శబ్దములచేఁ గొండగుహలనుండి ప్రతిధ్వనులు బయలుదేరుచుండెను.

---

## ఏడవ ప్రకరణము



నిరాశ

అనంతమిశ్రుఁడు బయలుదేరి వచ్చినతోడనే రూపనగరమున మహాకోలాహలము పుట్టెను. మొగలుబాదుషావారి రెండువేల యశ్వసైన్యము రూపనగరదుర్గమునకు వచ్చి విడిసియుండెను. చంచల కుమారిని దీసికొనిపోవుటకే యాసైన్యము వచ్చియుండెను.

నిర్మలముఖము వెలవెలవారెను. ఆమె యతివేగముతోఁ జంచలకుమారియొద్దకు వచ్చి "సఖీ! ఇఁక ముందేమికానున్నదో గదా!" అని గద్గదస్వరముతోఁ బలికెను.

చంచలకుమారి చిఱునవ్వునవ్వి "ఇప్పు డెవ్వరి కేమి వచ్చినది?" అనియెను.

నిర్మ—నిన్ను నెంటఁబెట్టుకొని పోవుటకు సేనలువచ్చియున్నవి. మొన్న పోయినగురువుగా రుదయపురమున కింకను పోలేరుగదా! రాజసింహుని ప్రత్యుత్తరము వచ్చులోపలనే నిన్నుఁ దీసికొనిపోయెద రేమోయని భయమగుచున్నది. అక్కా! ఇప్పుడేమిచేయుదుము?

చంచ—ఏమిచేయగలము? నాకాయంత్యోపాయముండియే యున్నది. ఢిల్లీమార్గమునందు విషపానముచేసి ప్రాణత్యాగముచేసి కొనుటయే కడపటియుపాయము. అందువలన నిక నాలోచింపనలసినదిలేదు. ఒకసారి మాతండ్రితో మాటలాడెదను. మొగలు సేనానాయకుఁడొక యేడుదినములుమాత్ర మవకాశము కలిగించునేని—

అని సగముమాత్రము చెప్పి చంచలకుమారి తండ్రియొద్దకు బోయి 'నేనీజన్మమున మఱియీరూపనగరమునకు రాజాలను. తిరిగి మీచరణకమలసందర్శనము సేయజాలను. మరల నాబాల్యసఖులతో గలసి సుఖింపజాలను. కావున నేడుదినములవఱకు నాకవకాశ మీయవలయు నని ప్రార్థించుచున్నను అంతవరకును మొగలుసైన్యము నిచ్చటనే యుండనిమ్ము. ఈయేడుదినములును మీసన్నిధానమున నుండి జననీజనకులయెడలను, జన్మభూమియెడలను గలయనిర్వాచ్యమగు నానంద మంతయు నొక్కసారి యనుభవించి పిమ్మట ఢిల్లీకి పోయెదను' అని ప్రార్థించెను.

విక్రమసింహుడు కన్నీరు విడుచుచు 'సేనానాయకునితో నీ సంగతినిగూర్చి మాటలాడెదను. ఆత డంగీకరించునో లేదో నేను చెప్పజాలను' అనియెను.

పిమ్మట రాజు మొగలుసేనాధిపతితో నీసమాచార మంతయు నుచెప్పెను. ఆతడు 'ఇన్నిదినములలో రావలయునని బాదుషావారు సెలవిచ్చియుండలేదు. అయిన నేడుదినములవఱకు నాలస్యముచేయు

టకు నాకు ధైర్యము చాలకున్నది. ముందు కాబోవు బేగమువారి యానతి నిర్వహింపకుండుట కూడ నసాధ్యమే' అని యాలోచించు కొని యైదుదినములవఱకు నాగియుండుట కంగీకరించెను. కాని, చంచలకుమారికిమాత్రము చాలినంత ధైర్యము కలుగలేదు.

ఉదయపురసమాచార మేమియును తెలియలేదు. అనంత మిశ్రు డింకను తిరిగి రాలేదు. చంచలకుమారి నిరాశయై యాకసము వంక జూచి కేలు సారించి 'ఓయనాథనాథా! దేవదేవా! ఈనవవనవో న్మేషవిలసితం బగువసంతకుసుమము నకాలఝంఝామారుతము పాలం బడద్రోయకుము! ఓదీనరక్షకా! రక్షింపుము! రక్షింపుము!' అని ప్రార్థించెను.

ఆరాత్రి నిర్మల యామెయొద్దనే పరుండియుండెను. రేయెల్ల వారిరువురు నొకరినొకరు కౌగిలించుకొని విలపించుచుండిరి.

నిర్మ—నేనును నీతోగూడ వచ్చెదను.

చంచ—నీవు నాతో నెక్కడకువచ్చెదవు? నేను చచ్చుటకు బోవుచుంటినిగదా!

నిర్మ—నేనుగూడ మరణించెదను. నిన్ను విడిచి నేనొక నిమిషమైన నుండగలుగుదునా?

చంచ—అయ్యో! సఖీ! ఇట్టిమాటలచే నాదుఃఖమును మఱింత వృద్ధి పొందించుచుంటి వేల?

నిర్మ—నీతో నన్నుగూడ దీసికొనిపొమ్ము. నీవొక్క తెవును పోవలదు. నేను నీతో రావలయు నని నిశ్చయించుకొంటిని. ఈవిష యమున నన్నడ్డుపెట్టువా రెవ్వరును లేరు.

ఇట్లు మాటలాడికొనుచు వారిరువురును కన్నీటితో నారాత్రి గడపివైచిరి.

---

# ఎనిమిదవ ప్రకరణము

## మెహరజాన్

రూపనగరమున మొగలాయిసేన యతివిలాసముగనే యుండెను. వారిలో విందులును, విలాసములును, సంగీతసభలును జరగుచుండెను. ఎంతమాత్రమును యుద్ధము చేయునక్కఱ లేకుండుటచే సైనికులు విలాసములతో ప్రొద్దులు గడపుచుండిరి. ఆసైనికులు రూపనగరమున విలాసముల ననుభవించుటకే వచ్చియుండిరి. రాత్రి వేళ వారిశిబిరములలో నాటపాటలకోలాహలము వినవచ్చుచుండెను.

ఆనర్తకులలో నొకనాట్యాంగనపేరు శీఘ్రకాలముననే సుప్రసిద్ధమై వ్యాపించెను. "మెహరజాన్" అనుపేరు డిల్లీలో నిదివఱ కెవ్వరును వినుటయైన లేదు. ఎంతటిసుప్రసిద్ధులకైనను రూపనగరమున గీర్తి సంపాదించుట చాలగష్టము. మెహరజాను నర్తకియై యుండినను, సచ్చరిత్రయై యుండుటవలన మిగుల యశస్సును సంపాదించుకొనియెను.

మొగలుసేనానాయకుడగు సైద్‌హసనల్లీ యామెసంగీతమును వినవలయు నని చాలవఱకు ప్రయత్నించెను. కాని, మెహరజాను మాత్రము సభలో బాడుట కంగీకరింపలేదు. నేనొంటరిగా నున్నప్పుడైన వచ్చి గానము చేయవలయు నని యాత డనేకవిధముల గోరుటచే నామె యొకసారి వచ్చి యాతనిహృదయమును మనోహరసంగీతరసప్రవాహమున ముంచివైచెను. ఆసేనానాయకుడు పరమానందభరితుడై యామెకు బహుమానముగ విశేషధనము నీయబోయెను. కాని, యామె "నాకు ధనమక్కఱలేదు; మీరు సంతుష్టులైతిరేని నాకంతియే చాలును. మీకిష్టమైనయెడల నొక్కటి కోరెదను.

అది నాకొసంగినచో బ్రహ్మానందము నొందెదను. లేనియెడల నాకు బహుమానమే యక్కఱ లేదు" అనియెను.

సేనా—నీ కేమి కావలయును?

మెహ—నీ యాశ్వికసైన్యమునందు నాకు గొలువు కావలయును.

సైదుహాసనల్లి వరాసమును వహించి మందబుద్ధివలె నామెహరజాను సుందరముఖమండలమును జూచుచు నిలువబడిపోయెను. అతడు నిరుత్తరుడై యుండుటను మెహరజాను చూచి "కావలయునేని, గుఱ్ఱము, కత్తి, ఉడుపులు మొదలగువానినెల్లను నేనిచ్చివైచెదను" అనియెను.

సేనా—ఒకయాఁడుది యాశ్వికసైనికులలో నొక్కతెయై పని చేయఁగలదా?

మెహ—ఏమీ! ఇప్పుడు నష్టమేమున్నది? యుద్ధము లేనే లేదుగదా! ఒక వేళనున్నను పరాజయమునుమాట యెక్కడిది?

సేనా—సరియే. నేనట్లు చేసితి నేని ప్రజ లేమనుకొందురు?

మెహ—అది మనయిరువురకుమాత్రమే తెలియును. ఇతరులకెట్లు తెలియగలదు?

సేనా—నీకిట్టికోరిక యెందులకు గలిగినది?

మెహ—ఎందులకైననేమి? ఇందువలన బాదుషావారి కెంత మాత్రమును నష్టములేదు.

హాసనల్లి మొదట నిష్టములేనివాఁడైనను, మెహరజాను పట్టినపట్టు విడువఁకుండుటచేఁ దుదకెట్లో యంగీకరించెను.

ఆ మెహరజానే దరియాబీబీ.

# తొమ్మిదవ ప్రకరణము

## ప్రభుభక్తి.

ఈసమయమునం దొకసారి మాణిక్యలాలు సమాచారముం గూర్చి చెప్పవలసియున్నది. అతఁడు మహారాణాయొద్ద సెలవు దీసికొని తిరిగి యాపర్వతగుహాలోనికిఁ బోయెను. అతఁడు మరలఁ జోరవృత్తియందుఁ బ్రవేశించుట కిష్టపడలేదు. కాని, తన మిత్రులు బ్రతికియున్నారో, చచ్చిరో చూచి పోవలయు నని యాతఁ డచ్చటికిఁ బోయెను. అట్లు పోవుట యాతని కెంతమాత్రమును తప్పుగాదు. ఎవ్వరైనఁ బ్రాణావశిష్టులైనయెడల వారి కుపచారములు చేసి తేర్పవలయు నని యెంచి యాతఁ డాగుహాలోనికిఁ బోయెను.

అందిఱువురు చచ్చిపడియుండిరి. అప్పుడు మూర్ఛిల్లి పడిపోయిన మూఁడవ వాఁ డీలోపలనే స్మృతిదెచ్చికొని యెచ్చటికో పాఱిపోయెను. అప్పుడు మాణిక్యలా లరణ్యమునకుఁ బోయి కట్టెలను దెచ్చి రెండు చితులను బేర్చి వానియం దామృతకళేబరముల నుంచి యగ్నిని రగులుకొల్పి తనజతగాండ్ర కంతిమసంస్కారములను గావించి వెడలిపోయెను. అట్లు పోవుచు నాబ్రాహ్మణుఁ డేమయ్యెనో వెదకి చూడవలయు నని యెంచి యావన మంతయును వెదకెను గాని యాతఁ డెందును నగపడలేదు. క్రమముగా నాతఁడు నదీతీరమునకు వచ్చెను. ఇంతవఱకు నిర్మలముగాఁ బ్రవహించుచున్న యానదీజల మిప్పుడు కలఁగి కలుషితమై కానవచ్చుచుండెను. అనేకస్థలములయందు చెట్లకొమ్మలు పడి లతాగుల్మములు భిన్నభిన్నములై తెగి పడియుండెను. మాణిక్యలా లీగుర్తుల నన్నిటినిం జూచి యిట కెవ్వరైనఁ జాలమంది వచ్చియుండవలయు నని తలంచుకొనియెను. ఆ

మెట్టమార్గమునందలి కఱకురాళ్ళపైఁ గొన్ని గుఱ్ఱములగిట్టల యొఱ పిడివలనగలిగిన గుఱుతులు కానవచ్చుచుండెను. గుఱ్ఱములరాయిడిచేఁ దెగిపడిన లతాగుల్మాదికములు నేల నంటికొనిపోయినచోట నర్ధ గోళాకారములుగల యశ్వపదచిహ్నములు విస్పష్టముగ నగపడు చుండెను. ఇంక నితరస్థలములయం దట్టిచిహ్నము లున్నను లేనియట్లే యస్పష్టములై యుండెను. మాణిక్యాలాలు చాలసేపు చూచి యటకుఁ జాలమంది యాత్రికులు వచ్చియుండవలయు నని నిశ్చయించుకొని యెను.

చతురమతి యగు మాణిక్యాలా లాగుఱ్ఱము లేదిక్కునకుఁ బోయినవో తెలిసికొనవలయునని ప్రయత్నించెను. కొన్ని పదచిహ్న ములు దక్షిణపుదిక్కునకును, కొన్నియుత్తరపుదిక్కునకు నున్నట్లు కనిపెట్టి దక్షిణాభిముఖుఁడై యాతఁడు కొంతదూరము పోయి చూడఁగా నాయశ్వపదచిహ్నము లన్నియు నుత్తరాభిముఖము లయియే యుండెను. ఇందువలన నశ్వారోహకు లందఱు నుత్తరము నుండి దక్షిణమునకు వచ్చి తిరిగి యందఱు నుత్తరాభిముఖులై పోయియుందు రని యాతఁడు నిశ్చయించుకొనియెను.

ఇట్లు సిద్ధాంతము చేసికొని మాణిక్యాలాలు తనయింటికిఁ బోయెను. ఆతనియి ల్లక్కడకు రెండుమూఁడు క్రోశములుమాత్రమే యుండెను. అక్కడకుఁ బోయి మాణిక్యాలాలు వంటఁ జేసికొని కుమార్తెయును తానును భోజనము చేసి యనంతరము తనబిడ్డ నెత్తి కొని యింటితలుపునకుఁ దాళము వైచికొని బయలుదేరెను.

మాణిక్యాలాలునకు సమీపబంధువు లెవ్వరును లేరు. ఆతని మేనత్త యాఁడబిడ్డ మేనఁగోడలికి బినకాలగారి కుమార్తె మాత్ర మొక్కతె యుండెను. సౌజన్యమువలనను, సంబంధమువలనను నాతఁ డామె నత్తయని పిలుచుచుండెను.

మాణిక్యలాలు కుమార్తె నెత్తికొని యత్తయింటికిఁ బోయి యామెను పిలిచెను. ఆమె వచ్చి "అబ్బాయి మాణిక్యలాలా? నే నింకను క్షత్రియం బున్నానా?" అనియెను.

మాణి—నాకుమార్తెను నీయింటియందుంచి పెంచికొనుచుందువా?

అత్త—నీబిడ్డను నాయింట నెంతకాల ముంచెదవు?

మాణి—ఒకటిరెండు నెలలుమాత్రమే.

అత్త—నేను దరిద్రురాలను గదా నాయనా! ఈబిడ్డ నంత కాలముదాఁక నెట్లు పోషింపఁగలను?

మాణి—అత్తా! నీవు పేదరాలవే యగుదువు. నీబంధువుల పసిపిల్ల నొకదానిని రెండుమాసములు పోషింపలేవా?

అత్త—అది యేమిమాట నాయనా! ఒకబిడ్డకు రెండుమాసము లన్నముపెట్టవలయుననిన నొక మొహరీ కావలసియుండును.

మాణి—సరియే. నేను వచ్చి నీకు మొహరీ నిచ్చెదను. ఈ బిడ్డను రెండునెలలవఱకు నెట్లో కాపాడుము. నేనుదయపురమునకుఁ బోయి యొకపెద్దయుద్యోగమును సంపాదించెదను.

అని చెప్పి మాణిక్యలాలు తనకు మహారాణా యిచ్చిన మొహరీలలో నొకదాని నామెకిచ్చి తనబిడ్డ నక్కడనుంచి "అమ్మా! మీయవ్వయొద్ద నుండుము" అని యామె కొప్పగించెను.

ఆముసలియును "ఈమొహరీ యీబిడ్డ కొకసంవత్సరము వఱకు నన్నవస్త్రములకు సరిపోవును. కాని, రెండుమూడుమాసముల వఱకే గదా యీమెను పెంచవలసినది! ఇంతియ కాక మాణిక్య లాలునకు గొప్పయుద్యోగముకూడఁ గాఁగలదు. అతఁడు మహోన్నత పదవికి వచ్చినప్పుడు పేదరాలనగు నాకేమైన నుపకారము చేయక పోవునా? ఇంతమాత్ర ముపకారము చేసినయెడల నీతఁడు మనచేతి

లో నుండును'' అని యోచించి యామోహనిని తీసికొని ''నేను పేదరాలను కావున నీయొద్ద డబ్బు తీసికొంటిని గాని యీపసిపిల్లను పోషించు టెంతపని నాయనా? నేనీమెను నాకన్నబిడ్డవలెఁ బెంచు కొనియెదను. నీవు నిశ్చింతతో నుదయపురమునకుఁ బొమ్ము! మాతల్లి రావే'' అని చెప్పి యాబిడ్డనెత్తికొని ముద్దు పెట్టుకొనియెను.

మాణిక్యలాలు తనబిడ్డపోషణమునకుఁ దగినయేర్పాటు చేసి నిర్వ్యాకారముతో నూరువిడిచి బయలుదేరెను. ఎవ్వరితోడ నేమియును జెప్పక రూపనగరమునకుఁ బోవుమెట్టుమార్గమునుబట్టి యిదివఱకు రాణాను కలిసికొన్నస్థలమునకు వచ్చెను.

అప్పుడాతఁడు తనమనసునందు ''ఇచ్చటికి కింతమందియాశ్వికులేల వచ్చిరో? ఇక్కడ నాకు రాణా యొక్కఁడే గదా యగపడినది కాని, యుదయపురరాణా యొక్కఁడు వచ్చుటకుఁ గారణమేమియు నగపడదు. ఆయాశ్వికు లందఱు నాతనితోఁగూడ వచ్చియుందురు. మహారాణా వేటకో, వనవిహారమునకో వచ్చియుండు నని తోఁచు చున్నది. ఆతఁడు సేనతో మరల రాజధానికే పోయియుండునా? బాగుగ నాలోచించి చూచినయెడల వారుదయపురమునకుఁ బోయి నట్లు పొడకట్టుట లేదు. ఆగుఱ్ఱములయడుగుజాడలనుబట్టి యోచింపగా నవి మరల నుత్తరపుదిక్కునకే పోయినట్లు తోఁచుచున్నది. రూపనగర మిక్కడ కుత్తరముగనే గదా యున్నది. రాణా రాజసింహుఁడు చంచలకుమారియుత్తరమును చూచి యామెకోర్కె తీర్చుటకై యాశ్వికసైన్యముతో రూపనగరాభిముఖుఁడై పోయియుండ వచ్చును. ఆతఁడట్లు పోకయుండినయెడల రాజస్థానచక్రవర్తియను నాతనియుత్తమాభిధానము నిరర్థకమేగాదా! ఆతని భృత్యుఁడ నగు నేడు గూడ నాతఁడు పోయినచోటికే పోవలయును. కాని, వారందఱు నశ్వముల నధిరోహించి ప్రయాణము చేయుచున్నారు. నేను

కాలినడకతో వారిని సకాలమునఁ గలిసికొనఁగలుగుదునా? అయి నను నాకొక ధైర్యమున్నది. వాళ్ళు, గుట్టలు, డొంకలు మొదలగు వానిచే దుర్గమమైయున్న యీమార్గమున వారంత వేగముగాఁ బో జాలరు. నాయంత వేగముగ నడచువా రెవ్వరును లేరు నేను వారిని గలిసికొనలేకపోను” అని యోచించి యాతఁడు రేయుంబవలు ప్రయాణము చేసి సకాలముననే రూపనగరము వచ్చి చేరెను. ఆతడు వచ్చి చూచునప్పటికి రూపనగరమున రెండు వేల మొగలాయి యాశ్వి క సైన్యము శిబిరములలో విడిసి యుండెను. రాజపుత్ర సైన్య మేమి యును వచ్చియుండ లేదు. ఆమఱునాఁడే మొగలాయి సైనికులు చంచ లకుమారిని తీసికొనిపోయెద రని యాతనికిఁ దెలియవచ్చెను.

మాణిక్యలా లొకచిన్న సైన్యమునకు నాయకుఁడుగా నుండఁ దగినసామర్థ్యముగలవాఁడై యుండెను. ఆతడు రాజపుత్రు లెవ్వరు నచ్చటికి వచ్చియుండ లేదని తెలిసికొన్నవాఁడయ్యును విచారింప లేదు. “ఈమొగలాయివారలు లేమిచేయఁగలరు? నేను నాప్రభువును బాగుగ వెదకి తెలిసికొనియెదను” అని యాతఁడు నిశ్చయించు కొనియెను.

అప్పుడు మాణిక్యలాలు రూపనగరవాస్తవ్యుఁ డగునొకమను ష్యునిం బిలిచి ఢిల్లీకిఁ బోవుటకు మార్గమును దెలుపు మని యడిగెను ఆతని కేమైన నిచ్చెద నని చెప్పినపిమ్మట నాతఁడు కొంతదూరమువఱ కును వచ్చి మాణిక్యలాలునకు ఢిల్లీమార్గమును చూపించెను. మాణి క్యలా లాతనికిఁ బహుమానము నిచ్చి పంపించి పిమ్మట మార్గమున నలువంకలను వెదకికొనుచు ఢిల్లీపురాభిముఖుఁడై పోయెను. రాజ పుత్రు లామార్గమున నెచ్చటనో దాఁగికొని యుందు రని యాతఁడు నిశ్చయించుకొనియెను. ఆతఁడు కొంతదూరము పోయి చూచెనుగాని యెవ్వరు నగపడ లేదు. మఱికొంతదూరము పోనుపోను మార్గము

క్రమక్రమముగా నిరుకగుచుండెను. ఆయిఱుకుత్రోవ కిరువంకలను రెండుమెట్టలుండెను. అందెడమవైపున నున్నమెట్ట కొంచె మెత్తుగా నుండుటచే నెక్కుటకు కష్టమైనదిగా నుండెను. దానిపై గఱకురాళ్లు విశేషముగ నుండెను. కుడివైపున నున్నమెట్ట యాదోకుగ నుండి పోయినకొలఁది నెత్తుగా నుండుటచే నెక్కుటకు సులభసాధ్యమై యుండెను. అది యంతయెత్తుగాఁగూడ లేదు. దక్షిణభాగమున నొకచోటినుండి యావలకుఁ బోవుటకొకసందును, నటనుండి యొక సన్ననికాలిబాటయు నుండెను.

నెపోలియన్ మొదలగుదొంగ లనేకులు మిగుల సమర్థులై తుదకు సేనానాయకులైరి. రాజులైనతరువాత నట్టివారి నెవ్వరును దొంగ లని పిలుచుటలేదు. మనమాణిక్యలా లిప్పుడు రాజై యుండ లేదు. అందువలన మేమాతని దొంగ యని చెప్పుట కేమియును సంశయించుట లేదు. కాని రాజులైన యాదొంగలవలెనే యీచిన్న దొంగకును దండనాయకపదవి నందఁగలశక్తియుక్తులు లేకపోలేదు. పర్వతనిరోధముచే సంకీర్ణమై యున్న యామార్గమును జూచి మాణిక్యలాలు "మహారాణా వచ్చినయెడల నిచ్చటనే యుండవలయును. మొగలాయిసైన్య మీయిఱుకుత్రోవను వచ్చునప్పటికిఁ రాజపుత్రులు తమయుత్తమాశ్వములతోఁ బిడుగులవలె వారిపైఁ బడవలయు నని తలంచియుందురు. గుఱ్ఱములతో నెక్కుట కెడమవైపుమెట్టకంటె కుడివైపుమెట్టయే సుగమముగా నుండుటవలన నీతు లిందే దాఁగి యుండవచ్చును" అని యాలోచించుకొని యామెట్టపై కెక్కిపోయెను అప్పటి కప్పుడే సాయంకాల మయ్యెను.

మాణిక్యలా లామెట్టపై కెక్కి వెదకెను గాని యందెవ్వరునగ పడలేదు. ఇంకను వెదకవలయు నని యోచించి మరల నంతలో 'మహారాణా యొకఁడుదక్క మిగిలినరాజపుత్రు) లెవ్వరును నన్నె

ఉండగ. వారెవ్వరికైన నగపడినయెడల నేను మొగలాయిసేవ కుడ ననునుద్దేశముతో నాతోఁ బోరాడఁగడంగుదు రేమో!' అని యూహించి యటనుండి ముందునకుఁ బోక 'మహారాణా రాజసింహు నకు జయమగుఁగాక' అని జయధ్వని చేసెను.

ఆశబ్దమును వినినతోడనే యెక్కడనుండియో నలుగురైదుగురు శస్త్రధారులు తమబాహువులయందు నిశితకరవాలములు మిల మిల మెఱయుచుండ నతివేగమున లేచి మాణిక్యలాలును నఱికివేయుటకై పఱుగెత్తుకొని వచ్చుచుండిరి.

అంతలో నొకపురుషుఁడు 'ఆతఁడు మనవాఁడే; చంపవలదు! చంపవలదు!' అని కేకవైచెను. ఆపురుషుఁడు మహారాణా రాజసింహుఁడే యని మాణిక్యలాలు తెలిసికొనియెను. మహారాజాజ్ఞ వినినతోడనే యాశస్త్రధారులు మరలిపోయి దాఁగికొనిరి.

మాణిక్యలాలు రాజాజ్ఞ ననుసరించి సమీపమునకుఁబోయెను. అక్కడ నొకరహస్యస్థలమునఁ గూర్చుండి మహారాణా మాణిక్యలాలుతో 'నీవిక్కడ కెందులకు వచ్చితివి?' అనియెను.

మాణి—ప్రభు వెక్కడ నుండునో భృత్యుఁడుగూడ నక్కడనే యుండవలయును. మీరింతటి మహత్తర కార్యమునఁ బ్రవృత్తులై యున్నప్పు డీసేవకునివలనఁ గాఁదగినపని యేమైన నుండవచ్చు నని యూహించి మీయొద్దకు వచ్చితిని. మొగలాయిసైనికులు రెండువేలమంది; మహారాణావారియొద్ద నున్నవారు నూర్గురు మాత్రమే. నేనెట్లు నిర్విచారముగా నుండఁగలుగుదును? మీరు నాకొక్కసారి ప్రాణదానము చేసి యుంటిరి. అది నేనెన్నఁటికైన మఱవఁగలుగుదునా?

రాజ—నేనిక్కడకు వచ్చితి నని నీకెట్లు తెలిసినది?

మాణిక్యలాలు తానూహించిన యుద్ధసంగతులను దెలియఁ జేసెను. మహారాణా సంతోషముతో 'నీవు బాగుగనే వచ్చితివి. ఈసమయమున నీవంటివాఁడొకఁడు కావలయు నని యూహించు చున్నాను. ఇప్పుడు నీకొకపని చెప్పెదను, చేయఁగలవా?' అనియెను.

మాణి—మనుష్యసాధ్యమైన యెట్టికార్యమునైనను మీ యాజ్ఞయైనచో నెఱవేర్పఁగలను.

రాజ—మనము నూర్గురుమాత్రమే యున్నాము. మొగలాయియోధులు రెండువేలమంది యున్నారు. వారితో మనము యుద్ధము చేసినయెడల విజయము గాంచుట యసంభవముగదా! యుద్ధము చేసి రాజకన్య నుద్ధరింపఁజాలము. ముందుగా రాజకన్యను బ్రాణాపాయమునుండి తప్పించి తరువాత యుద్ధము చేయవలయును. యుద్ధములోఁ బడినయెడల నామె ప్రాణములు గోల్పోవును. మొదట నామెను రక్షింపవలయును.

మాణి—నేనల్పుఁడను. అదియంతయు నేనెట్లు చేయఁగలను? నేనేమిచేయవలయునో దేవర యాజ్ఞాపింపవలయును.

రాజ—నీవు మొగలాయియశ్వసైనికుని వేషముతో రేపటి యుదయముననే వారితోఁ గూడి రాజకుమారిపాలకిని వెంబడించి వచ్చుచు నేను చెప్పినప్రకారము చేయవలయును.

ఇట్లుచెప్పి కర్తవ్యము నాతనికెఱిఁగించెను. మాణిక్యలా లది విని 'మహారాజునకు జయమగుఁగాక! నేనీకార్యమునందు సంసిద్ధుఁడనై యుండెదను, దయచేసి నాకొకయశ్వము నొసఁగవలయును' అనియెను.

రాజ—మేమొకనూర్గు రాశ్వికుల మున్నాము. గుఱ్ఱములు నూరేయున్నవి. నీకిచ్చుటకు వేఱొకగుఱ్ఱము లేదు. ఇతరుల యశ్వమును నేనీయఁజాలను. వలయునేని నాయశ్వము నీయఁగలను.

మాణి—ప్రాణము పోయినను దానిని స్పృశింపఁజాలను. నాకు కావలసినయాయుధముల నిప్పింపుఁడు.

రాజ—ఆయుధము లెక్కడ నున్నవి? ఉన్నవి మాకే చాలవు. ఎవ్వరియాయుధము నీయుదును? వలయునెడల నాయాయుధమును దీసికొనుము.

మాణి—అది కాదు. నాకు దుస్తుల నిచ్చుట కాజ్ఞ దయచేయుఁడు.

రాజ—శరీరముపై ధరించినవితప్ప నిచట వేఱువస్త్రములు లేవు.

మాణి—పోనిండు. ఎట్లయిన వీని నన్నిటిని సంపాదించుకొనుటకైన ననుజ్ఞ యిచ్చితీరవలయును.

రాజ—(నవ్వి) దొంగతనము చేసెదవా?

మాణి—(నాలుక కఱచుకొని) నేనాపని చేయనని శపథము చేసికొని యున్నాను.

రాజ—అట్లయిన నేమి చేసెదవు?

మాణి—మోసగాండ్రను తన్నితీసికొనిపోయెదను.

ఆమాటలకు రాణా నవ్వి "యుద్ధకాలమునందందఱును దొంగలే. అందఱును వంచకులే. నేనును బాదుషావారిబేగము సాహేబాను దొంగిలించుకొనిపోవుటకై వచ్చియున్నాను. దొంగల వలెనే దాఁగుకొనియుంటిమి. నీయిష్టమువచ్చినట్లన్నియు సంపాదించుకొనుము" అనియెను.

మాణిక్యలాలు ప్రఫుల్లచిత్తుఁడై రాణాకుఁ బ్రణామము జేసి వెడలిపోయెను.

# పదియవ ప్రకరణము

[illegible]

మాణిక్యాలు లక్ష్మిని వెనువెంటఁగొని నగరమునకు వచ్చెను. అప్పటికి సంధ్యాకాల మగుచుండెను. అతఁడు అంగడివీధికిఁ బోయి చూడఁగా నది యత్యంతశోభాయమానమై విరాజిల్లుచుండెను. లెక్క-లేని దీపములచే నచటి యంగడులన్నియుఁ బ్రకాశించుచుండెను. నానావిధములగు భక్ష్యపదార్థములు నోరూరఁజేయుచుండెను. పుష్పములును, పుష్పమాలికలును తరతరములై నయనరంజకములై, అనుపమానసుగంధములచే మనోహరము లగుచుండెను. మాణిక్యలాలునకు గుఱ్ఱము, అస్త్రములు మొదలగువానిని సంపాదించుకొనవలయునని యుద్దేశమున్నది, కాని, ఆయుద్దేశముచేత పొట్టను వంచింపవలయుననుతలం పాతనికి లేదు. అతఁడు తిన్నగఁబోయి కొంతమిఠాయిని గొని సేరుపాలను త్రాగి మిఠాయిఅంగడివానికి సరియైన వెల నిచ్చి తమలపాకుల దుకాణమునొద్దకుఁ బోయెను. ఒకచోట తాంబూలద్రవ్యము లమ్మెడియంగడి సొగసుగ నలంకరింపఁబడి యాతనికిఁ గన్నుల పండువగాఁ గానవచ్చెను. అంగడియం దనేకదీపములును, లాంతరులును, సుస్నిగ్ధకాంతుల నీనుచునుండెను. గోడల కనేకవర్ణములు గలకాగితము లంటింపఁబడి యుండెను. బహువిచిత్రములగు చిత్రపటము లనేకములు వ్రేలాడుచుండెను. ఆపటముల యందలి చిత్రముల నాధునికభాషయందు బూతు లన్నియు, ప్రాచీనభాషయందు "ఆదిరసాశ్రితము" లనియుఁ జెప్పవచ్చును. ఆనడుమ పఱుపఁ బడిన మెత్తని రత్నకంబళముపై నాయంగడియజమానురాలు కూర్చుండి తాంబూలచర్వణము సేయుచుండెను. ఆమెవయసు ముప్పది సంవత్సరము లుండును. కాని, యామె కురూపిణి కాదు,

ఆమె దేహచ్ఛాయ • మెఱుపు. కన్ను లాకర్ణాంతములై విరాజిల్లు చుండెను. ఆమె పూవుల చంచలములు. నగవు సరసమైనది. ఆనగవు నిర్మల దంతపంక్తి మధ్యమునుండి సర్వదా విహారము చేయుచుండెను. దానితోఁగూడ సర్వాభరణములును జలించుచుండెను. ఆభరణంబు లందుఁ గొన్ని వెండివి. కొన్ని స్వర్ణమయమైనవి. కాని, యవి మనోహరముగ నిర్మింపఁబడి విరాజిల్లుచుండెను. మాణిక్యలాలా మెను పిలిచి "వక్కలు నాకులు నిచ్చెదవా!" అని యడిగెను.

ఆమె స్వయముగాఁ వాని నమ్ముటలేదు. ఆమె యాజ్ఞా ప్రకార మొకదాసి "వక్కలు నాకులును సుగంధద్రవ్యములు, సున్నము, మొదలగువానిని కావలసినవారి కమ్ముచుండెను. యజమానురాలు పైకమునుమాత్రము గ్రహించుచు మనోహరముగ నవ్వుచుండెను.

దాసి, వక్కలు, ఆకులు, సున్నము, కవిరి, లవంగములు, జాపత్రి, ఏలకులు మొదలగువానితోఁ జేయఁబడిన తాంబూలపు పట్టీల నొసంగెను. మాణిక్యలాలు వినోదముగ నొక కాని హెచ్చుగ నిచ్చి మఱియొకటి కట్టి యిమ్మని యడిగెను. అయ్యది సిద్ధముచేయు లోపల నాతఁ డాయంగడియజమానురాలితో మాటాడుచుండెను. ఆమెరూపము నగ్గించి యంగడిప్రాశస్త్యమునుగూర్చి శ్లాఘించెను. అందుల కామె మన సించుకకరఁగెను. ఆమనోహర తాంబూలముతోఁ దనమనోహర వాక్యముల నామె యమ్మ నారంభించెను. అంతలోఁ దాంబూలపు పట్టీ సిద్ధమయ్యెను. దాసి యేమో తెచ్చుటకై వెలుపలకుఁ బోయెను. ఆసమయమునందు మాణిక్యలాలు తాంబూలమమ్ము నామెతో "రాజామణీ! నీవు మిగుల చతురవు. నేనొక్కచాతుర్యవతికై వెదకుచుంటిని. నాకొకశత్రువున్నాఁడు. అతని నొకయింటిలో వైచి తాళము వేయవలయు నని యోచించు

చున్నాను. నీవు సాహాయ్యము చేసినయెడల నాకార్య మెట్లు చేయ వలయునో చెప్పెదను. అదిగాక నీకొక మోహరీకూడ నొసంగె దను'' అనియెను.

తములపాకులమ్మునది—ఏమిచేయవలయును?

మాణిక్యాలా లామెచెవిలో నేమియో చెప్పెను. ఆమె యాతని మాటల కంగీకరించి ''మొహరీ నాకక్కరలేదు. వినోదమే గావలసినది'' అనియెను.

పొడుగువత్తికనిమొద్దం బోయి దాసి కలమును, సిరాబుడ్డియు, కాగితమును తెచ్చి మాణిక్యలాలున కిచ్చెను. మాణిక్యలాలు యోచించి యొకయుత్తరమును వ్రాసెను. ఏమనంగా:—

''ప్రాణనాథా! నీవూరిలోనికి వచ్చుచున్నప్పుడు నేను నిన్నుం జూచి చాలవిమోహితనై పోయితిని. నిన్నింకొకసారి చూడకున్న యెడల నాప్రాణములు నిలువవు. నీవు రేపే బయలుదేరి పోయెద వని వినియున్నాను. ఆకారణముచే నేడొక్కసారి తప్పక వచ్చి దర్శన మీయవలయు నని కోరుచున్నాను. అట్లు చేయనియెడల నేను కంఠమున నురి పోసికొని ప్రాణములు విడిచెదను. ఈయుత్త రముం దెచ్చినవానితో బయలుదేరి రావలయును.

ఉత్తరమును వ్రాసి మణచి పైవిలాసము ''మహమ్మదుఖాన్ సాహేబుగారికి'' అని మాణిక్యలాలు వ్రాసెను.

తముల—ఆమనుష్యుం డెవరు?

మాణి—ఒక మొగలాయియాశ్వికుఁడు.

నిజముగా మాణిక్యలాలు మొగలాయిసేనయం దెవ్వరి మొగము నెఱుంగఁడు. రెండువేలసైన్యమునం దెవ్వరికైన మహా మ్మదను పేరుండవలయును. మొగలుల నెల్ల ''ఖాన్'' అని పిలువ వచ్చునని యోచించి ''మహమ్మదుఖాన్'' అని పైవిలాసమును వ్రాసెను.

తముల—ఈయిల్లువల్లకాదు. ఇంకొకగృహ మద్దెకుం దీసికొన వలయును.

అప్పుడు వారిద్దఱును బజారునకుఁ బోయి యొకగృహము నద్దెకుఁ దీసికొనిరి. తములపాకు లమ్మునామె మొగలాయీయాశ్వికుని ప్రవేశపెట్టుటకై యాగృహ మలంకరింపఁ జేయుట కుద్యుక్త యయ్యెను. మాణిక్యలా లుత్తరమును దీసికొని మొగలాయీ సైనికులు దిగినస్థలమునకుఁ బోయెను. అక్కడ కొన్నియంగళ్ళుండెను. వెలుతురు హెచ్చుగా నుండెను. వినోదములు మొదలగునవి యెప్పటియట్లు జరుగుచుండెను. మాణిక్యలాలు తనకు మొగలాయి లెవ్వరు కంటఁబడినను "మహమ్మదుఖాను సాహేబువా రెవ్వరు? వారికొక యుత్తరమున్నది" అని చెప్పుచుండెను. ఆతనిమాటలకుఁ బ్రత్యుత్తర మిచ్చువా రెవ్వరును లేకపోయిరి. ఆతనిని దిట్టువారు కొందఱును, మాకగపడలేదని చెప్పువారు కొందఱును, బాగుగా వెదకి తెలిసికొనుమనువారు కొందఱు నగుచుండిరి. అందొకఁడుమాత్రము "మహమ్మదుఖానెవ్వరో నే నెఱుఁగను. కాని నాపేరు మాత్రము నూర్ మహమ్మదుఖాను. ఆయుత్తరమును నాకిచ్చితివేని చూచి యది నాయదియో కాదో చెప్పెదను" అనియెను.

మాణిక్యలాలు పరమానందముతోఁ దనయొద్దనున్న యుత్తరము నాతనికిచ్చి "ఎవ్వఁడైననేమి? మొగలాయియైనచో నావలలోఁ దగిలికొన్నవాఁడే" అనుకొనియెను. నూర్ మహమ్మదుఖాను "ఈ యుత్తర మెవ్వరికైన నేమి? నేనెందుల కిట్టి సమయమును బోఁగొట్టుకొనవలయును? ఆబీబీ నొక్కసారి చూచియైన వచ్చెదను" అని యోచించుకొని ప్రకాశముగా "ఔను. ఈయుత్తరము నాకే వ్రాయఁబడినది. నీతోఁగూడ వచ్చెదను నడువుము" అని చెప్పి శిబిరమునందలి తనబిడారమునకుఁ బోయి యద్దము చూచికొని తన పెట్టెయందలి సన్నదువ్వెనతో శిరోజములఁ జక్కగ దువ్వికొని యత్తరు మొదలగు పరిమళద్రవ్యముల నలందికొని యోధవేషముతో దురల బయటికి వచ్చి "ఓయీ! ఆస్థల మిచ్చటి కెంతదూర ముండును?" అని యడిగెను. మాణిక్యలా లతివినయముతో "స్వామీ!

చాల దూరమున్నది. గుఱ్ఱముపై నెక్కి వచ్చినయెడల బాగుగా నుండును'' అనియెను.

"మంచిది'' అని ఖానుసాహేబు గుఱ్ఱమును దిష్టి తీసికొని వచ్చి పల్లము మొదలగువాని నమర్చి యెక్కఁబోవుచున్న సమయమున మాణిక్యాలాలు సలాముచేసి "స్వామీ! గొప్పవా రంతఃపురముతోఁబని. ఆయుధములు మొదలగునవి తీసికొనివచ్చిన మంచిదని తలఁచెదను'' అనియెను.



నవనాగరికుఁడైన యామొగలాయి "బాగుగనే యున్నది. ఆశ్వికులలోఁ బెద్దనైననే నాయుధములు లేకుండ నేలపోవలయును?'' అని యనుకొని శస్త్రాస్త్రములం దొడిగికొని గుఱ్ఱముపైఁ గూర్చుండెను.

మాణిక్యాలాలాతని సంకేత స్థలంబునకుఁ గొని తెచ్చి "అయ్యా! ఇక్కడనే గుఱ్ఱమునుండి దిగవలయును. అదియే యాగృహము. నేను గుఱ్ఱమును పట్టుకొనియెదను. మీరు లోపలకుఁ బోవచ్చును' అనియెను.



ఖానుసాహేబు దిగి గుఱ్ఱమును మాణిక్యాలాలున కొప్పగించి యాయుధములతోడనే లోపలకుఁ బోవుచుం దనమనసునందు 'శస్త్రాస్త్రములను ధరించి రమణీమణుల సందర్శించుటయు, సంభాషించుటయు బాగుగా నుండదు' అని యోచించి వెనుదిరిగి వచ్చి మాణిక్యాలాలున కాయుధము లన్నియును దీసియిచ్చి లోనికి బోయెను. మాణిక్యాలాలునకు మఱింత మంచి దయ్యెను.

ఖానుసాహేబు లోపలికిఁ బోయి చూచునప్పటి కొకచేవకోళ్ళ మంచముపైఁ బఱుపఁబడిన తెల్లని సెజ్జపై నొకసుందరీమణి కూర్చుండి యుండెను. గులాబి, మల్లె, మొగలి మొదలగు నత్తరులచే నాయిల్లంతయును పరిమళించుచుండెను. ఆమందిరమున నలువంకలను బుష్పహారములు వ్రేలాడుచుండెను. ముందువంక సొగసైనహుక్కాగొట్ట మొకటి యుండెను. ఖానుసాహేబు తనపాదరక్షలను విడిచి యామంచముపైఁ గూరుచుండి యతిమృదులముగ నాబీబీని పలుకరించె

ను. తరువాతఁ దనయుకుప్పులను వదలి పువ్వులతో గట్టఁబడిన తాళవృంతమును చేసికొని విసరికొనుచుఁ దాంబూలమును సేవింప నారంభించెను. అప్పుడప్పుడు హుక్కా గొట్టమును నోటియందుంచుకొని సుఖావేశముతోఁ బీల్చి గుప్పుగుప్పున బరిమళధూమమును వలయాకారముగ విడుచుచుండెను. ఆబీబీయును గాఢానురాగ సూచకంబులగు మృదువాక్యములతో నాతని మోహింపఁజేసి కేవల మాతని హృదయమును వశపఱచుకొనియెను!

లోపల గుడిగుడిబీల్చుట ప్రారంభమైనతోడనే మాణిక్యాలాలు వచ్చి పిఖితలుపు తట్టెను? 'ఎవరువారు?' అని బీబీ హెచ్చరించెను.

మాణిక్యాలాలు వికృతస్వరముతో 'నేను' అనియెను.

అప్పు డానెఱజాణయగుబీబీ భయపడినదానివలె ఖానుసాహేబువంకఁ జూచి గద్గదస్వరముతో 'కొంప మునిఁగినది! నామగఁడు వచ్చియున్నాఁడు. నేఁడు రాఁడుగదా యని ధైర్యముతో నుంటిని. మీరు వేగముగ నీమంచముక్రిందికిఁ బోయి దాఁగి యుండుఁడు! నే నాతని నెట్లులైన నావలకుఁ బంపి వచ్చెదను' అనియెను.

ఖాను—అది యేమి? మగఁడు వచ్చినంతమాత్రమున దాఁగికొనవలయునా? ఆతనితల కఱుక్కున నఱికిపాఱవైచెదను. నీకింత భయమేల?

అప్పు డాబీబీ నాలుక గఱచుకొనుచు 'ఇదేమిప్రారబ్ధము! నామగనిని చంపివైచి నానోట బెడ్డఁగొట్టఁదలంచుట మీకు న్యాయమా? మీరు నన్నుఁ బ్రేమించినందులకు ఫల మిదియేనా? దయయుంచి వేగముగ మంచముక్రిందికిఁ బోయి దాఁగికొనుఁడు! ఆతని నిప్పుడే యావలకుఁ బంపివైచెదను' అనియెను.

మాణిక్యాలాలు మాటిమాటికి తలుపు తట్టుచునే యుండెను. చేయునది లేక ఖానుసాహేబు మంచముక్రిందికిఁ బోయి యొదిగియుండెను. స్థూలకాయుఁ డగుటచే సులభముగా లోనికిఁ బ్రవేశింపలేక పోయెను. ఆతనిశరీరమున నొకటిరెండుచోట్ల చర్మము కొట్టుకొని

పోయి గాయములుపడియెను. అయిన నేమిచేయఁగలఁడు? ప్రణయమునకై యెన్నిపాటులైనఁ బడవలయునుగదా! అస్థికలకాయము క్రిందకుఁ జేరుకొనినతోడనే బీబీ వచ్చి తలుపు తెఱచి తానిదివఱకేమో చెప్పినట్లుగానే 'మీరు మరల నెచ్చటకుఁ బోదలంచిరి? ఇంతలో రానంటిరిగదా!' అనియెను.

మాణిక్యలాలు మొదటివలెనే వికృతస్వరముతో 'తాళపుఁజేతిని మఱచిపోయితిని. అందుకొఱకు మరల వచ్చితిని' అనియెను.

బీబీ తాళపుఁజేతిని వెదకియిచ్చునెపంబున ఖానుసాహేబు విడిచివైచినవస్త్రములను తీసికొనియెను. మాణిక్యలాలాతనిపాదరక్షలను దీసికొనియెను. అప్పుడు వారిరువురును వెలుపలకు వచ్చి తలుపు మూసి బీగమువైచి యటనుండి బయలుదేరి పోయిరి. ఖానుసాహేబామంచముక్రిందఁ జీమలు, నల్లులు మొదలగువానిబాధలను సహించుకొనుచు నెదురుచూచుచుండెను.

అతని నాగ్రాపంజరమున భద్రముగానుంచి మాణిక్యలాలాతనిదుస్తులను, శస్త్రాస్త్రములను ధరించి యాతనిగుఱ్ఱముపై నధిరోహించి యాతనికి బదులుగా యోధకార్యములను నిర్వర్తించుటకు ముసల్మాను సైన్యమునకుఁ బోయి వారిని గలిసికొనియెను.

—

## చతుర్థభాగము—రంధ్రమునందలి యుద్ధము

### మొదటి ప్రకరణము

చంచలకుమారి ప్రయాణము

మఱునాఁటియుదయముననే మొగలాయిసైన్యము ప్రయాణమునకు సిద్ధమయ్యెను. రూపనగరమునుండి కవచోష్ణీషధారులును, సుస్నిగ్ధశ్మశ్రుసమన్విత గంభీరముఖమండలులును, శస్త్రాస్త్రాలంకృత భీషణాకారులు నగు నశ్వారోహకులు వరుసలు వరుసలుగా బయలు

లేచి వచ్చుచుండిరి. వరుసక్రమముగను రౌతులు వంతున నొకవరుస వెనుక నొకవరుసగా వారు పంక్తులుతీరి ప్రయాణము చేయుచుండిరి. భ్రమరశ్రేణీసమూహములంబులను వికసితారవిందములవలె వారి వదనమండలములు విరాజిల్లుచుండెను. అశ్వములతిసుందరముగ గ్రీవాభంగములతోఁ గళ్ళెములపట్టువలన మందమందముగఁ గదము ద్రొక్కుచు నతివిలాసముగ నడచుచుండెను. అవి శరీరభారముచే నల్లాడుచు, సవిలాసముగ నొడలు వడకించుచుఁ, దూలుచు నడచుట కుపక్రమించెను.

చంచలకుమారి ప్రభాతసమయముననే లేచి స్నానము చేసి రత్నాలంకారవిభూషిత యయ్యెను. నిర్మల యామెను బాగుగ నలంకరించెను. చంచలకుమారి పుష్పహారములను దీసి పారవైచి "చితారోహణమునకై పోవుచున్న నాకీయలంకారము లన్నియు నెందులకు?" అనియెను. శోకావేగమున నుదయించి ప్రవహించుచున్న యశ్రుజలంబులు నయనకమలంబుల జాలువాఱుచుండ నిర్మల "సఖీ! నీవుదయపురేశ్వరుని రాణివగుటకై పోవుచుంటివి. అందు కొఱకే నీకీరత్నాలంకారములం దొడుగుచున్నదానను" అనియెను.

చంచ—అలంకరింపు మలంకరింపుము! నిర్మలా! అవివేకినినై యాత్మహత్య నేలచేసికొనవలయును? నేను రాచబిడ్డనై సుందరీ శిరోమణి యని పేరొందియు నూరక చావఁజూచుచున్నాను. సౌందర్యమును మించిన రాజ్య మెక్కడ నున్నది? సౌందర్యము లేకున్న రాజ్య మెట్లు శోభింపఁగలదు? అలంకరింపు మలంకరింపుము!

నిర్మల యామె నతి మనోహరముగ నలంకరించి పుష్పితలతా కామణీయకమును నిందించుచున్న యా మోహనాకారమును గాంచి కన్నులనీరు వెట్టుకొనియెను. కాని మఱియేమియును మాటాడలేక పోయెను. చంచలకుమారి యామె నొకసారి కౌఁగిలించుకొని విలపించెను.

చంచ—నిర్మలా! ఈజన్మమున నిన్నికఁ జూడఁజాలను. మన మేన్వైపుడు మనకిష్ట మొడఁగూడు నేల చేకూర్చెనో! దైవము! కేవల మల్పమైన ముక్తాకంకణము నెక్కడఁ బుట్టెనో యక్కడనే పెరుగుచున్నది. నేనెందుల కీపాపనగరమున నుండలేకపోవుచున్నాను!

నిర్మ—నీవు నన్నింకను జూడఁగలవు, నీ వెక్కడ నుండుమో యక్కడనే నన్ను చూడఁగలవు. నన్నుఁ జూడకుండ నీవుగాని, నన్నుఁ జూడకుండ నేనుగాని యెన్నటికిని మరణింపఁజాలము.

చంచ—నేను ఢిల్లీమార్గమునఁ బ్రాణత్యాగము చేసికొందును.

నిర్మ—ఆమార్గమునందుఁ గూడ నీవు నన్నుఁ జూడఁగలవు.

చంచ—అది యెట్లు? నిర్మలా! నీ వెట్లు పోయెదవు?

నిర్మల ప్రత్యుత్తర మేమియును చెప్పఁజాలక చంచలకంఠ మును కౌఁగిలించుకొని యేడ్చెను.

చంచలకుమారి కన్యకాలంకారములను ధరించుకొని మహా దేవమందిరమునకుఁ బోయి నిత్యము నాచరించుచున్నట్టి యతి భక్తితో శివపూజలఁ గావించెను. అనంతరము "దేవదేవా! మహా దేవా! నేను చచ్చుటకు బయలుదేరితిని—కాని యొకమాట విన్న వించుకొనుచున్నదానను—అరవిరిమొగ్గవంటి ప్రాయముగల యీ బాలిక మరణవిషయమున నీకింత సంతోష మెందులకు? ప్రభూ! నేను జీవించియున్నయెడల నీసృష్టికి భంగము కలుగునా? నేనిట్టి పూఁపప్రాయమున మరణించుటయే నీయుద్దేశమైనయెడల నన్నేల రాజకుమార్తెగా సృష్టించి యీయాశాప్రపంచమున కేలపంపితివి?" అని కన్నీటితో నతి దీనముగ భగవంతునిఁ బ్రార్థించెను.

అనంతరమునఁ దల్లికి నమస్కరించుటకై చంచలకుమారి వెడలిపోయెను. ఆమె తనతల్లిదండ్రులకు వందనము చేసి యెంతయో సేవ విలపించెను. తరువాత నామె తన చిన్ననాఁటి చెలికత్తె లందఱియొద్దను సెలవు వేఁడికొనియెను. ఆమె వెడఁబాయవలసి

వచ్చెను గదా యని వారందఱును కన్నీరు పెట్టుకొనిరి. చంచల కుమారి తన చెలికత్తెలలో నొక్కొక్కతెకి రత్నాభరణములను, కొందఱి కొటవస్త్రములను, కొందఱికి వలయునంత ధనమును బహుమానముగ నిచ్చి "మీరు విచారింపవలదు. నేను మరల మరల వచ్చి మిమ్ముఁ జూచుచుండెదను" అని కొందఱితోడను, "ఇట్లు విలపించెద రేల? నేను రాజరాజేశ్వరి నగుటకై పోవుచుంటి నని మీరెఱుఁగరా?" అని మఱి కొందఱితోడను 'మీరు కంట దడిపెట్టుకొన్న యెడల దుఃఖమాగక యీరూపనగరముకూడ చేలిపోవునంతటిదుఃఖాశ్రుజల ప్రవాహము నాకన్నులనుండి ప్రవహింపగలదు. నేను పృథ్వీశ్వరిం గాబోవుచుండ నమంగళకరముగ మీరు దుఃఖించుట మంచిదికాదు' అని కొందఱి తోడను జెప్పి యూఱడించి వారందఱియొద్దను సెలవు లంది కొనియెను.

చంచలకుమారి పాలకిలో గూర్చుండెను. ఆపాలకికి ముం దొక వేయిమందియు వెనుక వేయిమందియు గుఱ్ఱపురౌతులు నిలిచి యుండిరి. రజతమయమై రత్నఖచితమైయున్న యాపాలకి సువర్ణమ యావకుంఠనమున నావృతమై యుండెను. స్వర్ణరజతమయంబు లగు దండముల చేబూని పాలకి కిరువంకల బోవుచుండు వేత్రహస్తుల వాగాడంబరములచే పురజను లందఱును పరమానందము నొందు చుండిరి. చంచలకుమారి పాలకిలో గూర్చుండినతోడనే వాద్యములు మ్రోగనారంభించెను. కుసుమాక్షతములచే పాలకి యంతయును నిండిపోయెను. అప్పుడు దండనాయకుడు సేనలు వెడలుట కాజ్ఞా పించెను. అప్పుడా యాశ్వికవాహిని కట్ట తెగిపోయిన తటాకము నుండి వెలువడిన జలప్రవాహమువలె బయలుదేరెను. గుఱ్ఱము లొయ్యారముగ నడచుచుండెను. ఆశ్వికులు ధరించిన యాయుధముల ఝళంఝళధ్వనులు నలుదెసల నలముకొనియెను.

ఆ యాశ్వికులు ప్రభాతమందమారుతముల సేవించుచు వికసిత హృదయములతో మనసునకు దోచినట్లెల్ల బాడుచుండిరి. ఆపాలకి సమీపముననే వెనుకభాగమున నున్న యోధు డొక శ్రీక్రిందివిధముగ గానము చేయజొచ్చెను.

"సారోమాంచతి సోత్కంపతి విలపత్యుత్కంపతే తామ్యతీ
ధ్యాయత్యుద్భ్రమతి ప్రమీలతి పతత్యుద్యాతి మూర్ఛత్యపి
ఏతావత్యతనుజ్వరే వరతను ర్జీవేన్న కింతే రసాత్
స్వర్వైద్యప్రతిమ ప్రసీదసి యదిత్యక్తాన్యథా హస్తకః"

ఇదియంతయును చంచలకుమారి విని 'ఇదియేమి? నామనో భావవికారములనుగూర్చి యుగ్గడించుచున్నాడు! ఆపద్గ్రస్తవైద్యుడును, గోవర్ధనోద్ధారకుడును, అనాథరక్షకుడును, ఆర్తపరాయణుడు నగు శ్రీగోపాలకృష్ణమూర్తి దయచేసి నన్నుద్ధరింపజాలడా? హా! మురారీ! ఆయాశ్వికయోధుడు మొఱయిడుదానిని విని నీవెక్కడనున్నను, నీ కెన్ని పనులున్నను వచ్చి రక్షింపవా!' అని ప్రార్థించెను. ఆపాట చెవిని బడుచున్నంతవఱకు నామె రాజసింహుని ధ్యానము సేయు చుండెను. తన్ను విడువకుండ వచ్చుచున్న మాణిక్యలాలట్లు గానము చేయుచుండె ననుమాట యామె కెట్లు తెలియును? మాణిక్యలా లతి ప్రయత్నముతో నాపాలకిని విడువక వెనుకభాగమున గొంతస్థలము నాక్రమించుకొని పోవుచుండెను.

---

## రెండవ ప్రకరణము

---

నిర్మల యగాధజలమునఁ బడిపోయెను

ఇది యంతయును నిర్మలకుమారి కతికష్టముగా నుండెను. చంచలకుమారిని మొగలాయిసైనికులు గొనిపోయిరి. ఉత్తర కుమారసమానులగు నయ్యాశ్వికులు చంచలకుమారి పాలకికి వెనుక

ముందు నిలిచి భగవన్మహిమలం గూర్చి పాడుచు రూపనగర ప్రాంతము నందలిపర్వతపఙ్క్తులలోఁ బ్రతిధ్వనులఁ గల్పించుచు బ్రయాణము చేయుచుండిరి. ఎంతయూరార్చికొన్నను నిర్మలకు దుఃఖమాగుట లేదు. వేలకొలఁదిగ నున్న పురజనులలో చంచలకుమారిం గానక విలపించుచున్న కోమలాంగి యగునిర్మల తనమేడపై కెక్కి పరికింప నారంభించెను. అరపరుగుదూరమున నాశ్వికసైన్యము శ్రేణీభూతమై స్థూలకాయముగలయజగరంబోలె పర్వతమార్గమునుబట్టి పోవుచుండెను. ఆ సైనికులచేతులయందలి చికిలిచేసిన బల్లెములు ప్రభాత సూర్యకిరణములచే మిలమిల మెఱయుచుండెను. కన్నీరు కాలువలు గట్టుచుండ నామె చాలసేపావంక జూచుచుండెను. కొంతసేపటికి కన్నులు తుడిచికొని మేడనుండి దిగి తన యలంకారముల నన్నిటిని దీసి మూటగట్టుకొని యెవరెవ్వరికి నగపడకుండ రహస్యముగా రూపనగరమును విడిచి యొంటరిగా బయలుదేరి మొగలాయిసైన్యము పోయినత్రోవనే నిర్మలయును వెడలిపోయెను.

---

## మూఁడవ ప్రకరణము

మహారణవిశారదుఁడగు ముబారకు

ఆయాశ్వికసైన్యము పెద్దకొండచిలువవలె నాపర్వతమార్గము నందు దిరిగితిరిగి చుట్టుకొనుచు బోవుచుండెను. ఏరంధ్రమార్గము ననుసరించి మాణిక్యలాలు పార్శ్వమునందున్న మెట్టపై కెక్కిపోయి రాజసింహునిజూచి మాటలాడివచ్చెనో యాభయంకరమార్గమునందే బిలప్రవేశముం జేయుమహోరంగముంబోనియా యాశ్వికయోధ శ్రేణియును బ్రవేశించెను. తురంగపదాఘాతములచే గొండగుహల బ్రతిధ్వను లుదయించుచుండెను. స్థిరమై, నిశ్శబ్దమై, విజనమైయున్న

యావార్గమునుబట్టి పోవుచున్న యాగుఱ్ఱపురౌతుల యాయుధముల మృదుశబ్దము లొక్కమారుగా భయంకరప్రతిధ్వనులఁ గల్పించు చుండెను. నడుమనడుమ హయహేషారవంబులును, యోధుల కోలాహలంబులును, వెలువడుచుండుటచే నాశబ్దాఘాతములచే నా పర్వతములయందలి తరులతాగుల్మంబుల నవపల్లవములు కంపింప నారంభించెను. ఆనిర్జన ప్రదేశమున నింతవఱకు నిర్భయముగా నివ సించియున్న పశుపక్షికీటంబులెల్లఁ బాఱిపోవుచుండెను. ఈవిధముగా నాయాశ్వికు లందఱు నాయిరుకుత్రోవను బ్రవేశించి పోవుచుండిరి. అప్పుడాకస్మికముగ నొక ధామ్మను భయంకరశబ్దము వినవచ్చెను. ఆయోధు లందరు నొకక్షణకాల మచ్చటనే నిలిచిపోయిరి. పరిశీలించి చూడగా నాపర్వతశిఖరమునుండి యొకబండఱాయి క్రిందికి దొరిలి పడినట్లు కానవచ్చెను. అందువలన నొక యోధుఁడు మరణించెను. మఱియొకనికి బలమైనగాయము తగిలెను.

ఇది యేమైయుండునని యోచించుచు చూచుచుండగనే యా సేనామధ్యమున మఱియొకఱాయి దొరలిపడియెను. ఒకటి, రెండు, మూఁడు, నాలుగు, క్రమముగా బది. ఇరువది, ముప్పది, నలువది— ఇట్లే యెన్నియో బండఱాళ్ళు చిన్నవియు బెద్దవియు వారిపైబడు చుండెను. చాలమందిరౌతులు తమతమ యశ్వములతోఁగూడ నాశన మైపోయిరి. ఆమృతకళేబరములవలన నాయిరుకుత్రోవ కట్టువడిపోయి వెనుకటివారు ముందునకును, ముందటివారు వెనుకకును బోవుట దుస్సాహముగానుండెను. అశ్వము లన్నియును నిలువలేక రౌతుల సహితముగాఁ బాఱిపోవుట కుడాయించుచుండెను. కాని, ముందును, వెనుకయును మృతకళేబరములచే మార్గము మూసికొనిపోయెను. అప్పుడు గుఱ్ఱముపై గుఱ్ఱమును, రౌతుపై రౌతును పడి సైనికు లందఱును తమతమ యాయుధములతోఁ బనిచేసి మార్గమును

కల్పింప నారంభించిరి. పరస్పరశస్త్రఘాతములచే గొందఱు మరణించుచుండిరి.

"ఎవడు? జాగ్రత! భద్రము! ఎడమవైపున మార్గ మున్నది!" అని మాణిక్యాలాలు కేకలువైచెను. రాజకుమారియున్న పల్లకియును, మాణిక్యాలాలును నిలిచియున్న ప్రదేశమునకు ముందువైపుననే యీ యల్లరి బయలుదేరెను. బోయలు తమప్రాణముల నెట్లయినఁగాపాడు కొనవలయు నని మిగుల భయపడుచుండిరి. అశ్వములు బెదరి వారల పైఁబడునట్లుండెను. అకనుమలనడుమనున్న యిరుకుత్రోవ కొకపార్శ్వమున మిగులసన్ననిరంధ్రమునుండి యొకమార్గ మున్న దని పాఠకుఁ లెఱింగియే యున్నారు. ఆమార్గమునుండి యొక్కొక్కఁడుగఁ బోవుటకుఁ దగినయవకాశ మున్నదియే గాని గుంపులు గుంపులై పోవుటకుఁ దగినంతయవకాశము లేదు. ఆసేనామధ్యమునందున్న పాలకి యీయడ్డత్రోవకుఁ జేరునప్పటికే యీగందరగోళము కలిగెను. ఇది యంతయును రాజసింహుఁడు చేసిననియమమే. చతురమతి యగుమాణిక్యాలాలు ప్రాణభయంబునఁ గలవలపడుచున్నబోయల కాయడ్డత్రోవను జూపించెను. యాబోయలు తమప్రాణములను, రాజకుమారి ప్రాణములను గాపాడుకొనుటకై పల్లకితోఁగూడ నామార్గమును బట్టిరి. మాణిక్యాలాలు తురగారూఢుఁడై వారివెనుకనే యామార్గమున బ్రవేశించెను. అతని సమీపముననున్న మఱియొక యోధుఁడిదియే ప్రాణరక్షణోపాయ మని తానుగూడ బోవఁజూచుచుండ నాకస్మికముగా నాపర్వతశిఖరమునుండి పెద్దచాపఱాయియొకటి క్రిందబడి యారంధ్రమార్గమును మూసివైచెను. శిలాఘాతమువలన నా యోధునిశరీరము తుత్తునియలైపోయెను. మఱియెవ్వరికి నామార్గమునుండి పోవుటకు సాధ్యపడలేదు. మాణిక్యాలా లొక్కఁడుమాత్రమే పల్లకితో నాత్రోవను బోయెను.

సేనానాయకుఁడగు హసన్‌ఖ్లీఖాన్ మన్సబుదారుఁడు సేనకంతకును వెనుకభాగమున నుండెను. అతఁ డాయశ్వసైన్యము నాయిరుకు త్రోవనుండి ప్రయాణముచేయుట కాజ్ఞాపించి తానుమాత్రము భద్రముగా వెనుక నిలిచి వచ్చుచుండెను. ఆకస్మికముగా సైనికులెల్లరు వెనుదిరుగుచుండుటను చూచి "ఇదియేమి? ఇదియేమి?" అని యెవ్వరి నడిగినను నాతనికెవ్వరును వాస్తవమును చెప్పలేకపోయిరి. అప్పుడాతఁడు సైనికులను నిందించుచు నదియేమో తెలిసికొనవలయు నని తనంతఁ దానే ముందునకుఁ బోయెను.

కాని, యంతవఱకును సేనలు నిలువఁజాలకుండెను. ఎడమవైపుకొండ చాలనెత్తయినదనియును, నెక్కుట కసాధ్యమైనదనియు, శిఖరము బండఱాళ్ళచే నావరింపఁబడి యున్నదనియు మొదటనే చెప్పియుంటిమి. రాజపుత్రులుమాత్ర మాకొండ నెక్కుమార్గమును గనిపెట్టి నేఁబదిమందిరాతులు మీఁదికిఁ బోయి యెవ్వరికి నగపడకుండ నూఱుగజముల కొక్కొక్కఁడుగ నిలిచి యారాత్రియంతయును శ్రమపడి ప్రోగుచేసికొనినబండఱాళ్ళను క్షణక్షణమునకు గ్రిందనుండి పోవుచున్న మొగలాయిసైనికులమీఁదికి దొరలించుచుండిరి. అందువలన క్షణమున కొకయేఁబదిమందిరాతులుగాని, యేబదిగుఱ్ఱములుగాని నాశనమైపోవుచుండిరి. ఆఱాతిబండలను విసరువా రెవ్వరో క్రిందివారికి తెలియుటలేదు. కొండమీఁద నిలిచియున్నశత్రువులను జంపుటకు గ్రిందివారి కెట్లు సాధ్యమగును? ఆకారణమున మొగలాయిలకు బాఱిపోవుటకంటె వేఱుమార్గ మేమియును గోచరించుటలేదు. పల్లకికి ముందున్న వేయిమంది రాతులలో జావకుండ మిగిలినవారెల్లరు నామార్గమునుండి తప్పించుకొని ముందునకు బాఱిపోయిరి.

ఆయేఁబదిమందిరాజకుమారులు నట్లే యెడమవైపు పర్వతముపైనుంచి శిలావర్షముఁ గురిపించుచుండిరి. మిగిలిన యేఁబదిమందియు

తమప్రభువితోఁ గుడిపైపున నంతయెత్తుగాలేని మెట్టపై దాఁగికొని యుండిరి. ఇంతవఱకు వారేమియును చేయుటలేదు. ఇప్పుడు వారికిఁ బనిచేయవలసిన యవసరము తటస్థించెను. ఎక్కడ నతిదారుణశిలా వర్షమువలన సైనికులు నాశనమైపోవుచుండిరో యావైపుననె ముబారకుకూడ నుండెను. అతఁడు మొట్టమొదట తనసైనికుల స్థలము నుండి దప్పింపవలయునని ప్రయత్నించెను. కాని, చూచుచుండఁగనే పల్లకి యాసన్నని రంధ్రమార్గమునుండి పోవుటయును, ఆవెనుక నొక యాశ్వికుఁడు కూడఁ బోవుటయును, తోడనే యొకచాపఱాయి పడి యా మార్గమును గప్పివేయుటయు తటస్థించెను. ఇది యంతయును జూచి యాతఁడు, దురాత్ముఁ డెవ్వఁడో రాజకుమారి నపహరించు కొనిపోవుటకై యిట్లు చేసియుండు నని నిశ్చయించి తన సైనికులను బిలిచి "ఓవీరయోధులారా! ప్రాణములు పోయినఁ బోనిండు. ఇందు నూర్గురుయోధులు తమయశ్వములను విడిచి బలవంతముగా నీచాప ఱాతిపై కెక్కి దుమికి యీమార్గమున పల్లకివెనుకనే పోవలయును! రండు! నేనుఁగూడ వచ్చెదను" అని చెప్పుచు ముబారకు ముందుగా గుఱ్ఱమును దిగి మార్గమున కవరోధముంగూర్చిన యాఱాతిపై కెక్కి యవ్వలివైపునకు దుమికెను. ఆతనిం జూచి తక్కినవా రందఱు నట్లే దుమికి యావలఁ బ్రవేశించిరి.

ఇది యంతయును రాజసింహుఁడు మెట్టపైనుండి చూచుచుండెను. ఆమొగలాయిసైనికులు లోపలఁ బ్రవేశించునంతవఱకు నెవ్వరితోడ నేమియును జెప్పకుండ నట్లేయుండి వారు వచ్చుట యాగిపోయినతోడనే తన యేఁబదిమంది రాజపుత్త్రులతోడను క్రిందికి దిగివచ్చి వారిపైఁ బడియెను. రాజపుత్త్రులు మొగలాయిలపైఁ బిడుగులపోలికంబడి నుఱుమాడుచుండిరి. రాజపుత్రయోధులు తమతమ యుత్తమాశ్వముల నధిరోహించి పైనుండి క్రిందికాకస్మికముగా

దిగివచ్చి యొక్కమారుగా దపుస్సైః బడుటచే మొగలాయిసైన్యము లంతలోః జెల్లాచెదరై పోయిరి. అందు చాలమంది ప్రాణములనే గోలుపోయిరి. పైనుంచి దాఃటుకొనుచు వచ్చుచున్న జవనాశ్వముల పదాఘాతములచేః గొందఱు మరణించిరి. ఏఃడెనమంద్రు యోధులు మాత్రము ప్రాణములతో నిలువఃబడి యుండిరి. ముబారకు వెను దిరిగి యావలకు దాఃటివచ్చెను. రాజపుత్రు లాతని నెన్నాడి రాలేదు.

ఆముబారకుతోఃగూడ మొగలాయి వేషధారి యగుమాణిక్య లాలుగూడ వెలుపలకు వచ్చి యటః జనిపోయిన యోధునిగుఱ్ఱము దీసికొని యధిష్ఠించి యావిశృంఖలసేనాసాగరమధ్యమునం బడి వెడలి పోయెను. అతని నెవ్వరును చూచి పట్టుకొన లేదు.

మొగలాయి యోధులు వచ్చినత్రోవనే మాణిక్యలాలుకూడ వచ్చుటచే చూచినవా రందఱు నాతఃడు పలాయితుఃడైన మొగ లాయిసైనికుఃడే యనుకొనిరి. మాణిక్యలాలటనుండి వాయువేగమున రూపనగరాభిముఖుఃడై పోయెను.

ముబారకు తనసేనలతో "ఈమెట్ట చాల చిన్నదగుటచే నెక్కుటకు సాధ్యము కాకపోదు. అందఱును గుఱ్ఱములపై నెక్కి యీ మెట్ట నెక్కవలయును. దొంగలసంఖ్య చాలస్వల్పముగా నున్నది. సమూలముగ వారిని సంహరింపవలయును. రండు!' అని హెచ్చ రించెను. అప్పుడు మొగలాయిసైనికులు 'దీన్ దీన్' అని కేకలు వేయుచు కుడిసైవుకొండపై కెక్కుట కారంభించిరి. వారికి ముబా రకు నాయకుఁడై యుండెను. వారియొద్దనున్న పిరంగులు రెంటిలో నొకదాని నామెట్టపైకి దీసికొనిపోవుచు రెండవచిన్నపిరంగి నొక యేనుగుచే నెత్తించి యారంధ్రముఖంబున నున్న చాపఱాతిపై ఖాయముచేసి యుంచిరి.

# నాలుగవ ప్రకరణము

## జయశీలయగు చంచల

అప్పుడు 'దీన్ దీన్' అని కేకలు వైచుచు నైదువందల యాశ్వికులు కాలకింకరులవలె నామెట్టపై నధిష్ఠించిరి. మెట్టయంత యెత్తుయినది కాదు. అందువలన నామెట్టపై కెక్కుటకు వారికి చాలసేపు పట్టలేదు. వారి కామెట్టపై నెవ్వరు నగపడలేదు. ముబారకు, తాను వెనుదిరిగి వచ్చినరంధ్ర మార్గముఖంబుననే దొంగలు (రాజపుత్రులను ముబారకు దొంగలని తలంచెను) కాచి యుందు రని నిశ్చయించుకొనియెను. అటనుండి వెలుపలికి బోవుట కొకమార్గమున్నది. ఆమార్గమును మూసివైచి రాజపుత్రులపైబడి నురుమాడవలయు నని ముబారకు స్థిరపరచుకొనియెను. మొదటిరంధ్రముఖమున హాసనల్లీ సేనలతో గాచి యుండగలడని తలంచి తాను మఱియొక రంధ్రమునుబట్టి సేనలతో బయలుదేరి పోయెను. అక్కడ నలువదియాఱుగురు రాజపుత్రులు — చాలమంది లేరు— నలువదియిద్దరు మాత్రమే రక్తమయగాత్రులై పల్లకితో గూడ బోవుచుండిరి. అప్పుడు ముబారకు 'ఇటనుండి వెలుపలికిబోవుమార్గము వీరికి దెలిసియుండవచ్చును; వీరివెనుకనే మెల్లమెల్లగ బోయిన మనకు నామార్గము తెలియగలదు' అని యనుకొని వారివంక జాగరూకుడై పరీక్షించుచు వారుపోవుచున్న త్రోవనే తానును బయలుదేరెను. కొంతదూరము పోవుసరి కామెట్ట యేటవాలుగ గ్రిందికి దిగజారియుండెను. అచ్చోటనే వెలుపలికి బోవుమార్గముకూడ నాతని కంటబడియెను. అప్పుడు ముబారకు తనసేనలతోగూడ గుఱ్ఱముల నుదాయించుకొనుచు బోయి యానిర్గమమార్గము నడ్డుకొనియెను. రాజపుత్రులు కొంచె మాయాసపడ వచ్చుచున్నవారగు

నాచోటికి ముందుగ జేరుకొనలేకపోయిరి, మొగలాయియోధులా మార్గము నడ్డుకట్టివైచి యారంధ్రముఖంబున కెదురుగ దమ ఫిరంగిని బారుచేసి యుంచిరి. అంతియకాక అక్కడకువచ్చుచున్న రాజపుత్త్రిలను నిందించి యుపహసింపవలయునని యెంచ 'దీన్ దీన్' అను శబ్దములచే గోలాహలము చేయుచుండిరి. ఆశబ్దములచ్చటికొండల యందెల్లెడ బ్రతిధ్వనించుచుండెను. రంధ్రమువెలుపలనున్న హసన్ఖా ఖానాకోలాహలము నాలకించి దానికి బదులుగాదనఫిరంగిని గాల్పించెను. పర్వతము లన్నియును గడగడవడంకెను. రాజపుత్త్రిలుకూడ గొంచెము బెదరిరి. వారియొద్దనొక ఫిరంగియును లేదు.

రాజసింహు డెంతయాలోచించినను తాము నిలుచుట కుపాయ మేమియును తోచలేదు. మొగలాయిసైన్యము తమకంటె నిరువదిరెట్లు పెద్దదిగా నుండెను. తప్పించుకొని వెలుపలకు వెడలిపోవు మార్గము కట్టువడిపోయెను. అప్పుడు రాజసింహుడు తనసైనికులను జేరబిలిచి వారితో నిట్లనియెను.

"సోదరులారా! బంధుమిత్రులారా! ఇప్పట్టున మీరోరిమి కలిగియుండవలయు నని మనఃపూర్వకముగ వేడికొనుచున్నాను. నా మూలముననే యింతటివిపత్తు సంభవించినది. కొండపైనుండి క్రిందికి దిగివచ్చుట చాల ప్రమాదకరమైనపని. ఇప్పు డీరంధ్రములు రెండును కట్టువడిపోయినవి. రెండురంధ్రముల ముఖద్వారములయందును ఫిరంగిగుండ్ల శబ్దము వినవచ్చుచున్నది. ఇరువంకలను మనకంటె నిరువదిరెట్లుమించిన మొగలాయిసైన్యము నిలిచియున్నది. కావున మనము జీవములతో నిలుచుట యసంభవము. లేదు. అయిన నిందువలన గలిగిన నష్టమేమున్నది? రాజపుత్త్రుడైనవా డెవ్వడు చావునకు భయపడును? అందఱమును చావవలసినదే. ఒక్కడును జీవించియుండ నక్కఱలేదు—కాని, చంపి చావవలయును. మరణించుటకుముం

దీసుపుడు మొగలాయియోధులనైన జంపకుండ జచ్చువాడు రాజపుత్రు లారా! వినుండు! ఈమార్గమునుండి గుఱ్ఱములు నడువజాలవు. అందఱును గుఱ్ఱములనుండి క్రిందికి దిగి నావెంటరండు. మన మందఱమును మనచేతులయందలినిశితకరవాలముల జక్రాకృతిం ద్రిప్పికొనుచు నందినంతవఱకు మొగలాయియోధుల శిరఃకర్తనంబు చేయుచు బోయి యాపిరంగిపై బడుదము. దైవయోగమువలన నాపిరంగి మన చేతులలో బడియెనా—అవిూదచూచుకొందము—ఎంతమంది మొగలాయిలనుపొడచి, కాల్చినాశనముచేయుదుమో!—అవిూదచూచుకొందము—''

ఈమాటలను విని రాజపుత్రులందఱును గుఱ్ఱములనుండి క్రిందికి దుమికి కరవాలముల నొరలనుండి దూసి పట్టుకొని ''మహారాణాకు జయ మగుగాక!'' అని జయధ్వానముల నాచరించిరి. వారి దృఢతరప్రతిజ్ఞలును, వారిగంభీరముఖకాంతులును జూచి రాజసింహుడు ''ప్రాణములు పోయినను విచారములేదు. ఒకరాజపుత్రుడైనను రణరంగమునుండి వెనుదిరిగి రాగూడదు.'' అని తెలియజెప్పి సంతోషస్వాంతుడై ''మహావీరయోధవరులారా! మీరిద్దఱిద్దఱుగ వరుసలు తీరి రావలయును'' అని యాజ్ఞాపించెను. ఇరువురు పాదచారులై ముందును, అశ్వికుడై యొక్కడువారివెనుకనుగా నిట్లే వరుసతీరి ముందునకు బోవుచుండిరి. మహారాణా రాజసింహు డందఱికంటెను ముందుగ నడచుచుండెను. అప్పటి యాసన్నమృత్యుకరాళ వదనగహ్వరముంగాంచి యాతడు వికసితహృదయారవిందుడయ్యెను.

అప్పు డాపర్వతరంధ్రము వడవడవడంక, పర్వతగర్భముల బ్రతిధ్వను లుదయింప రాజపుత్రులెల్లరును ''మహాకాళికి జయమగుగాక! జగన్మాతకు జయమగుగాక!'' అని జయధ్వానములు సేయు నారంభించిరి.

అత్యంతానందసూచకము లైన యూకోలాహలధ్వనుల నాల కించి రాజసింహుఁ డిది యేమైయుండు నని వెనుదిరిగి చూచునప్పటి కిరువంకలను రాజపుత్రవీరులుపక్కలుతీరి నిలువబడి యుండిరి! వారి నడుమ నాకర్ణాంతవిలోలలోచనయు, మందహాసముఖారవిందయు నగునొక దేవీమూర్తి నడచివచ్చుచుండెను. సాక్షాజ్జగన్మాతయగు కాళిక మనుష్యాకృతిం దాల్చి వచ్చుచున్నదో, కాక, సృష్టికర్తయగు పరమేశ్వరుడు మానవిని దేవీమూర్తిగా సృష్టించెనో, నిజము తెలిసి కొనుట కెవ్వరికిని శక్యముకాకుండెను. ఆమెనుజూచి రాజపుత్రు లంద ఱును చిత్తూరుదుర్గసంరక్షణదీక్షాదక్షయు, రాజపుత్రకులోద్ధారిణియు నగు సాక్షాద్భగవతియే యీవిపత్కాలమున రాజపుత్రసంరక్షణము నకై రణరంగమున సాక్షాత్కరించెనని యనుకొనిరి.

రాజసింహుఁడు మాత్రము "ఈమె నిజముగా మనుష్యాంగ నయే కాని స్వామాన్యకాంతమాత్రము కాదు" అని యనుకొని "పల్లకి యెక్కడ నున్నదో చూచితిరా?" అని కేకవైచెను.

అప్పుడాతని వెనుకనున్న యోధుఁ డొకఁడు "పల్లకి యిక్కడ నున్నది" అనియెను.

రాజ—అందెవ్వరైన నున్నారో లేదో చూడుము.

యోధుఁడు పల్లకిలోపలఁ జూచి "ఇందెవ్వరును లేరు. రాజ కుమారిక దేవర సమక్షముననే యున్నది" అనియెను.

చంచలకుమారి సమీపమునకు వచ్చి రాజసింహునకు నమ స్కారముచేసెను.

రాజ—నీవిక్కడ కెందులకు వచ్చితివి?

చంచ—మహారాజా! మీకు నమస్కరింప వచ్చితిని. నమ స్కరించితిని. ఇంకొక ప్రార్థన మున్నది. నేను ముగ్ధురాలను. స్త్రీలకు ముఖ్యాలంకారమైన లజ్జయనునది నాకడ నెంతమాత్రమును లే

పోయినందులకు మన్నింపవలయును. అందునుగూర్చి నేను మనవి చేసికొనలేకని యనుకొనవలదు.

అని చంచలకుమారి భయముతో వేడుకొనియెను.

రాజ—నీకొఱకే యింతదూరము వచ్చితిని. ఓరూపనగరకన్య కామణీ! నీకుఁ జేకూర్పరాని దేదియును లేదు. నీకేమి కావలయును?

చంచలకుమారి చేతులు జోడించుకొని "నేను చంచల హృదయనగు బాలికనగుటచే నిటకు రావలసినదని మీకు లేఖ వ్రాసియుంటిని. కాని, నాహృదయమునందలి నిజమైన యభిప్రాయము మును మీరింకను తెలిసికొని యుండ లేదు. నేనిప్పుడు మొగలాయి సార్వభౌముని వైభవ వృత్తాంతమును విని ముగ్ధనైయుంటిని. మీ రాజ్ఞ యొసంగితి రేని నేను డిల్లీకిఁ బోయెదను" అనియెను.

ఈమాటలను విని రాజసింహుఁడు విస్మితుఁడయ్యు నామె యందలి ప్రేమచే "నీకు డిల్లీకిఁ బోవలయునని యుండిన నట్లే పోవచ్చును. నేనేమియు నభ్యంతరము చెప్పువాఁడను గాను. కాని నీవిప్పుడు పోవుటకు మాత్రము వలనుపడదు. ఇప్పుడు నిన్ను పంపి నైచితినేని మొగలాయిలకు భయపడి యిట్లు చేసితినని వారునాపై నింద మోపఁగలరు. సంపూర్ణముగ యుద్ధము ముగియనిమ్ము! తరువాత నీవు పోవచ్చును. మఱియును, నేను నీహృదయభావమును తెలిసికొనలేకపోయితి|నని భావింపకుము. నేను జీవములతో నున్నంత వఱకు నీవెన్నఁడును డిల్లీకిఁ బోవఁజాలవు" అని చెప్పి సైనికులను గూర్చి "మీరు ముందునకు బయలుదేరుఁడు" అని యాజ్ఞాపించెను.

అప్పుడు చంచలకుమారి చిఱునవ్వు నవ్వుచు హృదయమర్మ భేదకంబులగు మృదుమధుర కటాక్షమాలికలం బ్రసరింపఁ జేయుచుఁ దన దక్షిణహస్తమునందలి చిటికెనవ్రేలియందున్న వజ్రపుటుంగర ముందీసి యెడమచేతియం దుంచుకొని రాజసింహునకుఁ జూపించుచు

"మహారాజా! ఈయుంగరమునందు విషమున్నది. నన్ను ఢిల్లీకిఁ బోనీయకుంటివేని నేను విషపానమువలనఁ బ్రాణత్యాగము చేసికొనియెదను" అనియెను.

రాజసింహుఁడు నవ్వుచు "ఓ రాజకుమారీ! నేను చాలసేపాలోచించి తెలిసికొన్నదిదియే. రమణీయమణులలో నీవే ధన్యురాలవు. కాని నీవు యోచించినట్లెన్నటికిని కాఁజాలదు. ఈదినమున రాజపుత్రవీరులు విధాయకముగఁ జచ్చితీరవలయును. లేనియెడల రాజపుత్రకులమునకంతకును గళంకము నాపాదించినవారగుదురు. నేనెంతవఱకు జీవములతో నిలిచియుందునో యంతవఱకును నీవు బందివై యుందువు. నామరణానంతరమున నీవెక్కడకుఁ బోవలయునో యక్కడకుఁ బోవచ్చును." అనియెను.

చంచలకుమారి ప్రణయమధురంబులగు మందహాసచంద్రికల చేదనముఖమండలమును వికసింపజేయుచు భక్తిపూర్వకముగ వినతయై సాక్షాన్మహాదేవునకైన ననివార్యములగు తన క్రేగంటిచూపు తూపుల రాజసింహునిపైఁ బరగించుచు తనలోదానే "వీరచూడామణీ! ఇదిమొదలు నేను నీదాసినైతిని. నీదాసిగానుండుటకు దక్క మఱియొందులకును చంచలప్రాణములతో నిలువజాలను." అని యనుకొని ప్రకాశముగా "మహారాజా! ఏ కాంతామణిని ఢిల్లీసార్వభౌముడు దేవిగా జేసికొనదలచియుండెనో, అట్టి సుందరీమణి నితరులెవ్వరు బందిగా జేయగలరు? ఇదిగో! చూడుడు! నేను మొగలాయి సేనాసముద్రమునకు బయలుదేరుచున్నాను. నన్నడ్డపెట్టువా రెవ్వరో చూచికొనుడు!" అని చెప్పుచు నా చంచలకుమారి—అమానవాకారముందాల్చిన సాక్షాద్దేవీమూర్తి—రాజసింహుని దనకటాక్షమాలికలచే బంధించి రంధ్రమార్గాభిముఖియై బయలుదేరి పోయెను. నవనవోన్మేషవిలాసభాసురంబును, పవిత్రతేజోభిరామంబును నగు నా [illegible]

స్పృశించుట కెవ్వాడు సాహసింపఁగలఁడు? ఆమె నెవ్వరును పోకుండ నడ్డగొనలేదు. మందహాససుందర వదనారవిందముతో నతివిలాసముగ బాదవిన్యాసమును జేయుచు స్వర్ణముక్తామయంబగు నాజీవ నజ్యోతి నిరాఘాటముగ రంధ్రమార్గాభిముఖురాలై పోయెను.

ప్రజ్వలజ్జ్వాలాభీలంబగు దావానలంబుపోలిక మండిపడుచున్న శత్రుప్రాణులగు నాయేనూర్గురాశ్వీక యోధులయొద్దకును బోయి చంచలకుమారి యేకాకినియై నిలువబడియెను. త్రోవ కడ్డముగా నిలిపి యుంచిన యాపిరంగి—ఆమనుష్య నిర్మితమైన వజ్రాయుధము మహానలజ్వాలల నుమియుచు శాత్రవ యోధప్రాణపుష్పముల నాహుతిగా గొనదలంచి మృత్యుముఖముం బోని తనకరాళవదన గహ్వరమును దెఱచియుంచికొని యున్నయాశతఘ్ని—అట్టిభయంకరంబగు నాయసయంత్ర ముఖంబున కెదురుగబోయి, లోకాతీతపవిత్రచరిత్రయు, త్రిలోకసుందరియు, రత్నాలంకార విభూషితయునగు నా చంచల నిర్భయముగా నిలువబడియెను. మొగలాయిసైనికు లామెం జూచి విస్మితులై పర్వత నివాసిని యగు దేవకన్యయే యాయని భావించిరి.

అప్పుడు చంచలకుమారి "సేనానాయకు డెవ్వరు?" అని మనుష్యభాషణములతోడనే ప్రశ్నించి వారి సందేహమును తీర్చివైచెను.

రంధ్రముఖమునందు ముబారకు స్వయముగా నిలిచియుండి రాజపుత్త్రిలరాకకై యెదురుచూచుచుండెను. ఆత డామెంజూచి "అమ్మా! ఈసేన యంతయు నీయుధమునియధీనమునందే యున్నది; తల్లీ! మీరెవ్వరు?" అని యడిగెను.

"నేను సామాన్యురాలనగు నాడుదానను. నీతో గొంచెము మాటలాడవలసియున్నది. నీవొక్కడవును వేఱొకస్థలమునకు వచ్చితివేని చెప్పెదను" అని చంచలకుమారి పలికెను.

ముబారకు "అటులైన నీరంధ్రమునకు రావచ్చును" అనియెను చంచలకుమారి రంధ్రమధ్యమునకు బోయెను. ఆమె వెనుకనే ముబారకును పోయెను.

తనమాట లితరుల కెవ్వరికిని వినబడకుండునట్టి యొకస్థలమునకు వచ్చి చంచలకుమారి "నేను రూపనగరరాజపుత్రికను. బాదుషావారు నన్ను బెండ్లియాడవలయునను నభిలాషతో నన్నుదీసికొనిపోవుట కీసైన్యమును పంపియున్నారు. ఈమాట నమ్మెదవా? నమ్మవా?" అనియెను.

ముబా—అమ్మా! మిమ్ములను చూచినంతమాత్రముననే మీమాటలను నమ్ముచున్నాను.

చంచ—నేను మొగలాయిచక్రవర్తిని పెండ్లిచేసికొనుట కిష్టములేనిదాననై యున్నాను. అట్లు చేసికొన్నయెడల ధర్మచ్యుతనై పాపాత్మురాలనై పోవుదు నని నానిశ్చయము. మాతండ్రి యంతబలవంతుడు కాకుండుటచేనన్ను మీతోగూడ బంపించివైచెను. నాయుద్దేశమునకు నాతండ్రి యెంతమాత్రమును తోడ్పడజాల డని యెంచి రాజసింహునియొద్దకు నేనొకదూతను బంపితిని. నాదురదృష్టవశంబున నాతడేబదిమంది రాజపుత్రయోధులను మాత్రమేసహాయముగ దీసికొని బయలుదేరివచ్చెను. ఆతని బలవీర్యశౌర్యప్రతాపములను చూచియుంటివిగదా.

ముబారకు వెఱగుపడి 'ఇదేమి? ఇంతమంది మొగలాయివీరులను నాశనముచేసినవా రేబదిమందిసిపాయిలు మాత్రమేనా?' అనియెను.

చంచ—ఇది యెంతఎంత? ఇట్టియుద్ధము లిదివఱ కనేకములు జరిగినవి. దానికేమి—ఇప్పుడు మహారాణా రాజసింహుడు నీచే జయింపబడియెను. అందువలననే మీయొద్దకు నేను స్వయముగా

వచ్చితిని. నన్ను ఢిల్లీకి దీసికొనిపొండు! ఇక యుద్ధముతో బ్రయోజన మేమున్నది?

ముబా—నీవు స్వార్థత్యాగము చేసికొని రాజపుత్రుల ప్రాణములను నిలుపవలయునను నభిప్రాయముతో నున్నట్లు తోచుచున్నది. వారిందుల కంగీకరించిరా?

చంచ—వారంగీకరించుట యెట్లు సంభవించును? నీవు నన్ను దీసికొనిపోయినను వారు యుద్ధము చేయుట మానువారు కారు. నా కోరిక యేమంటివేని—నీవు నాయభిప్రాయము నామోదించి వారి ప్రాణములను గాపాడుము.

ముబా—అట్లే కావచ్చును. కాని, దొంగలను విధాయకముగ శిక్షింపవలయును. కావున నేను వారిని పట్టి బంధించి తెచ్చెదను.

చంచ—నీవేమిచేసినను చేయగలవుగాని యాపనిమాత్రము చేయజాలవు. వారిని చంపిన జంపవచ్చునేగాని ప్రాణములతో నుండగా బంధించి తెచ్చుట యసంభవము. వారందఱును మరణించుటకు సంసిద్ధులై యున్నారు. చచ్చెదరు. సందేహము లేదు.

ముబా—సరియే అందులకు నేనంగీకరించితిని. కాని. మీరు ఢిల్లీకి వచ్చుట నిశ్చయమేనా?

చంచ—ఎట్లయినను మీతోగూడ వచ్చుటకే నిశ్చయించుకొంటిని. ఢిల్లీనగరమువఱకును చేరుదునో, లేదోమాత్రము సందేహము.

ముబా—అదియేమి?

చంచ—మీరు యుద్ధము చేసి చచ్చుట యెఱుంగుదురు. ఆకస్మికముగా నెట్లుచావవలయునో నేనుమాత్ర మెఱుంగనా?

ముబా—మాకు శత్రువులున్నారు. అందువలన మేము చావవచ్చును. ఈభూమండలమున మీకెవ్వరైన శత్రువులున్నారా?

చంచ—నాకు నేనే శత్రువును.

ముబా—మా శత్రువుల చేతిలో నస్త్రశస్త్రము లుండును. మీకో?

చంచ—విషము—

ముబా—ఎక్కడ నున్నది?

అనియడిగి ముబారకు చంచలకుమారి మొగమువంక జూచు చుండెను. ఆతడుగాక మఱియెవ్వరైన నచ్చటనున్నయెడల వారామె తరళనయనములకంటెను మించినవిషయము మఱియొకటి యుండదని భావించియుందురు. ముబారకుమాత్ర మట్టిచంచలస్వభావముగల పురుషుడై యుండలేదు. ఆతడు రాజసింహునివలెనే నిజమైన వీర పురుషుడై యుండెను.

ముబా—అమ్మా! ఆత్మహత్య యేల చేసికొనవలయును? ఢిల్లీకి బోవుటకు మీకిష్టము లేనియెడల మిమ్ము దీసికొనిపోవుట మాకు సాధ్యమగునా? మొగలాయిసార్వభౌముడు స్వయముగా వచ్చి నిలిచినను మీపై నాతనిబల మెంతమాత్రమును పనిచేయజాలదు. అట్టిచో నధములమగు మే మెంత? మీరు నిర్విచారముగా నుండుడు! కాని, యీరాజపుత్రవీరులు మొగలాయిసైన్యము నాక్రమించి యున్నారు. మొగలాయిదండనాయకుడనగు నేను వారిని మన్నించుటయెట్లు?

చంచ—సరియే. మన్నించుటవలన బ్రయోజనము లేదు. యుద్ధమే చేయుము.

ఇట్లు వారు మాటలాడుచుండగా నంతలో రాజపుత్రవీరులను దోడ్కొని మహారాణా రాజసింహు డచ్చటికివచ్చి నిలిచెను. అప్పుడు చంచలకుమారి ముబారకుతో "యుద్ధము చేయుము! రాజపుత్రస్త్రీల కుగూడ నచ్చట కుపాయము తెలియకపోలేదు" అనియెను.

మొగలాయిసేనానాయకునితో సిగ్గులేకుండ( జంచలకుమారి యేమి మాటలాడుచున్నదో వినవలయు నని రాజసింహుఁడు వచ్చి చంచలపార్శ్వముననే నిలువఁబడియెను. అప్పుడు చంచల రాజసింహునివంకఁ జేయిచాచి "మహారాజాధిరాజా! నీకటిస్థలమున నురగముంబోలె వ్రేలాడుచున్న కరవాలమును బహుమానముగ నీదాసికి దయచేసి కూడవలయును" అనియెను.

రాజసింహుఁడు నవ్వుచు "నీవునిజముగా భైరవివే యగుదువని తలంచుచున్నాను" అని చెప్పి తన నడుమునకుఁ గట్టినదట్టీనుండి వ్రేలాడుచున్న దారుణకృపాణము నొరనుండితీసి యామెచేతికిచ్చెను.

మొగలాయిసేనానాయకుఁడగు ముబారక కది యంతయును చూచి చంచలమాటకుఁ బ్రత్యుత్తరము చెప్పకుండగనే రాజసింహునివంకఁ జూచి "ఉదయపుర రాజపుత్రవీరు లెన్నిదినములనుండి యబలల బాహుబల మాధారముచేసికొని రక్షింపఁబడుచున్నారు?" అనియెను.

రాజసింహునిప్రదీప్తములగునేత్రములు నిప్పులఁ గురియుచుండెను. అప్పుడాతఁడు ముబారకుతో "మొగలుబాదుషా యెన్నిదినములనుండి యబలలగుసుందరులపై నత్యాచారమును జూపుచున్నాఁడో యదిమొదలుకొనియే రాజపుత్రకన్యకల కోమలబాహువల్లరులయందు బలపరాక్రమశక్తు లుదయించినవి" అని చెప్పి మృగేంద్రమువలె గ్రీవాభంగము చేసి తమవారివంక జూచి "రాజపుత్రవీరులారా ఉత్తమక్షత్రియకులాలంకారులగు మహావీరులు వాక్కలహమునందసమర్థులని పేరుమోచియున్నవారు. ఈయల్పసైన్యముతో వృథా వాక్కలహము చేయుచుండుటకు మనకుఁ దీరికలేదు. ఈమొగలాయి యోధుల శిరంబులఁ దాళఫలంబులవలెఁ దెగనఱకి యీభూదేవి కుపహారముగ నర్పింపవలయును. త్వరపడుఁడు! త్వరపడుఁడు" అని హెచ్చరించెను.

ఇంతవఱకు నుభయసేనలును వస్త్రోన్ముఖంబులగు మేఘముల వలె స్తంభించి యుండెను. తమతమప్రభువులయాజ్ఞలేక యెవ్వరును యుద్ధమున ప్రవేశించుట కసమర్థులై యుండిరి. ఇప్పుడు మహారాణా రాజసింహునియాజ్ఞయగుటచే "జయకాళీ!" అని ధ్వనిసేయుచు రాజపుత్రవాహిని మొగలాయి సైన్యముపైఁ బడియెను. ఈవంక ముశారకు నాజ్ఞననుసరించి "అల్లాహో అక్బర్"అని కోలాహలము సేయుచు మొగలాయియోధులు రాజపుత్రుల నెదుర్కొనుటకు సన్నద్ధులైరి. అంతలో నుభయసైన్యములును నిశ్చలములై, నిశ్శబ్దములై నిలువఁబడిపోయెను. ఆమహారణక్షేత్రమున, నాయుభయసేనామధ్యమున భయంకరకరవాలమును దన దక్షిణహస్తమునం బట్టి యెత్తి—యాయచలమూర్తియగు చంచలకుమారి నిలువఁబడి యుండెను. ఏమియును చలించుటలేదు.

అప్పుడు చంచలకుమారి యుచ్చస్వరముతో "ఈ యుభయపక్షములయోధులలో నెవ్వరైన నొకపక్షమువారీరణక్షేత్రమునుండి వెడలిపోవునంతవఱకు నేనీస్థలమునుండి యొక్కయడుగైన నావలఁ బెట్టుదానను గాను. నాయుత్తమాంగమును ఖండించినవెనుకఁ గాని యీ యిరువాగులలో నెవ్వరైనను తమయస్త్రములను చలింపఁ జేయఁజాలరు"అని పలికెను.

అప్పుడు రాజసింహుఁడు కోపముతో "ఇట్టిపని నీవు చేయఁదగినదికాదు. నీవు నీచేతులార రాజపుత్రవీరుల కీయవమానకళంకమును గల్పించుచున్నదానవు. ఇందుమూలమున రాజసింహుఁడొక్క స్త్రీ సాహాయ్యమువలనఁ దన ప్రాణముల రక్షించుకొనియె నని యింతకాలమునకు లోకు లనుకొనఁగలరు" అనియెను.

చంచ—మహారాజా! మీరు మరణించుటకు మిమ్మడ్డుకొన్న వారెవ్వరు? మొట్టమొదట నేను మరణించుటకిష్టపడుచున్నదానను.

ఇంతటి యనర్థమునకు మూలకారణ మెవ్వ తెయో యామెకు మొట్ట మొదటఁ జచ్చుట కధికారము లేకపోలేదు.

చంచల యటనుండి కదలలేదు. మొగలాయిసైనికులు తుపాకులను పైకెత్తిరి—బారుచేసిరి. అప్పుడు ముబారకు చంచలకుమారి సాహసకృత్యముం జూచి విమూఢుఁడై పోయెను. అతఁ డుభయ సేనాసమక్షమున నిలుపఁబడి "మొగలాయిసార్వభౌముఁ డబలలతో యుద్ధము సేయువాఁడుకాఁడు. అందువలన మేమీసుందరివిషయమున బరాజయము నంగీకరించి యుద్ధరంగమును వదలిపోవుచున్నాము. క్షేత్రాంతరమున రాణా రాజసింహునితో మఱియొకసారి యుద్ధము సేయుట తటస్థించినప్పుడు జయపరాజయములు నిర్ణయింపఁబడఁగల వని నమ్ముచున్నాము. అప్పుడుగూడ నిప్పటివలెనే యబలలను సహాయముగఁ దీసికొని రాఁగూడదని మహారాణాతో మనవిచేసి కొనుచున్నాము" అని పలికెను.

చంచలకుమారి ముబారకుకొఱకు కొంచెము విచారించెను. అప్పుడు ముబారకామె సమీపమునందే యుండెను. చంచలకుమారి యాతనితో "అయ్యా! ఏల నన్ను విడిచిపెట్టిపోయెదవు? బాదుషా నిన్నుఁ బంపుట నన్నుఁ దీసికొనిపోవుటకేగాదా? నీవూరకపోయి మీ బాదుషాతో నేమని చెప్పెదవు" అనెను.

ముబా—బాదుషా కంటెను గొప్పవాఁడు మఱియొకఁ డున్నాఁడు. అతనికిఁ బ్రత్యుత్తరము చెప్పవలయును.

చంచ—అతఁ డేమో పరలోకమునం దున్నాఁడు. కాని, యీ లోకమునందో?

ముబా—ముబారకల్లీఖా నిహలోకమునం దెవ్వరికిని భయపడువాఁడు కాఁడు. పరమేశ్వరుఁడు మీకు క్షేమము నొసంగుఁగాక! నేనాజ్ఞ తీసికొనియెదను.

ఇట్లు చెప్పి ముబారకు తనసైన్యమునకు వెనుదిరుగుట కాజ్ఞా పించెను. ఆసమయమునందు వెనుకనుండి యొక్కసారిగ వేయితుపాకు లుగాల్చినశబ్దము వినవచ్చెను. ఒక్కసారిగా నూఱుమంది మొగలా యియోధులు నేలపైఁ బడిపోయిరి. అప్పుడు దారుణమైనవిపత్తు సంభవించిన దని ముబారకు తెలిసికొనియెను.

---

## ఐదవ ప్రకరణము

### హరణాపహరణదక్షుఁడగుమాణిక్యలాలు

మాణిక్యలా లాకొండకనుమత్రోవనుండి క్రిందికి దిగివచ్చి గుఱ్ఱము నడాయించుకొనుచు నొక్కపఱుగున రూపనగరదుర్గమునకు చేరెను. రూపనగర ప్రభునియొద్దఁగూడ కొందఱు సిపాయి లుండిరి. వారు వేతనముల నందికొని పనిచేయువారు కారు. భూమి దున్ని కొని వ్యవసాయము చేసి జీవించురైతులు. అవసరమైనప్పుడు వారు కత్తి, కటారిమొదలగు పురాతనాయుధములం దీసికొని వచ్చుచుం దురు. వారికొక్కొక్కని కొక్కొక్క గుఱ్ఱముకూడ నుండెను. మొగ లాయిసైన్యము రూపగనరమునకు వచ్చినప్పుడు రాజు వారిని బలవంతముగఁ దీసికొనివచ్చెను. ఎల్లవిషయములును గనిపెట్టుచుండు టకును, మొగలాయి సైనికుల దగినమర్యాదలఁ జేయుటకును, వా రేర్పఱచినపనులను నిర్వహించుటకును రాజుచే నాసిపాయిలు నియ మింపఁబడిరి. అంతియకాక రహస్యముగా మొగలాయి సైన్యము వలన నేమైన తొందరలు కలిగినచో నట్టివానిని నివారణచేయుటకుఁ గూడ వారి నేర్పఱచి యుంచెను. రాజు పిలిచినతోడనే వారంద ఱును సిద్ధమై వచ్చియుండిరి. వారువచ్చినతరువాత రాజు తన

యాయుధశాలనుండి వారికిఁ దగిన యాయుధముల నిప్పించెను. వారందఱును తలకోకపనియందును బ్రవేశించి మొగలాయిసైనికులా పట్టణమునందున్నంతవఱకుఁ వారితోఁగూడి మహానందముగఁ గాల క్షేపమునుచేసిరి. ఇప్పుడు మొగలాయిసైన్యము రాజకుమారిని వెంటఁబెట్టుకొని ఢిల్లీకిఁ బోవుటవలన వారును తమతమ యిండ్లకుఁ బోవుటకు రాజునొద్ద సెలవులనందికొని తమ కిచ్చిన యాయుధము లన్నియు నాయుధశాలలో నొప్పగింపఁబోయిరి. రాజు వారితో నతి ప్రియంబుగ సంభాషించి వారి కాజ్ఞ నొసంగుచున్న సమయమున మాణిక్యలాలు గుఱ్ఱము నడాయించుకొనుచు నొడలంతయును చెమ్మటలుగ్రమ్మ రొజుచు నాకస్మికముగ నటఁబ్రవేశించెను.

మాణిక్యలాలు మొదటివలెనే మొగలాయియోధవేషమును ధరించి యుండెను. ఒకమొగలాయి సైనికుఁ డతిశ్రమంబున వెను దిరిగి వచ్చుటంగాంచి యటనున్నవా రెల్లరు నత్యాశ్చర్యముం బొందిరి. "ఏమిసమాచారము?" అని రాజడిగెను.

మాణిక్యలాలు రాజునకు నమస్కరించి "మహారాజా! చాల నల్లరి జరిగినది. వేయిమంది యడవిదొంగలు వచ్చి రాజకుమారిక నప హరించికొని పోయిరి. జనాబుహాసనల్లీఖానుబహదరువారు నన్నుఁదమ రొద్దకుఁ బంపుటచే నేను మీదర్శనమునకు వచ్చితిని. ఖానుసాహే బువారు ప్రాణములపై నాశవదలుకొని యుద్ధము చేయుచున్నారు. కాని, యింకను సైన్యము కావలసియున్నది. లేనియెడల నిలుచుట కష్టము. హాసనల్లీ ఖానుసాహేబువారు మీసేనాసాహాయ్యము నపే క్షించుచున్నారు" అనిచెను.

రాజు వికలహృదయుడై "దైవానుగ్రహమువలన నాసైనికు లెల్లరును సంసిద్ధులై యుండుట మంచిదే యైనది" అని యనుకొని తనసిపాయిలతో "మీగుఱ్ఱములు సిద్ధముగా నున్నవి. మీ యాయు

ధములింకను మీచేతులయందే యున్నవి. మీరిప్పుడే యుద్ధమునకు బయలుదేరవలయును. స్వయముగా నేనే మీతోగూడ వచ్చెదను.'' అనియెను.

అప్పుడు మాణిక్యలాలు ''మహాప్రభూ! అపరాధమును క్షమింపవలయును. నావిన్నపము నాలకించి మన్నింపవలయును. మీయాజ్ఞయైనచో సేనదీసికొని ముందుగా నేనుపోయెదను. దేవర యింకను కొంతసైన్యముతో వెనుకనుండి రావచ్చును. ఆదొంగల సంఖ్యయైదువేలవఱకు నుండవచ్చును. ఇంకను చాల సేనాబలము లేనియెడల మనకు క్షేమము కలుగబోదని తోచుచున్నది''అనియెను.

ఆరాజు సూక్ష్మబుద్ధి కాకుండుటచే మాణిక్యలాలుమాటలను నమ్మి యందుల కంగీకరించెను. ఆ వేయిమంది సైనికులను దీసికొని మాణిక్యలాలు ముందుగా బయలుదేరెను. రాజింకను గొంతసైన్యమును సంగ్రహింపవలయునను నుద్దేశముతో దుర్గమునందే నిలిచిపోయెను. మాణిక్యలాలా రూపసగిరసైన్యమును వెంటబెట్టుకొని రణక్షేత్రాభిముఖుడై వెడలిపోయెను.

అట్లు పోవుచున్నమాణిక్యలాలున కామార్గమధ్యమున నొక బంధులాభము తటస్థించెను. ఆమార్గమునం దొకచెట్టుక్రింద నొక సుందరీమణి పడియుండెను. ఆమె చాలవఱకు శ్రమపడియున్నట్లు కానబడుచుండెను గుఱ్ఱపురౌతు లతివేగముగ బోవుచున్న యానందడింజూచి యామె కేకలువైచుచు లేచి నిలువఁబడవలయునని ప్రయత్నించెను. కాని యట్లు చేయలేకపోయెను. ఆయాసముచే దుర్బలయై యున్న యాయబలంజూచి మాణిక్యలాలు గుఱ్ఱమునుండి క్రిందికిదిగి యామెయొద్దకుఁబోయెను. ఆమె యతిలోకసుందరీమణియై యుండెను. అప్పుడు మాణిక్యలాలామెంజూచి ''ఓసుందరీ! నీవెవ్వరవు? ఇక్కడ నేలపడియుంటివి?'' అని యడిగెను.

యువతి—నీ వెవ్వని సేవకుఁడవు?

మాణి—నేను మహారాణా రాజసింహుని సేవకుఁడను.

యువ—నేను రూపనగర రాజకుమారిక దాసిని.

మాణి—అట్లయిన యెడల నీ కిక్కడ నిట్టియవస్థ యేల కలిగినది?

యువ—రాజకుమారిని ఢిల్లీకి దీసికొని పోవుచున్నారు, నేను కూడ వచ్చెదనని యామెతోఁ జెప్పితిని; కాని, యెందువలననో యామె నన్ను విడిచిపోయినది. అందువలన నేనిట్లు కాలినడకతో నామె యున్నచోటు వెదకికొనుచుఁ బోవుచున్నదానను.

మాణి—నీవు నడచి నడచి బడలి యాయాసముచే బడిపోయితివా?

యువ—చాలదూరము నడచితిని. ఇఁక నడవలేను.

పాపము నిర్మలకుమారి యెంతదూరమో నడవలేదుగాని, యామె యెన్నఁడు నడచుట యెఱింగినది కాకుండుటచే నామెకదియే దూరముగా దోఁచుచుండెను.

మాణి—అట్లయినయెడల నిప్పుడేమి చేయుదువు?

నిర్మ—చేయుటకేమున్నది? ఇక్కడనే చచ్చిపోయెదను.

మాణి—అయ్యో! ఏల చావవలయును? రాజకుమారియొద్ద కెందులకు బోఁగూడదు?

నిర్మ—పోవుటయెట్లు? నడవఁజాలను. చూచుటలేదా?

మాణి—నడవలేకున్న గుఱ్ఱము నెక్కఁగూడదా?

నిర్మ—(నవ్వుచు) గుఱ్ఱముమీఁద నేనా?

మాణి—ఔను గుఱ్ఱముమీఁదనే. భయమేమి?

నిర్మ—నేనా స్త్రీకయువతినా?

మాణి—కాకున్న నేమి?

నిర్మ—అక్షేపణ మేమియును లేదు. నేనెన్నఁడును గుఱ్ఱము నెక్కియుండ లేదు.

మాణి—అదియేమి ప్రతిబంధకము? నీవు నా గుఱ్ఱముపై నెక్కుము.

నిర్మ—నీగుఱ్ఱముమాత్రము వట్టిదిగాఁ జేసినదియా?

మాణి—నేను నిన్నుఁ బట్టుకొనియుందును.

నిర్మల యింతవఱకును స్థిరతలేకుండ వినోదముగ సంభాషించుచుండెను. అప్పుడొకసారి యాతనివంకఁ మొగముద్రిప్పి బొమలు ముడివైచి కోపగించుకొని "మీరు మీపనిమీఁదఁ బొండు! నేను నా చెట్టుక్రిందఁ బడిచచ్చెదను! రాజకుమారుని చూచి నేను చేయవలసిన దేమియును లేదు" అనియెను.

ఆయబల చాలసుందరీమణియై యుండుటచే మాణిక్యలాలు తనహృదయమును మరలింపఁజాలక "సతీమణీ! నీకు పెండ్లియైనదా?" అనియడిగెను.

రహస్యపరాయణయగు నిర్మల మాణిక్యలాలంతవానిని జూచి నవ్వుచు "నాకింకను వివాహముకాలేదు" అనియెను.

మాణి—మీకులమేమి?

నిర్మ—నేను రాజపుత్త్రకన్యకను.

మాణి—నేనును రాజపుత్త్రవీరుఁడను. నాకు భార్యలేదు కాని యొకయాఁడుబిడ్డమాత్ర మున్నది. దానికిఁ దల్లికావలయును. నీవా బిడ్డకుఁ దల్లివగుట కంగీకరించెదవా? నేను నిన్నుఁ బెండ్లిచేసికొనియె దను. అట్లంగీకరించినయెడల నాతోఁగూడ గుఱ్ఱము నెక్కి వచ్చుటకు నీకేమియు నాక్షేపణయుండదు.

నిర్మ—నీవు శపథము చేయుదువా?

మాణి—ఏమిప్రమాణము కావలయును?

నిర్మ—కత్తిముట్టి నన్నుఁ బెండ్లియాడెద నని ప్రమాణము చేయుము.

మాణిక్యలాలు కత్తిచేతఁబట్టుకొని "ఈదినమున యుద్ధములో బ్రదికియుంటినేని నేను నిన్నుఁ బెండ్లిచేసికొనియెదను" అని ప్రమాణముచేసెను.

నిర్మ—అట్లయినయెడల నవువుము! గుఱ్ఱము నెక్కుదము.

మాణిక్యలాలు పరమానందముతో నిర్మలను గుఱ్ఱముపై నెక్కించుకొని తాను గుఱ్ఱముపై నెక్కి యామెను పట్టుకొని నెమ్మదిగా నడపించుకొనుచు బయలుదేరిపోయెను.

పాఠకమహాశయులిది సరియైన కోర్టుషిప్ *(Courtship) కాదని సందేహింతురేమో యని తోఁచుచున్నది. అందులకు మేమేమిచేయగలము. ప్రణయసూచకమైనమాట యొక్కటియును లేదు. చిరకాలసంచితప్రియభాషణమైన నేదియును లేదు. అన్యోన్య గుణశ్రవణమన నాదివ్యాపారవిలాసము లేమియును లేవు. 'ఓ ప్రాణప్రియా! ఓ ప్రాణాధికప్రియా! ఓ ప్రాణేశ్వరీ' (My Dear ! My Love !) అను మాటలేమియును లేవు. ఛీ ఛీ ఛీ! (Nonsense !)

---

## ఆఱవ ప్రకరణము

ఫలభోగియగు రాజసింహుఁడు

రణక్షేత్రమునం దొకరహస్యస్థలమున నిర్మలను గుఱ్ఱము నుండి దింపి భద్రముగా నందుండుమని చెప్పి మాణిక్యలాలు, రాజసింహునితో ముబారకుయుద్ధముచేయుచున్న స్థలమునకు బోయి

---

* "కోర్టుషిప్" అనగా వివాహార్థియై వివాహమునకుఁ బూర్వము మాసములకొలఁదికాలము వరుఁడు సకలోపచారములచేతను కన్యకను బుజ్జగించుచు నామెయిష్టము ననుసరించి నటించుచు నెటులైన నామె ప్రేమకుఁ బాత్రభూతుఁడగుటకై చేయుకన్యోపాసన—ఇది లేకుండ నాంగ్లేయులలో వివాహ మగుట యపూర్వము.

ముబారకు వెనుకవైపున నిలిచెను. మాణిక్యలాలు ప్రదేశమున యుద్ధము జరుగునని నిశ్చయించి యుండెను. కాని, యూరంధ్రమార్గమును కట్టివైచి రాజసింహుని వెలుపలకు బోనియకుండ మొగలాయి లాతనిం జంపివేయుదురేమో యనుభయముతో నాతడు రూపనగరమునకు బోయి సైన్యమును సహాయముగ గొనితెచ్చి యట నిలిపి యుంచెను. ఆతడు వచ్చునప్పటికి రాజపుత్త్రులు మహాప్రమాదమునకు లోనైయుండిరి. వారింకొక నిముసములో జచ్చుటకు సిద్ధముగా నుండిరి. అప్పుడు మాణిక్యలాలు రూపనగరయోధులకు ముబారకు సైన్యమును జూపించి 'వీరేదొంగలు; వీరిని నాశనము చేయవలయును' అని చెప్పెను.

ఆసైనికులలో గొందఱు 'వారు ముసల్మానులవలె నగపడుచున్నారే! వారితో యుద్ధము చేయుట యెట్లు?' అనిరి.

మాణిక్యలాలు 'ముసల్మానులుమాత్రము దొంగలు కాగూడదా? హైందవు లంతటిదుష్కృత్యముల జేయగలుగుదురా? సంశయింపవలదు. చంపుడు! చంపుడు!' అని బదులుచెప్పెను.

మాణిక్యలాలుని యాజ్ఞ ననుసరించి యొక్కసారిగా వేయి తుపాకులు కాల్పబడియెను. మనతో యుద్ధముసేయుటకు వేయిమంది యోధు లెక్కడనుండివచ్చిరో యని ముబారకు వెనుదిరిగి చూచెను. మొగలాయియోధులు భయభ్రాంతులై యుద్ధమును మాని యూరక చూచుచుండిరి. వారికి ధైర్యము చెప్పి నిలువరించుట ముబారకున కసాధ్యముగ నుండెను. అప్పుడు రాజపుత్త్రులు 'జయకాళీ' అని కేకలువైచుచు మొగలాయిలపై బడిరి.

ముబారకుని సైన్యమంతయును చెల్లాచెదరై యామెట్టపై కెక్కి పాఱిపోవుట కారంభించెను. కాని, రూపనగర సైనికులుకూడ వారివెనుకనే మెట్టపైకెక్కి వారిని తరుముచుండిరి. ముబారకు తన

సైనికుల నెల్లరను బ్రోవుచేసికొనవలయు నని ప్రయత్నించుచు నా కస్మికముగ నేస్థలమునందో యదృశ్యు డయ్యెను.

ఇది యంతయు నాశ్చర్యముతోఁ జూచుచున్న రాజసింహుని యొద్దకు మాణిక్యలాలు వచ్చి నమస్కారమాచరించెను. రాజసింహుఁడు "మాణిక్యలాలసింహా! ఈవ్యాపార మేమియో నాకుఁ దెలియుటలేదు. నీకేమైనఁ దెలియవచ్చినదా?" అని యడిగెను.

మాణిక్యలాలు నవ్వుచు "నే నెఱుంగుదును. మీరు మెట్టుపై నుండి రంధ్రమార్గమునకు దిగినతోడనే చాలఁ బ్రమాదము సంభవించినదని తెలిసికొని యిటనుండి తప్పించుకొని పోయి దేవరప్రాణ రక్షణార్థమై మఱియొక మోసమును చేసివచ్చితిని" అని జరిగిన వృత్తాంతమంతయును సంక్షేపముగఁ దెలియఁజేసెను. అప్పుడు రాజసింహుఁ డత్యనురాగముతో మాణిక్యలాలును గౌఁగిలించుకొని "మాణిక్యలాలసింహా! నిజమైన ప్రభుభక్తుఁడ వనిన నీవే. నేనుదయ పురమునకుఁ జేరినతోడనే నీవు చేసిన యుపకారమునకుఁ దగిన బహుమానము నిచ్చెదను. కాని, నీవు నాకొక మంచిసమయమును బోఁగొట్టితివి. రాజపుత్రవీరులు రణరంగమున నిర్భయముగాఁ దమ ప్రాణముల నర్పించుటయం దెంత సాహసముకలవారో మొగలాయిలకు నేఁడు చూపింపవలయునని యనుకొంటిని. అది జరిగినదికాదు" అనియెను.

మాణి—మహారాజా! ఆపాఠమును మొగలాయీలకు నేర్పుటకు మీభృత్యు లనేకు లున్నారు. ఆవిషయమున స్వయముగా మీరే ప్రయత్నింపనక్కఱలేదు. ఇప్పు డుదయపురమార్గము నిష్కంటకమై యున్నది. రాజధాని వదలి కొండలవెంబడిం దిరుగుచుండుట మంచిపనికాదు. రాజకుమారిని వెంటఁబెట్టుకొని రాజధానికి దయచేయవలయును.

రాజ—నాతోఁగూడ వచ్చినవారిలోఁ గొందఱవ్వలిమెట్టుపై నున్నారు. వానినిగూడఁ దీసికొనిరావలయును.

మాణి—నేను వారిని దీసికొనివచ్చెదను. మీరు ముందు దయచేయుఁడు. మధ్యమార్గమున మిమ్ము నేను గలిసికొని యెదను;

రాణా రాజసింహుఁ డందులకు సమ్మతించి చంచలకుమారిని వెంటఁబెట్టుకొని యుదయపురాభిముఖుఁడై బయలుదేరెను.

---

## ఏడవ ప్రకరణము

### ప్రేమగల యత్తగారు

రాజసింహుఁడు వెడలిపోయినతరువాత మాణిక్యలాలు రూపనగరసైన్యము వెనుకనే పర్వతముపై కెక్కిపోయెను. పలాయనాసక్తులగు మొగలాయిసైనికులు రూపనగరయోధులచేఁ బీడింపఁబడి కనఁబడినత్రోవనుబట్టి పారిపోయిరి. అప్పుడు మాణిక్యలాలు రూపనగర సేనలతో "శత్రువు లందఱును పాఱిపోయిరి. ఇఁక వృథాశ్రమ పడుట యెందులకు? కార్యము ఫలించినది. మీరందఱును రూపనగరమునకుఁ బొండు" అని చెప్పెను. వారు మాణిక్యలాలుచేసిన మోసము నించుకంతయైన నెఱుంగఁజాలక యొక్కసారిగాఁ గాలినడకను రూపనగరమునకుఁ బోవుట కష్టమని యోచించి యందందు దొరకినచోట భుజించుచు యథేచ్ఛముగ ద్రవ్యమును సంపాదించుకొనుచు సంతుష్టచిత్తులై మహానందమున బాదుషావారిని స్తోత్రముచేయుచు విజయగర్వితులై యాత్మగృహాభిముఖముగ బయలుదేరిరి. ఒకగంటసేపటిలో నాపర్వతప్రదేశము జనశూన్యమైపోయెను. మొగలాయి లందఱును

దమనమయస్వాములతో నాశనమైపోవుటను గనిపెట్టి యాకడపటి కొండపైనుండి ప్లావనమునుగురియించుచున్న రాజపుత్త్రులు క్రిందికి దిగివచ్చి తమకెవ్వరు నగపడకుండుటచే రాణా తనతోనున్న యోధులను వెంటఁబెట్టుకొని యుదయపురికిఁ బోయియుండునని యూహించి వారును రాజసింహుని వెదకికొనుచు నుదయపురాభిముఖులై పోవుచు మార్గమధ్యమునఁ దమరాజుం గలిసికొనిరి. అప్పు డందఱును గలిసి యుదయపురమునకుఁ బోయిరి.

మాణిక్యలాలుమాత్రము వారితోఁ బోలేదు. అతఁడు నిర్మలను తనతోఁగూడఁ దీసికొనిపోవలయు నని ప్రయత్నించుచుండెను. అతఁ డందఱితోడ నేమేమియో చెప్పి నిర్మలయొద్దకు వచ్చి యామె కాహారమును పెట్టెను. సమీపగ్రామమునుండి యొక్క పల్లకిని బోయలను దీసికొనివచ్చి నిర్మలను పల్లకియందుఁ గూర్చుండబెట్టుకొని రాజసింహుఁడు పోయినమార్గమునఁగాక మఱియొకత్రోవను బయలుదేరెను. నిర్మలతోఁగూడఁ జిక్కుత్రోవను బ్రయాణముచేయుట కాతని కంతయిష్టము లేకపోయెను.

అతఁడు నిర్మలతోఁగూడఁ దనయత్తగారింటికివచ్చి యామెను పిలిచి "అత్తా! ఒకకోడలిని దీసికొనివచ్చితిని." అనియెను. ఆమె యావిధూతిలకముం గాంచి కొంచెము వెఱఁగుపడి "ఈమెవలన నాకాశాభంగ మైనట్లున్నది. ఇతఁ డేమో నాయిల్లంతయును బంగారము చేయునని గంపెడాసతో నుంటిని. ఇదివఱ కీతఁడు నాకు రెండు మొహరీలకంటె నెక్కుడుగ నేమియు నీయలేదు. కోడలు వచ్చినప్పుడొకనాఁడైన విందుచేయకుండ నెట్లు పంపుదును?" అనియనుకొని "కోడలు చాలమంచిదిరే" అనియెను.

మాణి—అత్తా! ఇంకను పెండ్లికాలేదు.

అత్తగా రామె యుపపత్తియై యుండు నని భావించి "అట్లయిన శుభమందిరమున—" అనియెను.

మాణి—ఆవిషయమై యాలోచన యెందులకు? నీవే పెండ్లి చేయుము! "శుభస్యశీఘ్రము" మ్మని యీదినముననే కానిమ్ము!

నిర్మల సిగ్గుచే దల వంచికొనియెను.

అత్త—నీవు పెండ్లి చేసికొనకుండిన నేనెవ్వరికి బెండ్లిచేయవలయును? వివాహవ్యయములకు గొంతద్రవ్యముకూడ గావలసి యుండును.

మాణి—అందుకొఱకు నీవేమియునుసందేహింపనక్కఱలేదు.

యుద్ధమైనతోడనే మాణిక్యలాలు భోజనముచేసినసంగతి పాఠకులెఱింగియే యున్నారు. మాణిక్యలాలారణరంగమునుండి బయలుదేఱివచ్చుచున్నప్పుడు పడిపోయిన మొగలాయియోధులయొద్ద దొరికినద్రవ్యము నంతను సంగ్రహించుకొని తెచ్చెను. అందలి కొన్ని మొహరీలను తీసి యత్తచేతికిచ్చెను. ఆమె మహానందసముద్రమున మునిగి యున్నటివి లెక్కించి తీసికొని వివాహప్రయత్నములను చేయ నారంభించెను. పెండ్లికి గావలసిన పుష్పములు, చందనము మొదలగువాని నన్నింటిని సేకరించి యొకపురోహితునిగూడ బిలిపించెను. మాణిక్యలా లొకశుభముహూర్తమున యథాశాస్త్రముగ నిర్మలకుమారికి బ్రాణేశ్వరు డయ్యెను. తరువాత మాణిక్యలాలు మహారాణా రాజసింహునియొద్ద నొక యున్నతోద్యోగము నంపాదించి తన సుగుణగణంబులచే నెల్లవిధముల రాజసన్మానమును గాంచుచు సర్వథా పూజ్యుడై మెలంగుచుండెను.

ప్రథమ ఖండము సమాప్తము.

శ్రీ

# రాజసింహ

## ద్వితీయ ఖండము—అనలాయోజనము.

## ప్రథమ భాగము

### మొదటి ప్రకరణము.

మొగలాయి రాజపుత్త్రికంటె పేదబానిసయే యుత్తమురాలు.

ముబారకు రణరంగమునఁ బర్వతప్రదేశమునం దాకస్మికముగ నదృశ్యుఁడై పోయెనని యిదివఱకే చెప్పియుంటిమి. అతడు తన యశ్వసైన్యమును వెంటబెట్టుకొనిపోవుచున్న మార్గమునం దొకపాడుబావి యుండెను. ఆపర్వతముపై నివసించువారలెవ్వరో నీటికొఱ కానూతిని త్రవ్వించి యుందురు. ఆనేలనూతిముఖద్వారము తృణలతాగుల్మములచే నావరింపబడియుండెను; ఆతొందరలో ముబారకదియంతయును గనిపెట్టజాలక తనగుఱ్ఱము నావంకకు దాటించెను. తోడనే యాతడా గుఱ్ఱముతోగూడ నాబావిలోబడి పోయెను. దూరపతనము వలనంగలిగిన యాఘాతముచే నాతనిగుఱ్ఱము తత్క్షణమే మరణించెను. ముబారకు జాగరూకుఁడై యుండుటచే నాతని దెబ్బ విశేషముగా దగులలేదు. ఆపాడునూతిలో నీరేమియును లేదు కాని, యటనుండి మీది కెక్కివచ్చుటకు సాధనమేమియు నకు లేకపోయెను. ఎవ్వరైనను వచ్చి తన్నుఁ బైకిఁ దీసెదరనునుద్దేశముతో నాతఁ డందుండి కేకలువైచుచుండెను. కాని యామహారణ కోలాహలధ్వనులలో నీతని కేక లెవ్వరికిని వినబడలేదు. ఒకసారి మాత్రము దూర

మునుండి "భయములేదు! ధైర్యముగానుండుము! నేను వచ్చి నిన్ను ద్ధరించుచున్నాను" అని యాతనికి గొన్నిమాటలు వినవచ్చెను. అదియు నాతనికి సందేహముగనే తోచుచుండెను.

యుద్ధము ముగిసినతరువాత నంతయును నిశ్శబ్దమై యున్నప్పు డెవ్వరో యాబావియొద్దకు వచ్చి "ఇంకను బ్రతికియుంటివా?" అని కేకవైచిరి.

ముబారకు "జీవములతోడనే యున్నాను. నీవెవ్వడవు?" అనియెను.

"నేనెవ్వడనైననేమి? నీకు గాయములు విశేషముగఁ దగుల లేదుగదా?" అని మరలబైనుండి ప్రత్యుత్తరము వచ్చెను.

ముబా—సామాన్యముగ దెబ్బతగిలినది. గాయములు విశే షముగ దగులలేదు.

"నేను నాలుగైదుకట్టెలనుజేర్చి యడ్డముగా నొకవస్త్రమున కందందుగట్టి బావిలోనికి విడిచెదను. ఆకట్టెలను నీరెండుచేతులతో బలముగా బట్టుకొని యొకకట్టెనుండి యొకకట్టెపై కెక్కి నీవు నెమ్మదిగా మీఁదికి రావచ్చును" అని పైవా రాతనితోఁ బలికిరి.

ముబారకు విస్మితుండై "ఇదియేమి? స్త్రీకంఠస్వరమువలె వినవచ్చుచున్నది! నీవెవ్వడవు?" అనియెను.

స్త్రీ—ఈస్త్రీకంఠస్వరము నీవెన్నడును వినలేదా?

ముబా—ఓహో! వింటిని! వింటిని! దరియా! నీవిక్కడ కేల వచ్చితివి?

దరియాబీబీ—నీకొఱకే వచ్చితిని. నిన్నిప్పుడు బావినుండి పైకిఁ దీయుచున్నదానను. రమ్ము!

అని చెప్పి దరియాబీబీ కట్టెలుకట్టినవస్త్రమును బావిలోనికి విడిచెను. ముబారకు తన ఖడ్గముతో బావియందలి లతలు మొద

లకువానిని గోడకువైచి ఆవస్త్రమునకుఁ గట్టినకత్తును చేతులతో బట్టుకొని పైకెక్కి క్రమముగా రెండవకత్తును బట్టుకొనిపైకెగఁ బ్రాకఁ జూచెను. కాని యాయాసముచే నట్లు చేయలేకపోయెను. అప్పుడు దరియాబీబి తాను బట్టుకొనియున్న వస్త్రము నాసమీపముననే యున్న చెట్టుకొమ్మకుఁ దగిలించి నీరుచేదినట్లు బలముగాఁ జేదెను. అప్పుడశ్రమముగ ముబారకు పైకెక్కి వచ్చి దరియాబీబిని చూచి "ఇదియేమి వేషము?" అనియెను.

దరియా—బాదుసావారియశ్వసైనిక వేషము.

ముబా—ఈవేషము నెందులకు ధరియించితివి?

దరియా—నీకొఱకే.

ముబా—అదియేమి?

దరియా—ఇట్లు చేయకుండినయెడల నిన్నీదినమున నీయాపద నుండి రక్షించువా రెవ్వరు?

ముబా—ఢిల్లీనుండి నీవిక్కడకు వచ్చుట యిందుకొఱకేనా? అశ్వికవేషమును ధరియించుటయు నిందుకొఱకేనా? ఇదియేమి? నీ యొడ లంతయును రక్తసుయమై యున్నదేమి? అంతటిసాహసకృత్యములు నీ వెందులకుఁ జేసితివి?

దరియా—నీకొఱకే చేసితిని. చేయకుండిన నిన్నెట్లురక్షించు కొనఁగలుగుదును? జేబఉన్నీసా నిన్నెట్లు ప్రేమించుచున్నది?

ముబారకు తలవంచికొని "రాజకుమార్తెయగు జేబఉన్నీసా నన్నుఁ బ్రేమించుటయే లేదు" అనియెను.

దరియా—మేము పేదవాండ్రము గావున నిట్లు ప్రేమించెదము, మిగుల శ్రమపడియుంటివి. ఇక్కడఁ గూర్చుండుము! నీకొఱకొకపల్లకిని దీసికొని వచ్చెదను. నీయొడలిపై గాయము తగిలియున్నది. గుఱ్ఱముపై నెక్కి రాఁజాలవు.

రణరంగమున మొగలాయిసేనలతోఁ గొన్నిపల్లకులుఁగూడ నుండెను. యుద్ధభయముచే బోయలు పాఱిపోయిరి. ముబారకు బావిలోఁబడి పోవుటను దరియాబిబి రణక్షేత్రమునుండి చూచి రెండు పల్లకులను బోయలతోఁగూడ సిద్ధపఱచి యుంచెను. అప్పు డామె వానిని నటకుఁ దీసికొని వచ్చెను. ఇరువురును రెండుపల్లకులయందునుఁ గూర్చుండి ఢిల్లీపురాభిముఖముగ వెడలిపోయిరి. ముబారకు పల్లకిలోఁ గూర్చుండఁబోవునప్పుడు దరియాబిబీసుందరవదనారవిందమునొక్క సారి ముద్దువెట్టుకొని "ఇఁక నెన్నటికిని నిన్నెడఁబాయువాఁడను గాను" అనియెను.

దరియాబీబి ముబారకు నొకస్థలమునం దుంచి యాతని కెల్ల విధముల నుపచారములు సేయుచుండెను. ఆమె చేయుచున్న చికిత్స లచే ముబారకు కొలఁదికాలముననే యారోగ్యవంతుఁ డయ్యెను.

ఢిల్లీకిఁ జేరినతోడనే ముబారకు దరియాబీబిని తనయింటికిఁ దీసికొనిపోయెను. కొన్నిదినములవఱకు వారిరువురును బరమానంద ముతో సుఖముగఁ గాలక్షేపమును చేసిరి. కొన్నినాళ్ళయినతరువాత నానందమయులైన యాప్రియదంపతులసుఖానుభవంబున కతిదారుణ మైన ప్రతిఫలము లభియించెను. అది దరియాబీబీకిని, ముబారకున కును, జేబఉన్నీసాకును, మఱియు నౌరంగజీబునకుఁ గూడ భయానక మై, మహావిపత్కరమై పరిణమించెను. ఆరహస్యమును తరువాతఁ జెప్పెదము. ప్రస్తుత మవశ్యముగాఁ జంచలకుమారివిషయమై కొంచెము చెప్పవలసి యున్నది.

## రెండవ ప్రకరణము

రాజసింహుని నిర్ధారణము

రాజసింహుఁ డుదయపురమునఁ బ్రవేశించెను. చంచలకుమారి సంరక్షణమునకై చేయఁబడిన యుద్ధమంతయును ముగిసెను. చంచలకుమారి నాపదనుండి యుద్ధరించి రాజసింహుఁ డామెను దీసికొని వచ్చి యంతఃపురమునం దుంచెను. కాని, యామె నుదయపురమున నుంచవలయునో, కాక రూపనగరమునకు మరలఁ బంపివేయవలయునో యనుయంశమునుగూర్చి నిశ్చయించు టాతని కతికష్టముగా నుండెను. ఈయంశమును స్థిరపఱచుటకై యాలోచించుచున్నంత కాలమును రాజసింహుఁడు చంచలకుమారిని చూచుటకైన రాలేదు.

చంచలకుమారి రాజసింహునిహృదయభావములనుబట్టి యాలోచించి యత్యాశ్చర్యమగ్నమానస యై బాగుగ నాలోచించి చూడఁగా నన్నీతఁడు పెండ్లిచేసికొని యనుగ్రహించునన్లెంతమాత్రమును దోఁచుటలేదు. ఈతఁడు నన్నుఁ బరిగ్రహించుట కిష్టపడక యేపోయినయెడల నేనేల యీతని గృహమునందింకను నివసించి యుండవలయును? ఒకవేళ నిక్కడనుండి పోవలసివచ్చుటయే తటస్థించినయెడల నెక్కడకుఁ బోయి సుఖముగానుండఁ గలుగుదును?" అని యోచించుకొనుచుండెను.

రాజసింహుఁడు చాలవఱ కాలోచించి తన కేమియును దోఁపకుండుటచేఁ గొన్నిదినములైనతరువాత చంచలకుమారియభిప్రాయము తెలిసికొనవలయునను నుద్దేశముతో నామెయొద్దకు వచ్చెను. అప్పుడు చంచలకుమారి యనంతమిశ్రునిచేఁ దనకుఁ బంపించిన లేఖనుకూడఁ దీసికొనియెను.

రాజసింహుఁడు వచ్చి యొకపీఠముపై నాసీనుఁడైనతరువాత చంచలకుమారి యాతనికి నమస్కరించి లజ్జావనతవదనయై నిలువఁబడియుండెను. ఆత్రిలోకమోహనమూర్తియగుచంచలం గాంచి రాజసింహుఁడు విమోహితుఁడయ్యెను దనహృదయభావమును మఱుగుపఱచికొని "రాజకుమారీ! నీవు నీపుట్టినయింటికి బోయెదవో, లేక యిక్కడనే యుండెదవో నీయభిప్రాయ మెట్లున్నదియో తెలిసికొనుటకై వచ్చితిని. నీయుద్దేశమును తెలియఁజేసితివేని నీకోరినయట్ల కావించెదను" అనియెను.

ఆమాటలను విన్నతోడనే చంచలకుమారిహృదయము బ్రద్దలైపోయెను. ఆమెనోటినుండి మాటరాలేదు. నిశ్చేష్టయై నిరుత్తరయై నిలువఁబడిపోయెను.

అప్పుడు రాజు తన కామెవ్రాసినయుత్తరమును జూపించి "ఈయుత్తరము నీవువ్రాసినదేగదా?" అనియెను.

చంచ—ఔను మహాప్రభూ!

రాజ—కడవఱకు నీయుత్తర మొక్కరిచేతనే వ్రాయఁబడినట్లగపడుటలేదు. ఇద్దఱిచే వ్రాయఁబడినట్లు తోఁచుచున్నది. ఇందు నీ వెంతవఱకు వ్రాసితివి?

చంచ—మొదటిభాగమును నేను వ్రాసితిని.

రాజ—అట్లయినయెడల మిగిలినభాగము మఱియొకరిచే వ్రాయఁబడినదా?

ఆయుత్తరమునఁ గడపటిభాగముననే వివాహప్రస్తావము వ్రాయఁబడియుండె నని పాఠకు లెఱింగియే యుందురు.

చంచ—తక్కినది నాచే వ్రాయఁబడలేదు.

రాజ—అది నీసమ్మతి ననుసరించి వ్రాయఁబడినదే కాదా?

ఇది చాల నిర్దయాకలితమైనప్రశ్న యని చంచలకుఁ దోఁచెను. అయినను చంచలకుమారి తన యుదార స్వభావానుగుణముగనే

ప్రత్యుత్తరము నిచ్చెను. ఆమె "మహారాజా! ఉత్తమక్షత్రియ కులాలంకారులకు నీకును వివాహార్థమై కన్యాహరణము చేయుటకు యుక్తము చేయునది. మఱియొక యుద్దేశముతోఁ గన్యాపహరణము చేయుట మహాపాపము. మహాపాపాచరణమునకు మిమ్ము నేనెట్లు పురికొల్పఁగలుగుదును?" అనియెను.

రాజ—నేను నిన్నపహరించి తీసికొని రాలేదు. జాతిమత సంరక్షణార్థమై మసల్మానులచేతులలోఁ బడకుండ నిన్నుద్ధరించితిని. ఇప్పుడు నిన్ను నీతండ్రియింటికిఁ బంపించుటయే నాకు విధాయక కృత్యమైయున్నది.

చంచలకుమారి యువతీజనసామాన్యమైన సిగ్గుచే నింతవఱకును తల వంచికొనియుండెను. ఇప్పు డామె తన సుందరవదనమండలము నించుక పైకెత్తి రాజసింహుని మొగమువంకఁ జూచుచు "మహారాజా! మీరాజధర్మమును మీ రెఱుఁగుదురు. నాసతీధర్మమును నే నెఱుంగుదును. మీపావనచరణకమలసాన్నిధ్యమున నెప్పు డాత్మసమర్పణము చేసికొనియుంటినో, యప్పుడే నేను మీధర్మపత్ని నైతిని. నన్ను మీరు పరిగ్రహించినఁ బరిగ్రహింపుఁడు! పరిత్యజించినఁ బరిత్యజింపుఁడు! మీచిత్తము. అంతియకాని నేనెన్నటికైన మఱియొక్కని పెండ్లియాడుదానను కాను. అది నాయుద్దేశమునకును ధర్మశాస్త్రమునకును గూడ విరుద్ధమైనదియే. ధర్మానుసారముగా నెప్పుడు మీరు నాకాత్మేశులైతిరో, యప్పటినుండియును నాకు మీయాజ్ఞ శిరసా వహింపఁదగినదియే మీరు నన్ను రూపనగరమునకుఁ బొమ్మని యాజ్ఞాపించితిరి. అట్లే పోయెదను. కాని, యక్కడకుఁ బోయినయెడల నాతండ్రి నన్ను మరల బాదుషాయొద్దకుఁ బంపించుటకు బాధ్యుఁడైయుండునుగదా! నన్ను రక్షించుట యాతనికెట్లు సాధ్యమగును? మీయభిప్రాయముకూడ నట్టిదియే యైనయెడల నేను రణక్షేత్రమునందే

ఢిల్లీకిఁబోవుట కాజ్ఞ యీయవలయునని ప్రార్థించినప్పుడు నన్నుఁ బోనీయకుండ నెందుల కడ్డగింపవలయును?'' అని పలికెను.

రాజ—మనయుభయుల గౌరవమును గాపాడుటకై నేనట్లు చేయవలసి వచ్చినది.

చంచ—మీశరణము నపేక్షించివచ్చిన యబలను మరల ఢిల్లీకిఁ బంపవలయుననియే నిశ్చయించుకొంటిరా?

రాజ—అట్లెన్నటికిని గాఁజాలదు. పోనిమ్ము! నీవిక్కడనే యుండుము.

చంచ—అతిథివలె నుండవలయునా? కాక, దాసివలె నుండవలయునా? రూపనగర రాజకుమారిక దేవియై యుండఁదగినదియే గాని మఱియొకవిధముగా నెన్నటికి నుండఁజాలదు.

రాజ—నీయంతటి సుందరీమణి యేమహారాజునకు దేవియై యుండునో యాతఁడేగదా ధన్యుఁడని చెప్పఁదగినవాఁడు! నీవింతటి యనన్యసామాన్యరూపవయోవిలాసిని యగుటవలననే నేను నిన్ను దేవిగా జేసికొనుటకు సంశయించుచున్నాను. రూపవతియగుభార్య శత్రుసమాన యని శాస్త్రములయందు వినియున్నవాఁడను.

''ఋణకారీ పితా శత్రు ర్మాతా చ వ్యభిచారిణీ
భార్యా రూపవతీ శత్రుః పుత్ర శ్శత్రు రపండితః''

చంచలకుమారి చిఱునవ్వు నవ్వుచు ''రాజా! నేనుబాలికను, నావాచాలత్వమును కొంచెము మన్నింపవలయును. ఉదయపుర రాజసింహుని దేవేరు లందఱును కురూపిణులేనా?'' అనియెను.

రాజ—నీయంతటిసుందరగాత్రులు మాత్రము కారు.

చంచ—నేనిప్పుడు చెప్పుచున్నమాటలను రాణులకు దెలియనీయవలదని వినయపూర్వకముగ విజ్ఞాపనము చేసికొనుచున్నాను—మహాప్రభూ! మహారాణా రాజసింహునకుఁగూడ భయము

కలిగించునట్టియ మొగలి యున్నదా? అతనికూడ భయపడవలసిన మొగలి యున్నదా?

నారసింహుడు పకపక నవ్వసాగెను. అంతవఱకును నిలువబడి యున్న చంచలకుమారి యప్పుడశోకపీఠముపై గూరుచుండి "ఇప్పుడు నాయెడల నీతడు మహారాణా రాజసింహుడు కాడు నా హృదయేశ్వరుడు, నాప్రాణేశ్వరుడు" అని తన మనసునం దను కొనియెను.

పిమ్మట నాచంచలకుమారి "మహారాజా! మీయాజ్ఞ దీసి కొనకుండ మీయెదుట నేనిప్పుడు కూర్చుండి యుంటిని. ఈనాయప రాధమును క్షమింపవలయును. ఏమన—మీవలన నజ్ఞానోపదేశ మును పొందుటకై నేనిట్లు కూర్చుంటిని. ప్రేమపాత్రులగు శిష్యులకు గురువులయెదుట గూర్చుండుట కధికారము కలదుగదా! మహాప్రభూ రూపవతియగుటిట్లు శత్రువగుట యెట్లు? దయయుంచి యీనా ప్రశ్నమునకుం బత్యుత్తరమొసంగవలయును" అనియెను.

రాజ—ఇందులకుం బ్రత్యుత్తరము చెప్పుట చాలసులభమైన పని. భార్య రూపవతి యయ్యెనేని యామెమూలమున వివాదము, మనస్తాపము మొదలగునవి సంభవించుచుండును. ఇప్పుడు బాగుగ నాలోచించి చూడుము! నీవింకను నాభార్యవు కానేలేదు. అయినను నీమూలమున నౌరంగజేబునకును, నాకును వివాదము కలిగినది. పూర్వము మావంశమునందలి మహారాజ్ఞియగు పద్మినిచరిత్రమును నీవు వినలేదా?

చంచ—ఇట్టిబుద్ధిమి వాక్యములయందు నాకంతనమ్మకము లేదు. సుందరీమణులగు స్త్రీలిండ్రు లేకపోయినంతమాత్రమున రాజులు తమ లోపాము వివాదములు లేకుండ నుండగలుగుదురా? ముగ్ధురాలగు నావంటియబలవిషయమున నిట్టిగొడవలు తప్పుటవలన నేమిప్రయో

జనము? నేనందుకైనే కానిమ్ము; కాకపోనిమ్ము. నాకొఱకు బుట్టినల సిన వివాదమేమో పుట్టనేపుట్టినదికాదా?

రాజ—ఇక లోకవార్త చెప్పవలసి యున్నది. కళత్రము రూపవతి యయ్యెనేని పురుషు డామెయందేమధురంబులగు హసనహాస చంద్రికలకును, నతితరళంబులగు కటాక్షమాలికలకును వశుండై నిరంతర మామె తోడిదే లోకముగా జరించుచుండును. ఇట్టిప్రవర్తనము రాజపుత్త్రుల కత్యంతనిందనీయమైనది. ఏమన—అందువలన రాజకార్యముల కభ్యంతరములు కలుగుచుండును.

చంచ—దేవీశతపరివృతులగు మహారాజులుగూడ దమ రాజకార్య నిర్వహణమునం దప్రమత్తులై యుండుటలేదా? నావంటి యొక బాలికయందలిమోహముచే మహారాజా రాజసింహునంతటి వానికి రాజకార్యములయందు వైముఖ్యము కలుగు ననుట కేవలము నమ్మదగిన మాటకాదు.

రాజ—ఇది కేవలము నమ్మరానిమాట గాదు. శాస్త్రము నందు "వృద్ధస్యతరుణీవిష"మ్మని చెప్పబడియున్నది.

చంచ—మహారాజా! మీరువృద్ధులా?

రాజ—నేను యౌవనపురుషుడనుగాను.

చంచ—ఎవ్వడు బలపరాక్రమసంపన్నుడో యట్టివాడే రాజపుత్త్రికవ్యకకు యౌవనపురుషుఁడు.

రాజ—రూపవంతులును, బలిష్ఠులును, యౌవనులునగు రాజపుత్త్రు లింకను చాలమంది యున్నారుకారా?

చంచ—ఉండనిండు! నేను మీకొఱ కాత్మసమర్పణము చేసి కొంటిని. నేను కేవలము సిగ్గువిడిచి మాటలాడుచున్నాను. మీరు యోచింపవలయును. దుష్యంతునిచేఁ బరిత్యజింపఁబడినశకుంతల కవశ్యముగ సిగ్గును వదలివేయవలసివచ్చెను. నాకును నిప్పు డట్టిదశయే

వచ్చినది. మీరు నన్నుఁ బరిత్యజించుటయే నిశ్చయ మయ్యెనేని నేను మీచే నిర్మింపఁబడిన రాజమందిరమును సరోవరమునం బడి ప్రాణము లను త్యజించి వైచెదను.

రాజసింహుఁడు వాగ్యుద్ధమునఁ జంచలచేఁ బరాభవింపఁబడి "ఓసుందరీమణీ! నీవే నాకుఁ దగిన దేవివి—నీవాపదలోఁ బడియుండు టచేఁ గార్యావసరమునుబట్టి నన్నుఁ బతిగా వరించితివేమో యని యును నాచే రక్షింపఁబడుటయే నీయిష్టమై యుండవచ్చు ననియును, నాయెడల నీవు నిజముగా ననురక్తవై యుంటివో లేదో యనియును నేనింతవఱకు సంశయించుచుంటిని. ఇప్పటిమనసంభాషణమువలన నాసంశయము లన్నియును తీఱిపోయినవి. నీవు నాదేవి వయ్యెదవు. ఇందులకు మీతండ్రి యంగీకరించునో యంగీకరింపఁడో తెలిసికొన వలయును. అతఁడు సమ్మతింపకపోయెనయెడల నాకు నిన్నుఁ బెండ్లి యాడవలయునని లేదు. ఏమన—రాజ్యముచిన్నదైనను, సైన్యము స్వల్పముగా నున్నను మీతండ్రియగు విక్రమసింహుఁడు పదియా ఱేనుఁగుల బలముగల వీరపురుషుఁ డనియును, నుపయుక్తసేనా నాయకుఁ డనియును, ప్రసిద్ధుఁడై యున్నవాఁడు. నాకు మొగలాయి లతో నెన్నటికైన యుద్ధముచేసి తీరవలసియుండును. అప్పుడు నాకు మీతండ్రి సాహాయ్య మత్యావశ్యకమైయున్నది. అతనియనుమతి లేకుండ నిన్ను బెండ్లియాడినయెడల నాతఁ డెన్నటికిని । నాకు సాహా య్యము చేయఁజాలఁడు. అంతియకాక యాతఁడు మొగలాయిలలోఁ జేరి నాపైఁ బలము సాధింపఁజూచును. నా కాతనితోడిశత్రుత్వము కోరఁదగినది కాదు. కావున వ్రాసి యాతని యంగీకారమును బడసి యావెనుక నిన్నుఁ బెండ్లియాడెదను. ఆతఁడిందులకు సమ్మతించునా?" అనియెను.

చంచ—సమ్మతింపవలయుటకుఁ గారణ మేమియును లేదు. నాతల్లిదండ్రుల యాశీర్వాదమును బడసి మీచరణసేవావ్రతమును స్వీకరించుటకు నాకుఁ గూడ నిష్టమే. జాబువ్రాసి పంపుట చాల మంచిపనిగాఁ యగును.

అప్పుడు రాజసింహుఁడు వినయపూర్వకముగ నొకలేఖ వ్రాసి యొకదూతచేతి కిచ్చి విక్రమసింహునియొద్దకుఁ బంపెను. చంచలకు మారికూడ జననిజనకుల యాశీర్వాదము నపేక్షించుచు నొకజాబు వ్రాసి పంపెను.

---

## మూఁడవ ప్రకరణము

---

### అగ్నిప్రజ్వలనకారణము

రూపనగరాధిపతియగు విక్రమసింహునిచే వ్రాయఁబడిన ప్రత్యుత్తరము సకాలముననే రాజసింహునకుఁ జేరి మిగుల భయమును బుట్టించెను. ఆలేఖయందిట్లు వ్రాయఁబడి యుండెను.

"మీరు రాజస్థానరాజ్యమున కంతకును సర్వోత్కృష్టులై ప్రధానులై యున్నారు. రాజపుతానామండలేశ్వరులలో శిరోమణులై యున్నారు. అట్టిమీరిప్పుడు రాజపుత్త్రుఁడను పవిత్రాభిధానమునకు గళంకమును గల్పించుటకు సంసిద్ధులైయుంటిరి. మీరు బలవంతముగా నన్నవమానించి నాపుత్రిక నపహరించుకొని పోయితిరి. నాకు మాత్రె రాజరాజేశ్వరి కానై యుండగా మీరక్షమువచ్చితిరి. కావున నాకు మీయెడల శాత్రవమును వహించుట యావశ్యకర్తవ్యమై యున్నది. ఇప్పుడు మీరు నాయనుమతిమీఁద నాపుత్రికను పాణిగ్రహణము చేసికొనజాలరు.

పూర్వకాలమునందు క్షత్రియవీరులు కన్యాపహరణము చేసి పెండ్లియాడుట కలదనియును, భీష్ముడు, అర్జునుడు, మఱియు సాక్షాత్ శ్రీకృష్ణభగవానులునుకూడ నిట్లు చేసియుండి రనియును మీరు చెప్పవచ్చు నేమో! పరాక్రమవంతులగువారు పూర్వ మట్లు చేసిన చేసియుందురుగాక! మీకంతటిబలపరాక్రమము లెక్కడివి? మీబాహువులయందు బలపరాక్రమాదిపురాతనపవిత్రశక్తులే యున్నయెడల మనమాతృభూమి యగునీహిందూస్థానమునకు మొగలాయిప్రభువు లెట్లు రాగలుగుదురు? నక్కలై కూరుచుండి సింహములవలె విజృంభించుటవలన నేమిప్రయోజనము? నేనుగూడ రాజపుత్రవంశములోనిదాననే. మునల్మానులకు కన్యాదానముచేయుట నాయాత్మగౌరవమునకును, మతాచారమునకును విరుద్ధమైనపనియే యని నేనుగూడ నెఱుంగకపోలేదు. అట్లయినను నేనట్లు చేయకపోయినయెడల నీరూపనగరదుర్గ మొక్కక్షణకాలములో నిర్ధూమధామము కాకమానదు. నాయంతట నేనే యాత్మసంరక్షణము చేసికొనవలసివచ్చినయెడల నాకప్పుడు సాహాయ్యముచేయువా రెవ్వరు? అప్పుడుగూడ నేను సమ్మతింపజాల నని తెలియజేయుచున్నాను. మీరంతటిసామర్థ్యము గలవా రని నాకుదోచినప్పుడు మీకు కన్యాదానము చేయువిషయమై యాలోచించెదను.

పూర్వకాలమున రాజులకు రాక్షసవివాహము శాస్త్రసమ్మతమైనదే యనుమాట సత్యమే కావచ్చును. కాని యెవ్వరు నేకాలమునందును మీవలె నింతటియసత్యకల్పనములచే మోసము చేసి కపటమార్గమున విజయములను సంపాదించి యుండలేదు. మీరు నాయొద్దకొకదూతముఖంబున నసత్యసందేశమును బంపి నాసైన్యమునే సహాయముగా దీసికొనిపోయి బలవంతముగ నాపుత్రిక నపహరించితిరి. అట్లుకానియెడల మీరెట్లు విజయమును సంపాదింపగలుగు

దును? ఈ సమయాలములో నాకెంతటి దుఃఖమును కల్పించితిరో మీరే తెలిసికొనుడు! ఇప్పుడు మొగలు బాదుషా నేమనుకొనును? నామోసముచే నా సైన్యమే యుద్ధముచేసి నా పుత్రికను అపహరించెనని యనుకొనకుండునా? అందువలన నాతడు ప్రప్రథమమున నారూపనగరమును ధ్వంసముచేసినతరువాత గదా మీపై దండెత్తుటకు ప్రయత్నించును? యుద్ధము చేయుటకు నాకును గొంతసామర్థ్యము లేకపోలేదు. అయినను లక్షలకొలదిగ పెరిగియున్న మొగలాయిసైనికుల నెదిరించి రణరంగమున నిలువబడుట యెవ్వరికి సాధ్యమగును? అందువలననే సామాన్యముగ రాజపుత్రులెల్లరు నాతనిపాదదాసులై పోయిరి. అంతటి మహామండలేశ్వరులకే యట్టిగతి కలిగినప్పుడు నేనెంతటివాడను?

జరిగినసంగతు లన్నియును యథార్థముగ దెలియజేసినను నేను బాదుషాచే క్షమింపబడుదునను నమ్మకము నాకెంతమాత్రమును లేదు. మీరు నాకుమార్తెను వివాహమే చేసికొన్నయెడల నా కన్యను తిరిగి యాతనికిచ్చుటకు వలనుపడదుగదా! అందువలన నాకును నాకుమార్తెకునుగూడ జప్పించుకొనుట కుపాయము లేనే లేదు.

మీరు నాపుత్రికను పెండ్లియాడవలదు. నాకు వ్యతిరేకముగ మీరు పెండ్లిచేసికొన సాహసించితిరేని "నాపుత్రిక గొడ్రాలై భర్తృవిహీనయై సహగమనభాగ్యమైనను లేకుండబోవుగాక! మీ రాజధాని శునకజంబుకనివాసమై పోవుగాక!" అని నామనఃపూర్వకముగ శపించుచున్నాను. ఈనాశాపాక్షరములు ప్రళయకాలమహానలజ్వాలలవలె మిమ్ము ముట్టడింప కూరక పోవునవి కావు."

షోడశాంకపేజగు విక్రముడతిభయంకరమై, యతిదారుణమైన యాయుత్తరము నల్లి వ్రాసి యాజాబుచివర నొకటిరెండు పఙ్క్తులలో "ఎప్పటికైన మీరు నాకుమాత్రము దగినవారే యని

నకు దోచినయెడల నష్టము కామనఃపూర్వకముగ నేనే మీకు కన్యాదానమును చేయుదును'' అని లిఖించి యాలేఖను ముగించి .. చెను.

చంచలకుమారితల్లి ప్రత్యుత్తర మేమియును పంపలేదు. రాజసింహుడు విక్రమసింహుడు వ్రాసిన యుత్తరమును చదివి చంచలకుమారికి వినిపించెను. అప్పుడు చంచలకుమారికి లోకమంత యును గాఢాంధకారబంధురమై పోయినట్లు తోచెను.

ఆమె చాలసేపటివఱకు నిరుత్తరయై, నిశ్చేష్టయై యుండెను. రాజసింహుడు ''ఇప్పు డేమిచేయవలయును? వివాహము కర్తవ్యమా కాదా!'' అనియెను.

చంచలకుమారి కడకంటినుండి యొకయశ్రుబిందువు—ఒక్కటే యశ్రుబిందువు—చిటుక్కున నేలపై బడియెను. పిమ్మట నామె కన్నీరు దుడిచికొని తనతండ్రిగారి తీవ్రశాపాతురములను శిరసావ హించి ''తనంతట దానే పెండ్లిచేసికొనుట కెవ్వనికుమార్తె సాహ సింపగలదు!'' అనియెను.

రాజ—అట్లయినయెడల నీవు నీపుట్టినింటికిఁ బోవుట కిష్టపడి యెదవేని పంపివైచెదను.

చంచ—ఇంతకంటె జేయవలసిన దేమున్నది? కాని, పుట్టి నింటికి బోవుటయును డిల్లీకి బోవుటయును సమానమే. ఇంతకంటె విషపానమే శ్రేష్ఠమైనదిగదా!

రాజ—నేనొకమాట చెప్పెదను వినుము. నీవు నాకు దగిన దేవివి. నిన్ను నేనారక పరిత్యజింపజాలను. కాని నీతండ్రి యాశీ ర్వాదము లేకుండ నిన్ను బెండ్లిచేసికొనజాలను. ఆతని యాశీర్వాదము నెన్నటికిని సంపాదింపజాలమని నేను నిరాశ నొందుటలేదు. ముందు ముందు నాకు మొగలాయిలతో దప్పక యుద్ధము సంభవింపగలదు.

మహాదేవు డగునేకలింగేశ్వరుడే నాకు సహాయుడై యున్నాడు. ఆ మహారణమున జచ్చుటయో, మొగలాయిలను పరాజితులం జేయుటయో జరిగితీరవలయును. ఇంతకంటె వేఱుగా నెన్నటికిని జరుగనేరదు.

చంచ—మీరు మొగలాయి యోధులం బరాజితులుగా జేయుదురని నాకు సంపూర్ణమైన నమ్మకమున్నది.

రాజ—అదియే కష్టసాధ్యము. ఆకార్యము సఫలమయ్యెనేని మీతండ్రిగారి యాశీర్వాదము నప్పుడు పొందగలుగుదును.

చంచ—అంతవఱకు నేనేమికావలసినది?

రాజ—నీవు నాయంతఃపురమునందే యుండుము. నాదేవులకుం బోలె నీకు నొక మందిరము నిచ్చెదను. నీకును దాసదాసీజనంబు లుపచారములు చేయుచుండెదరు. నీవు కొలదికాలములో నే దేవివయ్యెదవని ప్రకటింతును. నిన్నెల్లరును మహారాజ్ఞి యనియే పిలుచుచుందురు. కేవలము ధర్మశాస్త్రానుసారముగా పెండ్లిచేసికొను వఱకును దినదినమును వచ్చి నీదర్శనము చేయుచుండుటకుమాత్రము నేనంగీకరింపజాలను. ఇందులకు నీ వేమి చెప్పెదవు?

చంచలకుమారి బాగుగ యోచించి "ఇంతకంటె మంచియుపాయ మింకేమియును తోచుటలేదు" అని చెప్పి యందుల కంగీకరించెను. రాజసింహుడు చేయవలసిన యేర్పాటు లన్నియునుచేయించెను.

---

## నాలుగవ ప్రకరణము

### అగ్నిప్రజ్వలనమునకు మఱియొక కారణము

చంచలకుమారి రాజమహిషి యయ్యెనని మాణిక్యాలాలువలన నిర్మల వినియెను. వివాహ మెప్పుడైనదియో, నిజముగాఁ బెండ్లి యైనదో, లేదో యీసంగతులను మాణిక్యాలాలు సరిగాఁ జెప్పలేక పోయెను. అప్పుడు నిర్మల స్వయముగా చంచలకుమారిని జూడవలయునని బయలుదేరెను.

చాలకాలమునకు నిర్మలను జూచి చంచలకుమారి పరమానందభరితురాలయ్యెను. ఇదివఱకు నిర్మల తనతో వచ్చెదనని యొంతబ్రతిమాలినను చంచల యంగీకరింపలేదు. రూపనగరమును వదలి వచ్చినతరువాత జరిగినసంగతు లన్నియు వారిరువురును చెప్పుకొనిరి. నిర్మలకునగల సుఖసౌభాగ్యములనుగూర్చి విని చంచల చాల సంతోషించెను. మాణిక్యలాలు రాణారాజసింహునివలన ననేకబహుమానముల నందియుండెను. విశేషద్రవ్యమును సంపాదించుకొనియెను అంతియగాక మహారాణాయనుగ్రహమునకుఁ బాత్రభూతుఁడై సైన్యమునం దొకయున్నతోద్యోగమును వహించి చాలగౌరవము కలవాడైయుండెను. నిర్మలకు రాజమందిరమువంటి రమణీయమైన సౌధమొకటి యున్నది. ధనము, వైభవము, దాసదాసీజనము మొదలగు రాజవైభవములం దామెకెంతమాత్రమును లోపములేదు; మఱియును మాణిక్యలాలామె గీచినగీటు దాఁటకుండ నామె కోరికలెల్ల నెఱవేర్చుచుండెను. ఇంతకంటెను నిర్మలకుఁ గావలసిన దేమున్నది? ఆమెజీవితము సుఖముగాఁ గడచుచున్నదనుటకు సందేహమేమున్నది? చంచలకుమారి కడగండ్లన్నియు నాలకించి నిర్మల చాలవిచారించెను. ఆమె చంచలకుమారితల్లిదండ్రులమీఁదను, రాజసింహునిమీఁదను చంచలకుమారిమీఁదనుగూడ విరక్తివహించెను. నిర్మల, చంచలకుమారిని మహారాజ్ఞియని పిలుచుట కెంతమాత్రము నంగీకరింపలేదు ఆమె రాజసింహునిం జూచుటతటస్థించెనని మొగమోటములేకుండ రాణామొగముమీఁదనే రెండుమాటలు చెప్పుటకుఁ బ్రతిజ్ఞచేసికొనియెను. అప్పుడు చంచలకుమారి "ఇదియంతయు నిట్లుండనిమ్ము. నన్నెఱింగినవారెవ్వరును నాయొద్దలేరు. నాయాత్మబంధువులెవ్వరును లేరు. నేనిట్టియవస్థలో నొంటిగా నున్నదానను. దయామయుఁడైన దేవుఁడు తనయవ్యాజకరుణాలేశమువలన నిన్నిటకుఁదీసికొనివచ్చెను.

మఱి నీవిటనుండి నీయింటికి బోవలదు. నాతోగూడ నిక్కడనే యుండవలయును'' అనియెను.

ఈమాటలను వినినతోడనే నిర్మలగుండెల్లో రాయిపడినట్లయ్యెను. నిర్మలకిప్పుడే క్రొత్తక్రొత్తగా భర్తతో గాపురము చేయు భాగ్యము కలిగెను. నూతనప్రణయము—నూతనానందము—నూతనసుఖము—ఇదియంతయును విడిచి చంచలకుమారియొద్ద గనిపెట్టుకొని యుండు టెట్లు? నిర్మల యంతలో నంగీకరింపజాలకపోయెను. ఏవో యసత్యకారణముల గల్పించిచెప్పి సెలవుదీసికొనిపోవుటకుగూడ నామె కిష్టములేదు. తనహృదయభావముల నన్నిటిని చెప్పుటకుగూడ సంశయముగనే యుండుటచే నిర్మలచంచలతో ''ఆవిషయమై తరువాత జెప్పెదను'' అనియెను.

చంచల కన్నీరువెట్టుకొని తనలోదానే ''ఈనాప్రాణసఖియగు నిర్మలకూడ నన్నుం ద్యజించివైచినది. అయ్యో! దైవమా! నీవు నాపైనేల చలముసాధించెదవు?'' అని యనుకొని తరువాత జిరునవ్వునవ్వుచు ''చెలీ! నిర్మలా! నీవు నాకొఱకు రూపనగరము నుండి కాలినడకను నడచివచ్చును. దారియందుం జచ్చుటకైన నిశ్చయించుకొని కూర్చుండి యుంటివిగాదా? నేనుమాత్రమో? ఇప్పుడు మగనాలవగుటచేత నాయిట్లు సందేహించుచున్నావు?'' అనియెను.

నిర్మల తలవంచికొని తన్నుతానే నిందించుకొనుచు ''సఖీ! నేను తరువాత వచ్చెదను. ఎవ్వడునాప్రాణమానధనంబుల కధీశ్వరుండై యుండెనో యాతనితో నొకసారి మనవిచేసి యాతనియొద్ద సెలవు నందికొని రావలయును. ఇంతయెకాక కంఠపాశముగా నొకచిన్న బిడ్డకూడ నన్నుంబట్టుకొని యున్నది. దానికేదైనను దిక్కు చూపించి మఱిరావలయును'' అనియెను.

చం—అబిడ్డ యెక్కడిది? ఇక్కడ కెందులకు దీసికొని రాలేదు?

నిర్మ—అది తల్లిలేనిపిల్ల కావున నెప్పుడును పోరువెట్టుచునే యుండును. నాకదినమంతయు నాబిడ్డను సవరించుటతోడనే సరిపోవును. అందులకై యిటకుదీసికొని రాలేదు. ఎవ్వతెయో యొక ధాత్రియున్నది. ఆమెను పిలిపించి మాయింట నుంచి తగినయేర్పాటు లన్నియును చేసి వచ్చెదను.

అని చెప్పి నిర్మలకుమారి తన యింటికిఁబోయి మాణిక్యలాలునితో నల్లసంగతులను మనవిచేసెను. మాణిక్యలాలునకు ప్రాణేశ్వరియగు నిర్మలను పంపివైచుట చాలఁగష్టగాము దోచెను. అయినను కేవలమాతడు ప్రభుభక్తుడగుటచే నేమియు నభ్యంతరము చెప్పలేదు. అత్త వచ్చి బిడ్డనుపోషించు భారమును వహియించెను.

---

## పదవ ప్రకరణము

అదియేమి ప్రయోజనము?

నిర్మల పల్లకీనెక్కి దాసదాసీజనంబులతోఁగూడ మహారాణా యంతఃపురమునకు బయలుదేరెను. మార్గమధ్యమునందలి యొకవిశాలచతుష్పథంబునఁ జాలమందిజనులు గుంపులు గూడి యుండిరి. ఆజనసమ్మర్దము నాలకించి నిర్మల తన పల్లకిపై మూయబడిన యమూల్యావకుంఠనవస్త్రము నించుక యోరజేసి చూచుచు నొకదాసిని బిలిచి "ఇదియేమి?" అనియడిగెను. ఒకానొకసుప్రసిద్ధుఁడగు జ్యోతిష్కుఁడు నిత్యము నామందిరమునందుండి వేలకొలదిజనులకు జాతకఫలంబులఁ జెప్పుచుండు ననియును, ఆతఁడు చెప్పినఫలాఫలములు యథార్థముగ జరగుచుండుననియును దాసిచెప్పెను. నిర్మల యట

నున్న జనసమ్మర్దము నడగించు నట్లాజ్ఞాపించి తానాస్థలమునకు బోవు చుదనతోఁగూడ వచ్చువారితో దనసంగతి యితరుల కెవ్వారికిని దెలియ నీయవల దని చెప్పెను.

భల్లములు ధరియించి వచ్చుచున్న సేవకులు జనసమ్మర్దమును శాంతిపఱచి మార్గమును గల్పించిరి. క్రమముగా నిర్మలపల్లకి జ్యోతిష్కునియింటికిబోయెను. జ్యోతిష్కుఁడా మెకు నమస్కరించి యామె చేతి కేదియో, యొకవస్తువునిచ్చి "అమ్మా! మీరడుగవలసిన ప్రశ్న యేమి?" అనియడిగెను.

నిర్మ—నాప్రశ్నమునుగూర్చి ఫలగణనముచేసి చెప్పవలయును.

జ్యోతి—మీప్రశ్న మేమో చెప్పుఁడు!

నిర్మ—నాకొకస్నేహితురా లున్నది.

జ్యోతిష్కుఁడేదియో గుర్తుపెట్టుకొని "తరువాత!" అనియెను.

నిర్మ—ఆమె కింకను పెండ్లికాలేదు.

అతఁడు మరల నొక గుర్తుపెట్టుకొని "చెప్పుము!" అనియెను.

నిర్మ—ఆమె కెప్పుడు పెండ్లియగును?

జ్యోతిష్కుఁడు మరల నేమేమియో వ్రాసికొని లగ్ననిర్ణయముచేసి చూచుకొనియెను. తరువాత నిర్మలను గొన్నియంకెల నడిగి వ్రాసికొని గుణించి చూచెను. పిమ్మట ననేక గ్రంథములను బత్రములఁ దిరుగవైచి చూచి తుట్టతుదకు నిర్మలవంక పెదవివిరిచి చూచెను.

నిర్మ—అయ్యో! ఆమెకు వివాహమే కాదా?

జ్యోతి—ప్రాయికముగా శాస్త్రమునం దట్టిఫలమే కనఁబడు చున్నది.

నిర్మ—ప్రాయికముగా ననుటయెందులకు?

జ్యోతి—చతుస్సముద్రముద్రితధరావలయేశ్వరుఁ డగువాని దేవివచ్చి నీసఖికి సేవచేయుట తటస్థించెనేని వివాహము కాఁగలదు. అట్లు కానియెడలఁ గానేరదు. అది యసంభవ మగుటచే వివాహము కాదని చెప్పవలసి వచ్చెను.

నిర్మల—అసంభవమే యగును.

అని చెప్పి యాజ్యోతిష్కునకు బహుమానము నిచ్చి నిర్మల యటనుండి బయలుదేరెను.

---

## ఆఱవ ప్రకరణము.

---

### అగ్నిప్రజ్వలనప్రస్తావము.

చంచలాపహరణమువలనం జనియించిన మహానలజ్వాలా ముఖంబునంబడి మొగలాయిసామ్రాజ్యమో, రాజపుత్రసంస్థానమో తప్పక ధ్వంసము కావలసి యుండెను. కేవలము మహారాణారాజ సింహునియనుగ్రహ మున్నంతమాత్రమున నీవిపత్తు తప్పిపోఁజాలదు. ఈయద్భుతవ్యాపారపరంపరలంగూర్చి వివరించి తెలుపుటయే యీ గ్రంథకర్త యుద్దేశముకాదు. కాకపోయినను గొంచెమైనఁ దెలుపక పోయినయెడల నీగ్రంథము పరిసమాప్తి కాజాలదు.

రూపనగరరాజకుమారిక మహారాణాచే నపహరింపఁబడియె నను సమాచారము డిల్లీ బాదుషాయొద్దకువచ్చెను. అప్పుడు డిల్లీనగ రమున విశేషముగఁ గోలాహలము బయలుదేరెను. ఔరంగజేబు బాదుషా మోహాంధుఁడై, మదాంధుఁడై తనసేనానాయకులలోఁ గొంతమంది నుద్యోగములనుండి తప్పించి వైచెను; కొందఱిని బంధించి కారాగారమునం దుంపించెను; మఱికొందఱికి మరణదండనమునే

విధించెను. కాని ప్రథానాపరాధులగు చంచలారాజసింహులనంత శీఘ్రముగా దండించుట యాతనికి సాధ్యపడలేదు. మేవారురాజ్యము చిన్న దేశమైనను శాత్రవులకు దుర్భేద్యమై యుండెను. ఆ రాజ్యము నలువంకలను దుర్విలంఘ్యములగు పర్వతమాలికలు పెట్టని ప్రాకారములై యలరారుచుండెను. రాజపుత్రులందఱును మహాబలపరాక్రమసంపన్నులగు వీరపురుషులై యుండిరి. అందును రాజసింహుఁడు వీరచూడామణియని పేరుమోచియుండెను. ఇట్టిసమయములు తటస్థించినప్పుడు రాజపుత్రవీరులెట్టి సాహసమును ప్రకటించి పనిచేయుదురో ప్రతాపసింహుఁ డొకసారి యక్బరునకు దెలిపియే యున్నాఁడు. అప్పుడు సకలధరాతలనాయకుం డగు నక్బరునకు గూడ దొంగతనముగా బాఱి పోవలసివచ్చెను.

కాని, ఔరంగజేబుకోపానలము సాధారణముగా జల్లారునది కాదు. హైందవుల కపకారము చేయుటకే యాతఁ డవతరించి యుండెను. హిందువుల చిన్నతప్పిదముకూడ నాతని కసహ్యముగా దోచుచుండెను. ఆతని నొక మహారాష్ట్రవీరు డనేకపర్యాయములవమానించి విడిచిపెట్టెను. ఇప్పుడు మరల రాజపుత్రుఁ డొకఁ డవమానమును గల్పించెను. ఆత డామహారాష్ట్రవీరునిచేతల కేమియు బ్రతిక్రియ చేయలేకయే పోయెను. ఈరాజసింహునిమాత్ర మేమి చేయగలఁడు? విషవాహినిమాత్రము బహుముఖముల బ్రవహించుచున్నది. అందువలన రాజసింహుడు చేసిన యపకారమునకు బదులుగా హిందూజాతి నంతను బీడింపవలయు నని యాతనికొక దురుద్దేశము కలిగెను.

ఆదాయపుబన్ను (Income-Tax) అను కప్పమును చెల్లించుటయే మనకిప్పు డసహ్యముగా నున్నది. ఇంతకంటెను విశేషాసహ్యకరమైన పన్నొకటి మునల్మానుప్రభువుల పరిపాలనకాలమునందున్నది.

అది కేవలము నరహత్యాకరమైనదిగో. ఏమన—ఆపన్ను హిందూ జనులుమాత్రమే చెల్లింపవలసినది. ఈపన్నుపేరు జిజియా. మహా రాజసింహునికారకుఁ డగు వర్గ్బుచకానుసామాత్ర మీపన్నువలన ప్రతి బంధమునుగూర్చి బాగుగా దెలిసికొని తన పరిపాలమునం దీపన్ను త్యజించివైచెను. హిందూదేవ, హిందూమత, హిందూజనద్వేషియగు నౌరంగజేబు మరల నింతకాలమున కీపన్నును స్థాపించి హైందవ ప్రజలలో గల్లోలమును వర్ధిల్లజేయవలయు నని తలంచెను.

ఆత డింతకుముందే యీపన్నును నియమించి యుంచెను. కాని, యిప్పుడు దానిని రాబట్టుటకై హిందువులను తొందరపెట్ట సాగెను. అందుమూలమున హిందూజనులు చాలవఱకు బీడింపబడి యున్నిటికిని తెగించియుండిరి, ఒకప్పుడు వేలకొలది హిందూప్రజలౌ రంగజేబునొద్దకు బోయి చేతులుజోడించుకొని నిలువబడి తమ కష్టములనుగూర్చి మొఱపెట్టుకొనిరి. అపరహిరణ్య కశిపుఁడగు నా మహారాజు "వీరినందఱను మదగజపదాఘాతములచే మర్దింపవల యును" అని యాజ్ఞాపించెను. అప్పుడొక క్షణకాలములో నావిషమ జనసమ్మర్దము మదగజచరణప్రహారములచే నివారింపబడియెను.

ఔరంగజేబునకు లోబడిన భారతీయు లందఱును జిజియా పన్ను నిచ్చివైచిరి. బ్రహ్మపుత్రానదీతీరమునుండి సింధుతీరమువఱకు నున్న హిందువుల దేవాలయములయందలి మహాదేవవిగ్రహము లన్నియును చూర్ణీకృతములైపోయెను. చాలకాలమునుండి మహా వైభవము ననుభవింపుచు నాకాశమునొరయుచున్న రమణీయ దేవ మందిరము లన్నియును భగ్నములైపోయెను. వానికి బదులుగా ముసల్మానుల మసీదులు వెలువడియెను. కాశీయందలి విశ్వేశ్వరాల యము చెడిపోయెను. మథురాపురమునందలి కేశవమందిరము నామ మాత్రావశేషమైపోయెను. బంగాళమునందలి ప్రజలకీర్తులను వెల్ల

డించుచున్న చిత్రాలంకారవిలసితంబులగు దేవమందిరము లన్నియును పేరులేకుండ నశించిపోయెను.

అప్పుడౌరంగజేబు రాజపుత్రానాయందలి రాజపుత్రులెల్లరును తనకు జిజియాపన్ను నిచ్చి తీరవలయునని యాజ్ఞాపించెను. రాజాపుత్రానాప్రజలు తనప్రజలు కాకపోయినను వారు హిందువులై యుండుటచే వారిపైగూడ నీశాసనము ప్రయోగింపబడియెను. మొట్టమొదట రాజపుత్రు లెవ్వరు నిందుల కంగీకరింపలేదు! కాని యుదయపుర మండలము కాక మిగిలిన రాజపుత్రు లంతయును నావికుములేని యోడ పోలిక నగతికమై యుండెను. జయపురప్రభుండగు జయసింహుని బాహుబలము మొగలాయి సామ్రాజ్యమునకుఁ బ్రధానప్రతిఘాతమై యుండెను. ఇప్పుడా జయసింహుడు లేడు. ఆతనికి మిత్రుడును విశ్వాసఘాతుకుడునగు నొకదురాత్మునిం దన వశముచేసికొని యౌరంగజేబు నేర్పుచే నాతనికి విషప్రయోగము చేయించి చంపించెను. తరుణ వయస్కుడగు నాతని కుమారుడిప్పుడు ఢిల్లీనగర కారాగారమున నుంపబడియున్నాడు. అందువలన జయపురముహా నాతనికి జిజియా పన్ను చెల్లింపవలసినవారైరి.

యోధపుర ప్రభుండగు యశోవంతసింహునకు లోకాంతర ప్రాప్తియగుటచే నాతనిదేవియే యారాజ్యమును పరిపాలించుచుండెను. ఆమె స్త్రీయయ్యును పన్నునిచ్చుట కంగీకరింపలేదు. అందుచే నౌరంగజేబామెతో యుద్ధముచేయుటకు బ్రయత్నించెను. ఆస్త్రీరత్నము యుద్ధమనేకానర్థములకుఁ గారణ మగునని యూహించి పన్నునకు బదులుగా గొంతరాజ్యము నిచ్చివేచి సంధిచేసికొనియెను.

రాజసింహుడు మాత్రము జిజియాపన్ను నిచ్చుట కంగీకరింపలేదు. ఈపన్నువిషయమై యధిక్షేపించుచు నాతడౌరంగజేబునకొక

యుత్తరము వ్రాసిపంపెను. ఆలేఖంగూర్చి రాజస్థాన చరిత్రమునం దిట్లు వ్రాయబడియున్నది.

"The Rana remonstrated by letter, in the name of the nation of which he was the head. in a style of such uncompromising dignity. such lofty yet temporate resolve, so much of soul stirring rebuke mingled with a boundless and tolerative benevolence, such elevating excess of the Divinity with such pure philanthrophy, that it may challenge, competition with any epistolory production of any age, clime or condition-Tod's Rajastan vol I page 381.

ఈలేఖవలన బాదుషహా క్రోధాగ్నియందు ఘృతాహుతిచేసి నట్లయ్యెను.

అప్పుడు బాదుషా, రాజసింహుడు తప్పక పన్ను నిచ్చి తీర వలయుననియు. అతనిరాజ్యమునందు నిరాఘాటముగా గోహత్యలు జరుప వచ్చుననియు, దేవాలయములు నాశనముచేయవలయు ననియు నాజ్ఞయొసంగెను. రాజసింహుడు యుద్ధప్రయత్నములను చేయనారంభించెను.

ఔరంగజేబుకూడ యుద్ధమునకుఁ ద్వరపడుచుండెను. అంతటి భయంకరప్రయత్నమునాత డెన్నఁడు చేసియుండలేదు. చీనాదేశ సార్వభౌముడు పరిష్యాదేశప్రభునితో యుద్ధముసేయుట కెంతటిప్రయత్నయచేసెనో యంతకంటె హెచ్చుగా నీచిన్నరాజ్యమునకు బ్రభువైన రాజసింహుని పైదండెత్తుట కౌరంగజేబు ప్రయత్నించుచుండెను. ఆసియాఖండమునందలి యర్ధభాగమునకుఁ బ్రభువగు జర్జన్ (Xerxes) కేవలమొక యల్పరాజ్యమును స్వాధీనపఱచుకొన దలంచి యెట్లు సైన్యము మొదలగువానిని సంగ్రహించియుండెనో, యట్లే యాపదు నేడవశతాబ్దమునందలి జర్జనగు నౌరంగజేబు మహాప్రయత్నములను జేయుచుండెను. ప్రస్తుతప్రయత్నముల కీపై నుదాహరించినవి రెండు

మాత్రమే పోల్పదగియున్నవి. దేశచరిత్రమున నింతకంటె మూఢవది యేదియు నగపడుటలేదు. మనము గ్రీసుదేశచరిత్రమును కంఠపాఠముచేసి చదువుచున్నాము. మన రాజసింహునిచరిత్రము మన భారతీయుల కెవ్వరికిని సామాన్యముగ దెలియనే తెలియదు. ఇప్పటి విద్యాశాలలయందలి బోధనములవలన మనకు గలుగుచున్న లాభములింతవఱకే.

---

## ద్వితీయభాగము—అనలోత్పాదనము.

### మొ ద టి ప్ర క ర ణ ము

#### అరణికాష్ఠము—ఊర్వశి.

రాజసింహుడు తీవ్రవచనసమంచితంబగు నాయుత్తరము నౌరంగజేబునకు బంపించినదిమొదలుకొనియు నియ్యనలోత్పాదకకార్యము పునస్సంజనితమైనదని చెప్పవచ్చును. ఆయుత్తరము నౌరంగజేబునొద్ద కెవ్వరు తీసికొని పోగలరనువిషయముంగూర్చి చాలసేపు చర్చించిరి. ఏమనిన—వార్తాహారులగు దూతలవధ్యులని రాజనీతిజ్ఞులయభిప్రాయమేయైనను, పాపభయశూన్యుండగు నౌరంగజేబుమాత్రముచాలమందిదూతలనుచంపించినట్లు ప్రతీతియుండెను. కేవలముప్రాణములకు భయపడి యాత్మరక్షణము చేసికొనంజాలని యసమర్థుండగువాని నక్కడకు రాయబారిగాం బంపుట రాజసింహున కెంతమాత్రము నిష్టములేదు. ఆసమయమునందు మాణిక్యలాలు రాజసింహునొద్దకువచ్చి నన్నాకార్యమునందు నియమింపవలయునని వేడుకొనియెను. ఈతండిందుల కెల్లవిధములం దగియుండు నని యూహించి రాణా యాతని నాఘనకార్యమున నియోగించెను.

ఈసమాచార మంతయును విని చంచలకుమారి నిర్మలం బిలిపించి "నీవు నీప్రాణేశ్వరునితోఁగూడ బోఁదలఁచికొనలేదా?" అనియడిగెను.

నిర్మల విస్మితయై "నేనెక్కడకుఁ బోవలయును? ఢిల్లీనగరమునకా? ఎందులకు?" అనియెను.

చంచ—ఒకసారి బాదుషా రంగమహాలును చూచివచ్చుటకు

నిర్మ—అది కేవలము నరకమే యని మనము వినియుంటిమి కాదా?

చంచ—అయిన నేమి? నీవు నరకమునకుఁ బోఁగూడదా? పాపము! నీవాయమాయకుఁడగు మాణిక్యలాలునిపై జూపుచున్న దౌరాత్మ్యమునకు నీకు నరకముగాక మఱేమి లభించును?

నిర్మ—సఖీ! అట్లనకుము! అట్లనకుము! ఆతఁడు సౌందర్యముగ్ధుఁడై నన్నేల పెండ్లి యాడవలయును?

చంచ—నీవొక చెట్టుక్రిందబడి నిష్కారణముగ జచ్చిపోవుచుంటివని కరుణించి నిన్నాతఁడు పెండ్లిచేసికొనియెను.

నిర్మ—నేనాతని బిలిచి నన్నెట్టులైన పెండ్లియాడక తప్పదని బ్రతిమాలుకొనలేదే! ఇప్పుడాభూతముతోఁగూడ ఢిల్లీకిబోయి నేను చేయవలసిన పనియేమున్నది?

చంచ—ఉదయపురి బేగమునకు నేనొకయుత్తరము వ్రాసి యిచ్చెదను. దాని జూపించి నీవామె నిచ్చటికి దీసికొనిరావలయును.

నిర్మ—ఎందులకు?

చంచ—నాకొకపరిచారికవై తాంబూలములను మడచి యిచ్చుచుండుటకు

నిర్మ—ఔను! మఱచితిని. రాజరాజేశ్వరి యొక్కతె వచ్చి నిన్ను సేవించుట సంభవింపకపోయినయెడల నీకుఁగూడ నొకభూతము లభియింపదఁటగాదా?

చంచ—పాపాత్ములారా! అవలఁబొమ్ము! నేనేభూతము నైయున్నదానను. బాదుషావారిబేగము వచ్చి నాకు దాసికావల యును. అట్లు కానియెడల నేను విషపానము చేసి తీరవలయును. ఇంతియే కాదా జ్యోతిష్కుఁడు చెప్పినది!

నిర్మ—జాబు వ్రాసి యిచ్చితివేని నేను పోయి బేగమున కిచ్చి వచ్చెదనుకాదా! ఇంతయేల!

చంచ—యుద్ధములను గల్పించి వర్ధిల్లఁజేయుటయే నాము ఖ్యోద్దేశము. ఏమనిన—మహారణము కలిగినయెడల నిశ్చయముగా మహారాణాకే విజయము లభించునని నానమ్మకము. అప్పుడు బేగము నాకుఁ బరిచారిక కాఁగలదు. నీవొకసారి యాయుదయపురి బేగమును చూచివచ్చుట కూడ నాయభీష్టమైయున్నది.

నిర్మ—అట్లయినయెడల నీకార్యమేవిధముగా నెఱవేఱఁ గలదో చెప్పుము.

చంచ—యోధపురిబేగమువారి హస్తముద్ర మనయొద్ద నున్నదికాదా! దానిని తీసికొనిపొమ్ము. దానిసాహాయ్యమువలననే నీవు రంగమహాలునఁ బ్రవేశించి యోధపురిబేగమును సందర్శించి జరగిన సమాచార మంతయు నామెకు నివేదించి నే నుదయపురిబేగ మునకు వ్రాసినయుత్తరము నామెకుఁ జూపింపుము. ఆమె దాని నెట్లయిన నుదయపురి కందించునట్టియేర్పాటు చేయఁగలదు. ఏసమ యమునందైన నీకాలోచన తోఁచకున్నప్పుడు నీభర్తతో నాలోచించి నేరుపుతో నికార్యమును కొనసాగించుకొని రావలయును.

నిర్మ—అహా! నేనెంతటి యాఁడుదాననో యాతఁడు నంతటి మగవాఁడే. మా సంసారవ్యాపారముల నడుమ నక్కఱలేదు.

అని నవ్వుచు నిర్మల చంచలయిచ్చినజాబు నందికొని వెడలి పోయెను. ఆమె తనభర్తతోఁగూడ ఢిల్లీయాత్రకుఁ బోవుటకై తగిన ప్రయత్నములను చేయుచుండెను.

## రెండవ ప్రకరణము

అరణికాష్ఠము—ప్రహారప్రుడు.

ప్రయాణమునకై విశేషప్రయత్నములను జేయుచున్న మాణిక్యలాలు నిర్మలకొక విచిత్రవస్తువును చూపించెను. దానిజూచి నిర్మల విశేషాశ్చర్యము నందెను. అతఁడు తన తెగిపోయిన వ్రేళ్ళకుబదులుగాఁ గ్రొత్తవ్రేళ్ళను చేయించుకొనియెను. "ఇవి యెందులకు?" అని నిర్మలయడిగెను.

మాణి—వీనిని నేను క్రొత్తగాఁ జేయించితిని.

నిర్మ—దేనితోఁ జేయించితిరి?

మాణి—ఏనుఁగు దంతముతోఁ జేయించితిని. కృత్రిమమైనవని గుర్తు దెలియకుండునట్లు వీనికి మేఁకచర్మము నదికించి నాయొడలి రంగుతో సమానమగురంగును వేయించితిని. కావలసినప్పుడు ధరించుకొనుటకును నక్కఱలేనప్పుడు తీసివేయుటకునుపయోగముగా నుండఁగలవు.

నిర్మ—ఇందువలన బ్రయోజనమేమి?

మాణి—ఆవిషయము డిల్లీయందు దెలియగలదు. అక్కడ నావశ్యకముగా గృత్రిమవేషము ధరింపవలసియుండును. వ్రేళ్లులేకుండ నుండినయెడల నెట్టివేషము వేసికొన్నను బయలుపడకమానదు. రెండువిధములుగా నున్నయెడల సరిగా నుండును.

నిర్మల మందహాసముచేసెను. తరువాత మాణిక్యలాలు రెండు పావురములను దీసికొనియెను. దూతకృత్యమునందు మిగుల నైపుణ్యముగలుగునట్లు వాని నాతడు పెంచెను. ఆధునికులైన యూరపుఖండవాసులు యుద్ధసమయములం దుపయోగించుకొనుచున్న పావురవు

దూతల (Carrier Pigeon) సంగతిం దెలిసిన వారెల్లరు నీపావురముల యుపయోగముంగూర్చి తెలిసికొనగలుగుదురు. పూర్వకాలమున భారతవర్షమునం దిట్టిపావురముల వ్యాపారము విశేషముగా నుండెను. ఆపావురములగుణవిశేషముంగూర్చి మాణిక్యలాలు నిర్మలకు బాగుగా దెలియజేసెను.

ఢిల్లీబాదుషావారియొద్ద కెవ్వరైన దూతను బంపవలసివచ్చినప్పు డాతనికి గొన్ని కానుకలను బంపించుట యాచారమై యుండెను. ఇంగ్లండు, ఫోర్చుగలు మొదలగు దేశములకు బ్రభువులగువారుకూడ నట్లే చేయుచుండిరి. రాజసింహుడును గొన్నివస్తువులను మాణిక్యలాలున కిచ్చి పంపించెను. స్నేహాదార్త్యము కాకుండుటచే విశేషవస్తువులను గానుకగా బంపియుండలేదు.

ఇతర వస్తువులతోఁగూడ జంద్రకాంత శిలానిర్మితంబులును, నమూల్యమణిఖచితములు, నగు వస్తువులును, సరిగ కుట్టుపనులచే రమణీయములగు వస్త్రాదులునుకూడ బంపబడియెను. వానిని మాణిక్యలాలు వేఱొకబండిపై వేయించెను.

నియమితదినముననే రాణావారి యుత్తరమును, సెలవును దీసికొని దాసదాసీజనపరివృతుడై, ఏనుగులు, గుఱ్ఱములు, లొట్టియలు, శకటములు, పల్లకులు మొదలగు సాధనసామగ్రులం జేర్చికొని మిగుల నట్టహాసముతో మాణిక్యలాలు నిర్మలంగూడి ఢిల్లీకి బయలువెడలెను. ఆతడు ఢిల్లీనగరము జేరుటకు జాలదినములు పట్టెను. ఢిల్లీనగరమున కనతిదూరమునం దొక రమ్యప్రదేశమున నాతడు విడిసి యచ్చట నిర్మలను, మిగిలినపరివారమును నిలిపి నమ్మకముగల సేవకునితోఁగూడ మాణిక్యలాలు ఢిల్లీకిబోవుచు గొన్ని శిలానిర్మితములైన ప్రతిమలను తనతో దీసికొనిపోయెను. ఆతడు పోవునప్పుడు దంతనిర్మితములైన తనచేతివ్రేళ్లను దీసి నిర్మలకుమారిచేతి కిచ్చి "నేను మరల తేపు వచ్చెదను" అని చెప్పెను.

నిర్మ—ఇక ముందు జరుగవలసిన దేమి?

మాణిక్యలాలు శిలానిర్మితమైన యొకవస్తువును, దానియం దున్న యొక చిహ్నమును నిర్మలకు జూపించి "ఈశిలాప్రతిమలయం దన్నిట నిట్టిగుర్తుండియుండును" అని చెప్పెను.

నిర్మ—ఈగుర్తెందులకు?

మాణి—ఢిల్లీయం దావశ్యకముగ మనము విడిపోవలసి యుండును. మొగలాయిల ప్రతిబంధమువలన పరస్పరసమాచారము లొండొరులకు దెలియకపోవుట తటస్థించినప్పు డీశిలాప్రతిమలను కొని తెచ్చుటకై సేవకుల నంగడివీధికి బంపించుము. ఏయంగడియం దున్న వస్తువులపై నిట్టిగుర్తుండునో యాయంగడిపై నాసమాచారము తెలియగలదు.

ఇట్లు చెప్పి మాణిక్యలాలాశిలాసామగ్రులను తీసికొని తనసేవకునితోగూడ ఢిల్లీకిబోయి యొకమందిరము నద్దెకుదీసికొని యందా వస్తువుల నుంచి యమ్ముచుండునట్లు తనసేవకుని నియమించి తిరిగి శిబిరమునకువచ్చెను.

పిమ్మట దనపరివారమును వెంటబెట్టుకొని నిర్మలాసహితుడై ఢిల్లీనగరమునకు బోయి యట నొకచో శిబిరమును స్థాపించుకొని బాదుషావారికి దనరాక యెఱింగించెను.

---

## మూ డ వ ప్ర క ర ణ ము

---

అగ్ని చయనము

అపరాహ్ణసమయమున నౌరంగజీబు దర్బారునకు వచ్చెను. మాణిక్యలాలుకూడ నాదర్బారునకు వచ్చెను. ఢిల్లీదర్బారునుగూర్చి యనేకులనేక గ్రంథములయందు వర్ణించియున్నారు. దానినిగూర్చి

మరల వర్ణించుటకు మాకిష్టములేదు. మాణిక్యలాలు ప్రథమసోపానము నధిష్ఠించి యొకసారి చక్రవర్తికి సలాముచేసి లేచెను. మఱియొకసారి వేఱొకమెట్టుపై గాలుంచి సలాము చేసెను. ఇంకొకమెట్టెక్కి మరల నట్లే సలాముచేసెను. ఇట్లు ముమ్మారు సలాముచేసి లేచి మాణిక్యలాలు సింహాసనసమీపమునకు వచ్చి బాదుషావారియెదుట నిలువబడియెను. పిమ్మట నాతడు చక్రవర్తి కభివాదనము చేసి రాజసింహు డుపాయనముగ బంపిన వస్తువులను బాదుషాసముఖమునందుంచెను. ఆయుపాయన మల్పమూల్యము కలదగుటచే నౌరంగజేబు కొంచెము కోపముగలవాడయ్యెనే గాని యేమియును మాటలాడలేదు. ఆకానుకలలో రెండుకత్తు లుండెను. అందొకటి యొరయందుంచఁబడి యుండెను. మఱియొకటి యొరనుండి తీయఁబడియుండెను. ఔరంగజీ బారెండవకత్తినిమాత్ర మందికొని మిగిలినకానుకలను విడిచివైచెను.

తరువాత మాణిక్యలాలు రాజసింహుఁ డంపినయుత్తరమును బాదుషా కొసంగెను. అందలి యంశములను గ్రహించి యౌరంగజేబు క్రోధాంధుఁడై పైకిమాత్రము శాంతస్వభావముకలవానివలెనే నటియించెను. ఆతఁడు మహోదరము కలవానివలెనే మాణిక్యలాలుని కుశలప్రశ్నము చేసి మఱునాఁడు దీనికిఁ బ్రత్యుత్తరము నిచ్చెదనని చెప్పి మాణిక్యలాలును పంపివైచెను.

తోడనే కొలువు చాలించి పోవుచు రహస్యముగా మాణిక్యలాలును సంహరింపవలయు నని బాదుషా సేవకుల కాజ్ఞాపించెను. వారు మాణిక్యలాలును వెదకుటకుఁ బ్రారంభించిరి. ఆఢిల్లీనగరమున మాణిక్యలా లెక్కడను వారికగపడలేదు. తన్నువధించుటకు బాదుషా యాజ్ఞాపించుటకు పూర్వమే మాణిక్యలా లెక్కడకో తప్పించుకొని పోయెను. వారాతని వెదకుచున్నసమయమున మాణిక్యలాలు మాయ

వేషమును ధరించికొని పోయి తానక్కడకుఁ దీసికొన్న యంగడికిఁబోయి శిలాప్రతిమల నమ్ముకొనుచుండె నని వేఱుగఁ జెప్పవలసిన యవసరములేదు. రాజభటులు నగరమం దంతటను వెదకివెదకి మాణిక్యలాలు గపడకుండుటచే నాతనిశిబిరమునకుఁ బోయి యటనున్న వారినం దఱను బట్టుకొని కొత్వాలునొద్దకుఁ దీసికొనిపోయిరి.

వారిమూలమున మాణిక్యలాలు సమాచార మేమియును దెలియరాదయ్యెను. వారినిభయపెట్టినను, కొట్టినను వారు మాణిక్యలాలు వృత్తాంతమును చెప్పలేకపోయిరి. ఎంత యాలోచించినను మాణిక్యలాలు సమాచారము తెలియలేదు.

తుదకాకొత్వాలు నిర్మలకుమారిని విచారింప నారంభించెను. ఆమె యంతఃపురస్త్రీ యగుటచే నంతవరకు నామెను పారాయందుంచిరి. ఆమెను పిలిపించి కొత్వాలడిగెను. ఆమె "రాణారాజసింహుని దూతను నేనెఱుంగను" అనిచెప్పెను.

కొత్వా—నీవు రాణా రాయబారితోగూడ వచ్చియుండలేదా?

నిర్మ—నేనుదయపురము నెన్నడును చూచియుండలేదు.

కొత్వా—అట్లయిన నీవెవ్వరు?

నిర్మ—నేను మహాదేవి యోధపురిబేగమువారి హిందూ పరిచారికను.

కొత్వా—అట్లయినయెడల రంగమహాలును విడిచి యెట్లు వచ్చితివి? వారెప్పుడును వెలుపలకురారే!

నిర్మ—నేనుగూడ నెప్పుడును వెలుపలకు వచ్చియుండలేదు' ఇప్పుడెవ్వరో హిందువులిక్కడకు వచ్చిరని విని బేగమువారు నన్నిచ్చటకు బంపినారు.

కొత్వా—ఎందులకు?

నిర్మ—(శ్రీ)కృష్ణచరణామృతముకొఱకు—రాజపుత్త్రిల కందఱకు నది పరమపూజ్యమైనది.

కొత్వా—నీవొక్కతెవ్వరు మహాలునుండి యెట్లువచ్చితివి?

నిర్మల యోధపురి బేగమువారి హస్తముద్ర యాతనికిఁజూపించి "దీనిసాహాయ్యముచే నేను వెలుపలకు రాఁగలిగితిని" అనిచెప్పెను.

దానిని చూచి కొత్వాలు నిర్మలకు మునస్కారు సలాముచేసి "నీవు నిర్భయముగా బొమ్ము! నిన్నెవ్వరు నడ్డగింపఁజాలరు" అనియెను.

నిర్మల—అయ్యో! మీరు నాకొక యుపకారము చేయవలయును. నేనెన్నడును మహాలునుండి యీవలకు వచ్చినదాననుగాను. నేటియల్లరులమూలమున ద్వారపాలకులం జూచిన నాకు భయమగుచున్నది. దయయుంచి మీరొకమనుష్యుని నాతోఁబంపెదరేని నేను నిర్భయముగా మహాలునకు బోఁగలుగుదును!

తోడనే కొత్వాలొక యాయుధపాణియగు రాజభటుని బంపించుచు నీమెను రంగమహాలున బ్రవేశపెట్టి రమ్మని చెప్పెను. ప్రధానమహిషియగు యోధపురిబేగము హస్తముద్రం జూచి కొజ్జాలెవ్వరును నిర్మల నడ్డగింపలేదు. నిర్మల కడుచతురతతో నతివిలాసముగ గనబడినవారితో సంభాషించుచు యోధపురిబేగమున్నస్థలమును దెలిసికొనియెను. ఆమె యోధాబాయి మందిరమునకుబోయి యామెకు నమస్కరించి హస్తముద్రం జూపించెను. చూచిన తోడనే యోధాబాయి నిర్మల నతిభద్రముగ రహస్యస్థలమునకుఁ దీసికొనిపోయి యామెతో మాటలాడదొడగెను.

యోధ—ఈహస్తముద్ర నీకెట్లు వచ్చినది?

"నేనెల్ల విషయములును సవిస్తరముగా దెలియజేసెదను" అనిచెప్పి నిర్మల ముందుగాదన విషయమును చెప్పెను. పిమ్మట యోధాబాయి దాసియగుదేవి రూపనగరమునకు వచ్చి సందేశవచనములం దెలుపుటయు, నామె హస్తముద్ర నట దిగవిడిచిపోవుటయు, చంచలకుమారి తనకుబ్రాణసఖి యగుటయు, మాణిక్యలాలునకును

తనకును సంబంధము కలుగుటయు, మాణిక్యలాలుతోఁ దానుఢిల్లీకి వచ్చుటయు, చంచలకుమారి యుదయపురికి జాబు నంపుటయు, దానికొరకాపదం బడుటయు, నాయాపదను తప్పించుకొని భద్రముగా నంతఃపురమునఁ బ్రవేశించుటయు మొదలగువిషయము లన్నిటిని దెలియఁజెప్పెను. అనంతరము చంచలకుమారి యుదయపురికి వ్రాసి పంపినయుత్తరమును జోధాబాయికిఁ జూపించి "ఈయుత్తరము నుదయపురిబేగమున కెట్లందింపవలయునో తెలిసికొనుటకై నేను మీదర్శనమునకు వచ్చితిని" అనిచెప్పెను.

జోధ—అందుల కుపాయము లేకపోలేదు. ఇందులకు జేబఉన్నీసా యాజ్ఞయైనఁ జాలును. ఇప్పుడే యామెయొద్దకుఁ బోయిన యెడలఁ జాల నల్లరిగా నుండును. ఆపాపాత్మురాలు రాత్రులయందు మద్యపాన మదవిహ్వలయై యుక్తాయుక్తజ్ఞానము లేక పడియుండును. ఆసమయమును గనిపెట్టి యామె దయ సంపాదించుట కుపాయము నాలోచింపవచ్చును. నీవిప్పుడు పోయి నాహిందూపరిచారికలతోఁ గూడ నుండుము. నీవక్కడనే భోజనము చేయవచ్చును.

నిర్మల యందుల కంగీకరించెను. జోధపురిబేగము నిర్మలకుఁ దగినయేర్పాటు లన్నియును జేయించెను.

---

## నాలుగవ ప్రకరణము.

### సమిత్సంగ్రహము—ఉదయపురిబేగము.

చాలరాత్రి యైనది. ఆసమయమున జోధపురిబేగము నిర్మలను పిలిపించి యామెతోఁ జెప్పవలసినసంగతు లన్నియుం జెప్పి యామె కొకదూతి నిచ్చి జేబఉన్నీసాయొద్దకుఁ బంపించెను. నిర్మల జేబఉన్నీసా మందిరమునకుఁ బోయి యందలి పుష్పహారములు,

చందనము, అత్తరులు మొదలగువాని పరిమళముల కానందించి మహాశ్చర్యము నందెను. అనత్తావ్రులతోఁ దంబాకుపరిమళముగూడఁ జేరియుండెను. మణివినిర్మితంబగు నామందిరమును, మందిరాలంకారములను, సురభిళకుసుమపరివృతంబగు మృదుశయ్యను, శయ్యాలంకారములను గాంచి నిర్మల నివ్వెరపడియెను. అన్నిటికంటెను మించిన జేబఉన్నీసావిచిత్రాలంకారప్రభలును లావణ్యకాంతులును మిగుల నాశ్చర్యజనకములై యుండెను. ఇట్టి వైభవములతో నలరారుచున్న పాపాత్మురాలగు జేబఉన్నీసాను చూచినయెడల స్వర్గలోకనివాసిని యగు నప్సరఃకన్యయేమోయను సందేహము కలుగక మానదు.

అప్పుడా యప్సరఃకన్యకకుఁ గన్నులు తేలిపోవుచుండెను. ద్రాక్షారసపానవశంబునం గలిగిన చిత్తవిభ్రాంతి రక్తవర్ణంబగు నామె వదనమండలమున సంపూర్ణాధికారము సేయుచుండెను. నిర్మలకుమారి యామెయెదుటకుఁ బోయి నిలువబడియెను. అప్పుడు జేబఉన్నీసా నాలుక తడఁబడుచుండ "ఎవరు నీవు?" అనియడిగెను.

నిర్మ—నే నుదయపుర రాజమహిషీదూతికను.

జేబ—మొగలు బాదుషావారి యనుగ్రహమును పొందుటకై వచ్చితివా?

నిర్మ—కాదు. ఒక యుత్తరమును దీసికొని వచ్చితిని.

జేబ—ఉత్తర మెందులకు? కాల్చి పొగవేయుటకా?

నిర్మ—కాదు—ఉదయపురి బేగమువారి కిచ్చుటకు.

జేబ—ఆమె బ్రదికియేయున్నదో, చచ్చినదో?

నిర్మ—బ్రదికియుండవచ్చునని యే తోఁచుచున్నది.

జేబ—లేదు. చచ్చియేయుండును. ఈదాసి నెవ్వరైన నామె యొద్దకు దీసికొనిపోండు.

అప్పుడు జేబఉన్నీసా యున్మత్తభాషణముల యర్థముపట్టి నిర్మలను యమసదనమునకు దీసికొని పోవలయునని యామె యుద్దే

శమై యున్నట్లు తోచుచున్నది. కాని, యాప్రతీహారిణిమాత్ర మట్లు స్థము చేసికొనలేదు. ఆవాక్యములయందలి సామాన్యార్థమును మాత్రమే గ్రహించుకొని నిర్మలకుమారిక నుదయపురిబేగమునొద్దకు దీసికొనిపోయెను.

నిర్మల యక్కడకు బోయి చూచునప్పటి కుదయపురిబేగము రక్తకాంతుల వెలిజిమ్ముచున్న కన్నులతోడను, మదవిభ్రమంబుల నెలార్చు వికటహాసంబులతోడను, నున్మాదినివలె గన్పట్టుచుండెను. అప్పుడు నిర్మల యామె కొకసలాము చేసెను.

ఉదయ—మీరెవరు?

నిర్మ—నేను యోధాబాయిదూతికను. ఉత్తరము దీసికొని వచ్చితిని.

ఉదయ—కాదుకాదు! నీవు పార్శీదేశచక్రవర్తివి. మొగలు బాదుషాయొద్దనుండి నన్ను దీసికొనిపోవలయు నని వచ్చియుంటివి.

నిర్మలకుమారి నవ్వడంచుకొని చంచలకుమారి వ్రాసిన యుత్తరము నామెచేతి కిచ్చెను. ఉదయపురి, చదువుచున్నట్లే దానిం జూచుచు "ఏమని వ్రాసితివి?—ఓసుందరీమణీ! ప్రాణేశ్వరీ! నీసౌందర్య విలాసములంగూర్చి వినుటవలన నాహృదయ మవశమయ్యెను. నే నున్మాదావస్థయం దున్నాడను. నీవు శీఘ్రముగా వచ్చి కామానల కీలాసంతప్తుడనగు నాకు శీతలోపచారములం జేసి యనుగ్రహింపవా?" అని వ్రాసితివా? మంచి దట్లే చేసెదను. నేనిప్పుడు మాబాదుషావారి యొద్ద కవశ్యముగ బోవలయును. నాకింకొకసారి షర్బతును దీసికొన మనసగుచున్నది. మీరు కొంచెముగ రుచిచూచెదరా? చాలబాగుగ నుండును! దీనిని పరంగిరాయబారి మాకు గానుకగా బంపియున్నాడు. ఇట్టిషర్బతు మీదేశమునం దెక్కడను దొరకబోదు" అని యీ విధముగా నుదయపురిబేగ మసందర్భప్రలాపములాడ నారంభించెను.

ఇట్లు మాటలాడుచు సుదయపురి లేచి పానపాత్రమును నోటి యొద్ద నుంచికొని మద్యమును సేవించుచు వెడలిపోయెను. ఆసమయమున నిర్మల వెనుదిరిగి యోధాబాయియొద్దకు వచ్చి జరిగినసమాచారమంతయు నామెకు దెలియజేసెను. ఆయుత్తరమునందలి సంగతుల నిదివఱకే చదివియున్న యాయోధపురిబేగము నవ్వుచు "నీవిప్పుడే యీనగరమును వదలిపోవలయును. పోనియెడల జాలచిక్కులు తటస్థింపగలవు. నమ్మకముగల యొకకొజ్జాను నీతో బంపెదను. ఆకొజ్జా నిన్నీమహాలునుండి తీసికొనిపోయి నీస్వామి శిబిరమునం జేర్పగలడు. అట నీభర్తగాని, నీసేవకులుగాని, లేకున్నయెడల నాతనినే సహాయముగ దీసికొని యెటకేని బారిపొమ్ము. నీప్రాణేశ్వరుడుకూడ నీయూరు విడిచిపోయి నీరాకకై వేచియుండవచ్చును. మార్గమధ్యమునంగూడ నీకాతడు దగపడకపోయినయెడల సుదయపురపర్యంతము నీకొజ్జాను దీసికొనిపొమ్ము. దారిబత్తెమున కేమియును నీయొద్ద లేకపోయిన యెడల నేనిచ్చెదను. చాల జాగరూకతతో నుండవలయును. ఏమఱి పోయితివేని చాలకష్టములకు లోనయ్యెదవు" అని బోధించెను.

నిర్మ—అమ్మా! మీరా విషయమున నిర్విచారముతో నుండుడు. నేనును రాజపుత్త్రయువతినేగదా!

అప్పుడు యోధాబాయి విశ్వాసపాత్రుడగు బనాసియను కొజ్జాను పిలిచి చేయవలసినపను లన్నియు నాతనితో జెప్పి "ఇప్పుడే బయలుదేరెదవా?" అనియెను.

బనా—సెలవైనయెడల నిప్పుడే బయలుదేరెదను. కాని, బేగమువారియుత్తరువు లేనియెడల మీరు చెప్పినట్లు చేయుట యసాధ్యముగా నుండును.

యోధ—ఎట్టియుత్తరువు గావలయునో యొక కాగితముపై వ్రాసి తీసికొనిరమ్ము. బేగమువారిచే వ్రాలు చేయించినీకిచ్చెదను.

కొజ్జా యొకపరవానాను వ్రాసి తీసికొని వచ్చెను. యోధాబాయి దాని నందుకొని యొకప్రతీహారిణిచేతి కిచ్చి "దీనిపై బేగము వారిచే వ్రాలు చేయించి తీసికొనిరమ్ము" అని యాజ్ఞాపించెను.

ప్రతీ—ఇది యెవ్వరికని యామె యడిగినయెడల నే నేమని చెప్పవలయును?

యోధ—నాయొక్క పరిచర్య సేయువారికొఱ కని చెప్పుము. హస్తముద్రను దీసికొనిపొమ్ము. సిరాబుడ్డియును, కలమును గూడ దీసికొనిపొమ్ము.

ప్రతీహారిణి యట్లే జేబఉన్నీసాయొద్దకు బోయి యాపరవానాపత్రమునందించెను. ఆమె యూహించినట్లే జేబఉన్నీసా "ఇది యెవ్వరికొఱకు?" అని యడిగెను.

ప్రతీ—యోధపురి బేగమువారి పరిచారికలకు.

జేబ—వ్రాయవలసిన వన్నియు వ్రాయబడియెనా?

ప్రతీ—ఆ.

జేబఉన్నీసా యాపరవానాపై సంతకము చేసెను. ప్రతీహారిణి దానిపై మొహరు వేసికొని తీసికొనివచ్చి యోధాబాయిచేతి కిచ్చెను. అప్పుడు బసంసి యాపరవానాను దీసికొని నిర్మలను వెంట బెట్టుకొని యతఃపురమునుండి వెడలిపోయెను. నిర్మల వికసితహృదయయై యాతనితోగూడ బయలుదేరెను.

కాని, యంతలోనే నిర్మలసంతోషమంతయు నంతరించిపోయెను. రంగమహాలుముఖద్వారమునొద్దకు జేరునప్పటికి కొజ్జా భయభ్రాంతుడై యటనుండి కదలలేక "అయ్యో! ఫుట్టైమునిగినది. మునిగినది. పరుగెత్తుము! పరుగెత్తుము!" అని కేకలువైచుచు నూర్ధ్వశ్వాసముతో బాఱిపోయెను.

---

## పదవ ప్రకరణము

[illegible]

ఆకోడ్డా యెంమలకు బాఱిపోయెనో నిర్మలకు దెలియలేదు. ఆమె యటునిటు చూచెనుగాని పాఱిపోవుటకు కారణమేమియు నగపడలేదు. ఆగుమ్మముప్రక్కనున్న యరఁగుకొద్ది నతిక్రాంతయౌవనుఁడును, విమలవస్త్రధారియు నగు నొకపురుషుఁడామెకంట బడియెను. అప్పుడు నిర్మల "ఈతనింజూచి భూతమో పిశాచమో యనుకొని కోడ్డా పాఱిపోయియుండవచ్చును" అని యూహించుకొనియెను. నిర్మల భూతప్రేతాదులకు భయపడునది కాదు. అందువలన నామె యెంతమాత్రమును బెదరకుండ నక్కిచూచుచుండెను. ఇంతలో నా పురుషుఁడు క్రమముగా నామెను సమీపించి "నీ వెవ్వరు?" అని యడిగెను.

నిర్మ—నేనెవ్వతెనైన నేమి?

పురు—నీ వెక్కడకుఁ బోవుచుంటివి?

నిర్మ—వెలుపలకు.

పురు—ఎందులకు?

నిర్మ—కొంచెముపనియున్నది.

పురు—పనిలేకయే పోవుచుంటి వని కాదు. ఆపని యేమో దెలుపవలయు నని యడుగుచున్నాను.

నిర్మ—నేను చెప్పఁదలఁచుకొనలేదు.

పురు—నీతోఁగూడ వచ్చినవా రెవరు?

నిర్మ—నేను చెప్పను.

పురు—నీవు హిందూస్త్రీవని తోఁచుచున్నది. ఏజాతి?

నిర్మ—నేను రాజపుత్రయువతిని.

పురు—యోధాబాయి పరిచారికవా?

మోధాభాయిమాట యెవ్వరితోడను జెప్పఁగూడదని నిర్మల ప్రతిజ్ఞ చేసికొనియెను. ఆమె పేరు చెప్పినయెడల నేమికోపమునగు నోయనుభయముతో నిర్మల "నేనిక్కడదాననే కాను; ఈదినమున నే వచ్చితిని" అని చెప్పెను.

పృ—ఎక్కడనుండి వచ్చితివి?

నిర్మల తనహృదయమునందు "అసత్యమేల చెప్పవలయును? ఈతఁడు నన్నేమిచేయఁగలఁడు? రాజపుత్రస్త్రీ లెవ్వరికిని భయపడువారు కారుగదా! అసత్యమేలచెప్పవలయును?" అని యూహించుకొని "నేనుదయపురినుండి వచ్చితిని" అనియెను.

పృ—ఎందులకు వచ్చితివి?

"ఇది యంతయు నీతని కెందులకు? సముచితముగా సమాధానము చెప్పెదను" అని యూహించి నిర్మల "అయ్యా! మీకు నా వృత్తాంతము దెలిసికొనుటవలనఁ బ్రయోజనమేమి? అభ్యంతరము చెప్పక నన్నిటనుండి వదలిపెట్టితిరేని చాల సంతోషించెదను" అనియెను.

పృ—నీవు సరియైన ప్రత్యుత్తరము చెప్పుము. నాకు సంతుష్టి కలిగినయెడల నప్పుడు నిన్నిటనుండి విడిచిపెట్టెదను.

నిర్మ—మీ రెవ్వరు? ఆసంగతి నాకుఁ దెలిసిననేకాని నేను మీప్రశ్నమున కుత్తరము సీయజాలను.

పృ—ఔరంగజేబుబాదుషా నాపేరు—

వెనుక చంచలకుమారిపాదప్రహారములచేఁ బగులగొట్టబడిన చిత్రపట మప్పుడునిర్మలకు జ్ఞప్తికివచ్చెను. నిర్మల నాలుక గఱచికొని "ఔను! ఇతఁడే కావచ్చును" అనియనుకొనియెను.

అనంతరము నిర్మల మునల్మానుసాంప్రదాయము ననుసరించి బాదుషాకు వంగి సలాముచేసి చేతులు జోడించుకొని "సెలవియ్య వలయును" అని ప్రార్థించెను.

బాదు—ఇక్కడ నీ వెవ్వరియొద్దకు వచ్చితివి.

నిర్మ—దేవర దేవియగు ఉదయపురి బేగముసాహేబావారి యొద్దకు.

బాదు—ఏమంటివి? ఉదయపురకుమారి యుదయపురి బేగము గారికా? ఎందుకొఱకు వచ్చితివి?

నిర్మ—ఆమెకొక యుత్తరము గొని వచ్చితిని.

బాదు—ఎవ్వరియొద్దనుండి?

నిర్మ—మహారాణా రాజసింహుని దేవియొద్దనుండి.

బాదు—ఏదీ! ఆయుత్తర మెక్కడనున్నది?

నిర్మ—ఉదయపురి బేగమువారికే యిచ్చితిని.

బాదుషా మిగులనాశ్చర్యపడి నిర్మలను వెంటఁబెట్టుకొని యుదయపురి బేగముమందిరమునకు వచ్చి నిర్మలను ప్రతీహారిణుల కొప్పగించి తానొక్కఁడును లోనికిఁ బోయెను. ఉదయపురి నిద్రవోవు చుండెను. ఉత్తరము ప్రక్కలోనే యుండెను. ఆకాలపుఁబద్ధతుల ననుసరించి యాజాబు ఫార్సీ భాషలో వ్రాయఁబడియుండెను. బాదుషా యాలేఖనందికొని చదివి భీషణాకారుఁడై వెలుపలికి వచ్చి నిర్మలం గూర్చి "నీవె ట్లీమహాలులోనికి రాఁగలిగితివి?" అనియడిగెను.

నిర్మ—ఈసేవకురాలియపరాధమును క్షమింపవలయును. నే నీప్రశ్నమునకుఁ బ్రత్యుత్తర మీయఁజాలను.

ఔరంగజేబు విస్మితుఁడై "ఏమి? ఎంతధైర్యము! నేనీప్రపంచ మున కంతకును ప్రభుఁడనుగదా! అట్టినేను బ్రశ్నించుటయు, నీవు ప్రత్యుత్తర మీయకుండుటయునా?" అనియెను.

నిర్మల చేతులు జోడించుకొని "ఈప్రపంచ మంతయును దేవర యధీనమం దున్నది. కాని నానాలుకమాత్రము నాయధీనమం దున్నది. నేను చెప్పకపోయినయెడల మీసార్వభౌమత్వము నాచేఁ జెప్పింపఁజాలదు" అని చెప్పెను.

బాదు—నాసామర్థ్యమును నిందించుచున్న నీనాలుకను కాస్తార ప్రతీహారిణులచేఁ గోయించి కుక్కలకు వేయించెదను.

నిర్మ—ఢిల్లీశ్వరుఁడు తనమనసువచ్చినట్లు చేయఁగలఁడు. కాని మీరట్లే చేయించినయెడల మీరిప్పు డడిగిన సమాచారము కొంతకాలమునకైనను తెలువడకుండఁ జేసినవా రగుదురు.

బాదు—ఔను. ఇప్పుడు నీనాలుకఁగోయింపను. నీయొడలికిఁ దైలవస్త్రమును జుట్టించి యందందు వెల్గించుచున్నట్లు ప్రతీహారిణి కాజ్ఞాపించెదను. నే నడిగి నప్పుడు చెప్పకపోయినను మహానల జ్వాలలలోనైనఁ జెప్పకపోవు.

నిర్మల మందహాసముచేయుచు "హిందూసుందరులు మహానల జ్వాలలంబడి చచ్చుటకు భయపడువారుకారు. హైందవమహిళా మణులు మందహాసవదనములతో సంతోషస్వాంతములతో భర్తృ సాలోక్యముంగోరి ప్రజ్వలించుచున్న చితులందుఁ బన్నీటికోలంకు లందుఁ బోలెఁ బ్రవేశించి ప్రాణేశ్వరులతోఁగూడ భస్మమై పోవుటకుఁ బరమానందము నొందుచుందురను సంగతి హిందూస్థాన చక్రవర్తులగు మీరెఱుంగరు కాఁబోలును. మీరు వేనియందు నాకు మరణభయమును గల్పింపఁ జూచుచున్నారో, అట్టియగ్నిజ్వాలల యందే మాపూర్వులగు తల్లులు, తల్లితల్లులు మొదలగువారెల్లరును తమతమ కళేబరముల నాహుతి నేసియున్నవారు. ఈశ్వరానుగ్రహమున నేను నట్లే నాప్రాణేశ్వరునితోఁగూడ నగ్నిగర్భమునం బడి భస్మమై పోవలయు నని కోరుకొనుచున్నాను" అనియెను.

బాదుషా తనహృదయంబున "ఆహాహా! ఏమి యీసాహసము!" అని యనుకొని ప్రకాశముగా "సరియే. ఆవిషయమై ముందుముం దాలోచించెదను. ఇప్పుడు మాత్రము నీవీ మహాలునం దొకకైదీవలె నుండవలయును. ఆఁకలిచేఁ బ్రాణములు పోవుచు నీవు

విచారించినప్పుడు తెలుపుఁడని ప్రతీహారిణి నన్ను నాయొద్దకుఁ దీసికొనివచ్చును. అప్పుడు నీవృత్తాంత మంతయు జెప్పినయెడల నీకాహారము దొరకును'' అని చెప్పెను.

నిర్మ—రాజాధిరాజా! హిందూస్త్రీలు నోములు నోఁచెదరను మాట మీ రెన్నఁడును వినలేదా? వ్రతనియమములకై యొక దినము-రెండు, మూఁడు, నాలుగుదినములు నిరాహారోపవాసములు చేయుదురని యాలకించలేదా? ఒకానొక వ్రతములందు నెన్ని దినములైన నుపవసించి యుందురను విషయము మీరు వినలేదా? వారుపవాసములను చేసిచేసి స్వేచ్ఛానుసారముగా ప్రాణత్యాగము చేసికొందురనుటగూడ మీరెఱుంగనే యెఱుంగరా? మహాప్రభూ! ఈదాసి కూడ వాని నన్నిటిని చేయఁగలదు. తెలిసికొనుటకు మీకిష్టమున్న యెడల నామరణపర్యంతమును బరీక్షించి చూడవచ్చును.

''ఈసుందరిని భయపెట్టుటవలన బ్రయోజనములేదు. ప్రాణములను దీసివేయుటవలన నేమిలాభము? పీడించిన నేమగునో చెప్పజాలము; ఏమైనను కొంచెమూరట కల్పించవలయును'' అని భావించి యౌరంగజేబా మెతో ''మంచిది నీకు నేనిష్టార్థములను గల్పించువాఁడనుగాను. ధనము, పరిజనము మొదలగువాని నిచ్చి నీపట్టణమునకు బంపించెదను. నీవృత్తాంత మంతయును యథార్థముగా దెలియజేసెదవా?'' అనియెను.

నిర్మ—రాజపుత్త్రియువతి మరణము నెట్లు తృణప్రాయముగా గాంచుచుండునో ధనవైభవముల నంతకంటెను హీనములైన వానిగా దలంచుచుండును. నేనాడుదానను ఉదారహృదయులగు మీరు మీసుస్వభావమువలననే నాకు సెలవీయవలయును.

బాదు—డిల్లీబాదుషావారి సమ్ముఖమున నర్థులకీయరాని దేదియునుండదు. అంతటివానియెదుట నీకుఁ బ్రార్థనీయమైన దేదియును లేనేలేదా?

నిర్మ—ఉన్నది. నిరంతరాయముగా వెడలిపోవుటయే నా కోరిక.

బాదు—కేవల మంతమాత్రమే కాదు. అంతకంటె ప్రపంచమునందు నీకు భయావహమైన దేదియును లేదా యేమి?

నిర్మ—నేను కోరదగిన దింకొకటి యున్నది. కాని, ఢిల్లీబాదుషావారిరత్నాగారమునం దట్టిరత్నము లేదు.

బాదు—నీవు కోరునా రత్న మెట్టిది?

నిర్మ—మేము హిందువులము. మాకీప్రపంచమునం గావలసినది ధర్మము. ఢిల్లీబాదుషా మ్లేచ్ఛుడు. మఱియు నాతడైశ్వర్యశాలియే యగును. కాని ఢిల్లీబాదుషాకు మాయభీష్టవస్తువగు ధర్మమునిచ్చుటగాని, పుచ్చుకొనుటగాని సాధ్యమగునా?

ఢిల్లీశ్వరుడగు నౌరంగజీబు నిర్మలకుమారి ధైర్యసాహసచాతుర్యములం గాంచి విస్మితుడయ్యెను. కాని యామె పరుషవచనములకై యించుక కనలి "ఏమి నీకుకుదనము! నేనొక్కటి మఱచి పోయితిని" అని యడలించి ప్రతీహారిణిం బిలిచి "పాకశాలకుం బోయి కొంచెము గోమాంసముం దెచ్చి యిద్దఱుముగ్గురుకలసి యామెచే బలవంతముగ దినిపింపవలయును" అని యాజ్ఞాపించెను.

నిర్మల యందులకించుకైనను చలింపలేదు. "మహారాజా! మీకిట్టివిద్య యొకటి యున్నదని నేనెఱుంగుదును, దానిమూలముననే రత్నగర్భ యనిపేరొందిన యీహిందూస్థానమును సంపాదింపగలిగితిరి. గోమాంసము నెదుటనుంచుకొనియే యుద్ధముచేసి ముసల్మానులు హిందువులను జయించిరనుసంగతి లోకవిదితమే. అట్లు కానియెడల రాజపుత్త్రులబాహుబలము నెదుట ముసల్మానులబలము సముద్రము నెదుటపిల్లకాలువవంటిది కాదా. మీకింకొకమాట చెప్పవలసియున్నది. రాజపుత్త్రస్త్రీలును తమతో విషమునుంచుకొనకుండ నొక్కయడుగై

నను వెలుపల బెట్టజాలరను సంగతి మీరెఱుగరని తోచుచున్నది. నాయొద్దనున్నవిషము మిక్కిలితీవ్రమైనది. మీభృత్యులు గోపా సముతోగూడ లోపల బ్రవేశించునంతలో నేను నావిషమును నోట వేసికొన్న జాలును.

నేను జీవములతో నుండగా నీసేవకులు నాచే గోమాంసమును దినిపింపజాలరు. మహాప్రభూ! మీపెద్దయన్నయగు దారా శకోయను వానిని వధించి యాతనిభార్యల నిరువురను దీసికొనిరావలయునని యెంతయో ప్రయత్నించెను. అట్లు తీసికొనివచ్చుట యాతనికి సాధ్యమైనదా? వారిలో నధమురాలగు క్రైస్తవాంగన యొక్క శవమాత్రము వచ్చినది. అది మీరెఱుగుదురు. రాజపుత్రకన్యకయగు నాతని రెండవ దేవి? ఢిల్లీ బాదుషాసన్నిధిమున నే యొక నిమిషకాలములో మరణించి స్వర్గమును చేరగొన్నదికాదా? నేనును క్షణములో మీయెదుట నే ప్రాణత్యాగము చేసికొని స్వర్గారోహణము చేయగలను" అని నిర్మల ధైర్యముతో బలికెను.

బాదుషా మఱిమాటాడలేక నిలువబడిపోయెను. ఎవ్వడు సకల ధరామండలేశ్వరుడై యుండెనో, ఎవ్వని కీర్తిగౌరవములు దేశ దేశాంతరములయం దుద్ఘోషింపబడుచున్నవో, ఎవ్వడు భారతవర్షమున కంతకు ఘోరభయావహుడై యుండెనో, యట్టి బాదుషా— అట్టి పరాక్రమవంతుడగు రాజరాజేశ్వరుడు—ఇప్పట్టున ననాథయై, యగతికయై యబలయై యున్న నిర్మలయెదుట గేవల మవమానితుడై పోయెను—పరాజితుడై పోయెను. అతడు తన పరాజయము నంగీకరించి తన హృదయమునందు "ఈమె యమూల్యమైనవస్తువు. బలవంతముగా నీమె నపహరింపగూడదు. ఉపాయాంతరములచే నీమె వశపఱచుకొనవలయును" అని యనుకొని మృదుమధుర స్వరముతో "సుందరీ! నీపేరెవ్వరు?" అని యడిగెను.

నిర్మల చిఱునవ్వు నవ్వుచు "మహాప్రభూ! అది యెందులకు? ఇంకను రాజపుత్రసుందరీమణులు దేవులు గావలయునను నాశయేనా? ఆయాశ వదలుకొనుడు! నేను వివాహితను. నా ప్రాణేశ్వరు డింకను జీవించి యున్నాడు" అనియెను.

బాదు—ఆమాట యట్లుండనిమ్ము. నీవు కొన్ని దినములవఱకును నూరంగమహాలునం దుండుము. ఈయాజ్ఞను నీవంగీకరింపక పోవని తోచుచున్నది.

నిర్మ—నే నెట్లభ్యంతరము చెప్పగలుగుదును?

బాదు—ఇట్టిస్థితిలో నీదేశమునకు బోయినయెడల నాస్వభావము నించుకయైన నెఱుంగని నీవు నన్నచ్చట నిందింపగలవు. నిన్ను గొంతకాలము నాయొద్ద నుంచి నాసుగుణములంగూర్చి నీవు కీర్తించునట్లు చేసి యావెనుక నీదేశమునకు బంపివైచెదను.

నిర్మ—మీరు పంపకపోయిన నేనెట్లు పోగలుగుదును? కాని, మీరు నాకభయ మిచ్చితిరేని నేను గొంతకాల మిట నుండగలుగుదును.

బాదు—అది యేమో చెప్పుము.

నిర్మ—హిందువులు వండినవంటకములకంటె తక్కువ యాహారపదార్థములను నేను ముట్టుకొనుదానను గాను.

బాదు—అట్లే చేయవచ్చును.

నిర్మ—ఏమనుష్యుడును నన్ను స్పృశింపగూడదు.

బాదు—అట్లును చేయవచ్చును.

నిర్మ—రాజపుత్రి బేగ మున్నయెడల నేనామెయొద్ద నుండెదను.

బాదు—అట్లే యుండవచ్చును. నిన్ను యోధపురి బేగముయొద్ద నుంచెదను.

బాదుషా వానికన్నిటికి నంగీకరించి యందులకు దగినయేర్పాటులను చేయుట కాజ్ఞల నొసంగెను.

---

# ఆఱవ ప్రకరణము

ప్రసక్త్యనుషక్త సంగ్రహము

మఱునాఁడు బాదుషా జేబఉన్నీసాను, నిర్మలను పిలిపించి రంగమహాలునకు నిర్మలను దీసికొనివచ్చినవా రెవ్వరై యుందురను విషయమును విచారింప నారంభించెను. అంతఃపురపరిచారికలు, ప్రతీహారిణులు, కోజ్జాలు, తాతారసుందరులు, మొదలగువారి నందఱిని విచారించెను. నిర్మల లోపలఁ బ్రవేశించుచుండఁగాఁ జూచినవారు గూడ నేమియపాయము కలుగునోయను భయముచే నేమియు నెఱుగనట్లు నటించిరి. ఔరంగజేబునకుఁగాని జేబఉన్నీసాకుఁగాని యీ విషయము తెలిసికొనుట యసాధ్యమైపోయెను.

అప్పుడౌరంగజేబు జేబఉన్నీసాతో "నిర్మలను లోపలఁ బ్రవేశింపనిచ్చుట యంతతప్పుగాఁ బరిగణింపలేదు. కాని, యీమె నెప్పుడైన నెవ్వరైన నవ్వలకుఁ బంపించుట జరిగెనేని యంతఃపురరక్షకుల కందఱకును కఠినశిక్ష కాకమానదు. నిర్మల కెవ్వరును తొందరకలిగింపక బేగమువలె నీమెను గౌరవించుచుఁ బూజింపవలయును. యోధాబాయిపరిచారిక లీమె కుపచారములు సేయుచుండవలయును. ముసల్మాను లెవ్వరు నీమెను స్పృశింపఁగూడదు" అని కఠినముగా నాజ్ఞాపించెను.

అప్పుడు నిర్మల కందఱును సలాములుచేసిరి. జేబఉన్నీసా యీమెను తన మందిరమునం దుంచుకొని యీమెతో ననేకవిధముల సంభాషించుచుఁ బనవుఁజూపుచుండెను. కాని నిర్మలహృదయమునందలి యొకయభిప్రాయమునైనను దెలిసికొనలేకపోయెను.

నాఁటి మధ్యాహ్నమునందొక తాతార ప్రతీహారిణి యోధాబాయియొద్దకువచ్చి "ఒకవర్తకుఁడు కొన్ని శిలావిగ్రహములను విక్రయార్థమై తీసికొని వచ్చియున్నాఁడు. అనస్తువు లంతబాగుగా లేకుండుటచే

నే బేగమును వానిని గొనుట కంగీకరింపలేను. మీ కేమైనఁ గావలయు నేమో యని యడుగవచ్చితిని" అనియెను.

ఎన్నారును కొనకుండవలయుననియే మాణిక్యలాలట్టి చెడ్డవస్తువులను దీసికొనివచ్చెను. ప్రతీహారిణి యావృత్తాంతమును చెప్పునప్పుడు నిర్మల యోధాబాయియొద్దనే యుండెను. అప్పుడు నిర్మల యోధపురికిఁ గనుసన్న చేసి యావస్తువులను నేను దీసికొనియెదననియెను. నిర్మలకుమారి నిన్నరాత్రి నో బాదుషాకును తనకును జరగిన సంభాషణ మంతయును జెప్పివై చెను. అప్పుడు యోధాబాయి నిర్మలను ప్రశంసించి యామెకు శుభము కావలయునని దీవించెను. యోధాబాయి నిర్మలయభిప్రాయమును గ్రహించి "ఆవస్తువులను దీసికొనిరమ్ము" అని ప్రతీహారిణి కాజ్ఞాపించెను.

ప్రతీహారిణి యవ్వలకుఁ బోయినతోడనే నిర్మల మాణిక్యలాలు సంకేతకౌశలముం గూర్చి యోధాబాయికిఁ దెలియజేసెను. అప్పుడు యోధాబాయి నిర్మలతో "అట్లయినయెడల నావస్తువులు వచ్చులోపల నీవు నీప్రియునకొక యుత్తరమును వ్రాయుము. నే నా వస్తువుల బరీక్షించుచుందును. ఈసమయమునందు నీసమాచారము నీస్వామికిఁ దెలియఁగలదు" అని చెప్పెను. కొలఁది సేపటిలో శిలానిర్మితంబులగు వస్తువులచ్చటికి వచ్చెను.

ఆవస్తువులయందలి సంకేతచిహ్నములను కనిపెట్టి నిర్మల యుత్తరమును వ్రాయుట కారంభించెను. ఆజాబుముగియువఱకును యోధాబాయి వస్తుపరీక్ష సేయుచుండెను. ఆవస్తువులయందు చంద్రకాంతశిలానిర్మితంబును, సువర్ణమణిఖచితంబునగు నొకబరణియుండెను. దానికి బిగము వేయుటకొక చిన్నగొళ్ళెముండెను. నిర్మల జాబుముగించిన తోడనే యోధపురిబేగము దానినందుకొని యాబరణియందుంచి బిగము వైచి కొదువవస్తువుల నన్నిటిని వెలయిచ్చి కొని యాబరణిని తిరగిపంపివైచెను. కాళివు జేతినిమాత్ర మంపించుట మఱచిపోయెను.

కపటవర్తకవేషి యగు మాణిక్యలాలు తాళపుచెవితో పెట్టె గొంతసేపు నిరీక్షించి రాకుండుటచే గ్రంథమును దీసికొని యింటికి బోయి లోపల నొంటిగా గూర్చుండి యాబరణించెవిచి నూడగా నిర్మల వ్రాసిన యుత్తరముం డుండెను.

పాఠకుల కాజాబునందు వ్రాసినయంశము లన్నియును దెలిసి కొనవలసిన యవసరములేదు. అందలి ముఖ్యమైన సంగతులు పాఠకులకు దెలిసినవే. ఇతరాంశములనుగూర్చి తరువాత జెప్పెదము. ఆ జాబు చూచినతోడనే మాణిక్యలాలు నిర్మలవిషయమై నిశ్చింతుడై స్వదేశగమనమునకు బ్రయత్నింప నారంభించెను. ఆదినముననే యంగడి నెత్తివేసినయెడల నెవ్వరికైనను సందేహము కలుగవచ్చునని కొంతకాల మందుండి తరువాత పోవచ్చునని నిశ్చయించుకొనియెను.

## ఏడవ ప్రకరణము

సమిధసంగ్రహము—జేబఉన్నీసా

ఇప్పుడు రూపనగరమునుండి పరాజితులై వచ్చినవారిలో గొందఱికి శిక్షలును, కొందఱి కుద్యోగములు పోవుటయును సంభవించెనని మొదట జెప్పియుంటిమి. ముబారకుమాత్ర మట్టివారిలో జేరలేదు. ముబారకు ధైర్యసాహసములంగూర్చి యనేకులవలన విని యుండుటచే నౌరంగజీ బాతని నాతని యుద్యోగమునందే యుంచివైచెను.

ఈవర్తమానము జేబఉన్నీసా విని ముబారకు వచ్చి యెల్ల సంగతులును తనతో మనవిచేసికొనునని యెదురుచూచుచుండెను.

కాని ముబారకు మఱి యెన్నఁడు నామెదర్శనమునకు వచ్చియుండ లేదు. అతడు దరియాబీబిని తనయింటికి దీసికొనిపోయి యామె యుపచారములకు బరిచారికలు మొదలగువారి నేర్పఱిచి యనురాగవతియై పతివ్రతచరిత్రయై, ధర్మపత్నియగు నామెతోఁ గూడి మహానందమున కాలము గడపుచుండెను.

జేబఉన్నీసా యెన్నాళ్లకును ముబారకు తనదర్శనమునకు రాకుండుటం జూచి "అజీరుద్దీను" అను నమ్మకముగల కొజ్జా నొక్కనిం బిలిచి ముబారకును తీసికొనిరమ్మని యాజ్ఞాపించెను. అప్పుడుగూడ నాతడు రాలేదు. అందువలన జేబఉన్నీసా తీవ్రక్రోధముతో "ఏమీ! ఈతనికి గన్నులు తలకెక్కినవా? మీరెంచి నాయంత నేనే వర్తమానమంపినను రాలేదుగదా! ఎంతధైర్యము! ఎంతగర్వము!" అని యనుకొనియెను.

కొన్నిదినములవఱకు జేబఉన్నీసా కోపముతోనే యుండెను. ఆమె తనమనసునందు "ఇతడేమి యల్లేయున్నాడు? పోనిమ్ము! నా కందఱు నొక్కటియే. ఇతడుగాక పోయిన మఱియొకడాయెను. నా కేమికొదవ!" అని యనుకొనుచుండెను కాని, జేబఉన్నీసా కట్లనుకొనుట కేవలము తప్పనితోచలేదు. తాను నితరులుంగూడ నొక్కటియే యని తెలియలేదు. సర్వసముడగు పరమేశ్వరుడు బాదుషాపుత్త్రికను, పచ్చికనమ్ముకొనుదానిగూడ నొకచేతితోనే చేసియుండెనని బోధపడలేదు. ధనము, రాజ్యము, వైభవము మొదలగున వన్నియు గర్మానుభవములే కాని యంతకంటె భిన్నములైనవి కావని పొడగట్టలేదు.

ఆమె కందఱును సమానులై యుండలేదు. ఆమె కొన్నాళ్ళు కోపముతోనే యుండెనుగాని తుదకు ముబారకునివియోగమును సహింపలేకపోయెను. అభిమానమును—కేవలసామాన్యాభిమానము కాదు—ఆభిజాత్యసంపన్నయగు బాదుషా పుత్త్రికయభిమానము

అహరమహాత్మాక్షమణి యగు నూరానము—అబ్బుమఖినూరానును ద్వ్యం చినైచి, తిరిగి ముబారకశాహ కొకదూతిక నంపెను. అప్పుడు ముబారకా దూతికతో “జేబఉన్నీసాకు జేయఖ్రాము లని చెప్పుము ఆమెకంటెను మాననీయులైన కన్యా మిప్రపంచమున నాకేదియును లేదు; కాని యొక్కటియున్నది. జేప్పకున్నాను; ధర్మమున్నది; ఇంతటినుండి నేనెట్టి పాపకార్యమును చేయజాలను. నేను ఔరంగ మహాలునకు వచ్చుచుండినపుడు కట్టిపడవాడనుగాను: నేను నా ధర్మపత్ని యగు దరియాతో ధర్మానుసరణముగ సంసారమునడపు కొనుచున్నాడనని జేబఉన్నిసాతో మనవిచేయుము”అని చెప్పి యా దూతికను బంపివైచెను.

ముబారకునిప్రత్యుత్తరము విని జేబఉన్నీసా క్రోధమునువహించెను. ఆకోపముతో నామె దరియాముబారకుల సిరువురను గూడ నాశనముచేయ సంకల్పించుకొనియెను. అధికారమదాంధుల లక్షణము లివియేగా? ఐశ్వర్యగర్వాంధుల పద్ధతులిట్టివియుండును గాబోలును!

నిర్మలకుమారి మహాలునందే యుండుటచే జేబఉన్నీసా సంకల్పము సిద్ధించుటకుఁ గొంచె మనుకూలముగా నుండెను. నిర్మలకుమారి యౌరంగజేబు పాదసేవనకు పాత్రభూతయైయుండెను. కాని యందుమూలమున మదనతంత్రములకుమాత్ర మభ్యంతరము కలుగుచుండెను. ఔరంగజేబు సమయము దొరకినప్పుడెల్ల నిర్మల కుమారితో సంభాషించి పోవుచుండెను. అతని ప్రస్తావమంతయును రాజసింహుని రాజకీయవ్యాపారములంగూర్చియే. చతురచూడామణి యగు నౌరంగజేబు రాజసింహుడు యుద్ధసమయములయం దెట్టిపద్ధతుల వెలంగుచుండునో తెలిసికొనుటకుఁ దగిన ప్రశ్నముల వడుగు చుండును. చతురతయందెంత మాత్రమును కొదవలేని నిర్మలకుమారి

యాతని యభిప్రాయమును దెలిసికొని తగురీతి నసత్యములనే తెలుపుచుండును.

అందువలన నామె ప్రత్యుత్తరములచే నౌరంగజీబు మనోరథముఫలించుట లేదయ్యెను. అతఁడప్పుడప్పుడు తన హృదయమునందు "మీవారురాజ్యమును నాసేవలతో ముంచివైచెదను. అందులకు సందేహము లేదు. రాజసింహుని రాజ్యమిక నిలువజాలదు. కాని యంతమాత్రమున నే నాకు గౌరవములేదు. రూపనగరకన్యనుగూడ దీసికొనిరాకుంటినేని నాగొప్పతనమునకు లోపము కలుగకమానదు. ఆతని రాజ్యము నపహరించినను రాజమహిషులంగూడ నపహరించి తీసికొనిరాగలుగుదునను ధైర్యము నాకెంతమాత్రమును కలుగుట లేదు. ఏమన—రాజపుత్రికన్యకలు మాటలాడుచుండగనే చితారోహణముచేసి ప్రాణములను ద్యజించివైచుచుందురు. మాటకుమాట సమాధానము చెప్పుచునే విషపానముం జేసివైతురు. నాచేతులలో బడుటకుముందే యాపిశాచములు ప్రాణములను విడిచెదరేమో! ఈబానిసయెట్లైన నాకు వశురాలైనయెడల - నీమెమూలమున నారూపనగరకన్యక నెట్లయిన దీసికొని రావచ్చును. ఈమెను మాత్రము వశపఱచుకొనుట సామాన్యమా! నేను డిల్లీబాదుషానైయుండియు నొక బానిసను లోబఱచుకొనజాలకుంటినే! అట్లు చేయఁజాలకుంటినేని నాసార్వభౌమత్వ మెందులకు"! అని యనేకవిధముల నాలోచించుకొనుచుండెను.

ఔరంగజేబు నాజ్ఞ ననుసరించి జేబఉన్నీసా నిర్మలను రత్నాలంకారములతో నలంకరించెను. ఆమె యుడుపులును, భూషణములును బేగములుధరించువానితో సమముగానుండెను. నిర్మల యేమిచెప్పినది. యప్పుడే యగుచుండెను. ఆమె యేమికోరిన నది యప్పుడే సిద్ధించుచుండెను. కాని, యవ్వాలకుఁ బోవుటమాత్ర మామె కసాధ్యముగా నుండెను.

నిర్మల యెల్లసంగతులు యోధాబాయితోఁ జెప్పుచు నామె తో నాలోచించుచుండును. ఒకనాఁడు నిర్మల యోధపురియొద్దకుఁ బోయి నవ్వుచు "ఈనవరత్నాలంకారములు—ఈ సువర్ణాభరణములు—వీనివలన నాకేమి ప్రయోజనమున్నది? బంగరుపంజరమునం బెట్టిన పక్షివలె నున్నదానను, నాయెడ లంతయును బంగారమే, మోసము!" అనియెను.

యోధ—నీకిష్టము లేనియెడల వీనినెందులకుఁ దీసికొంటివి?

నిర్మల—బాదుషా నిదెరించి యీవస్తువులను దీసికొంటినని నే నుదయపురమునకుం బోయినప్పుడు వారితోఁ జెప్పుటకు—

జేబఉన్నీసా యౌరంగజేబున కెల్లవిధములఁ గుడిచేయివలె నుండెను. ఆమె బాదుషాకు చెప్పినప్రకార మొకనాఁడు నిర్మలను పిలిపించెను. దర్బారునందలి ముఖ్యకార్యము లన్నియు జేబఉన్నీసా చేతిలో నుండెను బాదుషా నిర్మలను వశపఱచుటకై చేయవలసిన కార్యముల భారమంతయును జేబఉన్నీసాయే వహించెను. ఆమె నిర్మలతో నతిమధురముగ నతివినోదముగ మాటలాడుచుండును. ఆ సమయములయం దౌరంగజేబుకూడ నటకువచ్చుచుండును. ఎన్ని సంభాషించినను నిర్మల కోపగించుకొనుటలేదు. రాజపుత్రస్త్రీగౌరవము చెడకుండ బ్రత్యుత్తరముల నొసంగుచుండెను. ఆప్రత్యుత్తరములు రూపనగరసుందరీమణుల వాక్యములంబోలి యతి మృదులములై యుండలేదు. ఇప్పు డింగ్లీషునేర్చిన మనవారి యభిరుచికి సరిపడకుండుటచే నప్పటినిర్మలవాక్యములయందలి బాదుషావారి యభిరుచికిఁ దగినయుదాహరణముల నీయఁజాలకుంటిమి.

నిర్మల జేబఉన్నీసాతోఁ జెప్పఁదగిన మాటలను మాత్రమే చెప్పుచుండెను. ప్రస్తావవశంబున నొకనాఁడు రూపనగరయుద్ధము విషయమై సంభాషణ జరిగెను. నిర్మల యుద్ధమును చూడకపోయినను చంచలకుమారివలన వినియుండుటచే నన్నిసంగతులును జేబఉన్నీ

నాకుఁ దెలియఁజెప్పెను. ముబారకు చంచలకుమారియెదుటఁ బరాజయము నంగీకరించి మొగలుసైన్యముతో రణక్షేత్రమును వదలి నట్టియు, చంచలకుమారి రాజపుత్రరక్షణార్థమై స్వయముగా డిల్లీకిఁ బోవుట కంగీకరించుటయు, దారియందు విషపానము చేసి ప్రాణములను విడిచెదనని చంచల చెప్పుటయు, ముబారకు చంచలకుమారిని తీసికొనివచ్చుట కిష్టపడకుండుటయు మొదలగుసంగతులన్నిటిని జెప్పివైచెను.

అప్పుడు జేబుఉన్నీసా "ఓముబారకుసాహెబా! ఈయస్త్రముచే నీమెడపైనున్న యుత్తమాంగమును నేలపైఁ బడఁగొట్టఁగలను. దొరకితివి! ఇఁక నీవేమిచేయఁగలవు?" అనియనుకొని మంచి సమయము తటస్థించినప్పుడు రూపనగరయుద్ధసమాచారముల నన్నిటిని నౌరంగజేబున కెఱిఁగించెను.

ఔరంగజేబంతయును విని "అతఁడంతటి విశ్వాసఘాతుకుఁడే యైనయెడల నిప్పుడే యేకద్వారమును వీక్షింపఁగలఁడు" అనియెను. ఔరంగజేబు జేబుఉన్నీసాదుశ్చరిత్రములను గూర్చి నిరంతరమును వినుచుండెను. ఈప్రపంచమునందుఁ గొందఱు కుక్క ముట్టుకొన్నవస్త్రము నంటికొన లేక కుక్కను గొట్టుచుందురు. ఔరంగజేబాసాంప్రదాయములోనివాఁడు. తనకుమార్తెయు, సోదరియు దుశ్చరిత్రలై తిరుగుచుండ వారినేమియు చేయఁజాలక వారియనుగ్రహము సంపాదించుకొనియున్న వారిని గనిపెట్టి యేయుపాయముచేనైన నాతఁడు దండించుచుండును. ముబారకు జేబుఉన్నీసాకుఁ బ్రియుఁడైయుండెననుసంగతి బాదుషా కనిపెట్టెను. కాని యింతవఱకు నాతనికి నిజము బాగుగాఁ దెలియలేదు. ఇప్పుడు కుమార్తె చెప్పినమాటలు విన్నతోడనే వీరిద్దఱికిని పరస్పరకలహములు సంభవించె ననియు, నందువలననే జేబుఉన్నీసా ముబారకుని శిక్షింపఁగోరుచుండె ననియు సులభముగా గ్రహించెను. కాని యామె మాటలయందలి సత్యమును స్థిరపఱచుటకై సిగ్గులను పిలిపించి యామెవలనగూడ దెలిసికొనియెను. వారు మేసంగతియు నెఱుంగనినిర్మల సత్యమును చెప్పి[illegible].

అప్పు డౌరంగజేబు భక్తీసి పిలిచి ముబారకు నేమిచేయవల యునో యాతని కాజ్ఞాపించెను. భక్తీ యిరువురు రాజభటులను బంపి ముబారకును బట్టి తీసికొనివచ్చెను ముబారకు వచ్చి చూచునప్పటికి క్రూరసర్పసమన్వితంబులగు రెండు లోహపంజరములు భక్తీ సమీప మునం దుండెను.

ఈకాలమున మరణదండనము చేయవలసినప్పు డితరోపాయ ముల నుపయోగింపకుండ నురితీయుచుండురు. మొగలాయిపరిపాల నంబున మరణదండనమున కనేకోపాయము లుండెను. ఆకాలమున మస్తకచ్ఛేదనము, శూలారోపణము, మదగజపదాఘాతము, విషస ర్పదంశనము, రహస్యవధము, విషభోజనము మొదలగు వివిధవధో పాయములచే మరణదండనములు నిర్వర్తింపబడుచుండెను.

ముబారకు నవ్వుచు వచ్చి భక్తీ యొద్దనిలువంబడి "నేను మర ణింపవలసిన దేనా!" అని యడిగెను. భక్తీ విషణ్ణహృదయుండై బాదుషావారి యాజ్ఞ యిట్లున్నది" అనియెను.

ముబా—ఆయన యిట్లాజ్ఞాపించుటకుఁ గారణమేమో నీ వెఱుఁగుదువా?

భక్తీ—నాకుఁ దెలియదు. మీరెఱుఁగరా!

ముబా—బాదుషావా రేదియో దురభిప్రాయమును పొంది యుందురు. కానిండు. వృథాకాలహరణమువలనఁ బ్రయోజనమేమి!

భక్తీ—ప్రయోజనము లేదు.

అప్పుడు ముబారకు తనపాదరక్షలను విడిచి యొక పంజరము పై నొకకాలుంచెను. లోపలనున్న విషసర్పము బుస్సున లేచి యొక కాటు వైచెను. అవిషజ్వాలచే వివృతవదనుండగుముబారకు భక్తీ తో "అయ్యా! ఎవ్వరైన వచ్చి ముబారకెందులకుఁ జచ్చెనని యడి గిన మొదలగు[illegible] బాదుషాహాబావారి[illegible] వ్వదని చె[illegible]యుడు" అని చెప్పెను.

భక్తి భయముతో వడంకుచు "అట్టిమాటలాడకుము! ఊర కుండుము!" అనియెను.

ఒకపాముకాటుచే నెవ్వఁడైన జావకపోయినయెడల రెండవ పాముచే గఱపించుట యాచారమైయుండెను. ఆసంగతి ముబారకెఱుంగకపోలేదు. కావున నాతడు మఱియొక కాలెత్తి రెండవపంజరముపై నుంచెను. అందున్న విషసర్పముకూడ నాతనిం గఱచెను.

అప్పుడు ముబారకాకాలసర్పకఠోరవిషజ్వాలా ప్రసారంబున వీరరసభరితంబగుతనయొడలినెత్తురంతయును నీరై పోవ నేలపై మోకాళ్లనికూర్చుండి చేతులుజోడించుకొని "అల్లాహో అక్బర్! నేనెప్పుడైన నీదయాపాత్రుడను కాగోరి యెట్టిధర్మకార్యమైన జేసినను, చేయకపోయినను నాయందు దయయుంచి నాయాత్మకు బరమానందమును ప్రసాదింపుము!" అని పరమేశ్వరుని ధ్యానముసేయుచు బడిపోయెను.

---

## ఎనిమిదవ ప్రకరణము

---

### అందఱును సమానులే

రంగమహాలునం దెల్లసమాచారములును వినవచ్చెను. సమాచారముల సేకరించుపని జేబఉన్నిసా చేతిలోనే యుండెను. ఆమెకు నాయబ్ బాదుషా యనిపేరు. ముబారకుని మరణసమాచారమామెకు దెలిపెను.

ముబారకు మరణమువలన దనకెంతయో సుఖము కలుగునని జేబున్నిసా తలంచెను. కాని, తుదకది కేవలము విపరీతముగా బరిణమించెను. ఆసమాచార మామె చెవిని బడినతోడనే కన్నీరుపొంగి పొసంగెను. ఆమె మృత్తికా విగ్రహమునుండి యిదివఱకెన్న

డును రసోత్పత్తికాలేదు. ఇప్పుడు కేవల మామెకు గన్నీరుమాత్రమే కాదు. అశ్రుధారాప్రవాహము గండస్థలములనుండి ప్రవహించుచు నెంతతుడిచినను నిలువకయే నెడలుచుండెను. తుద కామె యొక్క-సారి గట్టిగా నేడ్చిన నెవ్వరేమనుకొందురో యని తలంచి తలుపు మూసికొని రతనపుమంచముపై బరుండి యేడువనారంభించెను.

ఏమి జేబఉన్నీసా? హస్తిదంతనిర్మితమై, మణిదండవిభూషితం బగు మంచముపై బరుండియున్నను కన్నీరు నిలుచుటలేదు! నీవొక సారి రంగమహాలు వదలి వెలుపలకు వచ్చి పర్ణకుటీరములకుం బోయితి వేని గొంగళులపై బరుండియు, నెందఱెందఱో జనులు హాయిననుభ వించుచుండుట గనిపెట్టగలవు. నీవలె నేడ్చువా రెవ్వరు నట్టిచో నుండఁబోరు.

జేబఉన్నీసా తనసుఖమును తానే చేతులార జెడగొట్టుకొంటి నని నిశ్చయించుకొనియెను. క్రమక్రమముగా నామెకందఱును సమానులేయను సంగతి తెలియవచ్చెను. తెలిసినను, తెలియక పోయినను స్త్రీజన్మ మెత్తినతోడనే ప్రీతివిశ్వాసములను పాపపు దలంపులు హృదయము నాశ్రయించి యుండునని యామెకు బోధ కట్టెను. అప్పుడు జేబఉన్నీసా తనలోదానే "ఇన్నిదినములనుండియు నేనాముబారకు నింతగా ప్రేమించుచుంటి ననుసంగతి యింతవఱకు నాకేల తెలియకపోయినది!" అని యనుకొనియెను. "నీవైశ్వర్య మదంబువలనను, రూపగర్వాంధతవలనను, నీయింద్రియములకు దాసి వైపోయి ప్రీతివిశ్వాసములను మాటయే మెఱుంగకపోయితివి; నీకు దగినశాస్తియైనది; నీవిషయమై యెవ్వరును కనికరపడగూడదు" అని యప్పుడామెతో జెప్పువా రెవ్వరును లేకపోయిరి. చెప్పకపోయినను నామె హృదయమునం దీభావములు తమంతట దామే యుద్భవించుచుండెను. వానితో ధర్మాధర్మ పరిజ్ఞానముకూడ [illegible]

చుండెను. ధర్మ మనునదొకటి యున్నయెడల నంతవఱకు తానుచేయుచున్న కార్యము లన్నియు నధర్మములనియే యామెకు దోచుచుండెను. తుదకామె హృదయమునందొక యనిర్వాచ్యమైన భయవేదనము కలిగెను. ఏమన, ధర్మాధర్మములకు బ్రతిఫలమేయుండి యామె పాపకృత్యములకు దండవిధానమే యున్నయెడల నామె షహజాది జేబఉన్నీసా యైనంత మాత్రమున నైన వాఁడామె పాపములను మన్నింపదలంచునా? అందువలననే జేబఉన్నీసాకు మిగుల భయము కలుగజొచ్చెను.

దుఃఖమువలనను, భయమువలనను విహ్వలయై జేబఉన్నీసా అజీద్దీనను గొజ్జాను పిలిపించి "సర్పదష్టుఁడై మనుష్యుడు మరణించినయెడల నందులకేమైనను చికిత్సయుండునా?" అని యడిగెను.

అజీ—హకీంమాలను నొక సర్పవిషచికిత్సకుఁ డున్నాఁడని వినియుంటిని. కాని నేనెన్నఁడు నాతని వైద్యమును జూచియుండలేదు.

జేబఉన్నీసా నిట్టూర్పువిడిచి "హకీంమాలును నీ వెఱుంగుదువా?" అని యడిగెను.

అజీ—ఎఱుంగుదును. ఆతఁడు ఢిల్లీయందే యున్నాఁడు.

జేబ—అతనియిల్లు నీ వెఱుఁగుదువా?

అజీ—ఎఱుఁగుదును.

జేబ—ఇప్పుడక్కడకు బోఁగలవా?

అజీ—ఆజ్ఞయైనచో నట్లేపోయెదను.

జేబ—(గద్గద స్వరముతో) ముబారకల్లీసాహేబు సర్పదష్టుఁడై మరణించినసంగతి నీకు దెలియునా?

అజీ—తెలియును.

జేబ—ఆతనిగోరీ యెక్కడనున్నదో నీవెఱుఁగుదువా?

అజీ—నేను చూడలేదు. రుద్రభూమియందే యైయుండును. [illegible]వున గుర్తుపట్టవచ్చును.

జేబ—సికిన్నాలు మొహరీల నిచ్చెదను. అందొక నూఱు మొహరీలు నీవుతీసికొని, తక్కినవి హాతింనూలునకిచ్చి ముబారకను గోరీయొద్ద కాతనిం దీసికొనిపోయి చికిత్స చేయించి యెటులైన ముబారకను బ్రదికింపవలయును. దైవయోగమున బ్రదికినచో నాతని నాయొద్దకు దీసికొనిరమ్ము. త్వరగాబొమ్ము.

---

## తొమ్మిదవ ప్రకరణము

---

సమిధసంగ్రహము—ఉదయపురి జేగము

మఱియొకసారి రంగమహాలునకు శిలాసామగ్రిం బంపిఆమూలమున మాణిక్యలాలు నిర్మలకుమారిసమాచారములను తెలిసికొనియెను. తిరుగా మునుపటిజవణిచే బీగముచేచి యక్కడకుబంపెను. నిర్మల యాబరణిం దెఱచి చూచునప్పటికి కందొక పావురముండెను ఆ మెదానినుంచుకొని నావిషయమై యేమియు భయపడనక్కఱలేదనియు నీవు బయలుదేరి పోవచ్చుననియు మొదట జెప్పినప్రకారమే నడచుకొనుచు బాదుషాతనవిషయమై యేమియుం దొందరకలుగజేయుటలేదనియు నొకజాబువ్రాసి మాణిక్యలాలునకు బంపించెను.

మాణిక్యలాలు తనయంగడి నెత్తివైచి తెల్లవారుటకుముందే యుదయపురమునకు బయలుదేరెను. ఢిల్లీనగరమున కనేకద్వారములున్నవి. ఎవ్వరైన దన్నుంజూచి యేమనుకొందురో యని లేదు డజ్మీరుద్వారమునంగాక మఱియొక ద్వారమున బోయెను. ఆ పోవుచున్న మార్గమునం దొకపార్శ్వమున శ్మశానభూమి యుండెను. ఆప్రదేశమునం దిరువురుమనుష్యులు నిలిచియుండి మాణిక్యలాలును, అతని పరిచారకులనుజూచి పరుగెత్తనారంభించిరి. [illegible]

గుఱ్ఱమునుదిగి వారున్న చోటికి బోయిచూడగా గోరినుండి తీయబడిన శవ మొకటి యాతని కంటబడియెను. మాణిక్యలాలాయుషఃకాలము నందలి వెల్తురులలో నాశవమును బరీక్షించిచూచెను. ఆతని కేమి తోచెనో కాని మాణిక్యలా లాశవమును తనగుఱ్ఱముపై భద్రముగా నుంచి పైనొకవస్త్రమును గప్పి పట్టుకొని తాను క్రిందనడచుచు గుఱ్ఱమును నడపించుకొని పోయెను.

అతడుఢిల్లీద్వారమును వదలి కొంతదూరము చనునప్పటికి సూర్యోదయ మయ్యెను. అప్పు డాత డాశవమును గుఱ్ఱమునుండి క్రిందికిదింపి యొకచెట్టుక్రింద బరుండబెట్టి తనపెట్టెలోనుండి యేదో యొకమాత్రను తీసియొకయాకురసముతో నరగదీసి తనచూరకత్తితో నామృతకళేబరమునం దొక్కొకచో గాయములు చేసి యాయౌష ధమును బూసి తరువాత నాలుకకును, కన్నులకునుగూడ నామందు లేపనముచేసెను. రెండుగడియలైన తరువాత మరల నట్లేచేసెను. ఈవిధముగా ముమ్మా రాయౌషధమును బ్రయోగించునప్పటికి మృత కళేబరమునుండి కొంచెముకొంచెముగ శ్వాసము వెడలనారంభిం చెను. క్రమక్రమముగా నాశవము కన్నులువిచ్చి కదలదొడంగెను. తుట్టతుదకు లేచికూర్చుండి మాటలాడజొచ్చెను.

ప్రయాణముచేయునప్పుడే మాణిక్యలాలు కొంచెముపాలు తెచ్చుకొనియెను. నెమ్మదిగా నాపాలను ముబారకునకు బోసెను. అందువలన నాతనికి గ్రమముగా బలముగలిగి యెల్లవృత్తాంతములును బ్రదికించెను. పిమ్మట ముబారకు మాణిక్యలాలుంగూర్చి "నన్ను బ్రదికించినారెవ్వరు? మీరేనా?" అని యడిగెను.

మాణి—ఔను.

ముబా—ఎందులకు బ్రదికించితిరి? నేను మిమ్ముల నెఱుంగు దును. రూపనగరపర్వతప్రాంతమున నేను మీతో యుద్ధముచేసి జయించితిని.

మాణి—నేనును మిమ్ములనెఱుంగుదును. మీరే మహారాణాకు బరాజయము కలిగించితిరి. మీకిట్టియవస్థ యేలవచ్చినది?

ముబా—ఇప్పుడు చెప్పదగిన మాటకాదు. మఱియొకప్పుడు చెప్పెదను. మీరెక్కడకుఁ బోవుచుండిరి? ఉదయపురమునకా?

మాణి—ఔను.

ముబా—నన్నుఁగూడ మీతోఁ దీసికొనిపోయెదరా? నేనుమరల ఢిల్లీకిఁ బోనని మీకుఁ దెలిసియుండవచ్చును. నేను రాజాజ్ఞచే దండింపఁబడితిని.

మాణి—మిమ్ములను నాతోఁ దీసికొనిపోయెదను. కాని, మీరు దుర్బలులై యుంటిరే.

ముబా—సాయంకాలమునకుఁ గొంచెము బలముకలుగవచ్చును. అంతవఱకును మీరాఁగఁగలరా?

మాణి—అట్లే.

ముబారకు కొంచెముకొంచెముగా పాలను దీసికొనుచుండెను. మాణిక్యలాలాసమీపగ్రామమునకుఁబోయి యొకగుఱ్ఱమును గొని తెచ్చి ముబారకు నందుపైఁ గూర్చుండఁ జేసి తనతోఁగూడఁ దీసికొనిపోయెను. మార్గమధ్యమున జేబఉన్నీసావృత్తాంతమంతయును మాణిక్యలాలుతోఁ జెప్పివైచెను.

అజీరుద్దీను జేబఉన్నీసాయొద్దకుఁ బోయి యేమిచేసినను ముబారకు జీవింపలేదని తెలియజేసెను. అత్తరుచేఁ దడుపఁబడిన చేతిరుమాలుతోఁ గన్నులుమూసికొని యింతవఱకు విచారించుచున్న జేబఉన్నీసా యామాటలను విన్నతోడనే గుభాలున నేలపైఁ బడి పొరలుచుఁ గూలిదానివలె మొత్తుకొనుచు నేడువ నారంభించెను.

ఆమెదుఃఖ మెవ్వరును వినఁగూడని దగుటచే దుస్సహముగా యుండెను. ఆదుఃఖమును సహింపలేక జేబఉన్నీసా "అయ్యో! నేను సార్వభౌమ పుత్త్రికనై యేలజన్మించితిని? సామాన్యురాలగు కూలిదాననై పుట్టిన బాగుగా నుండునుగదా!" అనుకొనియెను.

ఆసమయమునందు వెలుపల నేదో యల్లరి జరుగుచున్నట్లు వినవచ్చెను. ఎవ్వరో లోనికిఁ బ్రవేశింపఁ బ్రయత్నించుచుండఁగాఁ బ్రతీహారిణి వలదని వారించుచుండెను. పలుకు సవ్వడింబట్టి యావచ్చినది దరియాబీబీ యని జేబఉన్నీసా కనిపెట్టెను. ప్రతీహారిణి దరియాబీబీ నడ్డగింపలేకపోయెను. దరియా యతివేగముతో లోపలఁ బ్రవేశించెను. ఆమె చేతిలో నొక కత్తి యుండెను. జేబఉన్నీసా శిరము నొక్క వ్రేటున ఖండింపవలయు ననుపూనికతో దరియాబీబీ కత్తిని ఎత్తెనుగాని తోడనే యాకత్తిని క్రిందఁ బాఱవైచి పడఁకనారంభించి "చాలమంచిపని జరిగినది. నా కన్నులనీరు నిండిపోయినది" అని యఱచుచుఁ బకపక నవ్వసాగెను. అప్పుడు జేబఉన్నీసా "ఈమెను పట్టుకొనుము" అని ప్రతీహారిణి కాజ్ఞాపించెను. కాని, యప్పు డామెను బట్టుకొనుట యసాధ్యముగా నుండెను. ఆమె యూర్ధ్వశ్వాసముతోఁ బాఱిపోయెను. ప్రతీహారిణి యామె వెనుకనే పరుగెత్తిపోయి యామె కట్టుకొన్న వస్త్రమును బట్టుకొనియెను. దరియాబీబీ కట్టుబట్టను విప్పి పాఱవైచి నగ్నవేషముతో నే పాఱిపోయెను. అప్పు డామె దురంతోన్మాదగ్రస్తయై యొడలెఱుంగక యుండెను. ఆమె ముబారకుని మరణసమాచారమును వినియుండును.

---

## తృతీయభాగము—అగ్నిజ్వాల

### మొదటి ప్రకరణము

---

రెండవజర్జస్, రెండవ ప్లేటో

ఔరంగజేబు, రాజసింహుని రాజ్యధ్వంసము చేయుట కింకను కాలహరణము చేయుచుండెఁ గాని సైనికసేనాసంపాదనాదివ్యాపారము లతివ్యాప్తము లగుచుండెను. కురుపాండవసమరసమయంబున దుర్యోధనుంబోలె యాతడు బ్రహ్మపుత్రానదియొడ్డునుండి

బాలికాపర్వతపఙ్క్తులవఱకును, కాశ్మీరమునుండి కేరళపాండ్యదేశములవఱకును నెక్కడెక్కడ నెంతెంత సైన్యమున్నదో యంతసైన్యమును చేకూర్చి తెచ్చెను. దక్షిణాపథమునందున్న మహాసైన్యమును గోలకొండ, విజాపురము, మహారాష్ట్రము, మొదలగు ప్రదేశములయందున్న సైన్యమును దీసికొని రెండవవ్యాఘ్రాసురునింబోలి సమరమున విశ్రాంతియెఱుంగని బాదుషా జ్యేష్ఠపుత్త్రుఁడగు మహాలం దక్షిణదిక్కునుండి తనసేనాప్రవాహముచే నుదయపురమును ముంచివేయువానివలె బయలుదేరివచ్చెను. బంగాళాదేశమునందు రాజప్రతినిధియైయున్న, బాదుషా రెండవకుమారుఁడగు "అజంషాహు" పూర్వభారతవర్షమునుండి మహత్తర సైన్యముం దీసికొనివచ్చి మేవారుదేశప్రాంతమునందలి పర్వతమాలికాముఖంబునఁ గాంచికొనియుండెను. పశ్చిమముల తాను దేశముకడనుండి పంజాబు, కాబూలు, కాశ్మీరము మొదలగు దేశములయందలి యవనులగు యోధులం దీసికొని యకారంగిజేబు మూడవకుమారుఁడగు సాగరసన్నిభంబగు సైన్యమును దెచ్చియుండెను. ఉత్తరదిక్కునుండి బాదుషా స్వయముగా డిల్లీయందలి యపరాజితంబగు మూలబలముం దీసికొని యీపృథివియం దుదయపురమను పేరు లేకుండఁ జేయవలయునను తలంపుతో మేవారురాజ్యమునఁ బ్రవేశించెను. అపారపారావారమధ్యమునందలి పర్వతశిఖరముంబోలె నామొగలాయీల యనంతసేనాసాగరమధ్యంబున నుదయపురదుర్గము విరాజిల్లుచుండెను.

అసంఖ్యంబులగు విషసర్పములచేఁ బరివేష్టింపబడిన చెనతెయునివలె నారాజసింహుఁడు సాగరసదృశంబగు నామొగలాయీసేనలను నిర్లక్ష్యముగాఁ జూడసాగెను. భారతవర్షమునందుఁ బూర్వకాలమున గురుక్షేత్రమునందక్క నింతటిసైన్య మెన్నఁడును మఱియెక్కడను చేరియుండలేదు. చీనా, పరిష్యా, రష్యాదేశములను బయిం

చున్నకైన నింతసైన్యమును సంపాదింపవలసిన యవసరముండదు. కావి యీయుల్ప రాజ్యమగునుదయపురము జయించుటకై బాదుషా యింతసైన్యముచేర్చి రాజపుతానాకు దీసికొనివచ్చెను. ఈప్రపంచమునం దొక్కసారిమాత్ర మిట్టివ్యాపారము జరిగినది. పరిష్యా దేశ మీపృథ్వీతలంబున పెద్దరాజ్యమైయున్న కాలమున దదధీశ్వరుడగు జర్జస్ (Xerxes) ఐదులక్షలసైన్యమునుదీసికొని గ్రీసు దేశమును నల్ప భూఖండమును జయించుటకుబోయియుండెను. అప్పుడు థర్మాపిలీ (Thermopylea) యందు లియోనిడిస్ (Leonidas) అనువాడును, సాలామిసునందు థెమస్టాక్లిస్ (Themistocles) అనువాడును, ప్లాటియాయందు పాసనియస్ (Pausanias) అనువాడును జర్జసుతోబోరాడి దనాతనిగర్వము నడగించివైచిరి. ఆసమయమున జర్జను నక్కవలెం ... పోవలసివచ్చెను. అంతటవ్యాపార మీప్రపంచమున జరుగుటకిది ... డవసారి. లక్షలకొలంది సైనికులతో భారతేశ్వరుండగు నౌరంగజేబు జర్జసుకంటెను బాహుబలపరాక్రమశాలియగు సార్వభౌముండు-రాజపుతానాయందు నొకచిన్న రాజ్యము నాక్రమించుకొనుటకై వచ్చి ... రాజసింహుండు డంములకై చేసిన ప్రతివిధానముం గూర్చి యిప్పుడు చెప్పుచున్నాము.

మనకుం దెలిసినంతవఱకు యుద్ధవిద్యయనునది యూరపుదేశ విద్యగా యున్నది. ఆసియాఖండములోని భారతవర్షమునం దీవిద్య ప్రసిద్ధియుండలేదు. మనపురాణేతిహాసములయందు వర్ణింపబడిన సుప్రసిద్ధులగునార్యవీరుల రణకౌశలము కేవలధనుర్బాణముల యందే యున్నది. ఇతిహాసలేఖకులకు బ్రాహ్మణులకు యుద్ధవిద్య తెలియకుండుటవలననో, లేక పూర్వకాలమున భారతవర్షమునం దీవిద్యలేకుండుటవలననో, మనమావిషయములంగూర్చి చెప్పంజాలము. శ్రీరామచంద్రుండు, అర్జునుండు మొదలగు వీరయోధులకు

సేనానాయకత్వమునంగల విశేషసామర్థ్యములంగూర్చి తెలిసికొనుట మనకసాధ్యముగానున్నది. అశోకుఁడు, చంద్రగుప్తుఁడు, విక్రమాదిత్యుఁడు, శకాదిత్యుఁడు, శిలాదిత్యుఁడు మొదలగువారి సేనాపతిత్వము లేవియు సంతతిష్టములై యుండలేదు. భారతవర్షమును జయించిన మహమ్మదు కాసిం, గజనీమహమ్మదు, మహమ్మద్ గోరీ, అల్లాయుద్దీన్, బేబరు, తైమూర్‌లంగ్, నాదర్‌షాహా మొదలగువారి సేనానిర్మాణకౌశలముంగూర్చి మనకేమియును దెలియుటలేదు. ఇతిహాసలేఖకులగు ముసల్మానులకుఁగూడ నీసంగతి తెలిసియుండలేదని తోఁచుచున్నది. అక్బరుకాలమునుండి మాత్రము సేనాపతిత్వపరిచయము కొంచెముకొంచెము తెలియవచ్చుచున్నది. అక్బర్, శివాజి, అహమదబదాలీ, హైదరాలీ, హరిసింహుఁడు మొదలగువారి సేనాపతిత్వలక్షణములును, రణపాండిత్యకౌశలాదులును, మనకు విదితములైయున్నవి. మహారణవిశారదులగు వారిసామర్థ్యముల కింతమాత్రమును కొదవలేదని చెప్పవచ్చును. యూరపుఖండమునందుఁగూడ నంతటిరణపండితులు చాలమందిపుట్టియుండలేదు. అల్పసైన్యసాహాయ్యము వలననే యెంతలేసి మహత్కార్యములనైన సాధించుటలో వీరశ్రేష్ఠుఁడగు విలియం (William) అను నాతనికంటె మించినవారెవ్వరు నీప్రపంచమునం దింతవఱకు జన్మించి యుండలేదు.

ఈయపూర్వ సేనాపతిత్వ కౌశలముంగూర్చి వర్ణించుట యీయుపన్యాసమున కవసరము కాకపోయినను స్వల్పముగ సంక్షేపించి యీసమయమునఁ జెప్పవలసి వచ్చినది.

చతుర్భాగములుగా విభజింపఁబడి యౌరంగజేబుని మహాసైన్యము చేరినతరువాత రాజసింహుఁడు రణపండితులు చేయవలసిన కార్యమును చేసెను. పర్వతపజ్క్తులకు వెలుపలనున్న సమప్రదేశములను వదలివైచి పర్వతములపై సేనలను ప్రవేశపెట్టెను. అతఁడు తన

సైన్యమును మూఁడుభాగములుగ చేసి యందొకభాగమును తన పెద్దకుమారుఁడగు జయసింహునియధీనమునం దుంచి యాతని నా పర్వతశిఖరమునం దుండునట్లు నియమించెను. రెండవభాగమును ద్వితీయపుత్రుఁడగు భీమసింహునకిచ్చి యాతని నాసేనతోఁ బశ్చిమదిక్కునం దుండునట్లాజ్ఞాపించి యాపశ్చిమ మార్గము నిరర్గళముగా వదలివేయించెను. ఇతర రాజపుత్రులెవ్వరైనఁ దమకుసహాయముగా వచ్చినయెడల నామార్గమునుండి రాఁగలుగుదురను నూహతో నాతఁ డట్లు చేయించెను. మూఁడవభాగమును తానే తీసికొని తూర్పు దిక్కునందు చాలదూరమునందున్న నయనమను పేరుగల కఠిన పర్వతప్రదేశమునఁ గాచియుండెను.

అజంపాహా తాను నిలిచియున్నస్థలమునందలి పర్వతపఙ్క్తులనుదాఁటి లోనఁబ్రవేశించుట యాతనికి సాధ్యముకాకుండెను. పర్వతము నెక్కి వచ్చుట చాలకష్టముగానుండెను. తలుపులుమూయఁబడియున్న ద్వారమునొద్ద నిలువఁబడి యల్లరిచేయుచున్న కుక్కవలె నాతఁడా పర్వతద్వారదేశమునందుండి చిందులు ద్రొక్కుచుండెను. కాని ప్రవేశించుటకు మార్గము దొరకలేదు.

అక్బరు అజమీరునందలి యౌరంగజేబుతో గలసికొనియెను. తండ్రియును, కుమారుఁడును తమతమ సేనలంగూర్చుకొని పర్వతపఙ్క్తులయందు, నిరాఘాటముగ వదలివేయబడిన మూఁడవమార్గమును బట్టివచ్చుచుండిరి. ఈమార్గము గిరిసంకటప్రదేశమైయుండెను. అందొక కనుమపేరు దోవారి; మఱియొక దానిపేరు దయులవారు; ఇంకొకదానిపేరు మొదటచెప్పిన నయన—ఔరంగజేబు దోవారియొద్దకు జేరినతోడనే కుమారుడగు నక్బరునితో నీవైదువేల సైన్యమును దీసికొని ముందునకు బొమ్మనిచెప్పి తానాయుదయసాగరమను పేరుగల ప్రసిద్ధసరోవరతీరమునందు శిబిరమును స్థాపించుకొని కొంచెము విశ్రమింపవలయునని ప్రయత్నించెను.

ఆపర్వతమార్గమునుండి యగ్బరు పట్టణమునఁ బ్రవేశింపవలె యునని బయలుదేరెను. ఒక్కపిట్టయైన నాతనిప్రయాణము నడ్డగింపలేదు. రాజప్రాసాదవాటికలు, నుపవనశ్రేణులుంగూడ నాతనికంట బడియెను. కాని యేయొకమనుష్యుడైన నగపడలేదు. అంతటను నిశ్శబ్దముగా నుండెను. అతఁడచ్చట శిబిరముస్థాపించి ''నాసైన్యమునుజూచి భయపడి పట్టణములోని వారెల్లరును బారిపోయి యుందురు''అని యనుకొనియెను. అప్పుడా మొగలాయి శిబిరములయందు విలాసవిహారములు ప్రారంభములయ్యెను. కొందఱు భోజనములు చేయుచుండిరి. కొందఱాటలాడుచుండిరి. మఱికొందఱు నమాజులు సేయుచుండిరి, ఇట్టి సమయమున నిద్రించుచున్న పథికునిపైబడిన క్రూరవ్యాఘ్రమువలెఁ గుమారజయసింహుడు షహజాదాఅగ్బరుపై బడియెను. ఆపులియెల్లరను దననోట వేసికొనియెను. ఎవ్వరును మిగులలేదనియే చెపవచ్చును. ఆర్వైదువేలమంది సైనికులలోను బ్రతికియున్నవారు చాలదక్కువమంది మాత్రమే వెనుదిరిగిపోయిరి. షహజాదా అగ్బరు గుజరాతికిఁ బారిపోయెను.

షహాలంఅను నామాంతరముగల మాజం షాహుదక్షిణపు దిక్కునుండి సేనావాహినులందీసికొని యహమదాబాదును చుట్టుకొని యున్న పర్వతపఙ్క్తులకు గోణరావసిపేరు. అతఁడాత్రోవనుబట్టివచ్చి కాంకరలీ యను పేరుగల స్థలమునొద్దనున్న రాజప్రాసాదసరోవరములంజేరి చూచునప్పటి కాతనికి ముందుమార్గ మగపడలేదు. ఆహారవస్తుసంపాదకులు వచ్చుటకును త్రోవలేదు. అతడు వచ్చుచున్న మార్గమును రాజపుత్రులరికట్టివేసినట్లు కానవచ్చెను. ఆహారవస్తువులు రాకుండుటచే సైనికులుతిండిలేక చావవలసి వచ్చునట్లు తోచుచుండెను. ఇంకను భోజనసామగ్రులు చేరకుండుటచే సైనికులు తిండిలేక చచ్చెదమేమోయను భయముతో నేడ్చుచుండిరి. కడుపునిండిన

యెడల నెన్నటికి బరాజయము రానీయమని యనుచుండిరి. సర్ జాట్రిల్ గ్రియరను నాతడు "బంగాళాజనులు యుద్ధము చేయజాలరని నిందింపఁగూడదు. కాని వారొక నాటికైన నన్నము నుంచుకొనజాలరు" అని చెప్పియున్నాడు. పహాలం యుద్ధముసేయుటయందు నేర్పఱియే యగునుకాని యాహారసామగ్రులు రాకపోవుటం జూచి మఱిముందునకుఁబోలేదు.

రాజసింహుడు సేనాపతిత్వసామర్థ్యము మెఱయదనసేనలను విభజించియుంచిన కౌశలమువలన బంగాళాసేనలును; దాక్షిణాత్యసేనలునుగూడ గాలివానయందు గోతిగుంపులవలె స్తబ్ధములై పోయెను. ములతామసైన్యము భిన్నభిన్నమై చండమారుతోద్ధూతంబగుధూళింబోలె నెచ్చటికో పాఱిపోయెను. ఇక నిలిచియున్న వాఁడు బాదుషాయొక్కఁడుమాత్రమే—ప్రపంచమున కంతకును సార్వభౌముడని ప్రసిద్ధిగాంచిన యౌరంగజేబుబాదుషా యొక్కఁడుమాత్రమే—

---

## రెండవ ప్రకరణము

నయనవహ్నిహుత్తుకొనియెను.

మహాబాదా అక్బరును ముందునకుఁ బంపించి యుదయసాగరతీరమున బాదుషా తనశిబిరమును స్థాపించెను. పాశ్చాత్యమతబోధకులు మొగలాయికాలమునందు ఢిల్లీనిచూచి యానగరమొక దొడ్డశిబిరమని చెప్పియున్నారు. పత్యాంతరమున నౌరంగజేబు బాదుషాశిబిరమొక ఢిల్లీనగరమైయుండెను. బాదుషాశిబిరమువందు నగరమునందువలె ననేకములగు చతుష్పథములును, చత్వరంబులును విరాజిల్లుచుండుటచే నది మహానగరమువలె వలరారుచుండెను. ఆనడుమ బాదుషావారి పటకుటీరము విలసిల్లుచుండెను. అతఁడు ఢిల్లీనగరమునందెట్లుమాల్యహర్మ్యములయందు నివసించుచుండునో యట్లే యా

యమూల్యవస్త్రనిర్మితంబులగు మందిరముల నివసించుచుండెను. అస్త్రా దర్బారుమందిరము, ఆలోచనామందిరము—రంగమహాలు మొదలగు నవి యాశిబిరమునందును గట్టఁబడియుండెను. అవి కేవలము వస్త్ర నిర్మితములే కావు. బంగారము, వెండి మొదలగు లోహములచేఁగూడ నిర్మింపఁబడియుండెను. వానిలో రెండు మూఁడంతస్థులు కలవిగూడ నుండెను. ఎదుట డిల్లీదుర్గ ద్వారములవంటి ద్వారములుండెను. బాదుషా పటకుటీరము చుట్టునున్న యంగణములు విశాలములై యుండెను. అన్నియును మనోహరంబులై సరిగ కుట్టుపనులచేఁ గూర్పఁబడియుండెను. దుర్గమునందువలె నిచ్చటను బురుజులు మొద లగునవి యుండెను. పటకుటీరప్రాంగణము లిత్తడికంబములపై నుర క్షితములై యుండెను. గదులయందలి వెలుపలి భాగమెఱ్ఱని పట్టు వస్త్రములచే నమర్పఁబడి లోపలిభాగమంతయు ననేకచిత్రపటా లంకారములచే శోభిల్లుచుండెను. సింహద్వారమునొద్దఁ బైభాగమున సువర్ణఖచితంబగు చంద్రాతపత్రమును, క్రిందవిచిత్రరత్నకంబళమును, నడుమ రత్నసింహాసనమును విరాజిల్లుచుండెను. నలువంకల వస్త్ర ధారిణులగు తార్తారసుందరీమణులు కాచికొనియుండిరి.

రాజప్రాసాదముల తరువాత నమీరులు, ఉమ్రావులు మొద లగువారి యాస్థానము చాల విశాలమైయుండెను. అటఁ గొన్ని మందిరములు రక్తవర్ణములు కలవిగను, కొన్ని పచ్చనికాంతులు గలవిగను కొన్ని కపిలంబులుగను, కొన్ని నీలాకారములుగను, గన్ప ట్టుచు, నన్నియును సువర్ణకలశములచే నలంకరింపఁబడి సూర్యచంద్ర కిరణప్రసారంబులచే మిలమిల మెఱయుచుండెను. వీనిచుట్టు నాలుగు దిక్కులందును డిల్లీయందుఁబోలె నలరారుచున్న యంగడివీథిం జూచినయెడలఁ గేవలము బాదుషావారి శుభాగమనమునకై యుద

జునాగరిటీరము నీరసనీయనగరరాజము పరమేశ్వరునిచే సృష్టింప బడినట్లు యున్నట్లు తోచుచుండెను.

బాదుషావారు రాజధానివదలి యెటకేని బోవునప్పుడెల్ల నంతఃపుర స్త్రీలుగూడ వారితో బయలుదేరుచుండిరి. ఈసారికూడ నల్లి జోధపురిబేగము, ఉదయపురిబేగము, జేబఉన్నీసా మొదలగువారందఱునువచ్చియుండిరి. జోధాబాయితోగూడ నిర్మలయునువచ్చెను వారికి ఢిల్లీనగరమునందుబోలె రంగమహాలును, ప్రత్యేకమందిరములును నిర్మింపఁబడియుండెను.

ఇట్టియానందమయంబగు శిబిరంబున నౌరంగజేబు రాత్రి సమయమున జోధపురిబేగమువారి మందిరమునకువచ్చి యామెతో మాటలాడుచుండెను. నిర్మలకుమారికూడ నచ్చటనే యుండెను.

బాదుషా నిర్మలకుమారిని యిమిలీబేగ మని పిలుచుచుండును గావున బాదుషా "ఇమిలీబేగమ్! నీవు మాదానవా? రాజపుత్రుల దానవా?" అని యడిగెను. నిర్మల చేతులు జోడించుకొని "ప్రపంచవిచారముల నెల్లఁ దెలిసికొనజాలిన బాదుషా యింతమాత్రము దెలిసికొనలేకపోఁడు" అనియెను.

బాదు—నీవు రాజపుత్రికవు. నీభర్త రాజపుత్రుఁడు, నీవు రాజపుత్రమహిషికి సఖివి; కావున నీవు రాజపుత్రులదానవే యగుదువని నాకు దోచుచున్నది.

నిర్మ—మహాప్రభూ! మీరు బాగుగా నాలోచింపగా నట్లే తోచెనవా? నేను నిజముగా రాజపుత్రకన్యకనే. హజరతు జోధపురిబేగముకూడ నావలె రాజపుత్రికయే. మీపితామహియు, ప్రపితామహియుఁగూడ రాజపుత్రకన్యకలు కారా? వారు మొగలుబాదుషా వారి హితమును గోరినవారు కారా?

బాదు—వారు మొగలుబాదుషా బేగముగా యున్నారు. నేను రాజపుత్రుని భార్యనై యున్నదానవు.

నిర్మ—(నవ్వుచు) నేను షహాన్‌షాహా అలంగీరబాదుషా వారి ఇమ్‌లీబేగమును—

బాదు—నీవు రూపనగరకన్యక సఖివి.

నిర్మ—యోధపురిసఖినిగూడ నగుదును.

బాదు—అట్లయిన నీవు నాదాన వేగా?

నిర్మ—దేవర యిష్టముకొలది నట్లే.

బాదు—నేను నీకొకపని చెప్పవలయునని యుంటిని. నాకందు వలన జాల నుపయోగమున్నది. కాని, యందువలన రాజసింహున కనిష్టము కాఁగలదు. అట్టిపనిని నీవు నెఱవేర్పవలయునని కోరుచు న్నాను. నీవుచేసెదవా?

నిర్మ—కార్య మిట్టిదని తెలుపకున్న నేనేమియును జెప్పఁ జాలను. నేను దేవ బ్రాహ్మణుల కష్టముకలిగించు పనులలోఁ బ్రవే శింపజాలను.

బాదు—నేనట్టికార్యమును చేయుమని నీతో జెప్పుటలేదు. నే నుదయపురమునకు బోయి రాజసింహునియంతఃపురమున బ్రవే శింతును. అందుల కేమియును సందేహము లేదు. కాని యామిోఁద రూపనగరకన్యకను చేపట్టఁగలుగుదునో లేదో యని సందేహించుచు న్నాను. నీవావిషయమున సాహాయ్యము చేయవలయును.

నిర్మ—మీరుదయపురమునకు బోయి రాజాంతఃపురమున బ్రవేశించుటయే తటస్థించిన నాజనకులు చంచలకుమారిని తప్పక మీ చేతికి నొప్పగింతురని జగన్మాతలగు గంగాయమునలపై నాన బెట్టి శపథము చేయుచున్నదానను.

బాదు—నీమాటలను నమ్మెదను. ఏమన—నాయెడ మా

నముచేసి యుగళ్యములాడువారిని తుండెముండెములుగా నఱికి వేయించి కుక్కలకు వేయించెదనని నీవు బాగుగా నెఱుంగుదువు.

నిర్మల—నేను వంచించుదాననో కానో దేవర మొదటనే యెఱుగుదురు. నేను మిమ్ము వంచించుదానను కానని యొట్టుపెట్టుకొని యుండెను. మీరంతఃపురమును కొల్లగొట్టినప్పటికి చంచలజీవములతో నుండునో, యుండదో యనువిషయము మాత్రము సందేహముగా నున్నది. రాజపుత్ర స్త్రీలు శత్రులచేతులలో బడుటకుముందే చితారోహణముచేసి భస్మమైపోవుచుండు పద్ధతి యొకటియున్నది. ఆమె సజీవయై దొరకినయెడల నేనాప్రతిజ్ఞ నెరవేర్పగలను.

నిర్మల ప్రత్యుత్తరమిచ్చునంతలో ప్రతీహారివచ్చి "పేష్కారు దర్వాజున నిల్చియున్నారు. అవసరమైన విన్నపమొకటి చేయదలచియున్నారు. హజరత్ షహజా అక్బరుషాహావారి సమాచారము వచ్చియున్నది" అని తెలియపఱచెను.

ఔరంగజేబు చెదరిపోయినహృదయముతో నాస్థానమునకు బోయి పేష్కారునడుగగా "అక్బరుని సైనువేలసైనికులును నిశ్శేషముగ నిహతులైపోయిరనియు, హతశేషుల సమాచారమేమియును తెలియలే"దనియును పేష్కారు చెప్పెను.

వెంటనే యౌరంగజేబు శిబిరముల నెత్తివేయవలయునని యాజ్ఞాపించెను.

అక్బరుని సమాచారము రంగమహాలునకుగూడ దెలియవచ్చెను. అంతయును విని నిర్మలకుమారి యోధాబాయియొద్దకు బోయి యామెకు రూపనగరవృత్తాంత మంతయు నభినయించెను.

అనంతరము నిర్మల తననాట్యవేషమును దీసివైచి వేఱువస్త్రములను ధరించి కూర్చున్నప్పుడు బాదుషా యామెను పిలిపించెను. నిర్మల యాతనియొద్దకు బోయి నిలువబడినతోడనే బాదుషా "నేను

శిబిరము నెత్తివేసిపోవుచున్నాను. నీవుదయపురమునకు బోవుట కిష్టపడ యెదవా!'' అనియెను.

నిర్మ—ఇష్టపడుటలేదు. నేను సేనలతోగూడ బోవుదు నా యిచ్చవచ్చిన చోటనుండి వెడలిపోయెదను.

ఔరంగజేబు కొంచెము దుఃఖభావముతో "[illegible] దవు!'' అనియెను.

నిర్మ—షాహాన్ షాహావారి యాజ్ఞననుసరించి—

బాదు—(పశ్చాత్తాపముతో) నేను బోవుటకు సెలవియ్యని యెడల నీవు చాలకాలమువఱకు నీరంగమహలునందు నుండెదవా!

నిర్మ—(చేతులుజోడించుకొని) నాకు భర్త యున్నాడు.

ఔరంగజేబు కొంచెము వెనుకముందు లాలోచించుకొని "నీవు ఇస్లాంధర్మము నవలంబించినయెడల—నీభర్త నిన్ను వదలి పెట్టినయెడల నుదయపురిబేగముకంటెను నిన్నుమిగుల గౌరవముతో జూడగలను.''

నిర్మలనవ్వుచు తొందరతో "మహాప్రభూ! అట్లుకాజాలదు'' అనియెను.

బాదు—ఎందులకుగూడదు? రాజపుత్రకన్యక లెందఱో మొగలాయిల యింటికోడండ్రయియున్నారు.

నిర్మ—వారెవ్వరును భర్తనువిడిచి వచ్చినవారు కారు.

బాదు—నీకు భర్త లేకున్నయెడల నీవుగూడ వచ్చెదవుగా బోలునే!

నిర్మ—ఇప్పుడామాట యెందులకు?

బాదు—ఇందుకొఱకని చెప్పుటకు లజ్జయగుచున్నది. ఇట్టి మాట నేనెన్నడును వచించియుండలేదు. నేనువృద్ధుడనైయుంటిని కాని నేనెప్పుడు నెవ్వరిని ప్రేమించియుండలేదు. ఈజన్మమునందు గేవ

టము నిన్నుమాత్రము ప్రేమించియున్నాడను. నీకు భర్తయే లేక పోయినయెడల నీవు నాకు బేగమవయ్యెడవుకాదా ? నీవే చెప్పుము! ట్లయినయెడల స్నేహశూన్యమైన నాహృదయము—దగ్ధారణ్యముం బోలిన నాహృదయము—నీప్రేమచే శ్యామలము కాఁగలదు.

నిర్మల యౌరంగజేబు కంఠస్వరమును విని యాతని మాటలను నమ్మెను. నిశ్చయముగా నాతఁడు హృదయపూర్వకముగ నిష్కపటముగఁ జెప్పినమాటలేయైయుండెను. నిర్మల యౌరంగజేబుకొఱకు కొంచెము జాలిపడి "మహాప్రభూ! ఈదాసి మీప్రీతివిశ్వాసములకుఁ బాత్రభూతయగునంతటికార్య మేమిచేసినది?" అనియెను.

బాదు—నేనావిషయముంగూర్చి చెప్పఁజాలను. నీవు సుందరివే యగుదువు, కాని నాసౌందర్యమునకు వయసు చెల్లిపోయినది. నీవు సుందరివైనంతమాత్రమున నుదయపురికంటె నందమైనదాన వని చెప్పుటకు వలనుపడదు. నీకంటె నెవ్వరును నాయొద్ద నిజముచెప్పిన వారు లేరు. నీబుద్ధిచాతుర్యసాహసములం జూచినయెడల నీవునాకుఁ దగిన దేవివని తోఁచుచున్నది. అదియెట్లయిననేమి? అలంగీరుబాదుషా నీకంటె మఱియెవ్వరికిని వశుఁడై యుండలేదు. ఎవ్వరి కటాక్షముల వల్లనైన నింతగా మోహితుఁడై యుండలేదు.

నిర్మ—రాజాధిరాజా! రూపనగర రాజకుమారి యొకసారి "నీవెవ్వరిని పెండ్లిచేసికొందువు?" అని నన్నడిగినది. నేను "అలంగీరు బాదుషాను పెండ్లిచేసికొందును" అంటిని. ఆమె యెందులకని యడిగినది. నేను నాచిన్నతనమునుండియుఁ బులిని పెంచుచున్నాను. పులిని వశపఱచుకొనుటయే నాకు మిగుల నానందము. బాదుషాను వశపఱచుకొన్నయెడల నాకానందముగా నుండునని చెప్పితిని. నా దురదృష్టమువలనఁ గన్యకగా నున్నప్పుడు మీసందర్శనము లభించినది కాదు. నేనా దరిద్రుని భర్తగా వరించియు సుఖనైయుంటిని. ఇప్పుడు నాకు దయతో సెలవీయవలయును.

ఔరంగజేబు ముఖమునకై "ప్రపంచమునకు బాదుషానైనను నెవ్వరును సుఖమై యుండుటలేదు. ఎవ్వరును సుఖాశయముచే సంతృప్తులగుటలేదు. ఈప్రపంచమున నేను కాలము నిన్నుమాత్రము ప్రేమించుచున్నాను. కాని, నేను నిన్నుఁ బొందఁజాలకపోయుంటిని. నిన్ను మనఃపూర్వకముగఁ బ్రేమించుచుండుటవలన నీవు పోవుట కేమియు నభ్యంతరము కలిగింపఁజాలకుంటిని. నిన్ను వదలివైచెదను. పోయి సుఖింపుము. నీకు దుఃఖము కలిగించు కార్యములను చేయఁజాలను. నీవుపొమ్ము. నన్ను మఱచిపోవకుము. నావలన నీకేమైన నుపకారము గావలసియున్నయెడల వర్తమాన మంపించినచో నేను దానిని నెరవేర్పఁగలను.

నిర్మల యాతనికి నమస్కరించి "నాదొక చిన్నమనవి యున్నది. ఉభయులక్షేమమును గోరిన నేను సంధియగుటయే మంచిదని యూహించుచున్నాను. మీరు నేను చెప్పినదానిని చిత్తగించితిరా?" అనియెను.

బాదు—సమయము వచ్చినప్పుడు యోచించెదము.

అప్పుడు నిర్మల తనయొద్దనున్న పావురమునుచూపించి "ఇది సుశిక్షితమైనపక్షి. దీనిని మీయొద్దనుంచుఁడు. మీరు నన్ను దలచుకొన్నప్పు డీపావురమును విడువవలయును. అప్పుడు దీనివలన నా విన్నపమును వ్రాసిపంపుకొనియెదను. నేనిప్పుడు సైన్యముతోగూడ నుండెదను. నాకు సెలవుగావలసివచ్చునప్పుడు యోధపురిబేగమువారు సెలవిచ్చునట్లనుగ్రహింపవలయును" అనియెను.

అనంతరము బాదుషా సైన్యములను బయలుదేరఁదీయుటకై వెడలిపోయెను.

అయినను బాదుషా హృదయమునఁ జాలవిషాదము కలిగి యుండెను. వాక్పమత్కృతియందుగాని, విస్పష్టవక్తృత్వమునందుఁ

గాని, సామాన్యమునందుఁగాని నిర్మలతో సమానురాండ్రగువారిని బాదుషా యెప్పుడును చూచియుండలేదు. శివాజీకాని, రాజసింహుఁడుకాని, మఱియేరాజైనఁగాని, యేసేనానాయకుఁడైనఁగాని, ఉన్నను. మహలంబొడలను రాజపుత్రులుగాని, రాజపుత్రికలుగాని యింతటిస్థైర్యముతో సంభాషించినయెడల నౌరంగజేబెంతమాత్రమును సహించువాఁడు కాఁడు. కాని, రూపవతియు, యువతియు, నసహాయయునగు నిర్మలయొద్ద నామెమాటలకు మెచ్చి లోఁబడిపోయెను. ఔరంగజేబు కామాంధుఁడై యామెవియోగమున కంతిగా శోకాకులుఁడు గాకపోయినను విషణ్ణుఁడైయుండెను. ఔరంగజేబగ్నివర్ణుఁడై యుండలేదు. మనుష్యుఁ డెన్నఁటికిని పాషాణము కాఁజాలఁడు.

---

## మూఁడవ ప్రకరణము.

---

కన్నెచక్రమందలిబాదుషా.

ప్రభాతసమయమున బాదుషా మూలబలమును దీసికొని బయలుదేరుచుండెను. అందఱికంటెను ముందుగా మార్గపరిష్కారకులగు సైనికులు, త్రోవలను బాగుచేయుటకై శస్త్రధారులై బయలుదేఱిరి. వారియొద్ద గొడవలి; మచ్చుకత్తి, కఠారి మొదలగునవి యుండెను. వారు మార్గముల కడ్డగనున్న చెట్లను, తుప్పలను నఱికి యొత్తిగించి, మెరకపల్లములను సమతలముగఁ జేసి బాదుషావారి సైన్యము పోవుటకు మార్గమును చదునుజేసికొనుచు ముందునకుఁ బోవుచుండిరి. ఆమార్గమున ముందుగా ఫిరంగుల బండ్లు పోవుచుండెను. వానితోఁ దత్సంబంధసైనికులు పోవుచుండిరి. లెక్కలేనిఫిరంగిబండ్ల దడదడశబ్దములతోఁ జెవులు చెవుడువారుచుండెను. చక్రములరాపి

డిచే భూమినుండి లేచిన ధూళివలన కన్నులుమూతవడిపోవుచుండెను. ప్రళయ కాలయమునివలె నోరు తెరచుకొనియున్న ఫిరంగులను జూచుట వలన హృదయము కంపించుచుండెను. ఆఫిరంగుల వెనుక రాజకోశా గారము—బాదుషావారికోశాగారము వారితోడనే యుండును. ఔరంగజేబు డిల్లీయందున్నవారిని నమ్మి ధనరాసుల నక్కడ నిడి విడిచిపెట్టి వచ్చువాడుకాడు. అతని సామ్రాజ్యశాసనమునం దెవ్వరిని నమ్మకపోవుటయే మూలమంత్రముగా నుండెను. ఇందు మఱి యొకటి జ్ఞప్తియందుంచుకొనవలసి యున్నది. ఈసారి డిల్లీనుండి బయలుదేరి వచ్చిన యౌరంగజేబు డిల్లీకి మరలఁబోలేదు. చాల వఱకు కాలవల్లిశిబిరమునుండి బయలుదేరినదిమొదలు శిబిరములలో నివసించుచుఁబోయి తుదకు దక్షిణదేశమునఁ బ్రాణములను విడిచి పెట్టెను.

లెక్కలేని ధనముతోడను రత్నసమూహముతోడను బరిపూర్ణ గజాదివాహనములపైఁ బోవుచున్న రాజకోశాగారము వెనుక బాదుషావారి లెక్కల దస్తరములొకదానిపై నొకటిగ బండ్లమీఁదను, ఏనుఁగులమీఁదను, లొట్టియలమీఁదను గుట్టలుగుట్టలుగాఁ జేర్చబడి యుండెను. వాని వెనుక గంగాజలములను మోచికొనుచు లొట్టియలు బారులు తీరినడచుచుండెను. గంగాజలమువలె పానయోగ్యమైన జలము వేఱొండులేదు. ఆకారణముచేత నాగంగాజలము బాదుషాచేఁ గూడ దీసికొనిపోబడుచుండెను. ఆవెనుక నాహారపదార్థములు, ధాన్యము, పిండి, నేయి, కాయధాన్యము, మసాలావస్తువులు, చక్కెర, నానావిధపక్షులును, చతుష్పాద జంతువులును, ప్రస్తుతోపయోగములును, ఉత్తరోపయోగములునగు పక్వాపక్వభక్ష్యము లును బయలు వెడలెను. వానిలో గూడ జాలమంది వంటవాండ్రును సేవకులును బోవుచుండిరి. వారివెనుక రాజోపయోగములగు నాభర

...ంబులను గాకిమ్మట లెక్కలేని మొగలాయీ యాశ్విక సైన్య మును నడచుచుండెను.

ఈనడచుచునడంతయు సైన్యములోని ప్రథమభాగమై యుండెను. రెండవభాగమందు బాదుషా వారుండిరి. వారికిముమ్ముందు, అనేకోష్ట్రములపై నగరుఘూషములతో నొప్పారెడి యూదుదాను లును, చందనము, అత్తరువు, సుగంధతైలములు, కస్తూరి, జవ్వాది, పచ్చకర్పూరము, కేసరి, మొదలగు సుగంధద్రవ్యములును బోవుచుండెను. ఆసుగంధము దిక్కుల వ్యాపించి భూమ్యాకాశముల నామోద వంతముగ జేయుచుండెను. వానివెనుక బాదుషావారి స్వసైన్యము భయపార్శ్వముల బాకులతీరి యశ్వములపై బోవుచుండెను. ఆమధ్యమున మణిరత్నకింకిణీజాలాన్వితమై, శోభాయమానమై, యుజ్జ్వలమై ఉచ్చైశ్రవసదృశమై యొప్పారు నశ్వముపై నధిరోహించి బాదుషా ప్రయాణము సేయుచుండెను. అతనిశిరోగ్రభాగమున విఖ్యాతముగు శ్వేతచ్ఛత్రములరారుచుండెను. ఆవెనుక సైన్యమున కంతకును పారఖూతలును. ఢిల్లీకలంకారప్రాయులును, బాదుషాపదవికి లక్ష్మీస్వరూపిణులునగు నంతఃపురసుందరీమణు లేగుచుండిరి. ఐరావతము నకు సమానమైన యేనుగులపై, సువర్ణఖచితమై, సరిగకుట్టు పనుల గొప్ప మొగమల్ బట్టచే నిర్మింపబడి, ముత్యాలజాలరులచే నలంకృతమై, విచిత్రముగ బయచని తెరలచే నావృతమైన యంబారీలలో, మణిమయాలంకృతలగు రమణీమణులు కొందఱు ప్రకాశించుచుండిరి. వారివేణులు కాలభుజంగంబులవలె వెనుకభాగమున వ్రేలాడుచుండెను. వారివిశాలనేత్రములనుండి కాలాగ్నిసన్నిభకటాక్షమాలికలు వెలిమొలచ్చుచుండెను. వానిపైనల్లని భ్రూయుగ్మములు, నేత్రాంచల కజ్జలరేఖలును వెలయుచుండెను. వానిమధ్యమునుండి బయలువెడలు చున్న విద్యుత్ప్రకాశములకు సమస్తసైనికులును విశృంఖలులై పోవు

చుండిరి. మనోహర తాంబూల రక్తాధర మాధురీమూర్తులగు నానంద కీరములు మృదుమధురముగ మందహాసము జేయుచుండిరి. ఇట్టి సుందరులొకరిద్దఱుగారు ఏనుగులపై నొకరి వెనుక నింకొకరు, నిట్టి వందలకొలది పంక్తులుతీరియున్న యేనుగులపైఁ బ్రకాశించుచుండిరి. అన్ని యేనుగులమీదను నంబారీలుండెను. అన్నియంబారీలలోను సుందరీమణులే, ఆసుందరీమణులే. ఆసుందరీమణులయందఱినయనములందును మేఘమునగనుపడుచున్న నావిద్యుత్తామముల క్రీడయే. ఇట్లైయున్న భూమి యీకాంతులచే బ్రకాశింపజొచ్చెను. కొంతమంది పల్లకీలలోఁ బ్రయాణముచేయుచుండిరి. ఆసవారులు బురకాలచే మూయబడియుండెను. లోపలిభాగమున జలతారుతో సరిగపని చేయబడిన ముఖమల్ వేయబడియుండెను. మీద ముత్యాలజాలరులుండెను. వెండిబంగారు లతలచే మనోహరముగానున్న యాలోపలి భాగమున రత్నాలంకృతలగు సుందరీమణులు కూర్చుండియుండిరి. యోధపురి, ఉదయపురి, నిర్మలకుమారి, జేబఉన్నీసా; మొదలగువారేనుగులమీదనే ప్రయాణము సేయుచుండిరి. ఉదయపురిహాసముఖి; యోధపురియప్రసన్న: నిర్మలకుమారి రహస్యమయి; జేబఉన్నీసా, ఆశ్రయమునుండి యున్మూలింపబడిన లతవలె వికలయై, శుష్కయై, శీర్ణయై, మృతప్రాయయై యుండెను. ఆమె, "యీయేనుగుల మధ్యబడి చచ్చుట కుపాయమున్నదా" యని మనస్సునందూహించుకొనుచుండెను.

ఈమనోహరాంతఃపురకామినీ జనప్రవాహమునకు వెనుక పరివారస్త్రీజనంబును దాసీజనంబును—అందమైన శ్యామాంగులు; అలంకృతవేణులు; రక్తాధరలు; విద్యుత్కటాక్షులు; మనోహరాలంకారశింజితధ్వనులగావించుకొనుచు గుంపులుగానడచుచుండెను. దీనికి వెనుక మరఫిరంగిసైన్యముండెను. కాని యాఫిరంగులుముందు నడచుచున్న

దానికంటెఁ జిన్నది. బాదుషావారు, కామినీకమనీయకటాక్షములున్నప్పుడు పెద్దపెద్దఫిరంగులతో బనిలేదనియోచించినట్లు తోఁచుచున్నది!

మూఁడవభాగసైన్యము పదాతిసైన్యము. ఆవెనుక దాసదాసీజనమును, అన్నివిధములగు సామానులును, నర్తకవాద్యకజనమును గుఱ్ఱపుబండ్లను బండ్లను పోవుచుండెను.

అపరిమితమైనదియు, నసంఖ్యాకమైనదియు, నద్భుతకరమైనదియు నగు నీమొగలుసేనా ప్రవాహము, భయంకరధ్వని గావించుకొనుచు మహానదీప్రవాహ మెట్లు తనయందుఁబడిన చిన్నచిన్న యిసుకతిప్పలను, గ్రామములను ముంచివైచి కొనిపోవునో యట్లే రాజసింహుని రాజ్యమును ముంచివేయునట్లు బయలుదేరెను.

కాని, వారికొక యాటంకముకలిగెను. అక్బరేమార్గమున బోయెనో యామార్గముననే యౌరంగజీబు తనసైన్యమును నడిపించుకొనిపోవుచుండెను. అక్బరుసైన్యముతోఁ దనసైన్యమును గలుపుకొనవలయుననియు, మధ్యమార్గమునఁ గుమారజయసింహుఁ డతనికిఁ జిక్కినయెడల నాతనిసైన్యమును హతమార్చి యుభయులును గలిసి యుదయపురమునకుబోయి రాజసింహునిరాజ్యమును ధ్వంసము సేయవలయుననియు, యోచించి యౌరంగజీబామార్గమునుబట్టెను. కాని, బాదుషా కొండలదారి బట్టుటకుముందే రాజసింహుఁ డగ్రభాగమునఁ బర్వతముపై గాచికొనియుండెను. రాజసింహుఁడు నయనమును గిరిగహ్వరమార్గమును మూసివైచెను. రాజసింహుఁడు త్యాగమహాలగు [illegible] చారులవలన నక్బరు సమాచారమును దెలిసికొని [illegible] ప్రభాతమున, మాంసలోలుపయగు డేగవలె వేగముగఁ బర్వతాంచిత పర్వతమార్గమును దాఁటిపోయి బాదుషాసైన్యము నడచుచున్న గిరిసానుదేశమార్గమునం గాచుకొనియుండెను.

కుపాయములేదు. ఇతడు వెనుకకు దిరిగిపోవలసివచ్చెను. అప్పుడును రాజసింహుడు వెన్నాడించుచునే యుండెను. అది యట్లుండనిప్పుడుదయపుర ప్రవేశం బాతని వెనుక జప్పటలం గొట్టుచు వచ్చుచుండెను. ఆ నిర్జన ప్రపంచమంతయును నవ్వుచుండెను. ప్రపంచమునం దత్యంత గౌరవము నందుచున్న మొగలబాదుషా కింతకంటె విశేషావమానమేమున్నది! ఔరంగజేబు, "కొదమసింగ మెలుకకు బెదరి పాఱిపోవునా!"అని యనుకొని తప్పించుకొని పోవు యోచనయే చేయడయ్యెను.

అప్పుడేమిచేయుటకు సాధ్యము? ఒకటే ధైర్యము. ఉదయపురమున కింకొక క్రొత్తమార్గమును వెదకవలయును. ఔరంగజేబు బాదుషావారి యాజ్ఞాప్రకారము నలుదెసలకును మార్గమును వెదకుటకై యాశ్వికులు బయలుదేరిరి. ఔరంగజేబు నిర్మల కుమారినడిగెను. ఆమె "నేనంతఃపుర కాంతను. నాకేమియును దెలియదు"అని చెప్పెను. కొంతసేపటికి కుదయపురమున కింకొక మార్గమున్నదని చారులవలన దెలియవచ్చెను. ఒక మొగలాయీ యావర్తకుం డామార్గమును జూపించెద నని మన సబుదారుని దీసికొని బయలువెడలెను. ఆతం డాత్రోవను బరీక్షించుకొనివచ్చెను. అది కొండకనుమనడుమ నుండెడి చాల సిరుకుగ నుండెను. అక్కడ రాజపుత్త్రులెవ్వరు నున్నట్లే యగపడలేదు. వర్తకుడుగూడ నక్కడ నేవిధమైన సైన్యమును లేదని చెప్పెను.

ఔరంగజేబు "రాజపుత్త్రసైన్యమక్కడ దాగికొనియుండవచ్చును"అనియెను.

త్రోవనుజూచుటకై పోయిన మనసబ్ దారు బఖత్ ఖాను "నేను మార్గమును జూపించిన యావర్తకుని పర్వతముమీదికి బంపితిని. నేన లున్నయెడల మాకాచూకీ నిమ్మని చెప్పితిని" అనియెను

ఔరం—అతడు నమ్మకస్థుడైన సిపాయియేనా?

బఖత్—కాదు. అతడు వర్తకుడు. ఉదయపురమునందు శాలువ లమ్ముటకు బోవుచుండెను. ఇప్పుడు మన శిబిరమునందు శాలువల నమ్ముటకు దీసికొనివచ్చినాడు.

ఔరం—అట్లయిన యెడల నామార్గమున మన సైన్యమును నడపింపుము.

అప్పుడు శాహుజాదా వారి యాజ్ఞాప్రకారము శాజతీరిగెను—కొంచెముదూరము వెనుకకుబోయి కనుమదారిని బోవలయును. ఇట్లు చేయుటయును విశేషాపదకు గారణమే. చేయున దేమి? మొగలాయీ సైన్యము వచ్చినట్లుగనే వెనుకకు మరలెను. ముందున్నది వెనుకకువచ్చెను. వెనుకనున్న సైన్యము ముందునకు బయలు దేరెను. ఔరంగజేబు, ముందున్న సైన్యము శిబిరమున్న వైపునకు బోయె. మిగిలినసైన్యము, ముందునకు బోయిన పిమ్మట దాని వెనుక కానలె నని యాజ్ఞాపించెను. ఔరంగజేబు చిన్నచిన్నపిరంగులను కాల్బలమును దీసికొని కనుమదారిని బయలు దేరెను. బఖత్ ఖాను దారిఁజూపుచు ముందుపోవుచుండెను.

అదిచూచి రాజసింహుడు కొదమసింగమువలె పర్వతమునుండి దిగివచ్చి మొగలాయీసైన్యమధ్యమునఁ బ్రవేశించెను. మొగలు సైన్యము కత్తిరింపబడినపూలహారమువలె రెండుపాయలై పోయెను. ఒకభాగ మౌరంగజేబుతో గనుమయందు బ్రవేశించెను. మఱియొక భాగము పర్వతమార్గమున రాజసింహుని కెదురుగానుండెను.

మొగలులకు విపత్తులపై విపత్తులు. ఏనుగులు, గుఱ్ఱములు, పల్లకులు మొదలగువానిపై బాదుషాయంతఃపురస్త్రీలు పోవుచున్న స్థలమునందే రాజసింహుఁడు సైన్యసమేతుడై వచ్చిపడియెను. గ్రద్ద వచ్చి పడినయెడల బిచ్చుక లెట్లు చెల్లాచెదరై యటునో యిట్లే

లోనగుడారి జూచి రాజాంతఃపురకాంతల భుజంగినీసమూహ మాత్ర నాశము సేయఁబోడగెను. అక్కడ యుద్ధపుగోడవయే లేదు. అక్కడ నాఁడు గానుమన్నవారు కత్తిఁగట్టినయెడల బేగములు నాశనమై పోవుదురను భయమునఁ గన్నులు తెరువలేదు. రాజపుత్రులు యుద్ధము లేక సేవకులుగానున్న వారందఱిని ఖైదీలుగ బట్టుకొనిరి. బేగములందఱును పరిచారికాజనులతోఁగూడ ఖైదీలుగ బట్టుకొనబడిరి.

మాణిక్యలాలు రాజసింహుని సమీపముననే యుండెను. అతఁడు విశేషప్రేమపాత్రుఁడు. మాణిక్యలాలు వచ్చి చేతులు జోడించుకొని "మహారాజాధిరాజ! ఈమూర్జాలసమూహమును బట్టుకొని చేయునదేమి? ఆజ్ఞయయ్యేనేని పొట్టనిండ బాలును పెరుగును ద్రావుటకై వీరినందఱిని ఉదయపురమునకు బంపించెదను" అనియెను.

రాజ—(నవ్వి) వీరికిసరిపడిన పాలును పెరుగును ఉదయపురమునందు లేదు. ఢిల్లీపిల్లులపొట్టలు పెద్దవని వినియున్నాను. ఉదయపురికొక్క తెరువమాత్రము చంచలకుమారియొద్దకు బంపుము. చంచలకుమారి యామెనుగూర్చి విశేషముగ జెప్పియున్నది. మిగిలిన ధనమంతయు నౌరంగజేబు వెనుకనే పోనిమ్ము.

మాణి—(చేతులుజోడించుకొని) భోజనమునకై మనసైనికులకుఁ గొంతచేరవలసియున్నది.

రాజ—(నవ్వి) మీకుఁ గావలసినవి తీసికొనుఁడు. కాని మునల్మానుస్త్రీలను హిందువులు ముట్టుకొనగూడదు.

మాణి—వారాడుటకును పాడుటకును నేర్పరులు.

రాజ—ఆటపాలయందు మనసుంచిన యెడల రాజపుత్రులు నీవలె శౌర్యమును జూపింపగలరా? అందఱిని విడిచిపెట్టుము. ఉదయపురినిమాత్ర ముదయపురమునకు బంపుము.

మాణి—ఈసముద్రమునం దీరత్నము నెట్లు వెదకను! నాకు గుర్తు తెలియదు. ఆజ్ఞయయ్యెనేని హనుమంతునివలె నీగంధమాదన పర్వతమును దీసికొనిపోయి దేవియెదుట నుంచెదను. ఆమె వెదకి తీసికొనవచ్చును. కావలసినవారి నందఱి నేరికొననిమ్ము. మిగిలినవా రుదయపుర విఫణివీధులయందు పంక్తిపాడి, సుర్మా మొదలగువాని నమ్ముకొని జీవింపగలరు.

ఈసమయమునం దొక స్త్రీ యేనుగుమీఁదినుండి నిర్మలకుమారి మాణిక్యలాలును రాజసింహునిఁజూచి వారిద్దఱికిని ప్రణామముల జేసెను. రాజసింహుఁడు చూచి మాణిక్యలాలుతో "ఆమె యెవ్వరో బేగము హిందూవనిత యవలెనే తోఁచుచున్నది. సలాముచేయక మనకు ప్రణామమును జేయుచున్న దే" అనియెను.

మాణిక్యలాలు గట్టిగనవ్వి "మహారాజా! అదియొక బానిస—బేగమెట్లగునో తెలియదు. దానిఁ బట్టి తీసికొని రావలయును" అని మాణిక్యలాలు నిర్మలను ఏనుఁగుపైనుండి దింపి తీసికొనివచ్చెను. నిర్మల నవ్వుట కారంభించెను.

మాణిక్యలాలు—ఇదేమి నిర్మల నీవు బేగమ వగుటయెట్లు!

నిర్మల కన్నులు మొగమును ద్రిప్పుకొనుచు "నేను హాజరత్ ఇమ్లీ బేగమును. సలాము చేయుము" అనియెను.

మాణిక్య—సలాముచేయుదును. నీవు బేగమవు కావని నేను బాగుగ నెఱుఁగుదును. నీతండ్రితాత లెప్పుడును బేగములు కారు. కాని యీవేష మెట్లువచ్చినది?

నిర్మల—ముందు నాయాజ్ఞప్రకారము సలుపుము. నీమాట యటుండనిమ్ము.

మాణి—రామ రామ! బేగముసాహెబావారి కెంతటిజబర్ దస్తీ!

నిర్మ — మా యొక్క నేమనఁగా — హాజరత్ ఉదయపురి బేగమునాహేబావారు ముందున్న యేనుఁగుపై పంచకలశములున్న యంబారీలో దయచేసి యున్నారు. వారిని మనహుజూరునకు వేగముగఁ గొంపోవలయును.

ఈ వాక్యము సంపూర్ణమగులోపలనే మాణిక్యలాలు ఉదయపురి బేగము నేనుఁగునుండి దింపెను. ఉదయపురి సంకోచముతో ముఖము వస్త్రాగ్రముఁ గప్పికొని కన్నీరు విడుచుచు దిగెను. మాణిక్యలాలొక పాలకిని తెప్పించి యేనుఁగు కడ్డముగఁ బెట్టించెను. ఉదయపురి యాపల్లకిలోఁ గూర్చుండెను. పిమ్మట మాణిక్యలాలు నిర్మల చెవిలో "అయ్యా! ఇమ్లీబేగంసాహేబావారూ! ఇంకొకమాట చెప్పవలసి యున్నది" అనియెను.

నిర్మల — ఊరకుండుము. నా పేరు హాజరత్ ఇమ్లీబేగము.

మాణి — మంచిది. నీ వెంతటి బేగమవైన నగుదువు. బేగం జేబఉన్నిసాసాహేబా రెవ్వరో నీవెఱుఁగుదువా?

నిర్మ — తెలియదా? చూడు! ఆముందు మూఁడుబంగారపు కలశములున్న యంబారీపై జేబఉన్నిసాసాహేబావారు దయచేసి యున్నారు.

మాణిక్యలాలామెను, ఏనుఁగునుండి దింపి సవారిలోఁ గూర్చుండఁబెట్టి తీసికొని వచ్చెను. ఈసమయమందు మఱియొక యామె యంబారీపరదాను కొంచె మోరఁజేసికొని నిర్మలను బిలిచెను. మాణిక్యలాలు "ఇంక నెవ్వరో నిన్నుఁ బిలుచుచున్నారు" అని నిర్మలతోఁ జెప్పెను.

నిర్మల యాదిక్కుగ దృష్టిసారించి "ఔను. ఆమె జోధపురి బేగము. ఆమెను దీసికొనిరాఁగూడదు. నన్నా యేనుఁగుపై నెక్కించి యామెయొద్ద కంపుము". అనియెను.

## నాల్గవ ప్రకరణము

శత్రుచక్రము భయంకరముగ జేసెను.

అప్పుడు రాజసింహుడు ఏనుగులమీదను, సవారులయందును ప్రయాణముచేయుచున్న పౌరాంగనలందఱిని ఔరంగజేబు ప్రవేశించియున్నగుహామార్గమున బోవుటకు విడిచిపెట్టెను. వారచట ప్రవేశించినతోడనే రెండుసేనలును కదలకుండ నిలువబడిపోయెను. ఔరంగజేబుసేన ముందునకు బోవుటకు వలనుగాకపోయెను. రాజసింహుడు వారి నడ్డగించి యుండెను. కాని, సముద్రసదృశంబగు నౌరంగజేబుని యాశ్వికసైన్యము గుఱ్ఱములను ద్రిప్పుకొని రాజపుత్రులకెదురుగ నిలుచుండిరి. అప్పుడు రాజసింహుఁడు కొంచెము ప్రక్కగ నిలుచుండి ముందునకు బోవుటకు వారికి మార్గమును విడిచిపెట్టెను. మొగలాయాశ్వికులు "దీన్ దీన్" అని కేకలువేసికొనుచు బాదుషావారి యాజ్ఞాప్రకారము, బాదుషాయున్నరంధ్రమార్గమునఁ బ్రవేశించిరి. రాజసింహుఁడు మఱికొంత ముందునకుఁ బోయెను.

పిమ్మట రాజసింహుఁడు మాణిక్యలాలును బిలిచి, "ఈ మొగలులను జూచుటకు సంతోషమగుచున్నది. నేను నిరీక్షించుకొనియున్నదానికంటెను మంచియానుకూల్యమునే కలిగించినారు. నేను యుద్ధముచేసి మొగలాయీలను సంహరింపవలయునని తలంచియుంటిని. ఇప్పుడు యుద్ధప్రసక్తి లేకుండఁగనే యాకార్యము తుదముట్టించుట కనుకూలముగ నిందుఁ బ్రవేశించినారు. ముబారకును నాయొద్దకుఁ దీసికొనిరమ్ము. ఆతని నించుక బహూకరింపవలసి యున్నది" అనియెను.

ముబారకు మాణిక్యలాలుచే బునరుజ్జీవితుఁడై యాతనితో ను దయపురమునకు వచ్చెనని పాఠకులెఱింగియే యున్నారు. రాజసింహు

నాతని శూరత్వమును దెలిసికొని తన సైన్యమునం దొకనాయకునిగ జేర్చుకొనియెను. కాని యాతడు మొగలాయీడై యుండుటచే సంపూర్ణముగ రాజాతని నమ్మియుండలేదు. ఆకారణమున ముబారకు కొంచెము విచారించెను. అతడావిచారముతో నొకమహాకార్యమును జేసెను. అఘనకార్య మేదియో పాఠకు లెఱింగియున్నారు. స్త్రీవేషధారియైన యామొగలాయీవర్తకుడు ముబారకే.

రాజాజ్ఞను బొంది మాణిక్యలాలు ముబారకుని తీసికొని వచ్చెను. రాజసింహుడు, ముబారకును విశేషముగ బ్రశంసించి, "మొగలాయీవర్తకవేషముతో నీవు సాహసాద్భుతకార్య మొనరించి మొగలుసేనను రంధ్రమార్గమునం బ్రవేశపెట్టనిచో ననేక ప్రాణహత్యలు గావలసివచ్చును. నిన్నెవ్వరైన గుర్తించినయెడల నీకు బ్రమాదము సంభవించును" అనియెను.

ముబా—మహారాజా! అందఱు జూచుచుండగా వచ్చి గోటయందుం బాడ్పడినవానిని తిరిగి చూచినను గుర్తింపజాలరు. గుర్తించినను విభ్రాంతులై యుందురను కారణమున నేనీ సాహసకార్య మొనరించితిని.

రాజ—ఇకమీద గార్యసిద్ధి కాకపోయినయెడల నది నా లోపము నీవేమిబహుమాన మడిగిన నిచ్చెదను.

ముబా—మహారాజా! నాయమర్యాదను మన్నింపవలయును. నేను మొగలాయీనై యుండి మొగలాయీరాజ్యధ్వంసనోపాయము నొనర్చితిని. ముసల్మానునై యుండియు హిందూరాజ్యస్థాపనమునకు వలయు కార్యముల నొనరించితిని. నేను సత్యవాదినై యుండియు వంచనమును జేసితిని. నేను బాదుషావారి యన్నమును దిని మీకుపకారము జేసితిని. నేను మరణయాతనకంటెను మిగుల గష్టము ననుభవించుచున్నాడను. నాకిక బహుమానమునం దాశలేదు. నా ప్రార్థన యొక్కటి యున్నది. నన్ను ఫిరంగి యెదుటగ నిలిపి కాల్చి చంపునట్లుగ నాజ్ఞాపింపవలయును. నేనిక బ్రదికియుండుట కిష్టపడను.

రాజసింహుడు నిస్పృహుడై "నీకిందువలన నింత కష్టముగా నున్నయెడల నేమిటికీకార్యమును జేసితివి? నాకెందులకు దెలుప వైతివి? నేనిందుల కితరులను నియోగించి యుందునే. ఎవ్వరిమనస్సు నకును కష్టము గల్గజేయుట నాకిష్టముకాదు.

ముబారకు మాణిక్యలాలును జూపి "ఈమహాత్ముడు ప్రాణ దానము జేసి నన్ను బ్రదికించెను. ఈతని యాజ్ఞాప్రకారమే నేనీ కార్యమును జేసితిని. నేను లేనియెడల నీకార్యము నెఱవేఱదు. ఏమన — మొగలులు, మొగలాయీలనుతప్ప మఱి యెవ్వరిని నమ్మరు. నేనిందుల కొప్పికొనకున్నయెడల నకృతజ్ఞుడనై పాపంబునకు గుఱి యగుదును. అందువలన నీకార్యమును జేసితిని. ఇప్పుడిక బ్రాణము లతో నుండుట నాకిష్టములేదు. నన్ను గుండుతోగాల్చి చంపవలయు నని కోరుచున్నాడను. అట్లుకానియెడల నన్ను బంధించి , బాదుషా వారియొద్దకు బంపింపవలయును. నాకాజ్ఞ యిచ్చెదరేని యొకవిధ ముగ మొగలాయీసైన్యమున జేరికొని మీతో యుద్ధముజేసి ప్రాణ ములను విడిచెదను" అనియెను.

రాజసింహు డత్యంత సంతుష్టాంతరంగుడై "రేపటిదినమున మొగలుసేనయందు జేరికొనుటకు నీకాజ్ఞయిచ్చెదను. ఇక నొక్క దినము మాత్రముండుము. కాని యొకమాట యడుగవలసియున్నది. ఔరంగజేబు నిన్నెందులకు బంపించెను?" అని యడిగెను.

ముబా — అది మహారాజావారి సమక్షమున జెప్పదగినది కాదు. మాణిక్యలాలునకు జెప్పితిని.

రాజ — ఇక నొకదిన ముండుము.

ఇట్లుచెప్పి రాజసింహుడు ముబారకున కాజ్ఞయొసంగెను.

పిమ్మట మాణిక్యలాలు ముబారకు నేకాంతస్థలమునకుఁబిలిచి కొనిపోయి "అయ్యా! తాము వచ్చిపోదలచికొన్నయెడల 'మహాఋ షిని పట్టితీసికొని రావలయు'నని యెందులకుఁ గోరితిరి?" అనియెను.

ముబా—అవిశిష్టం. మాణిక్యసింహా! అవిశిష్టం. నేనిక మహాజాదిని వెంబ్లీయాడి నేమనుభవింపను? నేనామెను ప్రేమించినందులకు బదులుగా నన్నామె కాలకన్యకపనుచే జంపించినది. అందులకు ప్రతీకారముగా నామెను శిక్షింపవలయునని తలంచియున్నాను. కాని మనుష్యుడు నేదేనుకోరుకొని నటులగాక వానియందే విరక్తుడగుచుండును. నేను నేను చావవలయునని కోరుకొని యుంటిని. మహాజాది యొద్దనుండి ప్రతిఫలము పొందిననేమి? పొందకున్ననేమి? ఇప్పుడామెను జూచుట నాకిష్టము లేదు.

మాణిక్య—నేనిప్పుడామెను జంపవలయునని మీ కిష్టము లేని యెడల బాదుషానుండి నేనైన ప్రతిఫలమును తీసికొని యామెను విడిచివైచెదను.

ముబా—ఇక నొకసారి యామెను జూడవలయునని యున్నది. "ప్రపంచమున ధర్మాధర్మము లనునవి యున్నవని నమ్మెదవా? లేదా" యను నీయొక్కమాట నడుగదలచికొంటిని. ఇప్పుడు నన్ను జూచి యేమి చెప్పునో వినదలచి యున్నాను.

మాణి—మీరిప్పుడును నామెయందనురక్తులై యుంటిరా?

ముబా—నిశ్చయముగా లేను; ఒకసారిమాత్ర మామెను జూచెదను, ఇదే నా ప్రార్థనము.

---

## చతుర్థభాగము—అగ్నియందెవ్వరెవ్వరు దగ్ధమైరి?

### మొదటి ప్రకరణము

---

బాదుషాదహనారంభము

ఇంతలో బాదుషాకు జాలసంకటపాటు సంభవిల్లెను. ఆతనిసేన యంతయునురంధ్రమార్గమున ప్రవేశించిన కొలదిసేపటిలోనే సూర్యాస్తమయమయ్యెను కాని యెవ్వరును గనుమదాటి పైకిబోలేదు. అకనుమ కవ్వలి సమాచార మెవ్వరికిని దెలియదు, సాయంకాల

సైనతోడనే మహామార్గమున్న పర్వత ప్రదేశ మంతయు గాఢాంధ కారమైపోయెను. చముకు కాగడ లెవ్వియును తమతో లేనికారణ మున ముందునకుఁబోవుటకు వారికవకాశము లేకపోయెను. బాదుషా బేగములయొద్ద మాత్ర మొకదీపమును వెలిగించిరి కాని తక్కిన సేనయంతయు గాఢాంధకారములో మునిఁగియుండెను. అదియునుగాక యీయడవి మార్గమంతయు మిట్టపల్లములతో నిండియుండెను. కఱకు రాళ్ళుమొనలు గలిగియుండెను. గుఱ్ఱములు కాళ్లు తడబడ ముందునకు మ్రొగ్గుచుండెను. ఎన్నియోగుఱ్ఱము లారోహకులతో గూడబడిపోవుచుండుటచే ననేకులు వానికాళ్ళక్రింద బడితుత్తునియలై పోవుచుండిరి. పెద్దపెద్దకాళ్ళుతగిలి యేనుగులకాళ్ళు బ్రద్దలువాఱుచుండెను. అవి మావటీలకు లొంగక తమయిష్టము వచ్చినట్లు పోవుచుండెను. అశ్వములపైనున్న స్త్రీలు క్రిందఁబడి యార్తనాదమును జేయనారంభించిరి. పల్లకిబోయిలకాళ్ళు కఱకు రాళ్ళచే గాయపడి రక్తపరిప్లుతములగుచుండెను. పదాతిసైనికు లింక ముందునకుఁబోఁజాలరైరి. వారురాళ్ళపైఁ గాళ్ళుజారియు, దెబ్బలు తగిలియుఁ బాధపడఁజొచ్చిరి. ఇది యంతయునుజూచి యౌరంగజేబు శిబిర మక్కడనే స్థాపింప నాజ్ఞాపించెను.

కాని, యచ్చటశిబిరము నెలకొల్పుటకుఁ దగినస్థలము లేదు. బాదుషావారికిని, బేగములకును మాత్రము చోటుచేయుటకే చాలఁ గష్టమయ్యెను. మఱెవ్వరికిని స్థలము దొరకలేదు. ఎక్కడనున్న వారక్కడనే నిలిచిపోయిరి. అశ్వికులశ్వములమీఁదనే—గజారోహకులు గజములమీఁదనే—కాల్బలసైనికులు కాళ్ళమీఁదనే—భారముంచి నిలిచియుండిరి. కొందఱుకష్టపడి పర్వతసానుప్రదేశముల యందు కొంచెము స్థలము వెదకికొని కాళ్ళుచాఁచి కూర్చుండిరి.

[illegible]మునకుఁ దోడాహారపదార్థములు కూడ లేకుండఁ బోయెను. తమతోఁగూడఁ దెచ్చికొనిన సామగ్రియంతయు రాజపుత్త్రులు దోఁచికొనిపోయిరి. ఆసేన శిబిరమును జుట్టికొనియున్న యాకసమయందెట్టి పదార్థమును దొరకదు; గుఱ్ఱములకు గడ్డికూడ దొరకదగిన స్థలము కాదు. పగలెల్ల శ్రమపడిన సైనికుల కాహారము లేకుండఁ బోయెను. బాదుషాకేమి, భోగములకేమి, యెవ్వనికిని నిద్ర పట్టలేదు. అందఱు నాఁకలిచే బాధపడుచు మృతప్రాయులై యుండిరి. మొగలుసేనయందు [illegible] గందరగోళములు పుట్టెను.

ఇంతలోఁ బాదుషాకు, ఉదయపురపు జేబున్నిసాను రాజపుత్త్రులపహరించికొని పోయినవార్త తెలియవచ్చెను. అతఁడు కాలాగ్ని సన్నిభంబగు క్రోధమున మండిపడఁజొచ్చెను. ఒక్కఁడే సేనలనెల్ల హతమార్చుట సాధ్యము. సాధ్యమయ్యెనేని ఔరంగజేబొక్కఁడే శత్రుసేనలఁ బరిమార్చియుండును. ఇఱుకున గట్టువడియున్న సింహము, పంజరాబద్ధమైన యాఁడు సింగమును జూచి యెట్లు గర్జనము సేయునో, యట్లే యౌరంగజేబు గర్జింపనారంభించెను.

గంభీరనిశాసమయమున సేనాసమూహమునందలి కోలాహల మించుక తగ్గెను. అతిదూరమునందున్న పర్వతములపై లెక్కలేని వృక్షములు విఱిగిపడుచున్న చప్పుడు వినబడియెను. ఏమియును దెలియక, యందఱు నది భూతపిశాచాదుల సందడియని భావించి యూరకుండిరి.

---

## రెండవ ప్రకరణము.

---

[illegible]మునఁబడిన [illegible] మంటలు చుట్టుకొనుట.

మఱునాఁటియుదయమున నా సైన్యము నడచుటకు బాదుషా హారియుత్తరువయ్యెను. ఆయుద్ధ[illegible]ము—ఫిరంగులు, చేరి చతురంగబలమయ్యెను—అతి వేగముగ [illegible] [illegible]కై

వెడలెను. క్షుత్పిపాసలచే నందఱును బీడింపఁబడుచుండుటచే, సీకనుమ విడిచి బయలుఁబడినకొండల జలాహారములు దొరకునను ధైర్యముతో బయలు దేఱి. ఔరంగజేబు, ఉదయపురిని, జేబఉన్నీసాను వి డిపించికొని ఉదయపుర మశేషము భస్మరాశిగాఁ జేయఁదలంచి తన క్రోధాగ్నిచేఁ దానే దగ్ధుఁడగుచుండెను. ఆతని కించుకయైన నోర్పు లేకపోయెను. అతి వేగముగ మొగలుసేన రంధ్రముఖమార్గమునకు వచ్చినిలిచెను. అక్కడకు వచ్చిచూచునరికి మొగలాయీలగర్వ మడుగంటిపోయెను. రాత్రి యంతయును రాజపుత్రులు అసంఖ్యాక ములగు మహావృక్షములను గొట్టితెచ్చి పర్వతశిఖరమునుండి యా రంధ్రముఖమున కడ్డముగఁ బాఱవైచిరి. పర్వతాకారముగనున్న యావృక్షసమూహము రంధ్రముఖమునం దొత్తుగఁబడి మార్గమును మూసివైచెను. పశువు, గుఱ్ఱము, బంటుమొదలగువాని మాట యటుండ కుక్క దూరిపోవుటకుఁగూడ మార్గము లేదు.

సేనలో భయంకరార్తనాదములు బయలు వెడలెను. స్త్రీల రోదనధ్వనులను విని యౌరంగజేబుపాషాణహృదయము కూడఁ గంపించెను.

మార్గమును బరిష్కారముసేయుసేన ముందుండవలయును. కాని, మొగలాయీల యీమహత్తరసేనాసమూహము వెనుక ముందై రంధ్రమార్గమున బయలువెడలుటచే మార్గపరిష్కార సైన్యము వెనుకఁబడిపోయెను.

ఆసైన్యము ముందు చేరుటకు బాదుషావా రాజ్ఞాపించిరి. కాని, వారు వచ్చి త్రోవచేయునంతకు వేచియున్నయెడల సైనిక లందఱును నాదినమంతయు నుపవాసము చేయవలయును. ఆకారణ మున, ఔరంగజేబు, పదాతిసైన్యమువారును, నితరులును వృక్ష భారము నెక్కి యడ్డుగానున్న చెట్లను బార్శ్వమునకు లాగి

పాఱవేయవలయు నని యాజ్ఞాపించెను. వారికి సాహాయ్యముగా సేనఁ బంపించెను. వేనవేల కాల్బలమును, వందల కొలఁది యేనుఁగులును జేరి దుర్గప్రాకారమును తెఱపిచేయుట కారంభించెను. ఆప్రాకారమును విచ్ఛిన్నముచేయుటకుఁ గడంగిన తోడనే పెద్దపెద్దరాతిబండ లుభయపార్శ్వములనుండియుఁ బడనారంభించెను. ఆశిలావృష్టిచే ననేకులకు కాలుసేతులు విఱిగెను. చాలమందికి తల పగిలి ముక్కలు ముక్కలై పోయెను. ఇంక ననేకులకు శరీరమంతయు నలఁగి మంటిముద్దలై పోయెను. తలయును, గాళ్లును, దంతములును, నెమ్ముకలును వికలములగుటచే నేనుఁగులు వికటముగ ఘీంకారము సేయుచు పదాతిసైన్యమును గాళ్లతోఁ ద్రొక్కి పాఱిపోయెను. ఔరంగజేబు సైన్యమంతయుఁ గలఁగఁద్రొక్కుకొని నశింపనారంభించెను. ఎల్లరును గళవళపడి మీఁదికిఁ జూడఁగా బర్వతశిఖరముపై రాజపుత్రపదాతిసైన్యము బారుతీరి నిలిచియుండెను. శిలావృష్టిచేఁ జావక బ్రదికినవారలు రాజపుత్రుల ఫిరంగిగుండ్ల కాహారమై పోయిరి. ఔరంగజేబుని సేన కావృతప్రాకారసమీపమున క్షణమైన నిలుచుట కవకాశము లేకపోయెను.

ఔరంగజేబీవార్తవిని తనసేనానాయకులఁ బిలిచి చీవాట్లు పెట్టుచు, మరలవృతప్రాకారమును విఘటితముసేయుటకుఁ బ్రయత్నింపుఁడని యాజ్ఞాపించెను. అప్పుడు "దీన్ దీన్" అని కేకలు వేయుచు మొగలాయీలు మరల బయలుదేరిరి. మరలరాజపుత్రులు, కురిపించిన శిలావృష్టిచేతను, గోళవర్షముచేతను, నిలువున నెదిగియున్న తాటికగడలు చండమారుతమునకుఁ గూలినయట్లు, నేలం గూలఁబడిరి. ఇట్లెన్ని సారులు ప్రయత్నించినను మొగలాయిలు, కోటవలెఁ బడియున్న చెట్లగుంపును తీసివేయ లేకపోయిరి.

అప్పుడౌరంగజేబు హతాశుఁడై, ఆమహాసేన రంధ్రముఖము నుండి వెనుదిరిగివచ్చుట కుత్తరువుచేసెను. సేన నిలిచియున్న పాళెము నకే వెనుకకుఁ దిరుగవలయును. సమస్తసేనయు క్షుత్పిపాసాదులచేఁ బీడితమైయుండెను. ఔరంగజేబుకూడఁ బుట్టినన్నాళ్ళకు సేను వజా కష్టములచే మిగుల క్రాంతుండయ్యెను. బేగములందఱుగూడ నక్లేశమూనపడియుండిరి. కాని, యుపాయాంతరము లేదు. పర్వత పార్శ్వములనుండి పోవుదమన్న నవి మిగుల నేటవాలుగను నపాయకరములుగ నుండెను. ఇక జేయునదిలేక వెనుకకే తిరుగవలసివచ్చెను.

సేన వెనుకకుఁ దిరిగి మును పేదిక్కునుండి లోనికి బ్రవేశించెనో యాదిక్కునకు వచ్చి నిలిచెను. అప్పటి కపరాహ్ణమయ్యెను. వచ్చిచూచునరి కాదిక్కునందును నొకేముద్ద క్రింద సైన్యమంతను మ్రింగుచున్న మృత్యుదేవత కాచికొనియుండెను. రంధ్రమున కాదిక్కునను వృక్షము లెత్తుగబడి మార్గము నడ్డగించివైచెను. బయటికి బోవుటకు మార్గములేదు. పర్వతముమీదివైపున మునుపటివలెనే రాజపుత్రులు శ్రేణీబద్ధులై నిలిచియుండిరి.

అకనుమనుండి యీవల బడనియెడల సైన్యమంతయును మృత్యుముఖమున బడిపోవలయును. ఆకారణమున నౌరంగజేబు సేనానాయకుల నందఱిని బిలిచి "ప్రాణములపై నాశయుంచక మార్గమును జేయుటకు బ్రయత్నింపుడు" అని నయమునను భయమునఁగూడ జెప్పెను. సైన్యాధిపతు లందఱును సైన్యములను దీసికొని మరల వృక్షప్రాకారముల నాక్రమించిరి. ఈసారికొంచె మనుకూలముగనుండెను. మార్గపరిష్కారకు లాదిక్కునందే యుండిరి. మొగలులు చావునకు దృఢప్రాయముగ నెంచి చెట్లనెత్తిపాఱవైచుటకు బ్రారంభించిరి. కాని, క్షణకాలము మాత్రమే యత్నగావించిరి. ఆ యుత్తరక్షణముననే పర్వతశిఖరమునుండి పడినలోహాగోళవర్షముచే

తను, పాషాణవృష్టిచేతను, ఘోరప్రభంజనాగమనముచే ధాన్యక్షేత్రము లెట్లు మునిగిపోవునో యట్లు సేనయంతయును మునిగిపోయెను.

విపత్తుపై విపత్తు సంభవించును. సమీపపర్వతసాను ప్రదేశమున రాజసింహుని శిబిరముండెను. అతడు దూరమునుండి మొగలు సేన వెనుదిరిగి వచ్చుట గాంచి ఫిరంగులను మ్రోయించెను.

రాజసింహుని ఫిరంగిగుండ్లు బయలుదేరెను. వృక్షప్రాకారము నకు గుఱిచేసి విడిచిన గుండ్లచే, ఏనుగులు, గుఱ్ఱములు, పదాతి సైన్యము సేనాపతి సమూహము సమస్తమును భస్మీభూత మయ్యెను. మొగలుసేన రంధ్రమునుండి వెనుకకుజరగి, క్రూరసర్ప మగ్నిభయ ముచే నెట్లు కుండలాకారముగ జుట్టికొని బలముగ నణగునో యట్లు మాటుగ నిలుచుండెను. ప్రపంచమునకు బాదుషాయైయున్న ఔరంగ జేబు వజ్రఖచితమైన శ్వేతోష్ణీషమును తలనుండితీసి దూరముగ బాఱవైచి, మోకాళ్ళనేలపై నాని కంకరమట్టిని దీసికొని తలపై జల్లుకొనియెను. ఢిల్లీ బాదుషా, వనచారులైన రాజపుత్రులయెదుట బోనులోజిక్కినయెలుక యయ్యెను.

అప్పుడు భారతేశ్వరుడైన యౌరంగజేబు "ఒక్కరాజపుత్రి బాలిక నన్నుద్ధరింపగలదు" అని మనమునం దాలోచించుకొని యామె యిచ్చియున్న పావురమును పైకి విడిచిపెట్టెను.

---

## మూఁడవ ప్రకరణము

---

### ఉదయపురి దహనారంభము

నిర్మలకుమారి ఉదయపురిబేగమును, జేబఉన్నీసాబేగమును, సుచితస్థలమునునుంచి మహారాజ్ఞీమణియగు చంచలకుమారియొద్దకు బోయి ప్రణామములను జేసి జరిగినసమాచారము సవిస్తరముగ

తెలియఁజేసెను. వృత్తాంత మంతయు విని చంచలకుమారి ముందుగా నుదయపురిని బిలిపించెను. ఉదయపురి రాఁగానే ప్రత్యేకముగాఁ నాసనముఁ జేసి యామెను సన్మానించుటకై చంచలకుమారి లేచి నిలుచుండెను. ఉదయపురి విష్ణ్ణచిత్తయై వినీతభావముతో జంచల కుమారి సౌజన్యమును జూచి, అల్పురాలగు నీహిందూబాలిక భయ పడి తనకీవినయమును జూపించుచున్నదని యోచించుకొనియెను. అనంతర మామ్లేచ్ఛాంగన "నీవు మొగలాయీల చేతులలో మరణ మును గోరుచుంటి వేమి?" అని యడిగెను.

చంచలకుమారి కొంచెమునవ్వి "మేము వారివలన మరణ మునుగోరుట లేదు. వారస్త్రీయాశతో వచ్చుట చాలతప్పు. ఏమన— మేముహిందువులము. యవనులవలన దానమును గ్రహించువారము కాము" అనియెను.

ఉదయపురికోపించుకొని "ఉదయపురమువారు గర్వభాయిష్ఠు లగు వనచారులు. వారు తరతరములనుండియు ముసల్మానులచే నీదానమును గ్రహించుచున్నారు. సుల్తాన్ అల్లాయుద్దీన్ నాట నుండియు. మొగలాయిబాదుషాయైన యక్బరుచేతను, ఆతని పౌత్రుని చేతను రాణారాజసింహునిపూర్వు లీదానమును బొందియు న్నారు" అనియెను.

చంచ—బేగంసాహేబా! మీరు మఱచిపోయినట్లు తోచు చున్నది. మేమట్టిదానిని దానముగా గ్రహింపము. ఋణముగా గ్రహింతుము. అక్బరుబాదుషావారిఋణమును రాణాప్రతాపసింహు డు స్వయముగా దీర్చియున్నాడు. మీమామగారి ఋణమును మేము తీర్చుటకుద్దేశించుకొన్నాము. ఆఋణము మొదటివాయిదా సొమ్మును చెల్లించుటకే యిప్పుడు మిమ్ము బిలిపించితిమి. నాకు తములపాకుమడు పులను సిద్ధముచేసి యీయవలయును. దయచేసి తంబాకును సిద్ధము చేసి తీరవలయును.

చంచలకుమారి ప్రథమమున జూపించిన వినయమును సరిగా తెలిసికొని యుండలేక దాస్యముగా నడచుకొన్నయెడల బేగమునకీయవమానము తటస్థింపకపోవునేమో యని యోచించుచున్నది. అట్లు చేయక యామె పరుషవాక్యములచే తేజోమూర్తియైన చంచలకుమారి గర్వము నుద్రేకింపజేసెను. అవశ్యముగ నందులకుదగిన ఫలమనుభవించి తీరవలయును. తంబాకుమాటమీద తంబాకు బాగుచేసి సిద్ధము చేయుటకు రావలయు నని చంచలకుమారి వ్రాసియున్న యుత్తరము జ్ఞప్తికివచ్చెను. ఆమె తన పరిపాటిగనున్న గర్వమును తిరుగ మనస్సునకు దెచ్చికొని "బాదుషావారి బేగము తంబాకును బాగుచేయదు" అనియెను.

చంచ—నీవు బాదుషావారి బేగమవైనప్పుడు తంబాకును బాగుచేయవు. ఇప్పుడు నీవు నా దాసీవైయున్నదానవు. బాగుచేసి తీరవలయును. అది నా యాజ్ఞ.

ఉదయపురి యేడ్వదొడగెను. దుఃఖముచేతకాదు. కోపముచే నేడ్వదొడగెను. "అలంగీరు బాదుషావారి బేగము తంబాకును బాగు చేయవలయునని చెప్పునంతటిస్పర్ధ నీకెందులకు?" అనియడిగెను.

చంచ—అలంగీరు బాదుషావారు స్వయముగ మహారాణా వారికి తంబాకు నందించుటకు జేపిక్కడకు వచ్చెదరను ధైర్యమున్నది. ఆతనికాపని చేతగానియెడల నీవాతనికి నేర్పవలసియుండును. అందులకై నీవాపనిని నేర్చుకొని యుండవలయును.

ఇట్లు చెప్పి చంచలకుమారి పరిచారికతో "నీవీమెచే తంబాకును సిద్ధముచేయించి తీసికొని రావలయును" అనియెను.

ఉదయపురి లేవలేదు.

అప్పుడు పరిచారికయొకతె "హుక్కా చిలుము తీసికొనుము" అనియెను.

అంచలకును నుదయపురి లేవలేదు. పరిచారిక చేయిపట్టుకొని లేవదీయుటకై వచ్చెను. అవమానభయమున గుండెలుకొట్టుకొను చుండ ప్రపంచమునకు బ్రభువైనవాని ప్రియమహిషి చిలుము తీసికొనివచ్చుటకై పోయెను. ఆమె యొకటిరెండడుగులు నడచు లోపల శరీరము వశముకాక నేలపై బడిపోయెను. పరిచారిక పట్టుకొనియెను గాని, ఆగలేదు. ఉదయపురి నేలమీదబడి మూర్ఛపోయెను.

అప్పుడు చంచలకుమారి యాజ్ఞాప్రకారము పరిచారికయొకతె మణిమయఖచితమగు నొక మంచముపై బానుపువైచి యుదయపురి నాను బరుండబెట్టెను. అక్కడ నామె కంతఃపురకాంతలు సరియైన యుపచారములను గావించిరి. కొలదిసేపటిలోనే యామెకు జైతన్యము కలిగెను. చంచలకుమారి, మఱియెవ్వరును బేగమున కవమానము చేయగూడదని యాజ్ఞాపించుటయేకాక, ఆహారము, శయనము, మొదలగు నుపచారములయందు, తనకంటెను హెచ్చుగ నుదయపురి బేగమును జూచుచుండవలయు నని నిర్మలకుమారిని నియమించెను.

నిర్మ—అదియంతయు జరపుచున్నాను. కాని, యందువలన నామె సంతుష్టయగుటలేదు.

చంచ—ఏమి? ఇంకేమి యడుగుచున్నది?

నిర్మ—ఆమె యడుగునది యీకోటలో లేదు.

చంచ—సారాయమునే? దాని నడిగినప్పుడు కొంచెము గోమయమునిమ్ము.

ఉదయపురి, ఉపచారములచే సంతుష్టయయ్యెను. కాని, రాత్రి వచ్చినప్పుడామె నిర్మలను బిలిచి వినయముతో "ఇమ్లీబేగం! కొంచెము సారాయమును తీసికొనివచ్చెదవా?" అని యడిగెను.

నిర్మల తీసికొనివచ్చెద నని చెప్పి రాజవైద్యుని బిలిపించెను. రాజవైద్యు డొక బిందువౌషధమును వేసి షర్బతుచేసి మద్యమని

చెప్పి యున్నారము. నిర్మల యప్పటియున్నను. ఉదయపురి యాని ప్రాంత సంక్రమించి స్త్రీయుతో కొలదిసేపటిలోనె మత్తుతలకెక్కి నిద్రాభి భూతయయ్యెను

---

## నాల్గవ ప్రకరణము

జేబఉన్నీసా పరాభవము

జేబఉన్నీసా యొక్క తోట కూర్చుండియుండెను. ఒకరిద్దఱు పరిచారిక లామెయొద్ద దిరుగుచుండిరి. నిర్మలకుమారియు నప్పుడప్పుడు వచ్చి యామె యోగక్షేమముల నారయుచుండెను. క్రమముగా నుదయపురి యవస్థనుగూర్చి విని తనకుగూడ నట్టి యమర్యాద జరగునో కదా యని విచారింప నారంభించెను.

తుదకు నిర్మల యామెను జంచలకుమారియొద్దకు బిలుచుకొని పోయెను. ఆమె యథోచితముగ వచ్చి నిలిచి మనసునందు "నేను అలంగీరుబాదుషాకుమార్తె నని మఱచిపోను" అనుకొనియెను.

చంచలకుమారి విశేషాదరముతో నామె నొకపీఠమునందు గూర్చుండ జేసెను. ఆమె కూరుచుండినపిమ్మట ననేకవిషయముల గూర్చి మాటలాడెను. జేబఉన్నీసాయును వినయభావముతో బ్రత్యుత్తరమునిచ్చెను. పరస్పరమును విరోధభావము లుదయించుమాట లొక్కరును మాటలాడలేదు. తుదకు జంచలకుమారి యామెకు సరిగా బరిచర్య చేయుట కాజ్ఞయిచ్చి, అత్తరువు తాంబూలమునిచ్చి సన్మానించెను.

కాని, జేబఉన్నీసా వెడలిపోవునప్పుడు "మహారాజ్ఞీ నన్నిక్కడ కెందులకు బిలిపించితిరి? ఆవిషయ మేమియును చెప్పరైతిరి" అనియెను.

చం చ — ఆవిషయమైన మీతో జెప్పలేను. చెప్పకపోయినను బాధకములేదు. ఒక జ్యోతిష్కుడు చెప్పినప్రకారము మిమ్మువెలిపించితిని. మీరు నేడొంటరిగ బరుండవలయును. గదితలుపులను దీసియుంచవలయును. పారావాండ్రు పారానిచ్చుచుందురు. మీకేమియును కీడుకలుగబోదు ఈరాత్రి మీకొకకల వచ్చునని దైవజ్ఞుడు చెప్పియున్నాడు. అట్టి కలగన్నయెడల రేపటియుదయముననే దానిని నాకుం జెప్పవలయునని నాప్రార్థనము.

జేబఉన్నీసా ఆలోచనాధీనమానసయై చంచలకుమారియొద్దనుండి యాజ్ఞను దీసికొనియెను. నిర్మలకుమారి, జేబఉన్నీసా ఢిల్లీయందు రంగమహలులో నెట్లుండెడిదో యట్లే, యామెయాహారాదులను శయనాదికమును జరగుట కేర్పాటు గావించెను. ఆమెపరుండెను గాని నిద్రరాలేదు. చంచలకుమారి యాజ్ఞాప్రకారము ద్వారము తెఱచియుంచియే శయనించెను. ఒక్కతెయే పరుండియుండెను. ఏమన ఆజ్ఞకు వ్యతిరేకముగ నడచినయెడల నుదయపురివలెనే తనకును మృత్యుశంకలుగుననుభయ మామెకుం గలదు. అదియునుగాక తలుపులు దీసికొని పరున్నయెడల, నెవ్వరైనవచ్చి తనపైబడి దుర్మార్గము చేయుదురను తలంపున నిట్టియేర్పాటుగావించియుండవచ్చునని యనుకొనియెను. ఆకారణమున నిద్రబోకుండ మెలకువగా నుండవలయునని యామె సంకల్పించుకొనియెను.

కాని, పగలెల్లన నేకకష్టములకు లోనైయుండుటచే నామెకు మాటిమాటికిని కన్నులకు నిద్దురమబ్బు క్రమ్ముచుండెను కాని ప్రతిన మూలమున మెలకువదెచ్చికొనుచుండెను. జేబఉన్నీసా యిట్లే యప్పుడప్పుడు నిద్రాలసతకు లోనగుచుండెను. కాని, మధ్యమధ్యమున నులికిపడుచుండెను. నిద్రాభంగమైనతోడనే తనయవస్థ జ్ఞప్తికి వచ్చుచునేయుండెను. "ఢిల్లీమహాజాదియైన యామెయెక్కడ? ఉదయపురబాని

సమైన యామెయెక్కడ? మొగలు బాదుషాగారి భూమికి ప్రధానాధి నేత్రియై, మొగలు బాదుషావారి యాకాశమునకు సంపూర్ణచంద్ర బింబస్వరూపయై, మొగలుసింహాసనమునకు నిరంతరోజ్వలరత్నమై, కాబూలునుండి, విజాపురము, గోలకొండవరకు గలదేశములెల్ల నవ్వనిబాహువులచే శాసింపబడుచున్నవో, అట్టి రాజాధి రాజునకు భుజబలస్వరూపయై, ఇచ్ఛామాత్రముచేతనే రాజుల జనన మరణములకు కారణభూతయై యున్నయామెయెక్కడ? ఇప్పుడు గిరిగుహలతో గూడికొనియున్న యుదయపురకోటరమున, మూషికమువలె బంజరాబద్ధయై, అల్పజీవియైన రూపనగరబాలికకు బానిసయై, హిందూగృహమున నంటరానిస్త్రీయై, హిందూపరిచారికల చరణముల నపవిత్రముసేయుచున్న కీటకస్వరూపయై, అవమానితయైయున్న యామెయెక్కడ? ఇంతకంటెను మరణము మంచిదికాదా? మంచిది కాకేమి? ఏమరణము, నాకు ప్రాణాధికుడును ప్రియుడునగు ముబారకునకు విధించిన దానన్నైతినో, ఆమరణము మంచిదా? చెడ్డదా? ముబారకునకు విధించిన దమూల్యమైనది. ఆతడట్టిమరణమును బొందదగినవాడేనా? హా! ముబారకా! ముబారకా! అయమోఘమైన నీవీరత్వము సామాన్యమై విషసర్పమును జయింపలేకపోయెనే? అయనింద నీయమైన నీమనోహరమూర్తి పామువిషముచే మాసిపోయినది. ఇప్పుడీయుదయపురమునందున్న యీకాలభుజంగినిని గఱచుట కట్టి సర్పముదొరకదా? మనుష్యస్వరూపముతోనున్న యీకాలభుజంగిని, సర్పాకారముతోనున్న యాకాలభుజంగి దంశనముచే గడతేరదా? హా ముబారకా! నీవొకసారి సశరీరివై వచ్చి దర్శనమిమ్ము. కాలభుజంగమవై నన్ను గఱచి, నేను వచ్చెదనో లేదోచూడుము!"

ఈవిధముగా జేబఉన్నీసా తలంచుచు, ముబారకునుమరల జూడవలయునని కన్నులువిప్పుకొని పరుండియుండెను. చూచుచుండ

గనే సమ్ముఖమున నరేంద్రుడగు ముబారకు గానవచ్చెను. ఆతనిజూచి సతోడనే ఛీత్కారముసేయుచు గన్నులు మూసికొని యజ్ఞాన యయ్యెను.

---

## ఐదవ ప్రకరణము.

కన్య సంబంధనములు వేయఁబడియెను—జ్వాలలు హెచ్చయ్యెను.

మఱునాడు జేబఉన్నీసా పాన్పునువదలి లేచునప్పటి కామె రూప మానవాలుపట్టుటకువలనుకాకుండెను. నలగివివర్ణమై మేఘచ్ఛాయచే గప్పబడినదానివలె నుండెను. నేడెంతటిమార్పునుజెందియున్నదో తెలిసికొనవచ్చును. రేయుంబవళు లెడతెగకుండమనుష్యు డగ్గిసెగయొద్ద గూర్చుండియున్నయెడల నెట్లుండునో, చితారోహణము చేసి జ్వాలలచే ముట్టుకొనబడక, యుష్ణముచేతను, పొగచేతను గొంతవఱకాక్రమింపఁబడి క్రిందికిఁ బడినవాఁడెట్లుండునో, యట్లే, జేబఉన్నీసా కనఁబడుచుండెను. ఆమె ప్రతినిమిషమునందును మండి భస్మమై పోవుచుండెను.

వేషభూషణములు లేకుండనుండలేదు. జేబఉన్నీసా తనకిష్టము లేకపోయినను వస్త్రాదులను ధరించుకొని, ఆజ్ఞోల్లంఘనముగాకుండ స్వల్పముగ ఫలాహారమునుగూడ జేసెను. పిమ్మటనుదయపురినిజూచుటకై పోయెను. చూడఁగా నుదయపురి యొక్క తెయే కూర్చుండియుండెను. ఆమె తనయెదుట కుమారిమైనమేరీ చిత్రమును, ఏసు క్రీస్తుయొక్క క్రాసును (Cross) పెట్టికొనియుండెను. చాలకాలము నుండీ యుదయపురి, ఏసుక్రీస్తును, ఆతనితల్లినిగూడ మరచియుండెను నేఁడు కష్టకాలమున వారుజ్ఞప్తికివచ్చిరి. క్రైస్తవచిహ్నములుగాని

నీరెంతు నామె తానుపోవు చోటి కెల్లఁ దీసికొని పోవుచుండెను. ఒకనా డువస్థదినమున ప్రాతర్గానమును బైకిలేపినట్లుగ, నేఁడా క్రాసును మేరీ పటమునుదీసి తనమెడమీఁదఁ బెట్టుకొనియెను. జేబఉన్నీసా వచ్చి నమస్కరించి ఉదయపురికన్నులనుండి యశ్రుధారలు ప్రవహించుచుం డెను. బిందువుపై బిందువు—బిందువుపై బిందువు గండస్థలములపై బడిజారిపోవుచుండెను. జేబఉన్నీసా, ఉదయపురియంతటి సౌందర్య మును గలిగియుండుట నెన్నఁడును జూచియుండలేదు. ఆమెస్వభావ తఃపరమసుందరియైయుండెను. కాని, గర్వముచేతను, భోగవిలాసము లచేతను, ఈర్ష్యాపరితాపముచేతను, ఎల్లప్పుడు నాయసమానసౌంద ర్యము వికృతమగుచుండెను. నేఁడశ్రుప్రవాహముచే నావికృతితొలఁగి పోయి, యత్యపూర్వమైన యారూపరాశి సంపూర్ణవికాసమును బొందియుండెను.

ఉదయపురి జేబఉన్నీసాను జూచి తనదుఃఖసమాచారమును చెప్పఁదొడఁగెను.

“నేను బానిసనై యుంటిని. బానిసనై విక్రయింపఁబడితిని. బానిస గానే యెందులకుండనైతిని? నామొగమున కీయైశ్వర్య మెందులకు!—”

ఇట్లు చెప్పి ముఖమునెత్తి జేబఉన్నీసానుజూచి “నీయవస్థయు నెందుల కిట్లయినది? ఈ కాఫరయువతి నీ కేమియనిష్టములు చేసినది?” అనియడిగెను.

జేబఉన్నీసా దీర్ఘనిశ్శ్వాసమును విడిచి “కాఫరులకు సాధ్యమా! దేవుఁ డిట్లు చేసినాఁడు” అనియెను.

ఉద—అంతయు నాతఁడు చేసినదే. ఏమిజరిగినదో చెప్ప రాదా!

జేబ—అంతయు నిప్పుడే చెప్పఁజాలను. మృత్యుకాలము నందుఁ జెప్పిపోయెదను.

ఉద—ఎట్లయిననుగానిమ్ము. భగవంతుఁడు, రాజపుత్త్రిల నీ దుష్కార్యముకొఱకు దండింపకపోఁడు.

జేబ—ఇందు రాజపుత్త్రిలదోష మేమియును లేదు.

ఇట్లు చెప్పి జేబఉన్నీసా యూరకుండెను. ఉదయపురిగూడ నేమియు మాటాడలేదు. పిదప, జేబఉన్నీసా "చంచలకుమారిని జూడఁ బోయెదను" అనియెను.

ఉద—నిన్ను రమ్మని వర్తమాన మంపినదా?

జేబ—లేదు.

ఉద—అట్లయినయెడల నీయంతట నీవే పోవుట యెందులకు? నీవు బాదుషా తనయవుగదా!

జేబ—ఒక కార్యార్థమై పోయి చూడవలసియున్నది.

ఉద—చూడుము. ఎన్నియపరాధముల నిచ్చిన మనల నీబోయలు విడిచిపుత్తురో కనుఁగొనిరమ్ము.

తెలిసికొనియెద నని చెప్పి జేబఉన్నీసా వెడలిపోయి చంచలకుమారియనుజ్ఞ నంది యామెను జూచెను. చంచలకుమారియు వెనుకటివలెనే మర్యాదఁజేసి, యుచితరీతి నామె క్షేమలాభములఁ దెలిసికొని "బాగుగ నిద్రపట్టినదా?" అని యడిగెను.

జేబ—లేదు. మీ యాజ్ఞాప్రకారము నడచుకొనవలయు నని ప్రయత్నించుటచే నిద్రపట్టలేదు.

చంచల—అట్లయినచో స్వప్నమేమియును రాలేదా?

జేబ—రాలేదు. కాని, ప్రత్యక్షముగ నొకించుక చూచితిని.

చంచ—మంచిదా? చెడ్డదా?

జేబ—మంచిదో చెడ్డదో చెప్పఁజాలను—మంచిదిమాత్రము కాదు. కాని, యావిషయమున నాదొక మనవి యున్నది.

చంచ—చెప్పవచ్చును.

జేబ—నేను మరల దానిని చూడఁగలనా?

చంచ—ఇప్పుడు నకేమియుఁగాని చెప్పఁజాలను. ఐదాఱుదినము లైన పిమ్మట జ్యోతిష్కునియొద్దకు మనుష్యు నంపించి కనుఁగొని యెదను.

జేబ—నేఁడంపఁగూడదా?

చంచ—షహజాదీ! అంతతొందర యేమిటికి?

జేబ—తొందరయా? ఈముహూర్తమునందు నాకు దానిని చూపినయెడల నేను నీదాసినై యుండుట కొప్పుకొనియెదను.

చంచ—షహజాదీ! నివాశ్చర్యకరముగ మాటాడుచున్నావు! అది, చూపించుటకు వస్తువా?

జేబఉన్నీసా ప్రత్యుత్తర మీయలేదు. ఆమెకన్నులనుండి బాష్పజలము ప్రవహింప నారంభించెను. చంచలకుమారి యామెను జూచి దయయగపడుపక "నీవైదాఱుదినములు నిరీక్షించుకొనియున్న యెడల, నాలోచించి చెప్పెదను" అనియెను.

అప్పుడు జేబఉన్నీసా, హిందువులు, ముసల్మానులు, అను భేదమును మఱచిపోయెను. తాను పోకావిస్థలమునకు బోయెను. చంచలకుమారి కూర్చుండియున్న పాన్పుమీఁదికిబోయి నిలుచుండెను. అనంతర మాకస్మికముగఁ ద్రుంపబడిన లతవలె జంచలకుమారి పదములపై వ్రాలి, పద్మములపై బద్మమును దలక్రిందుగా నుంచి నట్లుగ దన ముఖమునందు జేర్చి, యశ్రుప్రవాహముచే దడుపుచు "నాప్రాణరక్షణము గావింపుము. లేకున్న నిప్పుడే మరణించెదను" అనియెను.

చంచలకుమారి యామెను లేవనెత్తి కూర్చుండబెట్టెను. చంచలయు, హిందువు, ముసల్మాను, అను భేదమును బాటింపలేదు. ఆమె "షహజాదీ! నీవు నిన్నరాత్రి యెట్లుపలుకుంటివో యట్లే నేడును జేయుము. నిశ్చయముగ నీకోరిక సిద్ధించును"అని చెప్పి జేబఉన్నీసా కనుజ్ఞయిచ్చి పంపివైచెను.

ఇంతలో నుదయపురియు జేబడున్నీసాకై యెదురుచూచు చుండెను. కాని యామె రాలేదు. అందులకు నిరాశఁజెంది, తానే పోయి చంచలకుమారిని జూచుట కాజ్ఞ వేడికొనియెను.

ఆమె యనుజ్ఞఁబొంది లోపలఁబ్రవేశించి "ఎన్నియుపరక్షల నిచ్చిన నన్ను మీరు విడుదల జేయుదురు?" అని యడిగెను.

చంచ—బాదుషా, భారతవర్షమునందున్న యన్ని మసీదులను, ముఖ్యముగా జుమ్మామసీదును, బ్రద్దలుకొట్టి పాఱవైచి, మయూరసింహాసనము నిచ్చుటకేఁ దెచ్చియిచ్చి. ప్రతివత్సరమును తప్పక మాకుఁ గప్పమిచ్చుట కొప్పికొన్నయెడల నిన్ను విడుదల చేయుదును.

ఉదయపురి కోపముతో ధీరయై "పసులగాచికొనువారల కింతటి స్పర్థ యుండు టాశ్చర్యముగా నున్నది" అనియెను.

ఇట్లు చెప్పి యామె వెడలిపోవుచుండెను. చంచలకుమారి నవ్వి "ఆజ్ఞలేకుండ నెక్కడకుఁ బోయెదవు? నీవు పసులకాపరుల బానిసవై యుంటివి. గుర్తు తెలియదా?" అని పరిచారికను బిలిచి "ఈక్రొత్త బానిసను రాజమహిషులయొద్దకు దీసికొనిపోయి, ఈమె దారాషేకు కొనిన బానిసయని తెలియ జేయుము" అనియెను.

ఉదయపురి రోదనముసేయుచు బరిచారికతో బోయెను. పరిచారిక యామెను రాజసింహుని మహిషీమణులయొద్దకు దీసికొని పోయి ప్రత్యేకముగ వారికి జూపించి తీసికొనివచ్చెను.

నిర్మల చంచలకుమారియొద్దకువచ్చి "మహారాజ్ఞీ! ముఖ్యమైన మాటనే మఱచినట్లు తోచుచున్నది. ఉదయపురి నెందులకు బట్టి తెప్పించితివి? దైవజ్ఞుడు చెప్పినది జ్ఞప్తియున్నదా?" అనియెను.

చంచలకుమారి నవ్వి "ఆమాట మఱచిపోలేదు. నాడు మిగుల నలసట నొందియుండుటచే నామెకు తొందరగలుగజేయ లేదు. కాని, యామె స్వయముగనే వచ్చి నాదయారసమును బడయును" అనియెను.—

---

## [illegible] ప్రకరణము

[illegible]

రాత్రి రెండుయామములు గడచిపోయెను. ఎల్లరు నిశ్శబ్దముగ నిద్రించుచుండిరి. జేబఉన్నీసా సుఖశయ్యపై గన్నిదుర దొరక వివశయై పడియుండెను. ఒక్కొకసారి దావాగ్నిచేఁ జుట్టుకొనబడిన వ్యాఘ్రాంగనవలె నిగ్రకోపాన్వితయగుచుండెను. రాత్రి యంతశాంతముగ తోఁచుటలేదు. ప్రబలముగ గాలి వీచుచుండెను. ఆకాశము మేఘచ్ఛన్నమై యుండెను. గవాక్షములనుండి కనబడుచున్నపర్వతపఙ్క్తులయందు గాఢాంధకారము. రాజపుత్రసైన్య శిబిరములున్న దిక్కునమాత్ర మొకతావున, వసంతారామమునందలి పుష్పసమూహమువలెను, సముద్రమునందలి ఫేననిచయమువలెను, కాంతాకమనీయదేహములందలి రత్నరాజివిధమునను, లెక్కలేనిదీపములు ప్రకాశించుచుండెను. తక్కిన తావులన్నియు నిశ్శబ్దములై గాఢాంధకారములై యుండెను. ఒక్కొకసారి సిపాయిలు ప్రేల్చుచున్నఫిరంగుల ప్రతిధ్వనులచే భయముకలుగుచుండెను. ఫిరంగులశబ్దము ప్రతిపర్వతశిఖరమునందును ప్రతిధ్వనితమగుటచే నైన కోలాహలము—రాజపురాశ్వశాలయందు బెదరినయశ్వముల హేషాధ్వనులు—రాజపురోద్యానమున నడలుజెందిన హరిణముల భయారవము—ఆభయంకరమగునపరరాత్రియందువివిధశబ్దములనువినుచు విషణ్ణచిత్తయై జేబఉన్నీసా "ఇప్పుడువినఁబడిన శబ్దము మొగలాయీలఫిరంగిశబ్దమని తోఁచుచున్నది. ఇది నాతండ్రిఫిరంగి—ఇటువంటిఫిరంగులు నాతండ్రియొద్ద ననేకములున్నవి. ఒక్కటైనను నా కుపయోగించినదికాదు. ఏమిచేసినయెడల శత్రుఘ్నిగోళమునకు నా హృదయము నొప్పగించి నాహృదయజ్వాలల జల్లార్చికొనగలుగు

మను? నిన్నటిదినమున గజారూఢునై లక్షలకొలది సైన్యమునుజూచి తిని. లక్షోపలక్షలై యున్న యస్త్రముల ఝణఝణంశబ్దములు వింటిని. వానియందొకయస్త్రముచే రాజ్యాలలనెల్ల నణగింపవచ్చును. నేనెం దుల కట్టిప్రయత్నము చేయనైతిని? ఏనుగుమీఁదినుండి క్రిందికుఱికి దాని కాళ్ళక్రిందబడి ప్రాణములను విడువవచ్చును. నేనెందుకాప్రయత్న మును జేయనైతిని? చచ్చుటకిష్టమున్నది. కాని, మరణించుప్రయత్న మెందులకుజేయనైతిని? ఇప్పుడు నాశరీరమునం దనేకవజ్రములున్నవి. మరణించుటకు బ్రయత్నపడుశక్తి నాకుజాలదు" అని భావించుకొను చుండెను.

ఈసమయమునందు దెఱచియున్న గుమ్మమునుండి గాలి ప్రబలముగ వీచి దీపము లారిపోయెను. ఆగదియంతయు జీకటి యగుటచే శేబఉన్నీసా కించుక భయముకలిగెను. భయపడి యామె తనమనసునందు "భయమెందులకు? నేనిప్పుడు మరణమునే కోరు చుంటినిగదా! చచ్చుటకుసిద్ధముగ నున్నవార లెవ్వరికి భయపడవల యును? నిన్న చచ్చిపోయినమనుష్యుని జూచితిని. అయినను నేఁడు బ్రతికియే యుంటిని. చచ్చిపోయినమనుష్యుఁ డెక్కడ నుండునో యక్కడకుఁ బోవుటకు నిశ్చయించుకొంటిని. అట్లయినచో, నెవ్వరికి భయపడవలయును? ఎట్లును స్వర్గమునకుఁబోవునదృష్టము నాకులేదా నరకమునకు బోవలసినదేనా? అందుచేతనా యింతభయము! స్వర్గ నరకములను గూర్చి నేనింతవఱకును నమ్మియుండలేదు. దేవుఁడున్నా డను నమ్మకములేదు. జాతిధర్మమును దెలిసికొనలేదు. కొన్ని భోగ విలాసములను మాత్రము తెలిసికొనియుంటిని. అల్లారహీం! (దయా నిధే!) నీవైశ్వర్యము నెందుల కిచ్చితివి? ఈయైశ్వర్యముచేతనే నాజీవ నము విషమయమైపోయినది. ఐశ్వర్యమునందు సుఖము లేదనుమాట నాకుఁదెలిసినది కాదు. నీకుఁదెలియును. తెలివియును నిర్దయుఁడవై

నాకుఁ జెప్పక యీదుఃఖమునేల నాకుఁ దెచ్చిపెట్టితివి? నాకున్న యైశ్వర్యమెవ్వరికున్నది? నాయంతటి సుఖజీవు లెవ్వరున్నారు?" అని భావించుకొనుచుండెను.

పాన్పుపై నేమయో నేమో యొకపురుగుండెను. రత్నఖచిత మగుశయ్యాతలమున బురుగేదియుఁ బ్రాకఁగూడదను నిషేధము లేదు. ఆపురువు జేబఉన్నీసాను గఱచెను. ఏకోమలతనూలతపై పుష్పధన్వి నాఁడు బాణములను మృదులహస్తమున విసరుచుండెనో, ఆకోమలతనూలత నాపురువు వనాయాసముగ గఱచి రక్తము చిమ్మునట్లు చేసెను. పురుగు కఱచినమంటచే జేబఉన్నీసా చాలభయపడి తనలో దానే నవ్వుకొని "పురుగుకాటునకు నేను భయపడితినే! ఈయపారదుఃఖమునందు గూడ భయమా! ఒకపురుగుకాటును సహింపజాలని నేను, అవలీలగ నాప్రాణాధికప్రియుని భుజంగముచేఁ గఱపించితిని. అట్టి విషసర్పమును నాయొద్దకు దీసికొనివచ్చువా రెవరును లేరా? సర్పము లేకున్నయెడల ముబారకు—

ప్రాయికముగ నెల్లరకిట్లే సంభవించుచుండును. అధికమనోవ్యథాసమయమున జాలసేపు మర్మభేదియగుచింతా సముద్రమున మునిగియున్నయెడల మనస్సునం దున్నదంతయు నోటితో విస్పష్టముగ ననుకొనుచుందురు. జేబఉన్నీసా పైనిజెప్పినదంతయు నదేరీతిగా విస్పష్టముగ బైకనుకొనినదే. ఆమె యాయంధకారాపరరాత్రియందు గాఢాంధకారమగు గదిలో విసరుచున్నగాలిని భేదించుస్వరముతో "ఆసర్పమున, లేకున్న ముబారకును, దీసికొనివచ్చువా రెవ్వరును లేరా?" అని యఱచెను. ఆ యంధకారమునం దెవ్వడో యొకడు "ముబారకును పొందినయెడల నీవు మరణింపవా యేమి?" అని ప్రత్యుత్తరమిచ్చెను.

"ఇదేమి!" యని యనుకొని జేబఉన్నీసా లేచికూర్చుండెను. కంఠధ్వనిని వినిపించిన యెల్లున్న మితానననై చెవి యిచ్చి వినునో యున్ని జేబఉన్నీసా లేచి కూర్చుండి "ఇదేమి? ఈవినబడినదేమి? ఇది యెవ్వరికంఠధ్వని?" అనియెను.

ఉత్తరము—యెవ్వరిది?

జేబ—స్వర్గస్థులైన వారికిని కంఠస్వరముండునా? వారు ఛాయా మాత్రులు కారా? నీవెల్లుస్వర్గమునుండి దిగివచ్చితివి? నీవు నేనిక్కడకు వచ్చుట చూచితివా? ఎన్నాళ్ళకు నీకంఠస్వరమును మరల వినగలిగి తిని! నీవు మరణించియుంటివా? జీవించియే యుంటివా? అసిరుద్దీను చెప్పినదసత్యమేనా? నీవుజీవితుడవై యుండినను, మృతుడవై యుండి నను, నాయొద్ద—ఈనామంచముమీదికి వచ్చి, ముహూర్త మాత్ర ము కూర్చుండజాలవా? నీవు ఛాయామాత్రుడవై యుండినను, నాకు భయములేదు. ఒక్కసారివచ్చి కూర్చుండుము.

ఉత్తరము—ఎందులకు?

జేబ—(సంభ్రమముతో) నేనించుక చెప్పవలసి యున్నది. ఎవ్వరును జెప్పనిదానిని జెప్పెదను.

ముబారకు—(సశరీరుడై వచ్చి నిలుచుండెనని చెప్పబని లేదు) అప్పుడాయంధకారమునందు బాన్పుమీదికి వచ్చి జేబఉన్నీసాపార్శ్వము నందు గూర్చుండెను. జేబఉన్నీసా బాహువున కాతని బాహుస్పర్శ మయ్యెను. జేబఉన్నీసాశరీరము హర్షకంటకితమై యానందరసాంబుధి దేలిపోయెను. అంధకారమునందు ముక్తాకారములగు నశ్రుబిందువు లామెగండస్థలమునుండి జారిపోవుచుండెను. జేబఉన్నీసా ముబారకు నిచేయి తన చేతియందుంచుకొని "ప్రాణనాథా! నీవు ఛాయా మాత్రుడవు కావు. నీవు మఱచిపోయినను నేను మఱచిపోను; నేను నీదానను ఇంక నిన్ను విడిచిపెట్టను" అనియెను. అనంత

రము జేబఉన్నీసా మంచమునుదిగి ముబారకుని పాదములపైఁబడి "నన్ను క్షమింపుము! నేనైశ్వర్యగర్వముచే బిచ్చిదాననై యుంటిని. నేనిప్పుడైశ్వర్యమును త్యజించుచున్నానని శపథము చేయుచున్న దానను. నీవు నాయపరాధమును క్షమించినయెడల నేను మరల ఢిల్లీకి బోను. నీవు 'క్షమించియుంటిని' అని చెప్పుము" అనియెను.

ముబారకు నిట్టూర్పు విడిచి "నేను జీవించియున్నాను. ఒక రాజపుత్త్రికయు నన్ను గోరీనుండి తీసి విషచికిత్సఁజేసి ప్రాణదాన మొసంగినాఁడు. నేనాతనితో నిక్కడకు వచ్చితిని" అనియెను.

జేబఉన్నీసా యాతనిచరణములను విడువలేదు. ఆమె కన్నీటిచే నాతనిపాదములు తడిసిపోయెను. ముబారకామెచేయి పట్టుకొని లేవఁదీయుటకుఁ బ్రయత్నించెను గాని యామె లేవక "దయయుంచి నన్ను క్షమింపుము" అని ప్రార్థించెను.

ముబారకు "నిన్ను క్షమించితిని. క్షమింపకున్నయెడల నీయొద్దకు వచ్చియుండను" అనియెను.

జేబ—అల్లై నాపై దయయుంచి వచ్చినయెడల నన్ను గ్రహింపుము. గ్రహించి నీకిష్టమున్నయెడల నన్ను విషసర్పమునోటి కర్పింపుము. నీవేమిచేయఁదలఁచికొనిన నట్లుచేయుము. నన్నింక మీఁదఁద్యజింపవలదు. నేను ఢిల్లీకిఁ బోవనని ప్రమాణముచేయుచున్నదానను. అలంగీరునిరంగమహాలునం దిఁకఁ బ్రవేశింపను.

ముబారక కంతయును మఱచెను. సర్పదంశనజ్వాలలను మఱచెను. తానుమరణించు సంకల్పమును మఱచెను. దరియాబీబిని మఱచెను. జేబఉన్నీసా ప్రీతిశూన్యవాక్యములను మఱచెను. కేవలము జేబఉన్నీసా యసమానరూపరాశి యాతనికన్నులఁ గప్పివైచెను. ఆమెయప్పటిప్రేమపరిపూర్ణములగు సంభ్రమోక్తు లాతని చెవుల కింపయ్యెను. షహజాదిదర్పము చూర్ణీభూత మగుటను జూచి

యూతనిమనసు కరఁగిపోయెను. అప్పుడాతఁడు "బీదవాఁడనగునన్ను భర్తగా గ్రహించుట కిష్టపడుచుంటివా?" అనియడిగెను.

జేబఉన్నీసా చేతులుజోడించుకొని "నాకంతటి యదృష్టమున్నదా?" అనియెను.

ముబారకు "అట్లయినయెడల సంకోచము లేకుండ నిర్భయముగ నావెంటరమ్ము" అనిచెప్పెను.

ముబారకు లాందరులో దీపమును వెలిగించికొని గదివెలుపలకు వచ్చినిలిచెను. ఆతఁడుచెప్పినప్రకారము జేబఉన్నీసా వస్త్రములను ధరియింపఁగా ముబారకామెచేయి బట్టుకొని వెలుపలికిఁ దీసికొనివచ్చెను. అక్కడనున్న ప్రతీహారిణు లిద్దఱు నాతనియాజ్ఞాప్రకారము వారితోఁగూడ వచ్చిరి. ముబారకు పోవుచు జేబఉన్నీసాతో "రాజాంతఃపురమునకుఁ బురుషులు రాఁగూడదు. ఆమీఁద ముసల్మానుల వాసనయైనఁ దగులరాదు. ఆకారణమున రాత్రికాలమున వచ్చితి ననియు, మహారాజ్ఞివారియాజ్ఞాప్రకారము వచ్చితి ననియు, సింహద్వారమువఱకును ప్రతీహారిణులు వచ్చి తిరిగిపోవుదు రనియు, వెలుపల నాకుగుఱ్ఱమును పాలకియు సిద్ధముగా నుండెననియు చెప్పెను.

వారు ప్రతీహారిణులసాహాయ్యమున సింహద్వారమువఱకును వచ్చి తమతమ యానములపై నధిరోహించి బయలుదేరిరి. ఉదయపురియందు నలుగురైదుగురు ముసల్మానులు వ్యాపారార్థులై వచ్చి వాసము చేయుచుండిరి. వారు రాణావారియాజ్ఞనుపొంది నగరప్రాంతమున నొకచిన్నమసీదునుకట్టుకొనిరి. ముబారకు జేబఉన్నీసా నామసీదులోనికిఁ దీసికొనిపోయెను. అక్కడ నొకమౌల్వియును, వకీలును, ఒకసాక్షియు సిద్ధముగా నుండిరి. వారిసాహాయ్యమున ముబారకు జేబఉన్నీసాను ఖురానులోఁ జెప్పఁబడినప్రకారము పెండ్లిచేసికొనియెను.

అనంతరము మురాదు జేబున్నీసాతో "నిన్నిక్కడనుండితీసి కొనివచ్చితినో యక్కడకే పంపించెదను. ఏమనఁగా—నిప్పు మహారాజావారి బందీవై యుంటివి. కాని, నీకు క్షేత్రంబులయందు నిలువఁదలయగునను ధైర్యమున్నది" అని చెప్పి మురాదు తానును వారల నాకెం శయ్యా గృహమునఁ జేర్చి వెడలిపోయెను.

---

## షోడశ ప్రకరణము

---

### దక్షురాలైన బాదుషా వేడికొనిన జలభిక్ష

మఱునాటి పూర్వాహ్ణకాలమున జేబఉన్నీసా చంచలకుమారి యొద్దఁ గూర్చుండి ప్రఫుల్లవదనయై మాటలాడుచుండెను. రెండు రాత్రులు జాగరణముచే శరీరము నలగియుండెను. రత్నరాసులచేతను, పుష్పరాసులచేతను, అలంకృతయై రంగమహాలునందు ప్రతిదర్పణము నందును తన ప్రతిబింబమును జూచికొని నవ్వుచుండు నా జేబఉన్నీసా యై యుండలేదు. బాదుషాహజాది జన్మము కేవలభోగవిలాసార్థ మైనదని యనుకొనుచున్న యా బాదుషాహజాదియై యుండలేదు. జేబఉన్నీసా, బాదుషాహజాది స్త్రీయనియు, నామెహృదయము నారీహృదయమనియు, స్నేహశూన్యమైన నారీహృదయము జల శూన్యమైన నదీమాత్రమే యనియు దెలిసికొనియెను.

జేబఉన్నీసా కపటమార్గములు విడిచి, గర్వమునుత్యజించి రాత్రిజరగినవృత్తాంతమంతయు జంచలకుమారి కెఱింగించెను. చంచల కుమారి కీవఱకె తెలియును. జేబఉన్నీసా సమాచార మంతయును జెప్పి పిమ్మట "మహారాజ్ఞీ! నన్నింకను ఖైదీగానుంచుటవలన మీ కేమి ప్రయోజనమున్నది? నేనలంగీరుబాదుషా పుత్త్రికననుమాట

మఱచిపోయితిని. మీరాతనియొద్ద కంపినను, నేను పోవుట కిష్టపడు చానుగాను. పోయినయెడల నాప్రాణములు నిలుచుమార్గము లేదు. నన్ను విడుదల చేయించినయెడల నాభర్తతో నాతని స్వదేశమైన తుర్కీదేశమునకు పోవుదను" అనిచెను.

చంచలవని "ఇందుల కుత్తర మిచ్చుటకు నాకు సామర్థ్యము లేదు. మహారాజావారియాజ్ఞ కావలయును. వారు నిన్ను నాయొద్ద నుంచుకొనవలసినదని యనుజ్ఞ యిచ్చినప్రకారము నిన్నిచ్చట నిలిపి యుంచితిని. ఇప్పుడు నీయభీష్టమును నెఱవేర్చుటకు సేనానాయకు డగు మాణిక్యలాలు సమర్థుఁడై యున్నాడు. నేను మాణిక్యలాలు కోరికమీఁద నీకు గొంతవఱ కవకాశ మిచ్చితిని. కాని విడుదల చేయు మని నాకెవ్వరును జెప్పలేదు. అందునుగూర్చి నేనేమియును జెప్ప జాలను" అనియెను.

జేబ—(విషణ్ణవదనముతో) మహారాజావారికి నాప్రార్థన మును మీరు దయతో విన్నవింపగూడదా? వారిశిబిరము దూర మున లేదు. నిన్నరాత్రి పర్వతముపైనున్న వారిశిబిరములయందలి దీపముల ప్రకాశమును జూచితిని.

చంచ—పర్వతము దగ్గఱగా నున్నట్లు కనబడుటయేగాని సమీపములోలేదు. మేము పర్వతములున్న దేశములయం దుండు టచే మాకాసంగతి బాగుగ దెలియును. నీవు కాశ్మీర దేశమునకుఁ బోయియుండుటచేత నీకు నాసంగతి తెలిసియుండవచ్చును. దాని కేమి? జనులను పంపినను, రాణావా రిందుల కొప్పుకొందు రను ధైర్యము లేదు. ఒకవేళ నుదయపురమందలి యీస్వల్పసైన్యము మొగలరాజ్యమును నేఁటి యీయుద్ధమునందు ధ్వంసము చేయఁ గలిగి బాదుషాతో సంధి చేసికొనుట యావశ్యకమే లేనియెడల, అవశ్యముగ నిన్ను నీభర్తతోఁ బంపుట కనుజ్ఞ యిచ్చుట కాటంకము

లేదు. అట్లుగాక సంధిచేసికొనవలసివచ్చినయెడల మిమ్మందఱను బాదుషాయొద్దకు ముందుఁ బంపించవలసియుండును.

జేబ—అట్లయినయెడల మమ్ములను మృత్యుముఖమునఁ ద్రోసినట్లగును. ఈవివాహవృత్తాంతమును విన్నయెడల నాతండ్రినాకువిష మిప్పించును. నాభర్తపేరే లేకుండఁబోవును. అతఁడు ఢిల్లీకిఁబోఁడు. పోయినయెడల నిశ్చయముగ మృత్యువునకు గుఱియగును. ఇఁకనీవివాహమువలన మాయభీష్టము లేమితీరునట్లు?

చంచ—మీకేమియు నపాయమురాని యుపాయ మొకటి యాలోచింపవలయునని తోఁచుచున్నది.

అట్లు మాటాడుచున్న సమయమున నిర్మలకుమారి యక్కడకువచ్చెను. ఆమె చంచలకుమారికి బ్రణామముఁ గావించి పిమ్మట జేబఉన్నీసా కభివాదము చేసెను. ఆమె ప్రత్యభివాదమును జేసెను

చంచ—నిర్మలా! ఇంతయాత్రముతో వచ్చితివేల?

నిర్మ—విశేషసమాచార మేమున్నది?

అప్పుడు జేబఉన్నీసా లేచి వెడలిపోయెను.

చంచ—యుద్ధసమాచారమేనా?

నిర్మ—ఔను.

చంచ—అయ్యది జనులు చెప్పుకొనుటచేఁ దెలిసినది. పిల్లిబిలములోఁ బ్రవేశించినది. మహారాణావా రాబిలముఖమును మూసివైచినారు. పిల్లి బిలమునందే మాడిచచ్చునట్లున్నదని వినియుంటిని.

నిర్మ—ఇఁకనొకసమాచార మున్నది. పిల్లి మిగుల నాకలిగొనియున్నది. నాపావుర మిప్పుడే నాయొద్దకు నచ్చినది. బాదుషాయే పంపియున్నాఁడు. దానికాలికొక చీటికూడ కట్టబడియుండెను.

చంచ—చీటిని జూచితివా?

నిర్మ—చూచితిని!

చంచ—ఎవ్వరి పేర?

నిర్మ—ఇమ్లీబేగమ్ పేర.

చంచ—ఏమి వ్రాసెను?

నిర్మల కాగితమునువిప్పి కొన్నిసంగతులను జదివి తెలిసికొనియెను. ఏమన—

"నేను నీయం దెట్టి స్నేహవిశ్వాసముల నిలిపియుంచితినో యే మనుష్యునందుగూడ నెన్నఁడు నట్టిస్నేహవిశ్వాసముల నగపఱుపలేదు. నీవును నేను చెప్పినట్లే యుంటివి. నేఁడుపృథ్వీశ్వరుఁడు దుర్దశాపన్నుఁడై యుండెను. లోకులవలన వినియే యుందువు. ఆహారములేకుండఁ జచ్చిపోవలసివచ్చినది. ఢిల్లీబాదుషా నేఁడొకరొట్టెముక్కకై యాచించుచున్నాఁడు. అంతమాత్ర ముపకారము చేయువా రెవరును లేరా! సాధ్యమైనయెడల నీవీపనిజేయుము. ఈయుపకారము నెప్పటికిని మఱచిపోను."

చంచల విని "నీవుపకారమును జేసెదవా?" అనియెను.

నిర్మ—నేనేమి చెప్పఁగలను! ఇంకేమి లేకపోయినను, బాదుషాయోధపురిబేగమునకు భోజనమున కైనఁ బంపవలయును.

చంచ—ఎట్లు? అక్కడికి మనుష్యులుపోవుటకు మార్గములేదు

నిర్మ—ఆసంగతి నిప్పుడు చెప్పఁజాలను. నేనొకసారి శిబిరమునకుఁ బోవుట కనుజ్ఞ యీయవలయును. ఏమి చేయవలయునో చూచివచ్చెదను.

చంచలకుమారియనుజ్ఞను గైకొని నిర్మలకుమారి ఏనుఁగుపై నెక్కి రక్షకజనముతో శిఖరమునందున్న భర్తను సందర్శించుటకై వెడలిపోయెను. పోయినవెంటనే మాణిక్యలాలును జూచెను.

మాణి—యుద్ధవిషయమేమా?

నిర్మ—ఎవ్వరితో యుద్ధముచేయుదును? నీవు నాతోయుద్ధము చేయుటకు యోగ్యుఁడవా?

మాణి—నీతోఁ గాదుగాని ఆలంగీరు బాదుషాతో.

నిర్మ—నేనాతని ఇన్ఛీబేగమును. అతనితోడ నేయుద్ధము? అతని రక్షించుటకు వచ్చితిని. నేను చెప్పునది వినవలయును.

ఆపిమ్మట వారిరువురకును కొంతసంభాషణము జరిగెను. ఏమేమి మాటాడిరో మనకుఁ దెలియదు. చాలసేపు మాత్రము మాటాడిరి.

మాణిక్యలాలు నిర్మలకుమారి నుదయపురికి మరల బంపించి రాజసింహునితో మాటాడుటకై వెడలిపోయెను.

---

## ఎనిమిదవ ప్రకరణము

---

### ఆత్మనిర్వాణపరామర్శ.

మహారాణా రాజసింహుని జూచి ప్రణామమును జేసి మాణిక్యలాలు చేతులుజోడించుకొని "దాసుఁడనైన నన్ను మరేదైన యుద్ధక్షేత్రమునకుఁ బంపుటకై మహారాజావారి కభిప్రాయమున్న యెడల నేనుననుగ్రహింపబడుదును" అని విన్నవించెను.

రాజ—ఎందులకు? ఇక్కడి కార్యము పూర్తియైనదా?

మాణి—ఇక్కడ నిఁక నెట్టిపనియు లేదు. ఇక్కడిపని క్షుధార్తులైన మొగలులశుష్కముఖములను జూచుటయే. వారియార్తనాదములువినుట యింతవఱకునైనది. అదికావలసినయెడల నప్పుడప్పుడు పర్వతములమీఁదికిఁ బోయి గొప్పగొప్ప చెట్లను వెదకిచూచివచ్చెదను. ఈ పనులనెవ్వరైనను జేయవచ్చును. నామనస్సునందు, ఇంతమంది జనులు, ఇన్ని యేనుఁగులు, గుఱ్ఱములు, నీరంధ్రపథమునఁ బడి ప్రాణములువిడిచినయెడల, దుర్గంధముచే నుదయపురమునం దెవ్వరును

ప్రాణములతో నుండ లేరని తోఁచుచున్నది. ఇది యంతయు శోకము లకుఁ గారణమగును.

రాజ—అందువలన మొగలుసేన నంతను, ఆహారము లేకుండ జంపుట సమంజసముఁ గాదని తోఁచుచున్నది. అంతియేనా?

మాణి—అట్లే యుద్ధమునందు లక్షజనులు చచ్చినను దుఃఖ ముకలుగదు. ఆహారము లేకుండ నొక్కఁడు చచ్చినను జాల విచార కరముగా నుండును.

రాజ—అట్లయినచో నేమిచేయవలయును?

మాణి—మహారాజా! చెప్పుటకు నేనెంతవాఁడను? నాయల్ప బుద్ధికిప్పుడు సంధిగావించుకొనుటకు సరియైనసమయ మని తోఁచు చున్నది. జఠరాగ్ని ప్రజ్వరిల్లి యుండుచు న్నప్పుడు మొగలులు లొంగి వత్తురు. మంత్రులను, సేనానాయకులనుగూడఁ బిలిపించి యీవిషయ మున వారియాలోచనమును దీసికొనుట మంచిది.

రాజసింహుఁ డట్లుచేయుట కొప్పికొనియెను. ఉపవాసముచే నింతమందిజనులు చచ్చుట యాతనికి నిష్టములేదు. హిందువులు క్షుధార్తున కన్నముబెట్టుట పరమధర్మ మని యెఱుంగుదురు. అందు వలన హిందువైనవాఁడు శత్రువైనను, అన్నము లేకుండ నుపవాస ములచే మాడ్చి చంపుట కొప్పికొనజాలడు.

సాయంకాలానంతరము శిబిరమునందు ప్రధానసేనానాయకు లును ప్రధానమంత్రులునుగూడఁ జేరియుండిరి. ముఖ్యమంత్రిపేరు దయాళుసహా అతడునువచ్చెను. మాణిక్యలాలుకూడవచ్చియుండెను.

రాజసింహుడు చర్చితాంశమును సభాసదులకు దెలియజెప్పి వారియభిప్రాయములను దెలుపవలయుననియెను. అనేకులు. ఆ మొగ లురు, ఆహారపానములు లేకుండ నిక్కడ బడి చావవలసినదనియు, ఔరంగజేబును దీసికొనివచ్చి జీవములతో గొఱుత వేయవలయు

ననియు, అట్లుకానియెడల శవములతో గోతిలో బూడ్చి పెట్టవలయు ననియు, మఱికొందఱు, మొగలులచే రాజపుత్రులకు సంభవించుచున్న యనిష్టములను దలంచుకొన్నయెడల నేటికి జిక్కినవారిని విడువగూడ దనియు, ననేకాభిప్రాయములనిచ్చిరి.

వీరిమాటల కుత్తరముగ మహారాణా రాజసింహుడు "నేను విడువగూడదను. ఈమొగలుల నిచ్చటనే యన్నపానాదులు లేకుండ జేసి పాతిపెట్టవలయును. కాని, ఔరంగజేబును, ఇక్కడనున్న యాతని సైన్యమును హతముచేసితిమైనయెడల మొగలులు నిశ్శేషులగు దురా? ఔరంగజేబు చచ్చినయెడల షహాలము బాదుషాయగును. షహాలముతో దాక్షిణాత్యమును జయించినమహాసైన్య మీపర్వత మున కవ్వలి భాగముననే సిద్ధమైయున్నది. మఱిరెండు మొగలుసేన లింకను రెండుదిక్కులగాచికొనియున్నవి. మన మీసేనలనెల్ల నెట్లు నిశ్శేషముగ జేయగలము? అట్లు చేయజాలనియెడల నెప్పుడైనను సంధియే చేసికొనవలసివచ్చును. సంధిచేసికొనుటకింతకంటెను మంచి సమయము మఱెప్పుడు దొరకునా? ఇప్పుడౌరంగజేబు ప్రాణములు కంఠగతములైయున్నవి. మనమిప్పు డేమిచెప్పినను ఒప్పికొనుటకు సిద్ధముగా నున్నాడు. వేఱొకసమయమున నట్లగునా?" అని చెప్పెను.

దయాళుషహా—అట్లుకాజాలదు. కాని, మహాపాపాత్ముడును భూమికి గంటకస్వరూపియునగు నీయౌరంగజేబును సంహరించిన యెడల బృథ్విని పునరుద్ధారణము చేసినట్లగును. ఇంతటిపుణ్యము మఱి యేకార్యమునందును లభింపజాలదు. మహారాజావారు మఱి యొకలాగున యోచింపరాదు.

రాజ—చాలమంది మొగలుబాదుషాలను జూచియుంటిమి. అందఱును బృథ్వికిఁ గంటకస్వరూపులే. ఔరంగజేబు షాజహానుకం

కెను హెచ్చునరాధముడా? ఖుస్రువలన మనకు గలిగిన యమంగ ళము వంటియమంగళ మౌరంగజీబువలనఁ దటస్థించినదా? షహజలము పితృపితామహులవంటి దురాచారపరుడు కాడని ధైర్యముతో జెప్ప గలమా? మీరీ నాలుగు మొగలు సైన్యములను జయింపగలమను ధైర్యమును గలిగియుండవచ్చును. అంతటి ధైర్యమున్నను, జను లెంత మందినశించినమీఁదట నాయాశ సఫలమగునో యోచించిచూడుడు! ఎంత మంది రాజపుత్రులు నిహతులు గావలయునో? ఉన్నవారెంతమంది? మనము హెచ్చుసేనలు గలవారముగాము ముసల్మానులసంఖ్యులై యున్నారు. మనజనము క్షీణించిన పిమ్మట తిరుగ వారు పైబడి పీడించినయెడల నెవ్వరిబాహుబలమున శత్రువులను మరల జయింప గలుగుదుము?

దయా—మహారాజా! రాజపుతానాయందున్న సమస్త రాజ పుత్రులు నేకమైన యెడల మొగలాయీలను సింధునది దాటిపోవు నట్లు దఱుముట కెంతసేపు కావలయును?

రాజ—అదినిజమే. కాని యెప్పుడైన నట్లు జరగునా? ఇప్పుడు నట్టిప్రయత్నములే చేయుచున్నాను. నాప్రయత్నముఫలించినదా?

దయాళు—సంధి చేసినను ఔరంగజీబట్లు నియతుడై యుండడు ఇంతటి మిథ్యావాదియగు పాపకర్ముడీభూమిపై బుట్టబోడు. ఈత డింమండి విడుదల నందినతోడనే సంధిపత్రమును జించిపాఱవైచి మరల నెప్పటియాటయే యాడుట కుపక్రమించును.

రాజ—అట్లు భావించుకొన్నయెడల నెప్పటికిని సంధియే కాదు. అట్లు యోచించుటవలన నేమిలాభము?

ఇట్లే విశేషముగ చర్చలు జరగెను. తుద కెల్లరును రాణా చెప్పిన మాట యథార్థమని యొప్పికొనిరి. సంధి జేయుటకే స్థిరపఱుపఁ బడియెను. అనంతరము సభాసదులలో నొకఁడు "ఔరంగజీబు

సంధికై మాతనంపలేము. సంధి చేసికొనుటవలన మాతనికా, మనకా?'' అని యాక్షేపించెను.

అందులకు రాజసింహుఁడు 'మాత నంపుట యెట్లు? ఆరంధ్ర పథమునుండి యొకవ్యక్తియైన బైటికి వచ్చుటకు మార్గములేదు. అతఁడు మాత నెట్లు పంపఁగలఁడు?'' అనియెను.

దయా——అట్లయిన మనమాతమాత్ర మెట్లుపోవును? ఆనాఁడు మనమాత పోయినప్పుడాతని వధించుటకాజ్ఞ యిచ్చెను. నేఁడు మాత్ర మట్లు చేయఁడను నమ్మక మెక్కడిది?

రాజ——ఈమా రట్లు చేయఁడని జెప్పఁగలను. ఇప్పుడు కపట సంధియైనను అతనికి శుభమే. కానిమాతయెట్లుపోవునో, ఆవిషయమై యోచింపవలసిన దే.

అప్పుడు మాణిక్యలాలు ''ఆభారము నామీఁద నుంచుడు. నేను మహారాణావారికాగితమును. ఔరంగజేబుకొద్దకుఁ బంపి యందు లకుఁబ్రత్యుత్తరము దెప్పించెదను'' అని విన్నవించుకొనియెను.

మాణిక్యలాలు కౌశలమునందును సాహసమునందును అద్వితీ యుఁడని యందఱు నాతనిమాటలను నమ్మిరి. పత్రము వ్రాయుట కాజ్ఞయయ్యెను. దయాళుషాహా కాగితమును వ్రాసెను ''బాదుషా సమస్తసైన్యమును మేవారునుండి తీసికొనిపోవలయును. మేవారు వందు గోహత్యలు చేయఁగూడదు. దేవాలయములను బ్రద్దలుకొట్ట రాదు. జిజియాపన్ను వసూలుచేయకూడదు. ఇట్లు జరగినయెడల రాజసింహుఁడు మార్గమును విడిచిపెట్టును. బాదుషా నిర్బాధకముగఁ బోవచ్చు'' నవి దానితాత్పర్యము.

పత్రము సభాసదులందఱియెదుటను జదివి వినిపింపఁబడియెను. విని, మాణిక్యలాలు ''బాదుషాభార్యయును కుమార్తెయును మన

యొద్దబందీలై యున్నారు. వారట్లే యుండవలయునా?'' అని యడిగెను.

ఆమాటవిని, ఒక్కొక్కరొక్కొక్కరీతిగ పరిహాసోక్తుల నాడిరి. కాని, యందఱును విడువఁగూడ దని చెప్పిరి. కొందఱు "ఉండనిమ్ము, వారు మహారాణాగారివాకిలి నూడ్చుచుందురు అనిరి.'' ఒకఁడు "వారిని డక్కాకుఁ బంపితీరవలయును. అక్కడ హిందువులై వైష్ణవ వేషములను ధరించుకొని హరినామస్మరణమును జేసికొనుచుందురు.'' అనియెను. ఒకఁడు "వారివిడుదలకొఱకు బాదుసా కోటిరూపాయల నీయవలయు'' ననియెను. ఇట్లీయందఱు నన్నివిధముల మాటాడఁ జొచ్చిరి. మహారాణా రాజసింహుఁడు "ఇద్దఱు బందీలకొఱకు సంధి చెడఁగొట్టుకొనుట భావ్యముకా''దని వారిద్దఱిని బంపివేయుట కాజ్ఞ యిచ్చెను.

పత్రమునందదేప్రకారముగ వ్రాయఁబడియెను. ఆకాగిత మును మాణిక్యలాలున కిచ్చి సభ ముగించిరి.

---

## తొమ్మిదవ ప్రకరణము

### అగ్నియందు జలసేచనము

సభ ముగిసినను మాణిక్యలా లచ్చటినుండి వెడలిపోక యందఱును బోయినపిమ్మట మహారాణాయొద్దకుఁ బోయి ముబారకుని యుపహారవిషయమై దేవరవారితో మనవిసేయ వేచియున్నానని యెను.

రాజ—అతఁ డేమి యడుగుచున్నాఁడు ?

మాణి—బందీయైయున్న బాదుషాకుమార్తె నడుగుచున్నాడు.

రాజ—ఆమెను బాదుషాయొద్దకుఁ బంపకున్న సంధికాఁజాల దని తోఁచుచున్నది. అదిగాక స్త్రీలకై మేమిట్టి యత్యాచారములు నడపవచ్చునా ?

మాణి—ఆమె కెట్టితొందరయును గలిగింప నక్కఱలేదు. ముబారకునకు నామెకు నిన్నరాత్రి వివాహమైనది.

రాజ—షహాజాది ఆమాటను బాదుషాకుఁ దెలియఁజేసికొన్న యెడల నంతయును చక్కఁబడును.

మాణి—వారిద్దఱికిఁ బరులును నేలపైఁ బడును.

రాజ—ఎందువలన ?

మాణి—షహాజాదులు, షహాజాదులను తప్ప నితరులను వివాహమాడరాదు. ఈషహాజాది సైనికుని వివాహము చేసికొని బాదుషాకులమునకుఁ గళంకమును దెచ్చిపెట్టినది. బాదుషాకుఁ దెలియకుండఁ బెండ్లిచేసికొనుటచే, ఢిల్లీలోని రంగమహాలు నందలి యాచారము ననుసరించి యామెను విషమిచ్చి వధింపవలసియున్నది. ముబారకు నేనుఁగు కాళ్ళచే ద్రొక్కించుటయో, శూలారోపణము చేసి వధించుటయో జరుగును. ఒకవేళ నీయపరాధమును క్షమించి నను, మీకాతఁడు చేసినయుపకారముకొఱకై నను శూలారోపణశిక్ష నందఁగలఁడు. ఆరహస్యము బాదుషాకుఁ దెలియకుండ నున్నయెడల నాతని యనుమతిలేకుండ పెండ్లిచేసికొన్న కారణముననే ముబారకు శూలమునకు గుఱియగుట కేమియును సందేహము లేదు.

రాజ—నేనిందుల కేమైనఁ బ్రతీకారము చేయఁగలనా ?

మాణి—ఔరంగజేబుని కుమార్తెయొక్కయు, నాతనియల్లుని యొక్కయు నపరాధములను క్షమించుకున్నచో సంధి కొప్పికొనమని మీరు చెప్పవచ్చును.

రాజ—నేనట్లే చెప్పెదను. అందులకై బాదుషాకు వేఱె యొకజాబును వ్రాసెదను. ఆయుత్తరమును నీవు సంధిపత్రముతోఁ

గూడఁ దీసికొనిపొమ్ము. ఔరంగజేబు కుమారుని యపరాధమును క్షమించును. కాని ముబారకుని యపరాధము మన్నించుట కాతఁ డొప్పుకొనినను, అంతమాత్రమున నాతనికి నిష్కృతి కలుగునను నమ్మకము లేదు. ఏమైనఁగానిమ్ము. ముబారక కిందువలన సంతుష్టుఁడై నయెడల నేనా కార్యమును జేయుటకు సిద్ధముగా నున్నాఁడను.

ఇట్లు చెప్పి రాజసింహుఁడు స్వహస్తముతో నొకయుత్తరమును వ్రాసి మాణిక్యలాలున కిచ్చెను. మాణిక్యలా లారెండు కాగితములను దీసికొని యారాత్రియే బయలుదేరిపోయెను.

ఉదయపురమునకు బోయి ముందుగా నీవృత్తాంతము లన్నియు నిర్మలకుమారి కెఱింగించెను. నిర్మల సంతుష్టాంతరంగయై బాదుషాకుఁ దానుకూడ నొకయుత్తరము నీక్రిందివిధముగ వ్రాసియిచ్చెను.

"మహాన్ మహా!

తమ బానిస యనేకాభివాదనములు. దేవర యాజ్ఞానుసారముగ నీబానిస నడచుకొన్నది. ఇప్పుడు దేవరవా రనుమతింపవలసిన దొక టియున్నది. నేను కట్టకడపట మిమ్ము వేఁడికొన్నది స్మరింపగోరెదను సంధిచేసెదను."

అనంతర మామె యీవృత్తాంత మంతయును జేబుఉన్నీసా కెఱింగించెను. ఆమెయును సంతుష్టచిత్త యయ్యెను.

మాణిక్యలాలు జరిగిన వృత్తాంతమంతయు ముబారకునకుఁ దెలియఁజేసెను. ముబార కేమియును జెప్పలేదు. మాణిక్యలాలు ముబారకును హెచ్చరించుచు "సాహెబా! బాదుషాయొద్దకు మరలఁ బోయినయెడల నాతఁడు మిమ్ము మన్నించునను ధైర్యము నాకులేదు" అనియెను.

ముబా—ధైర్యము లేదు.

మఱునాఁటి ప్రాతఃకాలమున నిర్మలకుమారియొద్దనుండి పావురమును దీసికొని మాణిక్యలాలు కాగితములను మడచి దానికాలికి గట్టివిడిచిపెట్టెను. అదివెంటనే యాకాశమున కెగసిపోయెను. దాని కాలికిఁగట్టఁబడిబరువుగనుండెను. అయినను దానిని విడువకుండ నౌరంగజేబుకొద్దకుఁ బోయివ్రాలెను. అతఁ డూర్ధ్వముఖముతో నాకాశము వంకఁ జూచుచుండెను. అది యక్కడకుఁ బోయి వ్రాలి పత్రములను జూపించెను.

---

## పదియవ ప్రకరణము

### అగ్నినిర్వాణకాలము, ఉదయపురి భస్మరాశి.

కపోతము శీఘ్రముగ నౌరంగజేబునొద్దనుండి ప్రత్యుత్తరమును దీసికొనివచ్చెను. రాజసింహుఁడు వ్రాసినదాని కన్నిటికి నౌరంగజేబు సమ్మతించెను. కాని, చంచలకుమారినిమాత్రము తనతోఁ బంపవలయునని యడిగెను. రాజసింహుఁ డంతకంటె మిమ్ము ససైన్యముగ నిక్కడనే పాతిపెట్టుట నాయభిమత మని వర్తమాన మంపెను. అది విని యౌరంగజీ బాయాశను విడిచివైచెను. ఔరంగజేబు మునిషీచే సంధిపత్రమును వ్రాయించి దానిపై తనముద్రనువైచి "మంజూరు చేసినాము" అని స్వహస్తముతో వ్రాసి పంపించెను. జేబఉన్నీసా ముబారకులవిషయమున క్షమించినట్లు మఱియొక యుత్తరమును గూడ వ్రాసి పంపెను. కాని యీవివాహమునుగూర్చి యెవ్వరికినిఁ జెప్పకుండనుండునట్లు మాట యీయవలయుననియు అల్లునిఁజూచుటకు దాను వేఱే యుపాయము నాలోచించుకొందు ననియు వ్రాసెను.

రాజసింహుఁడు సంధిపత్రమును దీసికొని మొగలుసేనను విడిచిపెట్టుట కాజ్ఞయిచ్చెను. రాజపుత్రు లనేకగజములను దీసికొని

వచ్చి యుద్ధమునకున్న జెట్లను దీసిపోఅన్నైచిరి. మొగలాయీలాల కాహారపదార్థములు లేనందున రాజసింహుఁడు వారి కందఱకును భోజనపదార్థముల నుపహారముగ బంపించెను. తుదకుదయపురమునం దున్న జేబఉన్నీసాను, ఉదయపురిని, ముబారకును విడిచిన్నైచుట కక్కడికి వచ్చియుండ నంపెను. అప్పుడు నిర్మల చంచలకుమారితో నేకాంతముగా "వేగము నీకు బానిసనై సేవచేసినదా?" అనియడిగి యుదయపురితో "నేనుమీతో ఢిల్లీనుండి (యుదయపురమునకు) వచ్చి చేయవలయు నని చెప్పినకార్యమును జేసితిరా?" అనియడిగెను.

ఉదయపురి "సీనాలుక ముక్కలుముక్కలుగఁ గోయించివై చెదను. నాచే తంబాకు నలిపించుట నీకుసాధ్యమా? బాదుషా వేగ మును నిరోధించుట మీవంటియల్పులకుసాధ్యమా? ఎందులకు విడిచి పెట్టరు? ఇట్లవమానించుటకుఁ దగినఫలమును బొందెదరు. ఉదయపు రమును పేరులేకుండఁ జేసివైచెదను" అనియెను.

అప్పుడు చంచలకుమారి స్థిరభావముతో "మహారాణావారు బాదుషాను గనికరించి విడుదలఁజేసి మిమ్ముఁగూడ విడిచివైచుట కనుజ్ఞదయచేసినట్లు వినియున్నాను. అందుకొఱకు మంచిమాటాడు టయును మీకుఁ జేతకాదు. ఆకారణమున మిమ్మును విడిచిపెట్టుట లేదు. బానిసలున్నమహాలునకుఁ బోయి నాకొఱకు తంబాకును బాగు చేసి తీసికొనిరావలయును" అనియెను.

జేబఉన్నీసా "అదేమిమహారాజ్ఞీ; మీరుఁగూడ నింతటినిర్దయ తజూపఁజెల్లునా?" అనియెను.

జేబఉన్నీసా చాలసేపుచెప్పినమీఁదట నుదయపురియు వినీత భావమును వహించెను.

కానిచంచలకుమారి చాలశక్తిమంతురాలు. కేవలకృపార్ద్ర

హృదయముతో "నీవొకసారి నానిమిత్తము తంబాకును సిద్ధముచేసి యిచ్చితివేని వెడలిపోవచ్చును" అనియెను.

ఉదయపురి "తంబాకు నలుపుట నాచేతఁగాదు" అనియెను.

చంచ—పరిచారికలు చెప్పి చూపించెదరు.

ఉపాయాంతరములేక యుదయపురి బానిసలు చెప్పినప్రకారము చంచలకుమారికి తంబాకుసిద్ధముచేసి తెచ్చి యిచ్చెను.

అప్పు డామెకు చంచలకుమారి సలాముచేసి యనుజ్ఞయిచ్చి "ఇక్కడ జరిగినదంతయు బాదుషాతోఁ జెప్పవలయును. మఱియు, అతనిచిత్రపటమును కాలితోఁ దన్నిముక్కలుచేసినది నేనే యనిజ్ఞప్తి కీఁదెమ్ము. అంతేకాక, మరల నాతఁ డేహిందూబాలికకైన నవమానముచేయుటకుఁ బ్రవృత్తుఁడైనయెడల 'నేను చిత్రపటమును దన్ని బ్రద్దలుగొట్టుటతోడనే సంతుష్టురాలను గాననికూడఁ జెప్పుము" అని చెప్పిపంపించెను.

బాదుషా తనమహిషిని కుమార్తెను గలిసికొని బెత్తముచేఁ గొట్టబడినకుక్కవలె బిక్కమొగముతో రాజసింహుని సముఖమునుండి పలాయితుఁడై పోయెను.

---

## పదునొకండవ ప్రకరణము.

అగ్నికాండముచేదాహముగొనిన చాతకి

బేగముల కాజ్ఞయిచ్చి పంపినమీఁదట నిర్మలకుమారి మరల నంధకారమును జూచెను. మొగలాయీలు పరాభూతులైరి. బాదుషామహిషి చంచలకుమారికి దాసివలె సేవఁగావించెను. ఐనను రాణా యేమాటయును జెప్పనికారణమునఁ జంచలకుమారి దుఃఖం

చుచుండుటను జూచి నిర్మల వచ్చి యామెయొద్దగూర్చుండెను. చంచల మనోభిప్రాయమును దెలిసికొని "మహారాణావారి కీవిషయము ప్రత్యుత్తరమీఁ దేఁగూడదా?" అని యడిగెను.

చంచ—నీవు పిచ్చిదానివలె నున్నావు. స్త్రీనైయుండి పదింబదిగ నిట్టిమాట జెప్పుటయెట్లు?

నిర్మ—అట్లయినయెడల నీతండ్రి యిక్కడకు త్తరము వ్రాయునట్లుగ మన మాతని కొకజాబును వ్రాయగూడదా?

చంచ—ఎందులకు? యుత్తరమున కట్టిప్రత్యుత్తరము వచ్చినప్పుడు మరల నేమనివ్రాయను?

నిర్మ—తండ్రిపై కోపమెందులకు?

చంచ—రాగాభిమానములులేవు. కాని యొకసారి వ్రాసిశాపగ్రస్తనైతిని. మరల వ్రాయుటకు సాహసమెట్లుండును?

నిర్మ—అది వివాహవిషయమై వ్రాసినది కాదా?

చంచ—మరే విషయమునుగూర్చి వ్రాయవలయును?

నిర్మ—మహారాణా యేమాటయును జెప్పకున్న యెడల బిత్రాలయమునకు బోయి వసించుటయే మంచిది. ఔరంగజేబు మరల నీదెసకన్నెత్తిచూడజాలడు. ఆకారణమున నుత్తరము వ్రాయవలయునని కోరుచున్నాను, పుట్టినిల్లుగాక యిక నుపాయ మేమున్నది!

చంచలకుమారి యేమో చెప్పబోయెను. కాని, యేమి చెప్పుటకును నోరాడక యేడ్వదొడగెను. నిర్మలకేమాట చెప్పుటకునుదోచినదికాదు.

చంచల కన్నీరు దుడిచికొని లజ్జావనతవదనయై యించుక నవ్వెను. నిర్మలయు నవ్వెను. అనంతరము నిర్మల మరలనవ్వి "నేను ఢిల్లీ బాదుషాయెదుట నైనమాటలాడుట కేమియునుదోచక యాత్ర

తిభన్నై యుండలేదు. నీయెదుట నప్రతిభన్నై పోయితిని. ఇది ఢిల్లీబాదుషాకు లజ్జాస్పదముకాదా? కాని నీవొకసారి, ఇమ్లీబేగముయొక్క కల్పనా కౌశలమును బరీక్షించినావు. కలమును కాగితమును దెచ్చి వ్రాయుటకు బ్రారంభింపుము. నేను చెప్పుచుండెదను'' అనియెను.

చంచ—ఎవ్వరికి వ్రాయవలయును? తల్లిపేరనా? లేకతండ్రి పేరనా?

నిర్మ—తండ్రిపేరనే.

చంచల వ్రాయుట కారంభించెను నిర్మల చెప్పుచుండెను. "ఇప్పుడు మొగలుబాదుషా మహారాణాచేత"

"బాదుషా" యనువరకును వ్రాసి చంచల "మహారాణాచేత" నని వ్రాయకూడదు. "రాజపుత్రులచేత" నని వ్రాసెదననియెను,

నిర్మల నవ్వి "అట్లేవ్రాయుము" అనియెను. అనంతరము చంచల నిర్మలచెప్పిన ప్రకారము వ్రాయనారంభించెను.

"రాజపుత్రులచేత బరాభూతుడై రాజపుత్రస్థానమునుండి హతాశుడై వెడలిపోయెను. ఇక మరల నాతడు మనపై బలపరాక్రమముల జూపుటకవకాశము లేదు, ఇప్పుడు మీకుమాత్రైవిషయమున మీయనుజ్ఞయేమి? నేను మీకధీన నై యుంటిని,"

అనంతరము నిర్మల "మహారాణావారియధీనమునందు కాదు" అనిచెప్పెను.

చంచ—ఊరకుండుము. పాపాత్మురాలా!

అని యదలించి నిర్మలచెప్పినమాట వ్రాయలేదు. నిర్మల, అట్లయినయెడల "మఱియెవ్వరి యధీనమునందును గాదు" అని వ్రాయుమనియెను. చంచల యట్లేవ్రాసెను.

ఈవిధముగ నుత్తరమును వ్రాసి రూపనగరమునకు బంపెను. రూపనగరరాజాయుత్తరమునకుఁ బ్రత్యుత్తరముగ "నేను రెండు

వేల యాశ్వికదళములను దీసికొని యుదయపురమునకు వచ్చెదను. ఘాటి, రస్తా మొదలగుతావుల నాకాటంకము గలుగకుండ నుండుటకై రాణాకుఁ దెలియఁజేయుము" అని వ్రాసెను.

అద్భుతకరమగు నాయుత్తరమున కర్థముచేసికొనఁజేరక చంచలానిర్మలలు కొంతసేపు విమర్శించుకొని యందు సైన్యసమాచారముండుటచే రాణాకుఁ దెలియఁజేయుటయే మంచిదని స్థిరపఱుచుకొనిరి. నిర్మల మాణిక్యలాలుమూలమున నాసంగతి రాణాకుఁ దెలియపఱిచెను.

రాణా రాజసింహుఁడుకూడ ననుమానపడఁజొచ్చెను. ఆతఁడు చంచలకుమారిని మఱచి యుండలేదు. ఆతఁడును షోడశకళాభిరుచాంకితుఁడగు విక్రమసింహున కొకయుత్తరము వ్రాసిపంపించెను. అందు చంచలకుమారివివాహవిషయమునుగూర్చియే వ్రాసెను. అందులోఁ గుమార్తెకు శాపము నిచ్చుటయు క్రమముగా రాజసింహుఁడపయుక్త మిత్రుఁడని తెలియవచ్చినయెడలఁ దనమనఃపూర్వకముగ వచ్చియాశీర్వదించి కన్యాదానమును జేయుదు ననుటయును, జ్ఞప్తికిఁ దెచ్చుచు, ఇప్పుడు మీయభిప్రాయ మేమి? అని వ్రాసిపంపెను.

ఇందులకుఁ బ్రత్యుత్తరముగ విక్రమసింహుఁడు "నేను రెండువేల యాశ్వికదళమును దీసికొని యక్కడకు వచ్చెదను. ఘాటీలను దెఱచియుంచవలయును" అని వ్రాసెను.

రాజసింహుఁడును జంచలకుమారివలె దానియభిప్రాయమును దెలియనేరక విక్రమసింహుఁడు రెండువేలయాశ్వికదళమును దీసికొని వచ్చి యేమిచేయఁగలఁడు? నేను జాగరూకుఁడనై యుండెదను" అని భావించికొని, విక్రమసింహుఁడువచ్చునెడల ఘాటీల నడ్డుపెట్టకుండునట్లుగ నాజ్ఞాపించెను.

# పండ్రెండవ ప్రకరణము.

[illegible]

ఉదయసాగరతీరమునకు నౌరంగజేబు మరలవచ్చి యచ్చట శిబిరములను నెలకొల్పెను. తెల్లవారినపిమ్మట సైనికు లాహారముల భుజించి గుఱ్ఱములు మొదలగువానికి మేఁతలువేసిరి. అప్పుడు సిపాయిల గుంపునందు, గానములును వేడుకలు నారంభమయ్యెను. ఒక సిపాయి "హిందూరాజ్యమునకు వచ్చియుండుటచే నేకాదశి యుపవాసము చేసినట్లుండె" ననియెను. ఈమాట విని యొకగాయిక "బ్రదికి బైటఁబడితిమి. నీవునా? నేనే యుపవాసము చేసితి ననుకొను చున్నాను" అనియెను. ఒక్కతె జావళి పాడుచుండఁగా, తంబూరా తంతి తెగిపోయెను. అదిచూచి యొకసిపాయి "ఇదేమి! తీఁగ తెగిపోయినది!" అనియెను. అందులకామె మీవీరత్వమును జూచి యిఁక మీఁద హిందూస్థానమునం దుండుటకు ధైర్యము చెడినది. ఉరియా దేశమునకుఁ బోవలయు ననుకొనుచున్నాను. ఆకారణమునఁ దంతిని త్రెంపివైచితిని" అనియెను. మఱియొకఁడు ఉదయపురి బేగమును గూర్చి చింతిల్లుచు, రావణుఁడొనరించినసీతాపహరణమును దానితోఁ బోల్చి చెప్పుచుండెను. అందులకుఁ బ్రత్యుత్తరముగ నింకొకఁడు "బాదుషా యింతమందివానరులను దీసికొనిపోయినను, సీత యుద్ధరింపఁబడలేదేమి?" అనియడిగెను. ఇంకొకఁడు "మనము సిపాయిలము. కోఁతులము గాము. చెట్లను విఱుచువిద్య మనకుఁదెలియదు. అందువలన సీతను బోగొట్టుకొంటిమి" అనియెను. ఇందులకుఁ బ్రత్యుత్తరముగ మఱియొకఁడు "మీకు వచ్చినవిద్య రొట్టెలువిఱుచువిద్యయగుటచేఁ జెట్లనువిఱుచుట యెట్లు చేతనగును?" అనియెను. ఈవిధముగ నొకరితో నొకరు హాస్యాలాపము లాడుకొనుచుండిరి.

ఇంతలో బాదుషా శిబిరమునుండి రంగమహాలు లోనికిఁ బోయెను. తోడనే జేబడున్నిసా వచ్చి చేతులు జోడించుకొని నిలుచుండెను. బాదుషా యామెతో "నీవివాహము నీమనఃపూర్వకముగాఁ గావించుకొన్నది కాదని తోఁచుచున్నది. ఆకారణమున నీయపరాధమును క్షమించితిని. కాని, వివాహప్రస్తావన మెవ్వరికినిఁ దెలియకుండ జాగ్రత్తగ నుండుము" అనియెను.

అనంతర ముదయపురి వచ్చి చూచెను. ఆమె తనకు జరిగిన యవమానముల నున్నవి లేనివి కల్పించి చెప్పగా విని యౌరంగజేబు కోపాగ్నిచేఁ బరిపూర్ణుఁ డయ్యెను.

మఱునాఁడు ముబారకు నేకాంతముగా బిలిపించి "నీయపరాధము లన్నిటిని మన్నించుచున్నాఁడను. నీవు నాకల్లుడవైతివి. నా యల్లుఁడకై నీచపదవియందుండుటతగదు. కావున నిన్ను ద్విసహస్ర సీమకు మన సబుదారునిగాఁ జేయుచున్నాను. ఆజ్ఞాపత్రము నేఁడే నీ కందగలదు. కాని, ఇప్పుడు నీవిక్కడ నుండఁగూడదు. షహజాదా అక్బరు పర్వతములమధ్యమున నావలెనే కష్టములకు గుఱియైయున్నాఁడు. అతని నుద్ధరించుటకై దిలీరఖాను ముందుగఁ బోవును. అక్కడ నీవంటియోధుని సాహాయ్య మవశ్యముగాఁ గావలసియుండును గావున నీవిప్పుడే బయలుదేరి పోవలయును" అని యాజ్ఞాపించెను.

ముబారకీమాటలు విని సంతోషమును బొందలేదు. అతఁ డౌరంగజేబుని యాదరము సుభావపూర్ణమైనది కాదని తెలిసికొనియెను. కాని, యాతఁ డీవిషయమున మఱింపక విసీతభావముతో బాదుషా వారి యాజ్ఞనుబొంది దిలీరఖానుని శిబిరమునకు చేరుటకు సంసిద్ధుఁడు కాఁజొచ్చెను.

అనంతర మౌరంగజేబు దిలీరఖానునకు "ముబారకను మన సబుదారుగాఁ జేసి నీయొద్దకుఁ బంపుచున్నాను. అతఁ డికఁ బ్రాణము లతో నుండరాదు. యుద్ధములో మరణించినయెడల మేలె—అట్లు జరుగనియెడల నాతని సంహరింపవలయును" అని యాజ్ఞాపత్రమును వ్రాసి నమ్మిన భృత్యునిచే నాతనియొద్దకుఁ బంపించెను. దిలీరఖాను బాదుషావారి యాజ్ఞ నవశ్యముగ నెఱవేర్పవలయు నని సంకల్పించు కొనియుండెను.

దర్బారుచేసి ఔరంగజేబు తన యభిప్రాయము నందఱికిని దెలియఁజేసెను. ఏమన—"మనము కట్టెలుఁగొట్టుకొని బ్రదుకువారి మోసమునకు లోనై సంధికొప్పికొంటిమి. అట్టిసంధి నెఱవేర్పదగినది కాదు. అల్పుఁడగు రాజుతో బాదుషానైన నేను సంధిచేసికొనుట యనఁగా నేమి? నేను సంధిపత్రమును జించిపాఱవైచితిని. అరూప నగర రాజకుమారిని బంపకపోవుటచే నల్లుచేసితిని. రూపనగరకన్య నామె తండ్రి మనకొప్పగించి యుండుటచేత నామెపై రాజసింహుని కధికారములేదు. ఆమెను మనయొద్దకుఁ బంపినఁగాని రాజసింహుని యపరాధమును క్షమింపఁజాలము. యుద్ధ మెట్లు జరుగుచున్నదో యట్లె జరుగనిండు. రాణా రాజ్యమునందుఁ గనఁబడిన గోవు నెల్ల వెంటనే ముసల్మానులు చంపివేయవలయును, జిజియాపన్నును సర్వత్ర వసూలుచేయవలయును" అని యాజ్ఞాపించెను.

పైనిఁ జెప్పినవన్నియు వెంటనే ప్రచారములోనికివచ్చెను. ఇంతలో దిలీరఖానుదై సురీమార్గముగ మారవాడనుండి యుదయపురమున ప్రవేశించుటకుఁ బోవుచుండెను. ఈసంగతివిని రాజసింహుఁడు బాదుషా యొద్దకు మరల యుద్ధప్రయత్నము లెందులకని యడుగుటకై జనుల నంపించెను. ఔరంగజేబు "కట్టెలుగొట్టుకొను నడవిమనుష్యు

లతో బాదుషా సంధిచేయుట యెట్టిది? రూపనగరకన్యను బంపకున్న యెడల, రాజసింహునియపరాధము క్షమింపఁబడదు" అని మరల వర్తమానమంపెను. ఇది విని రాజసింహుఁడు "నేనింకను జీవించియే యున్నాను" అనిచెప్పెను. రూపనగరరాజకన్యాపహరణము, ఔరంగజేబునిహృదయమునకు శల్యమై నాటియుండెను. అతఁడు రాజసింహునివలనఁ దనయభీష్టము సిద్ధి కానేరదని తెలిసికొని, రూపనగరరాజుసాహేబునకు "నీకుమార్తె యింకను నాయొద్దకు రాలేదు, ఆమెను వెంటనే తీసికొనిరావలయును, లేకున్న యెడల రూపనగరము గుర్తు లేకుండఁబోవునట్లు చేసెదను" అని యాజ్ఞాపత్రము వ్రాసిపంపించెను. ఆజ్ఞాపత్రము వచ్చినతోడనే విక్రమసింహుఁడు నేను శీఘ్రముగా రెండు వేలయాశ్వికదళముతో మీదరిసేనమునకు వచ్చుచున్నానని ప్రత్యుత్తరము వ్రాసిపంపెను.

ఔరంగజేబు "సేనతో నెందులకు రావలయును? బహుశః నాకుసాహాయ్యము చేయుటకై వచ్చుచున్నాఁడు" అనుకొనియెను.

---

## పదుమూడవప్రకరణము

---

ముబారకునిదహనారంభము

సౌందర్యమహిమ యెంతటిదో చెప్పుట యసాధ్యము! ముబారకు మరల జేబున్నిసాను జూచి సమస్తము మఱచిపోయెను. జేబున్నిసా యిప్పుడు విసితనైయు, దర్పాభావనైయు, స్నేహశాలినియై, యుండెను. ముబారకునిపూర్వానురాగము [illegible] స్మరతా సముద్దీప్తమయ్యెను. [illegible] "దరియా" [illegible] (సముద్రమువలె [illegible])

మనుష్యుఁడు కాంతామోహముచే వంధుఁడై నయెడల వానికి హితా హితధర్మజ్ఞానముండఁబోదు. అంతటివిశ్వాసఘాతకుఁ డగుపాపాత్ముఁ డీకేఁబుట్టఁబోఁడు.

అనేకదీపకాంతిప్రతిబింబసమన్వితమై, అంధకారమై యున్న యుదయ సాగరజలరాజికినలుదెసల జుట్టుకొనియున్నపర్వతపఙ్క్తులను జూచుచు, నింద్రభవనసదృశమైనగదియందుఁ గూర్చుండి ముబారకు జేబఉన్నీసా చేతిని తనచేతిలోఁ జేర్చుకొనియుండెను. ముబారకు మిగుల దుఃఖముతో "నిన్నుమరలఁ బొందఁగలిగితిని. కాని యీసుఖము నొకపదిదినములపాటైన ననుభవింపఁజాలను" అనియెను.

జేబ—ఎందువలన? అడ్డుపెట్టువారెవరు? బాదుషాయేనా?

ముబా—సందేహముగానున్నది. ఇప్పుడు బాదుషామాట చెప్పజాలను. నేను రేపేయుద్ధమునకు బోయెదను. యుద్ధమునందు మరణించుటయునుగలదు. బ్రదికివచ్చుటయునుగలదు. కాని, నావిషయ మున మరణమే నిశ్చయము రాజపుత్రులయుద్ధపద్ధతులను, ఏర్పాటు లను జూచిననేను, పర్వతముల మీఁదియుద్ధమున మనము పరాభూతు లమగుదుమని నిశ్చయముగ దెలిసికొనియున్నాను. నేనొకసారి యోడి పోయి వచ్చితిని. మరల నట్లుచేయుటకంటె యుద్ధమున ప్రాణములు విడుచుటయే మేలు.

జేబఉన్నీసా సజలనయనయై "నీవు యుద్ధమునందు జయశాలి వైవచ్చునట్లుగా నీశ్వరు డనుగ్రహించుగాక! నీవు మరల రాకున్న యెడల నేను మరణించెదను." అనిచెప్పెను.

ఇద్దఱును గన్నులనీరుబెట్టుకొనిరి. అప్పుడు ముబారకు "చచ్చి పోయెదనా? బ్రతికివచ్చెదనా?" అని యోచించుకొనుచుండెను. ఎదు టనక్షత్రములచే బ్రకాశించుగగనముతో నొరయుచున్న పర్వత

పక్షులచే బరివేష్టితమై యంధకారమయమైయున్న యుగయసాగర జలము—దానియందు, దీపసమూహములతోఁ బ్రకాశించుచున్న పటనిర్మితనగర మనోహరచ్ఛాయ—దూరమునందు బర్వతాగ్ర భాగముల శిఖరములపై శిఖరములు—వానిపై శిఖరాగ్రములు—సర్వము నంధకారమై యుండెను. ఇద్దఱును నాప్రబలగాఢాంధకార మునే చూచుచుండిరి.

అకస్మికముగ జేబఉన్నీసా యులికిపడి "ఈయంధకారములోనీ శిబిరప్రాకారపార్శ్వమున నెవ్వరో దాగికొనియున్నట్లు కనబడు చున్నది. నీకొఱకు నామనసు పరిపరివిధముల బోవుచున్నది" అనియెను.

ముబారకు శిబిరప్రాకారపార్శ్వమునకు బోయి చూడఁగా నెవ్వరోదాగియున్నట్లు కనబడియెను. ముబారకావ్యక్తిని బట్టుకొని చేతితో లేవనెత్తెను. దాగికొనియున్నమానిసి లేచి నిలుచున్న పిమ్మట ముబారకు పరికించిచూచెను. ఆచీకటిలో నాతనికానవాలు తెలియలేదు. ముబార కామానిసిని ప్రతిహారిణి కొప్పగించి జేబఉన్నీ సాయొద్దకు వచ్చి చెప్పెను. జేబఉన్నీసా కౌతూహలముతో నా మాని సిని లోనికి రప్పించెను!

జేబ—నీవెవ్వరు? ఎందులకు దాగికొనియుంటివి ముఖము మీాది బట్టనుదీయుము.

ఆవ్యక్తి ముఖావరణమును దీసివైచెను. ఇద్దఱును విస్మయా క్రాంతులై చూడగా నామె దరియాబీబీయై యుండెను.

అపరిమితసుఖానంద సమయమున, నాకస్మికముగ మేఘము లేకుండ నెదుట బిడుగుపడినట్లు జేబఉన్నీసాయు, ముబారకును విహ్వ లచిత్తులైరి. ముగ్గురుగూడ నేమియు మాటాడలేదు.

చాలసేపైనపిమ్మట ముబారకు నిష్ఠురనిశ్వాసముతో "అయ్యో భగవంతుడా! నేను మరణమునే పొందవలయును" అనియెను.

జేబఉన్నీసా విహ్వలయై "నేనో?" అనియెను.

దరియా—నీవెవ్వరు?

ముబారకు ఆమెతో 'నా వెంట రమ్ము' అనియెను.

అప్పుడు ముబారకు దీనభావముతో జేబఉన్నీసాయనుజ్ఞను దీసికొని వెడలిపోయెను.

---

## పదునాల్గవ ప్రకరణము

---

[illegible] స్ఫులింగము

రాజసింహుడు రాజనీతియందును, యుద్ధనీతియందును సమానపండితుడై యుండెను. మొగలుసైన్యము చాలదూరము పోవు వఱకును శిబిరము నెత్తివేయక, సైన్యముల నక్కడనే యుంచెను. అతఁడు శిబిరమునందుండఁగనే విక్రమసింహుఁడు రెండువేలసేనతో వచ్చెనని వర్తమానము వచ్చెను. రాజసింహుఁడు యుద్ధమునకు సిద్ధమయ్యెను.

ఒక యాశ్వికుఁడు దూతయై ముందుగావచ్చి రాజసింహునిఁ జూడఁగోరెను. రాజాజ్ఞనుబొంది ప్రతీహారి యాతనిలోనికిఁ బిలుచుకొనిపోయెను. అతఁడువచ్చి రాజసింహునకుఁ బ్రణామములుగావించి, "షోడశకళాబిరుదాంకితుఁడును రూపనగరాధిపతియు నగు విక్రమసింహుఁడు యుద్ధమునకుససైన్యుఁడై వచ్చియున్నాఁడు' అనివిన్నవించెను.

రాజు శిబిరమునకు వచ్చి చూచుటకిష్టమున్నయెడల నొంటిగావచ్చి చూడవచ్చును. సైన్యసమేతముగా వచ్చిచూడగోరినయెడలశిబిరమున కవ్వలనే యుండవలయును. నేనును సైన్యసమేతుఁడ నై వచ్చెదను.

షోడశకళాశాంకితుఁడగు విక్రమసింహుడు శిబిరమునకు వచ్చి చూచుట కిష్టపడక యొంటరిగా వచ్చి రాజసింహునిఁ జూచెను. రాజసింహుఁడాదరభావముతో నాతని నుచితపీఠముపైఁ గూర్చుండఁజేసెను విక్రమసింహుఁడు రాణాకుఁ గానుక లర్పించెను. ఉదయపురరాణా రాజపుత్రకులమునకుఁ బ్రధానుఁడై యుండుటచేత నాకానుకల కర్హుఁడై యుండును. కాని, రాజసింహుఁ డాయుపాయములను దీసికొనకయే మీ కానుకలు మొగలుబాదుషా కర్పింపఁదగినవని చెప్పెను.

విక్ర—మహారాణా రాజసింహుఁడు జీవితుఁడై యుండఁగా నేరాజపుత్రుఁడును మొగలుబాదుషా కుపాయనముల నర్పింపఁజాలడని నమ్ముచున్నాఁడను. మహారాజా! నాయపరాధమును మన్నింపవలయును. నేనెఱుఁగక యీయుత్తరమును వ్రాసితిని. మీరు మొగలాయీలను శాసించినవిధమును సమస్తరాజపుత్రులును జేరి మీపక్షమునందుండిపని చేసినయెడల మొగలుసామ్రాజ్యము విచ్ఛేదమైపోవునని తోఁచుచున్నది. నేనువ్రాసినయుత్తరమునందలి తుదిభాగమును స్మరణకుఁ దేవలయును. మఱియు నీ రెండుకానుకలను మీకర్పింపవలయునని తీసికొనివచ్చితిని. మొదటిది, నా రెండువేల యాశ్వికదళమును, రెండవది నాహస్తమునందున్న యీచంద్రహాసము; ఇప్పటికిని ఈనాబాహువులయందుఁ గొంచెము బలమున్నది. నన్నే కార్యమునందునియమించినను మేనఁ బ్రాణము లున్నంతవఱకు కార్యసంసిద్ధికై ప్రయత్నించెదను.

రాజసింహుఁ డత్యంతాహ్లాదముతోఁ "కుమారిపుడు షోడశకళా బిరుదమునకుఁ దగినట్లు మాటాడితివి. దుష్టాత్ములగు మొగలులు నాచే సంపూర్ణముగఁ బరాజితులై సంధిచేసికొని జీవింపఁగలిగిరి. అట్లు ప్రాణములు దక్కించుకొనియు నిపుడు సంధిచేసికొన లేదని మరల యుద్ధ ప్రయత్నములు సేయుచున్నారు. దలేరఖాను సైన్యమును తీసికొని యక్బరునకు సాహాయ్యముగ వచ్చుచున్నాఁడు. దిలేరఖానుని మార్గమధ్యముననే మట్టుఁబెట్టవలయును. ఆత డక్బరుతోఁ గలిసినయెడలఁ గుమారజయసింహున కపాయము సంభవించును. అందుకొఱకు నేను గోపీనాథరాథోరును బంపియుంటిని. కాని యాతని సైన్యమత్యల్పమైన దగుటచే నాసైన్యమునుండి కొందఱి నాతనియొద్దకుఁ బంపెదను. మాణిక్యలాలసింహుఁడను నాసేనానాయకుఁ డొకఁడు యుద్ధమున మిగుల దక్షుఁడు. ఆతఁ డాజనులను దీసికొనిపోవును కాని నేనీస్థలమును విడిచి యౌరంగజేబున్న దిక్కునకుఁ బోరాదు. మఱియు నా సైన్యమునుండి హెచ్చుమందిని మాణిక్యలాలుతోఁ బంపుటకును వలనుపడదు. నీ[illegible]యాశ్వికదళమును దీసికొని మహాయుద్ధమునకుఁ బోవలయును. మీ రిద్దరును జేరి దలేరఖానును సైన్యసమేతముగా మార్గమునందే సంహరింపవలయును" అని చెప్పెను.

విక్రమసింహుఁ డానందముతోఁ "మీయాజ్ఞ శిరసావహించితి" నని చెప్పెను.

ఇట్లు చెప్పి షోడశకళాబిరుదాంకితుఁ డగు విక్రమసింహుఁడు యుద్ధోద్యోగమునం దుండుట రాజను దీసికొనియెను. చంచలకుమారి మాట యేమియును రాలేదు.



# పదునేనవ ప్రకరణము

ముబారకును దరిఖాయును భస్మీభూతులైరి

గోపీనాధఠాకూరును, విక్రమసింహుఁడును, మాణిక్యలాల సింహుఁడును, దిలీరఖానుని సంహరించుటకై బయలుదేరిరి. ఆతఁడు వచ్చు మార్గమున నాముగ్గురును మూఁడుచోటుల దాఁగి కాచికొని యుండిరి. కాని యొండొరులకనతిదూరముననే యుండిరి. షోడశాంకుఁ డగు విక్రమసింహుఁడు దన యాశ్వికసైన్యముతోఁ బర్వతసాను ప్రదేశముల నిలుచుటకు వలనుగాకపోయెను. ఆతఁడు పర్వతనివాసి యైనను, ఆశ్వికదళము నుంచుకొనియెను. అందులకు గారణమేమన— పర్వతమును విడిచియున్నప్పుడు, సమప్రదేశవాసులగు శత్రువులును, దొంగలును నాతని వెంబడింపకుండ నుండుటకై యుంచుకొనియెను. మఱియు నిట్టిరాజులు సమయము దొరకినప్పుడు దండువెడలి గ్రామములను దోఁచికొనుచుండిరి. అవసరము లేనప్పుడు వారిసైనికులు గుఱ్ఱములను పర్వతముపై విడిచి యితరకార్యములను జేసికొనుచుండిరి. ఇప్పుడు మొగలాయీలను వెన్నంటుటకై విక్రమసింహుఁడు గుఱ్ఱపుదళమును దీసికొనివచ్చెను. పర్వతముపైనుండి యుద్ధముచేయుటకు వలను గానందున నాతఁడు సమప్రదేశమును వెదకికొనియెను. ఆతనిమనసునకు నిచ్చినస్థలము దొరకెను. ఆస్థలమునకు ముందుభాగమునఁ గొంత యరణ్యముండెను. ఆయడవి వెనుకఁ దన యాశ్వికసైన్యము బారులు తీరి నిలుచునట్లుగఁ జేసి తాను ముందరిభాగమున నిలిచియుండెను. దానికిఁ బైభాగమున పదాతిసైన్యముతో మాణిక్యలాలు దాఁగికొని యుండెను. అందఱకును ముందువైపున గోపినాధఠాకూరు నిలిచి యుండెను.

దిలీరఖాను, అక్బరుసమరవస్థను దలంచికొని జాగరూకతతోడనే వచ్చుచుండెను. రాజపుత్రు లక్కడక్కడ దాఁగియున్నారేమో యను ననుమానముతో నాలుగుదిక్కులను బరీక్షించుకొనుచు వచ్చుచుండుటచే షోడశాంకవిక్రమసింహుఁ డక్కడ నుండుట దిలీరఖానునకుఁ దెలియవచ్చెను. ఆతని నాస్థలమునుండి వెడలఁగొట్టుఁడని కొంత మంది యాశ్వికులను బంపించెను. విక్రమషోడశాంకుఁ డితరవిషయములలో స్థూలబుద్ధిగలవాఁడైనను, సమరకార్యములయం దత్యంత ధూర్తుఁడును, రణపండితుఁడునై యుండెను. అనేక సమయముల యందు ధూర్తతయే రణపాండిత్యమని యెంచఁబడుచున్నది. ఆతఁడు మొగలుసేనతో నించుక యుద్ధముచేసి వెనుదిరిగిపోయెను. ఆపోవుట దిలీరఖానుని భంగపఱచుటకే.

దిలీరఖాను మాణిక్యలాలు నతిక్రమించి ముందునకుఁ బోయెను. మాణిక్యలాలు పర్వతముపైఁ దాఁగియుండుట యాతనికిఁ దెలియదు. మాణిక్యలాలు శబ్దలేశమునుగూడఁ జేయలేదు. దిలీరుఁడు షోడశాంకు నోడించినపిమ్మట రాజపుత్రు లెల్లరును బాఱిపోయిరని యనుకొనియెను. ఆకారణమున మునుపటివలె జాగరూకతతోఁ బోవుటలేదు. మాణిక్యలా లది సరియైనసమయము కాదని యూరకుండెను.

తుదకు గోపినాథఠాకూరు దాఁగియున్నస్థలమునకు దిలీరఖాను వచ్చెను. అక్కడ దారి యిఱుకుగనుండెను. ఆయిఱుకుత్రోవనుండి సైన్యము పోవుటకుఁ బ్రారంభించినతోడనే దారినిబోవు పథికుని దినుటకై కాచికొనియున్న పులివలె గోపినాథుఁ డొక్కుమ్మడి సైన్యసమేతుఁడై వారియెదుట నిలిచెను.

దిలీరఖాను ముబారకుతో "ముందున్నసైన్యమును దీసికొని వారినోడింపుము" అనిచెప్పెను. కాని గోపినాథు నోడించుట యెట్లు?

ఇఱుకుగానున్న యీస్థలమున మొగలుసైనికులు కొలఁదిమందియే యుండిరి. రంధ్రమునుండి బారులుతీరివచ్చుచున్నచీమలను బాలకు లొకటొకటిగఁ నలపివేయునట్లుగ, ఇఱుకుత్రోవనుండి వచ్చుచున్న మొగలులను రాజపుత్రు లనాయాసముగఁ జంపివేయుచుండిరి. ఇఁక ముందుమార్గము లేకపోవుటచే దిలీరఖా నామధ్యమార్గమునందే నిలువవలసివచ్చెను.

మాణిక్యలా లిది సరియైనసమయమని తెలిసికొని, సైన్య సమేతుఁడై పర్వతముమీఁదనుండి వచ్చి పిడుగువలె దిలీరఖానునిపై బడియెను. దిలీరునిసైనికులు ప్రాణములపై నాశవదలి యుద్ధముచేసిరి. కాని, యీసమయమునందే షోడశాంకవిక్రమసింహుఁడు రెండువేల యాశ్వికులను దీసికొని దిలీరునిసైన్యము వెనుక వచ్చితాకెను. అప్పుడు మూఁడుదిక్కులనుండియు శత్రులచే నాక్రమింపబడినమొగలుసేన యొకగడియసేపైన నిలిచి యుద్ధముచేయలేకపోయెను. చేతనైనవారు పాఱిపోయి దాగికొనుచుండిరి. అనేకులకుఁ బాఱిపోవుటకు మార్గము దొరకలేదు. వ్యవసాయకులకొడవలికిఁ జిక్కినపైరువలె నెల్లరును రణక్షేత్రమునఁ బడిపోయిరి.

కేవలము గోపినాథునియెదుట యుద్ధముసేయుచున్న కొంత మంది మొగలులుమాత్రము వెనుదిరుగక నిలిచియుండిరి. వారు మొగ లుసేనకు సారభూతులై యుండిరి. ముబారకు వారి కధికారియై యుం డెను. కాని వారును నిలువలేకపోయిరి. నిమిషనిమిషమున కొక్కొ క్కఁడుగా, నారాజపుత్రులచేతులలోఁ బ్రాణములను విడిచిపెట్టుచుం డిరి. తుదకు నలుగురైదుగురు మాత్రము మిగిలియుండిరి.

దూరమునుండి వారినిజూచి మాణిక్యలాలక్కడకు వచ్చి రాజపుత్రులనుజూచి "వీరలను జంపవలదు. వీరువీరపురుషులు వదలి పెట్టుఁడు" అనియెను. రాజపుత్రులు కొంచెముసేపాఁగిరి. అప్పుడు

మాణిక్యలాలు "మీరు వెడలిపొండు. మిమ్ములను విడిచిపెట్టితిమి. మీరేమియును జెప్పవలదు" అనియెను.

ఒక మొగలాయి "మేము యుద్ధమునుండి యెప్పుడును వెను దిరుగలేదు. ఇప్పుడును వెనుకంజవేయఁజాలము" అనిచెప్పెను. ఆ మిగిలినవారు మరల యుద్ధమునకుఁ బ్రవృత్తులైరి. అప్పుడు మాణిక్య లాలు ముబారకును బిలిచి "ఖాన్ సాహేబా! మరల యుద్ధ మొన రించి యేమిచేసెదవు?" అనియడిగెను.

ముబారకు—చచ్చెదను.

ముబా—మరణముతప్ప నిఁక నాకు గత్యంతరము లేదని మీకు దెలియదా?

మాణి—అట్లయినయెడల వివాహముచేసికొనుట యెందులకు

ముబా—చచ్చుటకే.

ఈసమయమున నొకశతఘ్నిశబ్దము ప్రతిపర్వతమునుండియు ప్రతిధ్వనితమయ్యెను. ఆప్రతిధ్వని చెవిని బడినదో లేదోగాని ముబార కునిమస్తకముపగిలి యాతడుభూతలశాయి యయ్యెను. మాణిక్యలాలు చూచుసరికి ముబారకు విగతప్రాణుఁడై పడియుండెను. అతనితలకు బలమైన గుండుదెబ్బతగిలెను. మాణిక్యలాలుతలపైకెత్తిచూడఁగాఁ బర్వతసానుప్రదేశమున నొక్కయువతి ఫిరంగినిఁజేతఁబట్టుకొని యుం డెను. ఆఫిరంగిముఖమునుండి పొగ లెగయుచుండెను. ఆమె యున్మా దినియై యున్న దరియాబీబీయని చెప్పవలసినయవసరములేదు.

మాణిక్యలాలామెనుబట్టి తీసికొని రావలయునని కొందఱి నంపించెను. ఆమె నవ్వుచునవ్వుచుఁ బాఱిపోయెను. అదిమొదలు లెందరియాబీబీ నీపృథివిపై నెవ్వరును మరలఁ జూడలేదు.

యుద్ధమైనపిమ్మట ముబారకు యుద్ధములో మృతుఁడయ్యెనని

జేబఉన్నీసా వినియెను. అప్పు డామెతన వేషభూషణములను దీసిపాఱ
వైచి, కఠినశిలానిర్మితమగు నాయుదయసాగరతీరమునం బడియేడ్చెను.

"బహుధాలింగనధూసర స్తనీ॥
విలలాపవికీర్ణమూర్ధజా॥"

---

# పదునాఱవ ప్రకరణము.

## పూర్ణాహుతి—ఇష్టలాభము.

యుద్ధమైనపిమ్మట విక్రమ షోడశాంకుఁడు జయశ్రీతోడ రాజసింహుని శిబిరమునకువచ్చెను. రాజసింహుఁడాతనినాదరముతో నాలింగనముచేసికొనియెను. విక్రమషోడశాంకుఁడు "ఇఁకనొకమాట మిగిలియున్నది. అయ్యది నాకుమా ర్తెనుగూర్చి. త్రికరణశుద్ధిగ నాశీర్వాదముఁజేసి యాకన్యకను మీకుఁ గన్యాదానముసేయుటకై యిష్టపడుచున్నాఁడను. మీరనుగ్రహింపవలయును" అనియెను.

రాజ—అట్లయినయెడల నుదయపురమునకుఁ బోవలయును.

విక్రమషోడశాంకుఁడు తనరెండువేలయాశ్వికదళముతో నుదయపురమునకుఁ బయనమైపోయెను.

నాఁటిరాత్రియే రాజసింహుఁడు చంచలకుమారినిఁ బాణిగ్రహణము చేసికొనియెను. పిమ్మట జరిగినదంతయుఁ జెప్పుట చరిత్రములనువ్రాయువారియధికారమునకుఁ జేరినది. ఉపన్యాసలేఖకులు చెప్పవలసినపనిలేదు. మరలనౌరంగజీబు తానే స్వయముగఁ బోయి రాజసింహునిసంహరింపవలయునని ప్రయత్నములను జేసెను. అజీమను వాఁడు వచ్చి యాతనితోఁ గలసికొనియెను. రాజసింహుఁడు, విఖ్యాతుఁడును మార్వారదేశస్థుఁడునగు దుర్గాదాసనువానితోఁ జేరి

యౌరంగజేబును ముట్టడించెను. ఔరంగజేబు మరలఁ బరాజితుఁడై యవమానితుఁడై కుక్కవలెఁ బాఱిపోయెను—రాజపుత్రులాతని సర్వస్వమును దోఁచికొనిరి. ఔరంగజేబునకు విశేషముగ నష్టమయ్యెను.

ఔరంగజేబు భయపడి యజేముతోఁ బాఱిపోయి, రాణాస్వాధీనమునుండి పోయియున్న రాజధానిపురమగు చిత్తూరునందు దాఁగికొనియెను. కాని, యక్కడఁగూడ నాతనికి రక్షణము లేకుండఁ బోయెను. సుబలదాసను నొక రాజపుత్రసేనానాయకుఁ డాతని వెన్నంటి పోయి, చిత్తూరునకును అజమీరునకును మధ్యప్రదేశమున సేనాసమేతుఁడై కాచికొనియుండెను. మరల నాహారపదార్థములు రాకుండ నిలిచిపోవుననుభయముతో పండ్రెండువేలసేన నిచ్చి రోహిలాఖానును సుబలదాసుతో యుద్ధము చేయుటకై పంపి ఔరంగజేబు పరివారయుక్తుఁడై అజమీరునకుఁ బలాయనమైపోయెను. మరల నుదయపురమువైపునకు మొగముద్రిప్పి చూడలేదు. ఉదయపురమునకుఁబోవునాశ నాఁటితోఁ దుదముట్టెను.

ఇంతలో సుబలదాసు రోహిలాఖాను నోడించి తఱిమివైచెను. ఆతఁడు పరాజితుఁడై అజమీరునకుఁ బోయెను. మఱియొకదిక్కున రాజసింహుని రెండవకుమారుఁడైన భీమసింహుడు మొగలాయీల యధికారమునలోఁబడియున్న గుజరాతిప్రదేశములఁ బ్రవేశించి గ్రామములను, నగరములను, సుభాలను, నాక్రమించుకొనుచుండెను. అనేక ప్రదేశములను స్వాధీనపఱిచికొని సౌరాష్ట్రపర్యంతమును రాజసింహుని యధికారమును స్థాపించుకొనుచువచ్చెను. కాని, పీడితులైనప్రజలువచ్చి రాజసింహునొద్ద మొఱఁబెట్టుకొనఁగా నాతఁడు

దయాపరుఁడై వారిదుఃఖమునకు దుఃఖితుఁడై, భీమసింహుని వెనుకకుఁ బిలిపించెను. దయార్ద్రహృదయుఁడై హిందూసామ్రాజ్యమునావైపున మరలస్థాపించుకొనుట కాతఁడుపోలేదు.

కాని, రాజమంత్రియైన దయాళుషహా యట్టి స్వభావముకల వాఁడుకాఁడు. అతఁడును యుద్ధములందుఁ బ్రవేశించి మాళవమునం దున్న మసల్మానులను ధ్వంసముచేయ నారంభించెను. ఔరంగజేబు హిందువులధర్మవిషయమున ననేకదుర్మార్గములను గావించియుండెను. అందులకుఁ బ్రతిగ దయాళుఁడు కాజీల నందఱఁ బట్టుకొని చిత్రవధఁ గావించి వారిపుస్తకములనెల్ల ధ్వంసముచేసివైచెను.

దయాళుఁడు కుమారసింహునితోఁ జేరెను. వారిద్దఱును, షహజాదాఅజీమ్‌షాహాను జిత్తూరుసమీపమున ముట్టడించి యాతనితో యుద్ధముచేసిరి. అజీము పరాజితుఁడై తనసైన్యముతోఁ బాఱి పోయెను.

ఈవిధముగ నాలుగు సంవత్సరముల పర్యంతమును యుద్ధములు జరుగుచువచ్చెను. తుద కౌరంగజేబు రాజసింహునితో నిజమైన సంధిని జేసికొనియెను. రాణా యడిగినవాని కన్నిటికి నొప్పికొని, యాతఁ డిఁకఁదనపైకి రాకుండినఁజాలునని యూరకుండెను. మొగలాయీ లిట్టిపాఠము నెప్పుడును నేర్చుకొని యుండ లేదు.

సంపూర్ణము.

# ఉపసంహారము.

## గ్రంథకారుని నివేదనము.

గ్రంథకారునివినీతవిజ్ఞాపన మేమన—హిందూముసల్మానులయం గల పరస్పరతారతమ్యముం జూపించుట యీగ్రంథోద్దేశ మని పాఠకులు గ్రహింపంగూడదు. హిందువు లైనంతమాత్రమున మంచివా రని చెప్పుటలేదు. ముసల్మాను లైనంతమాత్రమునం జెడ్డవారు కారు. మంచివారును జెడ్డవారు నిద్దఱియందును సమానముగనే యున్నారు. ఇంకను జెప్పవలసిన దేమన—ముసల్మాను లనేకశతాబ్దములు హిందూస్థానమునకు రాజులై యుండిరి. రాజకీయగుణములయందు ముసల్మానులు, వారి సమకాలికులైన హిందువులకంటె మిగుల శ్రేష్ఠులై యుండిరి. కాని, ముసల్మానురాజు లందఱును హిందూరాజులకంటె శ్రేష్ఠులై యున్నారని చెప్పుటకును వలనుగాదు. అనేకస్థలములయందు ముసల్మానులే హిందువులకంటె రాజకీయగుణములయందు శ్రేష్ఠులై యుండిరి. ఇతరగుణములంటో, ధర్మావలంబకు లగువారిగుణములే—వారు ముసల్మానులేగానీ, హిందువులేగానీ—శ్రేష్ఠమైనవి. ఇతరగుణము లున్నను, ధర్మవిరహితు లగువారి గుణములు నికృష్టమైనవి. ఔరంగజేబు ధర్మశూన్యుండై యుండెను. అందువలననే యాతనికాలమునుండియు మొగలుసామ్రాజ్యమున కథఃపతనము ప్రారంభ మయ్యెను. రాజసింహుండు ధార్మికుండై యుండెను, అందువలన నాతండు చిన్నరాజ్యమున కధికారియై యుండినను, మొగలుచక్రవర్తి నవమానపఱచి పరాజితునిం జేయంగలిగెను. ఇదియే యీగ్రంథమునందుం బ్రతిపాదింపంబడినది. రాజెట్లుండునో, రాజానుచరులును, పౌరులునుగూడ నట్లే యుందురు. ఉదయపురిని, చంచలకుమారిని; జేబఉన్నీసాను, నిర్మలకుమారిని; మాణిక్యలాలును, ముబారకును సరిగాం జూచినయెడల నీవిషయము తెలియవచ్చును.

ఔరంగజేబుని చరిత్రమునకు, స్పెయినుదేశపు రెండవ ఫిలి (Philip II) చరిత్రము సరిపోవును.

ఇద్దరును ననంతసామ్రాజ్యమున కధిపతులై యుండిరి. ఇద్దరు నైశ్వర్యమునందును, సేనాబాహుళ్యమునందును, గౌరవమునం గూడ తక్కిన రాజులకంటెం బ్రబలులై యుండిరి. ఇద్దరును శీలత, జాగరూకత మొదలగు గుణములచే నలంకృతులై యుం కాని, వారిద్దరును నిష్ఠురులు; కపటాచారులు; క్రూరులు; దా కులు; స్వార్థపరులు; మీఁదుమిక్కిలి ప్రజాపీడితులుగూడనై యుండి అందువలననే వారిద్దరును దమతమ సామ్రాజ్యములు ధ్వంస పోవుటకు బీజమును నాటిపోయిరి ఇద్దరును జిన్నచిన్న రాజుల నవమానితులై పరాజితులయిరి. ఫిలిప్, ఇంగ్లీషువారిచేతను (ఆకా మున నింగ్లీషువారు గొప్పరాజులై యుండలేదు.) అతెగ్గాండ చేతను, పరాజితుఁడయ్యెను. ఔరంగజేబు మరాటావారిచేతను రా పుత్రులచేతను బరాజితుఁడయ్యెను, మహారాష్ట్రాధిపతి యగు శివా యును నప్పటి యింగ్లీషురాజ్ఞియగు ఎలిజబెత్తును బరస్పరము సమానులై యుండిరి. కాని యంతకంటెను నింగ్లాండునకుఁ బ్రభువై హాలెండుదేశ రాజకుమారుఁడగు విలియమును, రాజపుత్రరా రాజసింహుఁడును ననేకవిషయములలో సములై యుండిరి. ఉభయు కీర్తియును నితిహాసములయందు విశేషముగఁ గొనియాడఁ యున్నది. విలియము యూరపునందు దేశహితైషియనియు, ధ త్ములగు వీరపురుషులం దగ్రగణ్యుఁ డనియుఁ బ్రఖ్యాతిని జెం యున్నాఁడు. ఈదేశమునం దితిహాసములు (చరిత్రలు) లేనికా మున రాజసింహు నెవ్వరు నెఱుఁగరు. అట్టివారి చరిత్రమును దె కొనుటకైన మనవారు ప్రయత్నింపకుండుట శోచనీయముగా నున్న ఇంతటినుండియైనను బరిశీలనబుద్ధిఁగలవారై తెలిసికొనుటకు ప్ర త్నింతు రను నమ్మకముతో మేము సంతుష్టచిత్తుల మగుచున్నారము